


సంపు. ౧౩ ధాత సంవత్సరము, ఆశ్వయుజమాసము (అక్టోబరు ౧౯౩౬) సంఖ్య ౧౦

# కొండకోన

మండపాక పార్వతీశ్వరశాస్త్రి

కొండకోనలలోన, గుబురుకానలలోన,
పూవుటీరాలలో, బుకలుతోరాలలో,
ఆకుజొంపాలతో, రేకురంపాలతో,
ఆడితిమి, పాడితిమి... ... ... ...
... ... ... ... వేడికూడితిమి;

*   *   *   *

ఆరేయి నిముసమై యరిగినది నీకు;
ఆరేయి నిముసమై యరిగినది నాకు;
ఆవేళ స్వప్నమై యానంద మిచ్చినది;

*   *   *   *

తిరిగితిరిగీ త్రోచి, తెరతెరలుగా రాచి,
వచ్చి, మరివచ్చి, మరి మచ్చికల గ్రుచ్చి, కల
యచ్చుపడఁ జేసినది యిచ్చమెయి డాసినది;
ఆరేయి స్వప్నమై యరిగినది మనకు;
ఆవేళ నిముసమై యానందమయ్యె;

*   *   *   *

ఆకులో — పూవులో — అరిదికానఁలోన,
అందాలకోనలో, ఆడితిమి, పాడితిమి;
ఆరేయి స్వప్నమై యరనిముసమయ్యె;

*   *   *   *

*   *   *   *

నిన్నుఁ జూడఁగ నేను, నన్నుఁ జూడఁగ నీవు,
తిరిగితిమి కానలో — తిరిగితిమి కోనలో
కోనలో కానలో తిరిగితిమి తిరిగితిమి
కన్నీళ్లకాలువలు కార్చితిమి కార్చితిమి
నిలువెల్ల కంపించి నిలిచితిమి నిలిచితిమి

* * * *

నన్నుఁ గానక నీవు, నిన్నుఁ గానక నేను,
వెదకితిమి కానలో, వెదకితిమి కోనలో;
కానలో వెదకితిమి, కోనలో వెదకితిమి;
కంపించి, కంపించి, కన్నీళ్లు కార్చితిమి;
కన్నీళ్ల కాలువలు కార్చి కంపించితిమి;

* * * *

నిను నేను గనలేక, నను నీవు గానలేక,
యలసితిమి, సొలసితిమి, సొలసి యలసితిమి,

* * * *

ఆవేళ స్వప్నమై యరిగినది నాకు;
ఆవేళ స్వప్నమై యరిగినది నీకు;

* * * *
* * * *

ఆకుసందులను నీ వణగిపోయితివి;
మబ్బుసందులను నే మణగిపోయితిని;
ఆకులో మబ్బులో అణగితిమి మణగితిమి;
అణగితిమి, మణగితిమి, అణగిమణగితిమి;

* * * *

రాలుచినుకులఁగూడి వ్రేలుదారలఁగూడి,
ఆకుసందులను ని న్నరసితిని, బెరసితిని;
అరసితిని నిన్ను నే బెరసితిని నిన్ను నే
బెరసి యొం డొరులోన బిరబిరను గలసితిమి

* * * *

బిరబిరను గలసితిమి, బెరసితిమి మురిసితిమి;
మురిసితిమి, దరిసితిమి, మరచితిమి మనికి

* * * *

ఆవేళ స్వప్నమై యరిగినది మనకు;
ఆ రేయి నిముసమై యరిగినది మనకు;
ఆరేయి, ఆవేళ, ఆనంద మిచ్చినది
అరనిముసమయ్యె న య్యానందవేళ

* * * *
* * * *

తలపులోపల నీవు దాగి యుండితివి;
వలపులోపల నేను లోగియుండితిని;
తలపులో వలపులో దాగితిమి, లోగితిమి;
దాగితిమి, లోగితిమి, దాగి లోగితిమి;
దాగితిమి లోగితిమి,............
............రాగమున వేగితిమి

* * * *

నను నీవు వలచితివి; మనసు నలచితివి;
నిను నేను తలచితిని; మనసు కలచితిని;
తలచితిమి, వలచితిమి, నలచితిమి, కలచితిమి;
నిలిచితిమి వలపులో, నిలిచితిమి తలపులో;
తలచి యొం డొరులోన గలసిపోయితిమి;
వలచి, యొం డొరులోన నిలిచిపోయితిమి

* * * *
* * * *

తలపంత మరచితిమి; వలపంత మరచితిమి;
తలపువల పేకమై తనువు మరచితిమి;
ఆవేళ స్వప్నమై యరిగినది మనకు,

* * * *
* * * *

# "హిస్ మాస్టర్స్ వాయ్స్"



రేడియో రిసీవర్

**మాడల్ 471 A. C. రూ 300**

**D C** స్థలములకు కన్వర్టర్ రు 135 ప్రత్యేకము

జీవవంతమైన రేడియో యంత్రములు!

---

## శబ్ద పునరుత్పన్నమున ప్రఖ్యాతి పడసిన "హిస్‌మాస్టర్స్ వాయ్స్"

వారు ప్రపంచమునందలి రేడియో వార్తలను, సంగీతమును సహజమాధుర్యముతో ప్రతిఫలింపగల రేడియో యంత్రములను తయారుచేసియున్నారు. ఇందు వివరింపబడియుండు మాడల్ 471,474, 475 జగద్విఖ్యాత "హిస్‌మాస్టర్స్ వాయ్స్" వారి ప్రశస్తములైన పరికరములతో నమర్చబడి, రికార్డులందలి సంగీతమును కూడ విద్యుచ్ఛక్తిద్వారా ప్రతిఫలింపజేయ వీలగుచున్నది. సహజమాధుర్యమైన సంగీతమును గానాభిమానులకు "హిస్‌మాస్టర్స్ వాయ్స్" గ్రామఫోనులద్వారా విన వీలొనరించిన ఉత్కృష్టమైన విధానములే యిందును ఉపయోగింపబడియుండుటచే, ఈ "హిస్‌మాస్టర్స్ వాయ్స్" రేడియో యంత్రములను నేడే విని, ఇందలి ఔన్నత్యమును కనుగొనుడు.



రేడియో గ్రామఫోన్

మాడల్ 474 A C. రూ 570

రికార్డులను స్వయముగ మార్చగల పరికరముతో నుండు మాడల్ 475 A. C. రూ. 700.

D. C. స్థలములకు కన్వర్టర్ వెల రూ 150 ప్రత్యేకము

వివరములకు నేడే వ్రాయుడు.

## ది గ్రామఫోన్ కంపెని

లిమిటెడ్,

**45, సౌత్ పెరేడ్, బెంగుళూరు.**





## ఋతు సంబంధమయిన జబ్బులు

చాలమంది స్త్రీలు ఋతుకాలమున కడుపునొప్పితో బాధపడుచుందురు. రక్తము విశేషముగా స్రవించును. కల్జానా బిళ్లలను తీసికొన్నయెడల అటువంటి స్థితి యేర్పడదు. ఈ బిళ్లలు నొప్పినితగ్గించును. రక్తస్రావమును అరికట్టును.

ఇదివరకు యిదేమాదిరిగా బాధపడిన యొకస్త్రీ వ్రాయుచున్నది.

"కల్జానా బిళ్లలను వాడుచుండుటవలన యిప్పుడు నేను బాగుగా పనిచేయగలను. నిత్యకృత్యములను యేమాత్రము కష్టములేకుండా చేసికొనగలను."

మరియొక స్త్రీ.

"కల్జానా తీసికొన్నతరువాత నా విచారమంతయు మటుమాయమయ్యెను. తిరిగి బలమును పొందుచున్నాను. కొంతకాలము తలదిమ్మచే బాధపడితిని. ఇప్పుడట్టి జబ్బు యేమాత్రము లేదు. కల్జానా వదిలిపెట్టి యుండలేను."

మీరుకూడ కల్జానా సేవించినచో ఆరోగ్యము కుదుటబడి సుఖముగా నుందురు. పేరొందిన యీ ఖనిజసంబంధమగు ఔషధరాజమును నేడే కొని వాడుడు. జీవితసౌఖ్య మనుభవింప గలరు. (1)

# Kalzana




ఆరోగ్యాభివృద్ధి గావించు ఖనిజసంబంధమగు ఔషధము.

ప్రతి మందుల దుకాణములోను బజారులోను దొరకును.

కల్జానా తయారుచేయునపుడు చేతితో తాకబడి యుండలేదు.

954 B

అలరుఁ దేనియలలో నాడితిమి, వేడితిమి;
వలపు పుప్పొళ్లలోఁ బాడితిమి, కూడితిమి,
విరుల తేనెలలోన, మరుఁ పుప్పొళ్లలో,
ఆడితిమి; పాడితిమి; వేడితిమి కూడితిమి;

* * * *

పాడి, మరియాడి, మరివేడి, మరికూడి, విరి
తోడ, పాడితోడ, వడియాడ, విడిపాడ, సడి
వేచితిమి, కాచితిమి, వేచితి మొకళ్లొకళ;
ఆవేళ స్వప్నమై యరిగినది మనకు;
ఆవేళ నిముసమై యరిగినది మనకు;
ఆ రేయి నిముసమై యానంద మిచ్చినది;
ఆ రేయి స్వప్నమై యానంద మిచ్చినది;

* * * *

అరనిముసమై తోచె నాసాగసువేళ;
అరనిముసమై తోచె నాసుగమువేళ;

* * * *

మరచితిమి తనువు............
............మరచితిమి మనికి

* * * *

* * * *

తెలిపూవుఁదోటలో, సెలయేటి తేటలో,
తలిరాకుబాటలో, చిరుఁదేటిపాటలో,
నీవు నేనును గూడి, నెనరు చెందితిమి;
నీవు నేనొక్కటై నిలిచియుండితిమి;

* * * *

చల్లచల్లఁగఁ గాచెఁ దెల్లవెన్నెలలు;
మెల్లమెల్లఁగ వీచెఁ బిల్లతెమ్మెరలు;
ఆ తేటిపాటలో, ఆపూవుఁదోటలో,
వెన్నెలలవెలుగులో, మన్ననలు గైకొనుచు,
తెమ్మెరలమెమ్మెలకు నుమ్మలికమును బాసి
సమ్మదము, సమ్మోదము నెమ్మదులఁ గైకొని
నీవు నేనును గూడి నిలిచియుండితిమి;
నీవు నేనొక్కటై నెనరు చెందితిమి;

* * * *

ఆవేళ స్వప్నమై యరిగినది మనకు;
ఆ రేయి నిముసమై యానందమయ్యె

* * * *

* * * *

* * * *

పొదలచాటున నీవు మెదలుచుండితివి;
రొదలమాటున నేను కదలుచుండితిని;
చదలఁ జుక్కలముదల కదరు బెదరును లేక,
ముదము మదిఁబొదల నది కెరుదెరుగఁగాఁ
[బోయి,
కొదమచిల్కలరొదల కొదుగ నద నదియ
[యని,
దలచాటున మనము మెదలితిమి, కదలితిమి,

* * * *

కదలితిమి, మెదలితిమి, కదిసితి మొకళ్లొకళ;
కదిసితి మొకళ్లొకళ; కౌఁగిలించితిమి;
కౌఁగింటిలోఁ గరగి కలసిపోయితిమి;

* * * *

ఆవేళ స్వప్నమై యరిగినది మనకు;
ఆ రేయి స్వప్నమై యానంద మిచ్చినది;
అరనిముసమై తోచె నాస్వప్నవేళ;
అరనిముస మయ్యె నయ్యానందవేళ;
మరచితి మొకళ్లొకళ, మనికి మరచితిమి;

* * * *

* * * *

* * * *

తలలూచి యూచి, చిత్తము రేచిరేచి, యు
త్తలపాటు మీరఁ, దత్తరపాటు తోఁపంగ,
చిగురుచేతులు సాపి, బిగురురీతులు సూపి,
పొగరుచేతలఁ జేపి, యగడు బెగడును బాపి,
రాగాలకొమ్మలను రాగాలువెలయ, స
రాగాలు సేయంగ, నాగితిమి, రేగితిమి;

* * * *

ఆగితిమి, రేగితిమి, లాగితి మొకళ్లొకళ;
దరిఁజేర్చి కౌఁగింటఁ దార్చితి మొకళ్లొకళ;
కౌఁగింటిలోఁ గరగి కలసితి మొకళ్లొకళ;
కరగితిమి, కలసితిమి, మరచితి మొకళ్లొకళ;

* * * *

* * * *

ఆవేళ స్వప్నమై యరిగెఁది మనకు;
ఆరేయి స్వప్నమై యానందమయ్యె;
అరనిముసమయ్యె నయ్యానందవేళ,

* * * *

మరచితి మొకళ్లొకళ, మరచి యెరిగితిమి.

* * * *

* * * *

* * * *

తీగయుయ్యాలలో నూగుచుంటివి నీవు;
సోగ యొయ్యారానఁ దూగుచుంటివి నీవు;
ఊగుతూగులఁ జూచి బాగుబా గనుకొంటి;
సోగతీగలఁ ద్రోసి, రాగమందగ నుంటి;
కారుచీకటిఁ జిక్కి కదలలేకుంటి;
ఆకసంబునఁ జుక్క లరసి నవ్వినవి;
పొదలలోపలఁ జిక్కి మెదలలేకుంటి;
అలరుగుత్తులు చెట్ల నరసి నవ్వినవి;

* * * *

* * * *

పొదలఁ జీకటిలోనఁ గదలమెదలఁగ లేక,
నినుఁ జూచి, చేసాచి, నిలుచున్న ననుఁ జూచి,
అలరుగుత్తులతోడఁ గలసి నవ్వితివి;
కలికిచుక్కలతోడఁ గలసినవ్వితివి;

* * * *

నవ్వుతాకున నేను నలిగిపోయితిని;
నలిగి యానందానఁ గలిగిపోయితిని;

* * * *

* * * *

* * * *

కొల్లకొల్లఁగఁ బూచె మల్లెపూఁబొదలు;
తెల్లతెల్లఁగఁగాచెఁ జల్లవెన్నెలలు;
మెల్లమెల్లఁగ వీచెఁ బిల్లతెమ్మెరలు;
చల్లవెన్నెలలోన, మల్లెపూఁబొద నిల్చి,
పిల్లతెమ్మెర కుల్లసిల్లుచుంటివి నీవు;
నినుఁ జూచి, చేమోడ్చి నిలిచియుండితి నేను,
ననుఁజూచి, కనుసైగ నెనయఁ బిల్చితి వీవు;
తడఁబాటు తొడరి నే నడుగు ముందిడలేను;
వడిగ రమ్మనుచు నీ వడియానఁ బడఁద్రోతు,
వేమి సేయఁగ లేక యేడ్వ సాగితిని;
నాయేడ్పు విని నీవు నవ్వసాగితివి;
నీనవ్వులో నేను నిలిచి క్రాగితిని;
క్రాగి నీనవ్వులోఁ గరగిపోయితిని;
కరగి నీనవ్వులోఁ గలసిపోయితిని.

* * * *

* * * *

* * * *

* * * *

# ఊటీ వైభోగము

## "మంత్రి సింహం"

పాత్రలు, పురుషులు

౧. రాఘవయ్య-బోర్డు ఆఫీసులో గుమాస్తా.
౨. శ్రీనివాసరావు-సబుజడ్జీ.
౩. మార్తాండశంపిళ్లె-డాక్టరు
౪. రామసింగు-జవాను.
౫. యోగీశ్వరుడు.

—స్త్రీలు

౧. చంపకవల్లి—రాఘవయ్య భార్య.
౨. వెంకుబాయమ్మ—శ్రీనివాసరావు భార్య.
౩. కామాక్షి } ఇరుగుపొరుగు
౪. జయలక్ష్మి } స్త్రీలు.

(ప్రథమ రంగము)

[మదరాసులో అక్బర్ సాహేబువీథిలో నొక గృహము. వీథివైపుగదిలో ఆఫీసు బల్ల యొద్దకూర్చుని, ఆఫీసుకాగితములు చూచుకొనుచు, రాఘవయ్య ప్రవేశించును.]

రాఘవయ్య:—(తనలో) ఈ రోజులలో యింగ్లీషు చదువుకొని, దొరసానుల పద్ధతుల నవలంబించు నవనాగరిక పిల్లలను పెండ్లియాడుటకంటె బుద్ధితక్కువ మరి యొకటియుండదు. పూర్వము, మనస్త్రీలు భర్తయొక్క శుశ్రూషయే పరమ వ్రతమని యెంచి, భర్త నిదురనుండి లేచుటకుముందే లేచి, కాలోచితములను దీర్చుకొని, నుదుటను అర్ధరూపాయియంత కుంకుమ బొట్టును దిద్ది, లక్ష్మీదేవివలె కలకలలాడు ముఖముతో భర్త లేచునప్పటికి కెదురేగి, ఆయనకు కావలసిన సపర్యలను జేసి, పిమ్మట, ఉతకవలసిన మేలైన బట్టలను బిందెయందుంచుకొని, నదికిబోయి శుభ్రముగా బట్టల నుతికి, స్నానమాడి, యుతికినబట్టల నొక భుజముపై వేసుకొని, బిందెతో నుదకము నింకొక భుజముపైనుంచు కొని యింటికివచ్చువారు. పిదప షడ్రసోపేతమగు పదార్థములను స్వయముగా పచనముజేసి, భర్తకేవస్తువులు యిష్టమో గుర్తెరిగి, ఆ పదార్థములను భర్తకు కొసిరి కొసిరి వడ్డించి భుజింపచేసి, తర్వాత భర్తకుడిచి లేచిన విస్తరిలో తానొడ్డించుకొని, భుజించి, యెల్లవిధముల పతిసేవ చేయుచుండెడివారు.

ఇప్పుడు నాభార్యయో, జిల్లాజడ్జీగారి కూతురు. ఎక్కువ గారాబముతో పెంచబడి, యింగ్లీషువిద్య నభ్యసించిన నవనాగరికురాలు.

నేను బి. య్యే. బి. యల్. ప్యాసు అయినానని చెప్పి యేదోపెద్ద యుద్యోగము చేస్తానని భ్రమతో నాకిచ్చి వివాహము చేసిరి. కాని నేను బ్రాహ్మణుడనై పుట్టుటచే నాయుద్యోగము నీళ్లు కారుచున్నది.

ఇప్పుడు ౮ గంటలయినది. నాభార్య యింకా నిదురనుండి లేవలేదు. నే నుదయముననే లేచి కాఫీ తయారుచేసి యుంచితిని. అది చల్లారిపోవుచున్నది. కాఫీ చల్లారిపోయినదని నామొఖముమీదకొట్టి మళ్లీ కాచమంటుంది కాబోలును. నే నింకా ఆఫీసుకాగితములు వ్రాసుకొని, తర్వాత వంట చేసుకొనవలసియున్నది.

అయినను, లేచినదేమో చూచెదను. (అనుచు పడకగది యొద్దకుబోయి తలుపు నెమ్మదిగా తెరచి, మెల్లగా) "చంపకం! చంపకం! యింకా లేవలేదా? ౮ గంట లయినది. కాఫీ కాచియుంచినాను, చల్లారిపోవుచున్నది." అని పలుకరించెను.

చంపకం:—(కనులు నులుపుకొనుచు తలయెత్తి చూచి) ఇంకా పూర తెల్లవారలేదు. అప్పుడే యేమి తొందరవచ్చింది? మా నాన్నగారి యింట్లోవున్నప్పుడు విస్తట్లో వడ్డించబోతూ ౧౦ ఘంటలకు మాఅమ్మవచ్చి

లేపితే లేచేదానను. మీయింటికి వచ్చినప్పటినుంచి నాకు కళ్లనిండా నిద్దుర లేదు. కాఫీ చల్లారిపోయేందుకు అప్పుడే యెందుకు కాచినారు? నేను లేచినాక నీళ్లు పొయిమీదపడేస్తే చాలదా? చల్లారిపోయిన కాఫీ నేను తాగలేను. అది పారబోసి, మళ్లీ నీళ్లు పొయిమీద పడెయ్యండి. నేనే కాచుకొందును కాని, పొయిదగ్గరకు వెళ్లటం అలవాటులేక, కళ్లల్లోకి పొగ వస్తుందని భయముచేత కాఫీ కాచుటకు, వంటచేయుటకు మిమ్మలిని కష్టపెట్టవలసివస్తూ యున్నది.

అనుచు ఆమె లేచి కాలకృత్యములను దీర్చుకొనుటకు వెళ్లెను.

ఇంతలో రాఘవయ్య తిరిగి తన ఆఫీసుబల్లయొద్ద కూర్చుని కాగితములు వ్రాసుకొనుచుండెను. కొంతసేపటికి చంపకవల్లి శృంగారించుకొని, కప్పతాళ్లవంటి జడ వీపుపై నిటునటు గంతులువేయ కనులపై సులోచనముల జోడు సవరించుకొనుచు మేలు పసిండి జల్తారు సరిగ సిల్కుచీర చెరగు జారిపోయిననూ గమనించక, హస్తమున నొక Ladies hand bag ను ధరించి, ఔన్నత్యము యెత్తున్న దిమ్మకీ కాసంతే అడుగుభాగముగల Ladies shoes యొక్క మడిమలు టక్కుటక్కుమని చప్పుడు చేయుచుండ, మెరుపుతీగవలె ఆఫీసుగదిలోనికి ప్రవేశించెను.

చం—My dear! మీరు యెప్పుడూ ఆఫీసు పనితో మునిగితేలుతూవుంటారు. కొంచెము సేపు మీతో ముచ్చటించవలెనంటే అవకాశమే లేదు. రాత్రి మీరు మళ్లీ ఆఫీసు కాగితములు చూచుకొని వచ్చేటప్పటికి నేను నిద్రపోతూ వుంటాను. ఆఫీసు పని కట్టిపెట్టి నేను చెప్పేడు మాటలు వినండి.

రాఘ—ఆఫీసుపనిచేయకపోతే మనకు కడుపులోనికి భుక్తి యెట్లా వస్తుంది? అంత అవసరంగా చెప్పవలసిన రాచకార్యం యేమి వచ్చినది? చెప్పు చంపకం! వింటాను.

చం—మార్చినెలలో సగం గడచిపోయినది. యెండలు ముదురుతూ వున్నవి. వేడి భరించలేకుండా వున్నాను.

మాతండ్రిగారు జీవించియున్నప్పుడు ఆయన జిల్లాజడ్జిగా నుండుటచే వేసవికాలపు శలవులలో ఊటీ వెడుచూ నన్నుకూడా తీసుకువెళ్లేవారు. మీరు మూడు నెలలు శలవుపెట్టి నన్ను ఊటీ తీసుకువెళ్లక తప్పదు.

ఇట్లనుచు చేతిలోని తోలుసంచీ తెరచి, దానిలో నుండి యొక చిన్న అద్దమును తీసి, ముఖమును చూచుకొనుచు, దువ్వెనతో జుట్టు సవరించుకొనుచుండెను.

రాఘ—మంచి యాలోచనే చేసినావులే! నాకు చూస్తే రూ ౧౦౦ లు జీతం. నా జీతమునీ సిల్కు సారీలకు, జాకెట్లకు, ఫేసుపవుడర్లకు చాలక అప్పులలో పడ్డాను. ఇప్పుడు ఊటీకి వెళ్లవలెనంటే రూ ౫౦౦-లైనా కావలెను. ఎక్కడ నుంచి తేగలను? అదిన్నీకాక, మదరాసులో మేనెలాఖరువరకూ చల్లగానే వుంటుంది. ఇప్పుడు ఊటీ యెందుకు చంపకం! మన స్థితిగతుల కనుగుణంగా మనము నడుచుకోవద్దా!

చంప—నేను యేకోరిక కోరినా మీరు డబ్బులేను డబ్బులేదు అనే అంటారు. నాకు చీరెలు జాకెట్లుకొన్నానని చెప్పుతారు. పెండ్లిచేసుకున్న భార్యలకు గుడ్డలుకొనియివ్వటం అబ్బురమేనా? ఇక్కడ ఎండలులేవన్నమాట అటుంచండి. ఎండలువున్నా లేకపోయినా Fashionable people ఊటీ వెళ్లుట ఆచారము. మనపొరుగువారు, సబ్‌జడ్జి శ్రీనివాసరావుగారు, ఆయనభార్య వూటీవెడతారట. నాస్నేహితురాలు వెడుతూవున్నపుడు నేను వెళ్లకపోతే నాకు చిన్నతనముగా నుండదా! మీదగ్గర డబ్బులేకపోతే నా Necklace యిస్తాను. అది అమ్మివేసి డబ్బుతీసుకురండి. ఇప్పుడు బంగారం ఖరీదు యెక్కువగా నున్నది. రూ ౫౦౦/- లు వస్తాయి.

రాఘ—అయితే, యిప్పుడు వూటీవెళ్లటం చల్లదనంకోసంకాదా! Fashion కోసమా? "పులినిచూచి నక్కవాతపెట్టుకున్నది" అన్నట్లు దొరలు, దొరసానులు వెడతారని, వాళ్లమోస్తరుగా మనంకూడా వుండవలెనని వూటీవెళ్లి, అక్కడచలిబాధ అనుభవించవలెనా? ఇంగ్లీషువారంటే వారు శీతలదేశంలో పుట్టినవారు

గనుక మనదేశంలో వేసవిలో యెండలు భరించలేక వెడతారు. మనము యీ ఉష్ణదేశములో పుట్టి, యిక్కడ పెరిగినవారము. ఇక్కడ శీతోష్ణస్థితులకు అలవాటు పడినవారము. మనతండ్రులు, తాతలు ౮౦ సంవత్సరముల వయస్సువచ్చేవరకూ బ్రతికి రాళ్లవలెవుండేవారు. ఊటీవెళ్లకుండా మంచిఆరోగ్యముగా బ్రతుకలేదా?

చంప—ఊటీవెళ్లడము Fashion కోసమేనని నేను మొదటనే చెప్పియుంటిని. ప్లీడరు రామారావుగారిని చూడండి. ఆయనకు కోర్టుకు వెళ్లుటకు ట్రాంఖర్చుకైనా డబ్బురాదు. ఆయన అప్పుచేసుకొని ప్రతియేటా ఊటీవెళతాడు. "మాప్లీడరుగారు ఊటీవెళ్లినారు" అని పార్టీలుచెప్పుకుంటే గొప్పగావుంటుంది. ఈలాగుననే ఊటీవెళ్లే ప్లీడర్లలో మూడువంతులు నలుగురూ చెప్పుకోవాలని గొప్పకోసంవెళ్లేవారే.

రాఘు—అయితే నీ మనసొచ్చినట్లు కానిమ్ము. నీ వస్తువ అమ్మి డబ్బు తెచ్చియిస్తాను. అది తీసుకొని నీవు వెళ్లి నన్ను మాత్రం వదలివెయ్యి. నీవు స్వతంత్రురాలవు. ఇంగ్లీషు మాటలాడగలవు. అన్ని దేశములు స్వయముగా తిరిగిరగల శక్తి గలదానవు.

చం—మీ రన్నమాటలు నిజమేగాని, నేను వొంటరిగావెడితే అక్కడ నాకు హోటలు భోజనము పడదు. స్వయముగా వంటచేసుకోలేనన్న మాట మీకే తెలుసును గదా. నేనక్కడ హోటేల్‌లో భోజనము చేసి జబ్బుపడితే డాక్టర్ బిల్లుకు అయే ఖర్చు మీ కిప్పుడు రైలు ఖర్చు అవుతుందనుకోండి. మీరు సాధారణముగా ౩ వ క్లాసులో వెళ్లటమే మామూలుకదా! అట్టే ఛార్జికామలెండి. నాకుమాత్రం ౨-వ క్లాసు టిక్కట్టు కావాలి సుమండీ. సబ్ జడ్జీగారి భార్య కంకుబాయమ్మ ౨-వ క్లాసులో యెక్కుతూవుంటే నేను యేముఖము పెట్టుకుని ౩-వ క్లాసులో యెక్కను. నా ప్రాణం చచ్చిపోయినట్లుంటుంది.

రాఘు—సబు జడ్జీగారి భార్య ౨-వ క్లాసులో వెడుతుంటంటే ఆమె భర్త నెలకు రూ ౮౦౦ గణిస్తూ వున్నాడు. ఆమెకూ నీకూ సాపత్యమా?

చం—ఆమె సబు జడ్జీగారి భార్య అయితే నేను జిల్లాజడ్జీగారి కూతురను. ఆమె స్టేటస్‌కంటె నాస్టేటస్ యే యెక్కువది.

రాఘు—నీ మనసొచ్చినట్లే చేస్తానులే. నన్ను కాగితములు వ్రాసుకోనిస్తూ. నాకు వంటకు మడికట్టుకునేందుకు టైము అవుతూ వున్నది.

చంప—మిమ్మలను యిక మాట్లాడించనులెండి. నేను స్పెన్సరుకు వెళ్లి నాకు కావలసిన వులెన్ బనియనులు, స్వెట్టరు, మఫ్లర్లు, రెండు ట్వీడ్‌కోట్లు వొకవోవర్‌కోటు, ఒక Rain coat ఒక నస్గు ఆర్డరుచేసి వస్తాను. మీకు కూడా యేమైనావులెన్సు కావలిస్తే తెచ్చి పెడతాను.

రాఘు—నాకు యేమీ అక్కరలేదు. నా అంగోస్త్రం చెవులకు చుట్టుకుంటే నీ మఫ్లరుకంటె యెక్కువ వేడిగా వుంటుంది. రెండుకుంపటులా పొయిదగ్గర కూర్చుంటే యే ఫ్లానల్ కోట్లూ అక్కరలేదు. మన పరుపుక్రింద కట్టే బళ్లారి కంబళీ రాత్రికప్పుకున్నానంటే, దానికి యే రగ్గులూ చాలవు.

చంప—అయితే నేను స్పెన్సరులోనే ఆర్డరు యిచ్చివస్తాను. ఖరీదు యెక్కువఅయినా మంచి సరకు వుంటుంది. ఇతర షాపులలో సామాన్యులు కొనుక్కుంటారు. (అని నిష్క్రమించును).

## రెండవ యంకము

(రంగము: ఊటీ. గవర్నమెంటు బొటానికల్ గార్డెన్సులో వర్షము కురియుచుండగా రాఘవయ్య, చంపకవల్లి ప్రవేశించుచున్నారు. చంపకవల్లి కాళ్లకు వులెన్ సాక్సు, లేడీషూస్, వులెన్ స్వెట్టర్, దానిపైన మోకాళ్లక్రిందకు దిగజారుచున్న Rain Coat, చెవుల చుట్టూ తలపైనుండి కట్టబడిన రమ్యమగు మఫ్లరు, చేతులకు gloves, యెడమచేతిలో ladies bag, కుడిచేతిలో గొడుగు ధరించియుండును.

రాఘవయ్య చెవులచుట్టూ అంగోస్త్రమును చుట్టి, చొక్కాకోటు, ధోవతిధరించి పైన బళ్లారికంబళీ కప్పుకొని, చిరిగిన గొడుగువేసుకొని యుండును.)

రాఘు—అబ్బా! ఈచలికి దవడలు దగ్గరబడుతూ వున్నాయి. నాకోడుకులో చిల్లులగుండా వర్షం అంతా నామీదనే వుంటూవున్నది. లోపలినుంచి చలి, వొణుకు పుట్టుకు వస్తూవున్నది. ఇది అంతా యెందుకువచ్చిన అవస్థ!

చంప—ఈ రోజున వర్షముచే చలియెక్కువగా వున్నమాట నిజమే. కాని, మీరు అందరితోను వూటీ క్లైమేటు (Climate) బాగులేదని అనకండిసుమీ! వూటీ enjoy చేయలేని rustic అనుకుంటారు. ఎవరినైనా కలుసుకున్నప్పుడు వెంటనే "How fine is the weather! How enjoyable!" అనవలెను.

రాఘు—మనస్సులో వొకటి, పైకిచెప్పేది యింకొకటి, అంతా అబద్ధపు జీవనమేనా? ఇదికూడా నవనాగరికతకు లక్షణమే కాబోలును. నా కిట్టి కుటిల వర్తనము చేతకాదు.

చంప—మీకు నవీన పద్ధతులు నేర్పవలెనని నేనెన్ని ప్రయత్నములు చేసినా పట్టుబడవు. అందరూ చలితో వొణుకుతూవున్నా నోటితోమాత్రం నేను చెప్పినట్టుగా అంటారు.

ఇది Etiquette. మీపుణ్యమయిని, మీరుమాట్లాడకుండానైనా వూరుకోండి. అదుగో Executive Counciller వేణుగోపాలరావునాయుడుగారు వస్తూవున్నారు. వీరికి, మాతండ్రిగారికి స్నేహం అవుటవల్ల నన్ను చిన్నప్పటినుంచీ యెరుగుదురు. వీరితో కొంచెం దూరం మాట్లాడుతూ నడిచివెళ్లి యిప్పుడేవస్తాను. మీరు యిక్కడ బెంచిమీద కూర్చోండి. మీరు మాతో మాత్రం రాకండి మీకు మంచి dress లేదు. ఈవేషంతో మాతో వస్తే బాగుండదు.

(సర్ వేణుగోపాలరావునాయుడుగారు ప్రవేశించుచున్నారు)

చం—Good evening Sir Venugopal! How fine is the weather!

వేణు—Good evening mrs. Valli. Yes, it is really enjoyable మిమ్ములను కలుసుకుని చాలాకాలమైనది. క్షేమంగాయున్నారా?

(అని యుభయులు కలిసి నడచి వెళ్లుచున్నారు.)

వేణు—తో మాటాడుచున్న ఆ బ్రాహ్మడు యెవరు?

చంప—ఆయన మాయింట్లో వంటచేసేవాడు. నేను వొక్కర్తెనూ వస్తూవున్నానని Gardens వరకూ సాయంవచ్చినాడు.

(ఈమాటలు రాఘువయ్య చెవులకు సోకగా)

రాఘు—(తనలో)అన్నా! ఎంతవరకూ వచ్చినది! ఈమె నేను భర్తనని చెప్పుకొనుటకుకూడా సిగ్గుపడుచున్నదే. "అయ్యా! నాయుడుగారూ! యీమెచెప్పినట్లుగా నేను యింటిలో వంటచేసేవాడనే కాని, నాకు యింకొక డ్యూటీకూడా కలదు. అది ఈమె చెప్ప మరచినది.......................................

...................... అని తక్షణమే అనవలెనని నాకు నాలుకచివరకు వచ్చినది. కాని, సిగ్గుపడి యేడ్చిపోతుందని చెప్పి, అనకుండా ఆపుకున్నాను. ఆడపిల్లను తెచ్చుకునేటప్పుడు తనకంటె తక్కువకుటుంబములోనుంచి తెచ్చి వివాహము చేసుకొనవలెననియు, ఆడపిల్లను యిచ్చేటప్పుడు, తనకంటె యెక్కువకుటుంబములో యివ్వవలెననియు, పెద్దలు చెప్పేడిమాట అబద్ధముకాదు. కాని ఈమెను నిందించవలసిన పనికాదు. ఇది ఈమెతప్పుకాదు. ఈమె నావహించిననవనాగరికతా పిశాచముయొక్క యీవేళను యీమె నిట్లాడించుచున్నది. ఈ పిశాచముపట్టిన పురుషులయొక్కయు స్త్రీలయొక్కయు చర్యలు, దెయ్యముపట్టిన వానిచర్యలు విపరీతముగానుండునట్లు, మనసనాతన ధర్మనియమములకు కడువిపరీతముగా నుండును. నాలుగు యింగ్లీషుముక్కలు చదువుకోగానే, మనపెద్దలు దివ్యదృష్టిచేకనిపెట్టి మనకు యెక్కువ శ్రేయోదాయకములుగా యేర్పరచిన యీ చారములనన్నిటిని ధిక్కరింతురు. ఎంతోధనము వ్యయముచేసి, బ్రహ్మోపదేశపురస్కరముగా ఉపనయనములో వేయబడిన యజ్ఞోపవీతము ఒక్కపిల్లకాయమెడలోనైనా కనపడుతుందా? జంధ్యపుపోచ బరువట. పూర్వం మనస్త్రీలు పరాయిమొగవానికంటబడేవారా? ఇప్ప

టికాలపు ఆడపిల్లలో, ముద్దుముసు, ముక్కారు వేష ములువేసి, యెప్పుడూ, గృహకృత్యములు చూచుకొనుట లేదు సరికదా, పరాయిమొగవాళ్లతో పూరు వెంటతిర గడమేపని

నా భార్యకి పిశాచముపట్టుటచే యిట్టి విపరీత చేష్టలు కనబడుచున్నవి.

ఎన్నిదురాచారములు చేసిననూ యీమెకు గుణము మాత్రము నిష్కల్మషముగానుండుటచే నే నోపికపట్టి యూరకొనుచున్నాను. ఈ దురాచారపిశాచ మీమె నెప్పుడు వదులునాయని భగవంతుని వేయివోళ్ల ప్రార్థించుచున్నాను అదుగో! శ్రీనివాసరావుగారు యీలాగు వచ్చుచున్నారు. ఆయనతో మాట్లాడుచూ యింటికి బోయెదను. చంపకం ఏరాత్రికోగాని యింటికి చేరదు.

(ప్రవేశము: శ్రీనివాసరావుగారు)

రాఘ—పంతులుగారూ! క్షేమముగానున్నారా?

శ్రీని—ఏమి క్షేమమండీ! చలిబాధపడలేక చచ్చిపోతూన్నాను.

రాఘ—ఇక్కడ చలియెక్కువగా వుంటుందని యెరిగియుండిన్నీ యెందుకువచ్చారండీ? నేనైతే నా పెండ్లాముపోరు పడలేక వచ్చినాను.

శ్రీని—మీరు పెండ్లాము పోరుపడలేక వస్తే నేను వూళ్లోవాళ్ల పోరు పడలేక వచ్చాను.

రాఘ—అదేమిటండో! నాకుబోధపడటంలేదు. వూళ్లోవాళ్ల పోరపడలేక రావటం యేమిటి?

శ్రీని—నాకు శరీరములో బాగులేక శలవు పుచ్చుకొని మదరాసులో వైద్యం చేయించుకుందామని వచ్చినాను. సముద్రపుటొడ్డుకు షికారువల్లినా, బజారుకు పనియుండి వెల్లినా బైటకు వెళ్లగానే కనబడే స్నేహితులందరూ మొట్టమొదటి ప్రశ్న)— "ఏమండీ, పంతులుగారూ! ఊటీ వెళుతారా బెంగుళూరు వెడతారా?" అని అడిగేవారే కదా! "నేను యెక్కడకూ వెళ్లను, యిక్కడనేవుంటాను." అని చెప్పినా వూరుకోకుండా, "ఊటీ వెళ్లండి. చాలా బాగావుంటుంది." అని అయాచిత-సలహాలిచ్చేవారేకదా! ఈ విధముగా యెందరు పీక్కుతిన్నారని చెప్పను. మదరాసులో నే కూర్చుంటే, "వీడు లుబ్ధుడు. డబ్బు ఖర్చవుతుందని వూటీ వెళ్లాడుకాడు" అనేవారు కొందరు. "వీడు పాత వుసిరిగపచ్చడి. వీడికి నవీనపద్ధతులు తెలియవు" అనేవారు కొందరు. వీళ్ల పోరుపడలేక, మదరాసులో వుంటే బతుకనీయరు, ఇలా పొడిచి చంపుతారని చెప్పి నేను వూటీవచ్చినాను. ఇప్పుడు నాయవస్థ యేమని చెప్పను. ఒక్కటే వర్షాలు కదా! సూర్యరశ్మి యెప్పుడో కాని కనుపించదు. ఏవస్తువు ముట్టుకొన్నా చల్లగా కాళ్లు కొంకర్లుపోతాయి. చన్నీళ్లు ముట్టుకోనేలేము గదా! కాళ్లు కడుక్కోవడానికి, త్రాగుటకు నీళ్లు, బైలు భూమికి వెడితే ప్రక్షాళనకు కూడా వేడినీళ్లే వుపయోగించాలి. అందుచేత యిరవై నాలుగు ఘంటలు వేడినీళ్ల అండీ పొయిమీద కాగుతూ వుండవలసినదే. నాకు తెల్లవారగల్లే లేచి, యెంత శీతాకాలములోనైనా సరే శీతలోదకస్నానముచేసి, జపంచేసుకోవటం వాడుకాలు. ఇక్కడ చన్నీళ్లు స్నానము చేద్దామనుకుంటే, నీళ్లు ముట్టుకోగానే, వేళ్లు కొంకర్లుపోతే, ఇంక స్నానం యెల్లా చేయగలను? చన్నీళ్లలో స్నానముచేస్తే అన్ని అవయవములు బిగుసుకుపోయి Cramps ట యేమిటో వచ్చి చచ్చిపోతావన్నారు. నేను చచ్చిపోతే పోనీ అని చన్నీళ్లే స్నానముచేద్దును కాని, నా పిల్లలకు యింకా కొంతకాలం నా ఆసరా కావలసివుంటుందని చెప్పి సాహసించలేదు.

స్నానంచేసి, జపం చేసుకుందామని కూర్చుంటే చలిచే దవడలు వజవజ లాడటంచేత "కృష్ణా, కృష్ణా" అనబోతే "వృమణ, వృమణ" అనేశబ్దం బయలుదేరుతోందండీ! ఇదో పాపంకూడాను.

ఇంట్లో పగలుకూడా అన్నితలుపులూ, కిటికీలు మూసుకొని ఫ్లానల్సుతో కూర్చోవలసిందేకదా! మరిన్ని ప్రతిగదిలోను గోడలలో పొయిలు, వాటిలో నిత్యాగ్నిహోత్రాలు వెలుగుతూ వుండవలసిందే. దుర్భరమైన యీ శీతలంలోకి యెందుకురావాలి, మళ్లీ వేడికోరుతూ ఉష్ణోపచారాలకు యెందుకు యేడవాలి. పోనీ, చలి,

వానగానున్నది యింట్లోనే కూర్చుందామంటే, బైటకు వెళ్లి, వొళ్లు వేడి ఎక్కేవరకూ నడచివస్తేనే గాని తిన్న తిండి అరగదు. ఆకలివుండదు. తిన్నతిండి అరుగుతేనే గాని ఆరోగ్యముండదు. అందుచేత వర్షం కురుస్తూ వున్నాగాని, రెండుపూటలూ వచ్చినట్లువెళ్లి నడచి రావలసిందే. నడవకపోతే జబ్బుచేస్తుంది. నడిచి వర్షములో తడుస్తే జబ్బుచేస్తుంది. "ముందుకువెడితే గొయ్యి, వెనక్కువెడితే నుయ్యి" అన్నట్లున్నది. ఏఋతువులో ఆ ఋతుధర్మం జరుగుతే బాగుంటుందికాని, మండు వేసవికాలములో మనదేశంలో హేమంతఋతువులోనైనా లేని శీతకాలపు ధర్మములను కోరుకొనటం యెందుకండీ? యిదంతా మాస్తే, డబ్బెట్టి తద్దినం కొని తెచ్చుకున్నట్లున్నది. చన్నపట్నంలో పగలు కొంచెం వేడిగావున్నా, రాత్రి సముద్రపుగాలి తగులుతూ, ఆరుబయట పండువెన్నెలలో మంచంవేసుకు పడుకుంటే సుఖమా? లేక, యిక్కడ అన్నితలుపులు, కిటికీలు మూసుకొని, ఊపిరి సలపకుండా, నాలుగుబ్లాంకెట్లు కప్పుకుని, యింకా చలిఆగక వొణుకుతూ పడుకోవటం సుఖమా! ఈ కలికాలంలో అన్ని విపరీతాలు యేలా పుట్టుతున్నాయో, యీ ఊటీకిరావటం అనేది వాటికి అనుగుణంగానే వున్నది. నేనుపుట్టి బుద్ధియెరిగాక చాలా కాలంవరకు "వూటీ" అనేది యెక్కడవున్నదో యెవరికీ తెలియదు. యేదో దొరలుమాత్రమే వూటీ వెడతారని వినేవాళ్లము. వొకరినిచూచి వొకరికి ౧౦,౧౫ యేండ్లనుంచి వేలాం వెర్రిక్రింద బయలుదేరింది. అంతకు పూర్వం మనవాళ్లు వూటీరావటం వినలేదు. అదివరకల్లా మనదేశంలోనే వేసవికాలంలోవుండి బ్రతుకుతూ వున్నవాళ్లు, యిప్పుడు వూటీవస్తేనేకాని ప్రాణాలు పోతాయా! యివన్నీ వేషాలండీ!

రాఘు—మీరుచెప్పినవన్నీ నిజమే. ఈచిత్రం చూచారా? మదరాసు వదలివచ్చిననాటినుండి శుభ్రమైన పెరుగుగాని, మజ్జిగగాని జిహ్వామీదపెట్టి యెరుగను. ఒక్కరోజునైనా కాచి తోడుపెట్టిన పాలుతోడు కుంటేవొట్టు. రోజూకూడ తోడుకోకుండా పులిసి పోయిన పాలుపోసుకోవడమేకదా?

శ్రీని—మీరు పాలు తోడుకోవంటే జ్ఞాపకం వచ్చింది. మావూరునుంచి మంచిరకం మామిడి కాయలు కావకట్టించి బుట్టతెచ్చినాను. అందులో ఒక్కకాయకూడ పండలేదు సుమండీ! మనవైపున వుంటే అనుభవింపగల సౌఖ్యాలు అన్నీ వదులుకొని, యిక్కడ యీబాధలు అనుభవించటానికి రావడం పూర్వజన్మ కృతకర్మానుభవమే.

రాఘు—ఇన్ని బాధలు పడతూవున్నా యివి పైకిచెప్పకోకూడదట. అల్లాచెప్పటం Bad Etiquette is "పైగా Rustic, వూటీ Enjoyment యిల్లాంటి పల్లెటూరివాళ్లకు యేమి తెలుస్తుంది" అంటారట. నా భార్య నన్ను Warn చేసింది.

శ్రీని—సరే! మీభార్య చెప్పిందంటే మన మంగీకరించవలసిందే. ఆమె నవీననాగరికతలో Authority కదా! మీపుణ్యమాయిని వాతో చెప్పినారు. లేకపోతే నేను నలుగురిదగ్గరా యీలా వాగానంటే, వీడు పరమ మూర్ఖుడు అనుకొందురు.

రఘు—నాభార్య యీవిషయములలో Authority అన్నమాట నిజమే. మొన్న Gardens లో ఒక పిల్ల షికారుతిరుగుతూవుంటే చూచినాను. ఆమెచెవులలో యేవో వ్రేలాడగట్టుకున్నదండీ! చాటలులాగ వున్నాయి. భుజములకు తగులుతూ వుండేటంతపొడుగ్గా వ్రేలాడుతూ వున్నాయి. చూస్తే నాకు అసహ్యం వేసింది. ఇప్పుడు యిది యొక Fashion అని నా భార్యచెప్పింది.

శ్రీని—మొగవాళ్ల మీసాలకు క్రొత్త Fashion వచ్చింది, చూచారా! ముక్కుక్రింద చిన్నగొంగళీ పురుగులాగ నలుసంత నల్లగావుంచి, మీసాలు గొరిగివేస్తూ వున్నారు. ఇదియేమి అందమో నాకు తెలియదు మొఖం చూస్తే డోకువేస్తుంది. పూర్వం మీసాలు పెంచి నారంటే, సంపెంగనూనెలు రాసి రెండువైపులా తుమ్మెద రెక్కలవలె పట్టెడేసి మీసాలు పెరిగితే, వాటిని రెండుచేతులతోనూ వొడవేస్తూ, మైనం రాసి, గొరగేదె కొమ్ములవలె నిలబెట్టేవారు. ఇప్పుడు మనవాళ్ల మీసాలు క్రమముగా పొట్టి అయిపోవటానికి

కారణం, ఈమధ్య యెవరో వుపన్యాసం యిస్తూ చెప్పినారు. అది యేమిటంటే, పూర్వం మనవాళ్లు పౌరుషం తెలియజేయటానికి, పౌరుషానికి తగ్గట్టు మీసాలు పెంచేవారు. ఇప్పుడు పురుషులు పౌరుషహీనులై, యెంత వరకూ పౌరుషం తగ్గిందో మీసాలు అంత ముక్కులోకి దూరుతూ వున్నాయట!

చీకటి పడుతూవున్నది. మంచుకురవటం ఆరంభించింది. ఎవ్వరూ బయట వుండరు. ఇళ్లు చేరుకుందాము.

(ఇద్దరూ నిష్క్రమించుచున్నారు)

## మూడవ యంకము

(రంగము గవర్నమెంటు బొటానికల్ గార్డెన్సు చంపకవల్లి, వెంకుబాయమ్మ నడచుచున్నారు)

చంప- ఏమండీ! వెంకుబాయమ్మగారూ! మొఖానికి అంతవొత్తుగా పసుపురాసుకుని, కుంకుమబొట్టు అంత పెద్దదిగా పెట్టుకున్నారేమిటి? ఈరోజులలో ఆడవాళ్లు పసుపు రాసుకోవటం మోటు అయిందని మానివేసినారని యెరుగరా? ఇలాగంటివేషముతో షికారు వస్తే అంతా చూచి నవ్వుతారు.

వెంకు- పోనీ! నవ్వితే నవ్వనీ అమ్మా! వాళ్ల మూతి వొంకరపోతుందిగాని, నాకేమీ దానివల్ల లోటు రాదు. నేను యేమి తప్పుపని చేసినానని నవ్వుతారు? పాడుపని చేసినానని నవ్వుతారా? పుణ్యస్త్రీలకు పసుపు, కుంకుమయే భూషణములు. మనజీవనమంతా ఈపసుపు, కుంకుమ నిలబెట్టుకున్నంతసేపే. ఈరెండు వదలిపోతే జీవనముతో ప్రయోజనమే లేదు. మీవంటి నవీనయువతులు ముఖమునకు యేదో విభూతి రాసుకొన్నట్లు యేవో తెల్లనిపౌడర్లు చల్లుకొని పూర్వ సువాసినుల ముఖములవలె యెక్కడ బొట్టు లేకుండావుంటే అది అందమనుకున్నావా అమ్మాయీ! మరిన్నీ మనము అలంకరించుకోవడము మన హృదయములకు తృప్తిగా నుండుటకున్నూ, మన భర్తలను రంజింపజేయుటకున్ను కాని యితరులు మనలను చూచి ఆనందించవలెననిన్నీ, శ్లాఘించవలెననిన్నీ కాదు.

చం—పతిని రంజింపజేయుట సతీమణిధర్మమని నేను వొప్పుకుంటాను. కాని నవీనపద్ధతుల ప్రకారం చక్కగా శృంగారించుకొని అందరిచేత "ఈమె Fashions లో authority" అని అనిపించుకుంటే గౌరవము కాదా? గుణం మంచిది అయివుంటే దీనిలో తప్పేమి వున్నదండీ?

వెంకు—కులస్త్రీలయొక్క యాశయము వేశ్యకాంతలవలె వేషములువేసి యితరుల మెప్పు పొందుట కాదు. మన యావజ్జీవమునూ పతిసేవకై ధారపోసి మన స్వంతసౌఖ్యములను, ఆనందములను విడనాడి యైననూ భర్తృసేవాతత్పరులమై యుండవలయును. పూర్వము సీత, దమయంతి, చంద్రమతి మొదలగు పతివ్రతా శిరోమణులు, ఆగర్భ శ్రీమంతురాండ్రై చక్రవర్తులకు కుమార్తెలైననూ తమ సర్వసౌఖ్యములను గడ్డిపరకవలె తృణీకరించి భర్తలను వెన్నంటి తిరుగుచూ, యెన్ని యిక్కట్టులనో పడియుండలేదా? కనుకనే వారి జీవితములు ఆచంద్రార్కము శాశ్వతముగా మన హిందూయువతులకు ఆదర్శములుగా నుండునట్లు విలసిల్లుచున్నవి.

చం—వారు పతివ్రతాశిరోమణులని శ్లాఘించవచ్చునుకాని తమస్వంత సౌఖ్యములను పూర్తిగా వొదులుకొనుట నేనంత appreciate చేయలేను. భగవంతుడు అన్ని జీవులను సౌఖ్యపడమనే సృజించినాడు కాని, సౌఖ్యపడగలిగియుండియూ, కష్టములను కొనితెచ్చుకొనమని సృజియించలేదు. ఇది నా యభిప్రాయము.

వెంకు—నీ మతము యిప్పటి కాలానుసరణముగానే యున్నది కాని మా బోట్లకు రుచింపదు.

చంప—దీనికేమిగాని, నాటకమునకు వెడుదాము వస్తారా? స్థానం నరసింహారావు character వేస్తాడట. వూరంతా విరగబడుతూ వున్నారు.

రేపు ఒకక్రొత్త సినిమాఫిలిం వస్తుందట. దాని పేరు " Fools! Come and see " దానికైనా రేపు సాయంత్రం తీసుకు వెడుతాను రండి.

వెంకు—ఈప్రపంచంఅంతా ఒక నాటకరంగం కాదా? ఇందులో మనమందరము కూడా అభినయించు వేషధారులము. ఈ జగన్నాటకమున భగవంతుడు మనల కేర్పరచిన పాత్రలను ఉచితముగా నిర్వర్తించుకొని మన part ముగిసినతర్వాత, వేషములను చాలించి నిష్క్రమించుచున్నాము. నీవు చూడబోవునది యింతకంటె యెక్కువ నాటకమా? మన మిప్పుడు ఆడుచున్న నాటకముయొక్క రహస్యమును గుర్తెరిగిన వారికి యితర నాటకము లెందుకు? సినీమా ఫిలిం పేరు చిత్రంగావున్నదే! చూడడానికి వెళ్లినవాళ్లకి చాలా తగినపేరు పెట్టింది. నాకు యే నాటకములు, యే సినీమాలు అక్కరలేదు. నాకు భర్తసేవకంటె యింకేదీ యెక్కువైనదికాదు. పతిసేవవలన వచ్చే ఆనందంకంటె నాకు ప్రపంచములో యేదీ యెక్కువ ఆనందము నీయజాలదు. నేను యింటికి వెళ్లుటకు వేళ అవుతూవున్నది. ఎందరు నౌకర్లువుండి నౌకరీ చేస్తూన్నా ఆయనకు కావలసిన ఉపచారములన్నీ నేను స్వయముగా చేసుకుంటేగాని నాకు తృప్తివుండదు. వంటబ్రాహ్మణుడు వంటచేస్తూవున్నా నాభర్తకు యేపదార్థములు యేరీతిని తయారుజేసిన ఆయనకు రుచించునో, ఆప్రకారము నేను దగ్గరకూర్చొని చేయించుకొనవలెను. కనుక నేను పోయివచ్చెదను.

(అని నిష్క్రమించును)

చం--(తనలో) పాపము! ఈమెను జూచిన నాకు జాలి పుట్టుచున్నది. తెల్లవారి లేచిన తర్వాత స్నానములని, పూజలని యెప్పుడూ తంటాలుపడుతూ వుంటుంది. వెలుతురు రాకుండానే లేచి చన్నీళ్లలో స్నానముచేసి, పూజలతోనూ, పతిసేవతోనూ పడుకోబోయేవరకు మునిగి తేలుతూ వుంటుంది. భగవంతుడు ఈమెను కష్టజీవిగా పుట్టించినాడు. నావలె సుఖపడడం యేమిటో ఈమెకు తెలియదు. నేను బోధచేసినా వినదు. పోనీ! ఎవరినుదుటవ్రాత యెవరు తప్పించగలరు? నాటకమునకు వేళ అగుచున్నది. పోవలెను.

(నిష్క్రమించును)

## నాల్గవ రంగము

రాఘవయ్య కాపురమున్న యిల్లు

(రాఘవయ్య కంబళీ కప్పుకొని తలకు కొంతికంధం పట్టువేసుకొని దగ్గుచూ మంచంమీద పరుండియుండును. చంపకవల్లి, శ్రీనివాసరావు సమీపమున కూర్చునియుందురు.)

రాఘు—ఏమి తలనొప్పి! కణతలు బద్దలువేస్తూ వున్నది. కంబళీ కప్పుకొన్నా చలి ఆగక మంచం మీదనుంచి యెగరవేస్తూ వున్నది. దగ్గుచేత వొక్క నిముషమైనా నోరు మూతపడటంలేదు. దగ్గితే గుండెలు అదిరిపోతూవున్నవి. రామయ్య తండ్రి! అమ్మ! అమ్మా! లోపల బాధ యేమిటో చెప్పలేను. కడుపులో ఏదో ఆందోళనగా వున్నది. నిన్నరాత్రి ఒక్క నిముషమైనా కంటిమీద కునుకు పట్టలేదు.

చంప—రాత్రి బాగానిద్రపోయినారనుకుంటూ వున్నాను. నిదురపట్టనేలేదా నాకు వొళ్లు తెలియకుండా నిద్దురపట్టిపోయింది. ఇప్పటివరకూ మెలుకువ వచ్చింది కాదు.

రాఘు—రాత్రి ఆరుసార్లు దొడ్లోకి వెళ్లవలసివచ్చింది. వొకసారి దొడ్లోకివెడుతూవుంటే వుల్లుతూలి క్రింద పడిపోయినాను. మోకాళ్లు కొట్టుకుపోయినవి.

చంప—అప్పుడైనా నన్ను లేపలేకపోయినారా? కాళ్లకు కొట్టుకుపోయినచోట జాంబక్ రాద్దును.

రాఘు—దొడ్లోకి వెళ్లబోయేటప్పుడే నిన్ను రెండుసార్లు పిలిచినాను. పలకలేదు. పోనీ, లేపటం యెందుకని వెళ్లిపోయినాను.

చంప-(శ్రీనివాసరావుగారితో)పంతులుగారూ! మీబంట్రోతును పంపించి డాక్టరును పిలిపించెదరా!

శ్రీని- అల్లాగేనమ్మా! ఎవరోయి అక్కడ! రామసింగూ!

రామ---చిత్తంబాబూ!

శ్రీని—ఈవీధిలోనే చివర డాక్టరు మార్తాండం పిళ్లె యిల్లువున్నది. ఆయనను నేను చెప్పినానని చెప్పి దగ్గిరవుండి వొకసారి తీసుకొనిరా.

రామ—చిత్తం (అని వెళ్లుచున్నాడు)

శ్రీని—రాఘవయ్యగారూ! నేను మొదటినుంచీ మీతో చెప్పటంలేదా! ఈగ్రీష్మఋతువులో శీతాకాలం కంటే యెక్కువశీతలంగా వున్నది. వర్ష ఋతువు మించిపోయి రోజూ వర్షాలు కురుస్తూవున్నవి. మీశరీరాన్ని గురించి తగిన జాగ్రత్త పుచ్చుకోవటంలేదు. జబ్బుచేస్తుంది సుమండీ అని చెప్పలేదా?

రాఘ—ఏమిచెయ్యనండీ! వర్షం కురుస్తూవున్నా ప్రతిపూటా నాలుగుమైళ్లన్నా అధమపక్షం తిరిగితే కాని జబ్బుచేస్తుంది. అన్నం అరగదు అనిచెప్పి తిరుగుతూ వచ్చినాను. నాగొడుగుకు అన్ని చిల్లులమార్గాన్ని తడుస్తూవచ్చినాను. అక్కడికీ, వొకరోజున వర్షంయెక్కువగా వుంటే నడవటం మానివేసినాను. మర్నాడు విరోచనం కాలేదు. కడుపు పొంగరించి నానాబాధాపడ్డాను. తిరుగకపోతే జబ్బు. తిరిగితే జబ్బు. నక్కచావు వచ్చింది. మళ్లీ దగ్గ పొలివస్తూవున్నది. (అని విస్తారము దగ్గును).

చంప—ఈదగ్గుచూస్తే లంగ్సు affect అయిన వేమోనని భయముగా వున్నదండీ!

శ్రీని—ఆయనకు వొక ఫ్లానలుచొక్కా అయినా లేదు. స్వెటర్ అయినా లేదు. Lungs affect అయాయంటే ఆశ్చర్యంలేదు.

(డాక్టర్ మార్తాండంపిళ్లె ప్రవేశించును).

శ్రీని — Good evening Doctor! ఈ Patient ను examine చేయండి.

డాక్ట—Symptoms శొల్లుంగో.

రాఘ—జ్వరము, దగ్గు, రొంప, తలనొప్పి, లోపలయేదో బాధ. చెప్పలేను. రాత్రి ఆరుసార్లు విరోచనములైనవి.

డాక్ట— (తణిఖీచేసి) మీరు Weather కు Expose అయినట్లు కనపడుతుంది. మీరు సరియైన Dress వేసుకోలేదే? చెవులకు గుడ్డచుట్టినా లేమిటి! వులెన్ మఫ్లరు చుట్టుకోవాలి ఫ్లానల్ షర్టు, అల్లదు Thick స్వెట్టరు పోట్టుకోవేండుం.

శ్రీని—చంపకవల్లి! ఏదైనా మఫ్లరు, స్వెట్టరు, లేక ఫ్లానల్ షర్టు యియ్యి.

చంప—ఆయనకు యినియేవీలేవు. కొని తీసుకురావలి.

శ్రీని—కొనితెచ్చేవరకూ నీవి అయినా యివ్వరాదా?

చంప—నావియిస్తే నాకుయెల్లాగ? ఆయనకు ఎప్పుడూ అంగోస్త్రం చెవులకుచుట్టుకోవడము, కంబళీ కప్పుకోవటం మామూలే. సాయంత్రములోగా ఆయనకు వేరే కొనితెస్తానులెండి.

శ్రీని—డాక్టరుగారూ! Lungs examine చేసినారా?

డాక్ట—ఎల్లాం Examine పణ్ణి ఆచి.

(రహస్యముగా శ్రీనివాసరావు, చంపకవల్లితో)

౧౦౪ డిగ్రీలు Temperature వున్నది. Right lung affect అయినది. Careful precautions తీసుకోకపోతే Dangerous అవుతుంది.

చంప—అయితే యిప్పుడు యేమి చికిత్సచేయమన్నారు?

డాక్ట—నేను Mixture పంపుతాను. మూడేసి గంటలకు వొక Dose వేయవలెను. వేడినీళ్లు బాగా మరుగుతూవుండగా ఆనీళ్లలో ఫ్లానల్ గుడ్డ తడిపి, లంగ్సుకు కాపడం పెట్టవలెను

చంప—పొద్దున్న కాచిననీళ్లువున్నాయి. ఇప్పుడు చల్లారిపోయివాయి. ఇప్పుడు మళ్లీ కాచవలెను. అవి కాచిననీళ్లేకనుక వాటితో కాచకూడదండీ?

డాక్ట—ఎన్నయిదు అమ్మా! ఆ జిల్లునవున్న నీళ్లతో కాపటం పెట్టితే patient ఉడనే సచ్చి పూడుస్తాడు!

చంప—అయితే నీళ్లు మళ్లీ కాస్తానులెండి. nourishment యేమి యిమ్మన్నారు?

డాక్ట—Solid food యేమీ యివ్వకూడదు. వుడుకు వుడుకు కంజి పటించాలి.

చంప—అన్నం వార్చినప్పుడు వచ్చే వేడివేడి గంజి వొంటికి పట్టించాలా?

శ్రీని—నీయిల్లు బంగారంగాను! గంజి కాదు. మనము గోధుమజావ అనేదానిని అరవవాళ్లు కంజి అంటారు. వేడిగావుండే గోధుమజావ త్రాగించవలెనని డాక్టరుగారి అభిప్రాయం. కాని వేడిగంజి వొంటికి పట్టించమని కాదు. ఇంకానయమే! రాఘువయ్య రోజులు బాగున్నాయి గనుక నీవు అడిగినావు. నీవు అడగకుండా, మేమంతా వెళ్లినతర్వాత వేడివేడి గంజి అతని వొంటినిండా పోశావంటే వొళ్లంతా తెగకాలి, మళ్లీమళ్లీ చచ్చును.

చంప—నాకీ గొడవలు తెలియవండీ! ఎప్పుడన్నా యిల్లాగంటి పాట్లుపడ్డానా! మీరు చెప్పినట్లు అడగటం నయమేవచ్చింది. లేకపోతే ప్రాణఘాత, లోకులవల్ల నాకు నిందకూడా వచ్చియుండును.

డాక్ట—నాన్ పోయిట్టువరేన్!

శ్రీని—సరే. పోయిరండి. అవసరంవుంటే మళ్లీ మీకు కబురుపంపుతాను. మీబిల్లు ఆఖరున యిప్పిస్తాను.

(డాక్టరు నిష్క్రమించును.)

శ్రీని—అమ్మాయీ! నేను యిక్కడవుండగానే వేడినీళ్లు కాపడం పెట్టు. కంజికి బదులుగా గంజి అనుకున్నట్లు దానిలో యేమి ప్రమాదముచేస్తావో! కాపడంలో నేను కూడా సహాయంచేసి, తర్వాత యింటికి పోతాను.

చంప—అల్లాగే! నీళ్లు కాచితెస్తాను.

(అని లోపలకు బోవును. తర్వాత వొక పావుగంట అయినవెనుక యింటిలోనుంచి చచ్చాను బాబో. చచ్చానుబాబో! అని చంపకవల్లి యేడ్పులు వినబడును. రాఘువయ్య తొట్రుపాటుతో లేచి లోపలకు వెళ్లుటకు ప్రయత్నించును. శ్రీనివాసరావు వారించి మీకు వొళ్లు తూలి పడిపోతారు. లేవవద్దు. నేను వెళ్లి చూచి వస్తాను. (అని లోపలకు బోవును.)

చంప—బాబో! చచ్చానండీ! బాబో!

శ్రీని—ఏమిటమ్మా! ఏమి జరిగింది?

చంప — వేడినీళ్లు కాచి పొయిమీదనుంచి దింపుతూ వుంటే కాళ్లమీద పడ్డాయి. బొబ్బలు యెక్కినాయి. చూడండి!

శ్రీని—ఏమి ఖర్మము వచ్చిందమ్మా! వేడినీళ్లయినా కాచటం చేతకాని ఆడవాళ్లు వుంటారా? ఆడవాళ్లు చదువులు చదువుకొన్నా యింట్లో గృహకృత్యాలు అన్నీ చేసుకోవటం నేర్చుకొని వుండవలెను. ఇప్పటి ఆడవాళ్లు యింత అసమర్థలైతే పిల్లలపోషణ యేమి చేసుకోగలరు! కొబ్బరినూనెలో గుడ్డలు తడిపి తెచ్చి కాళ్లకు కడతాను వుండు. (అని లోపలకు వెళ్లి కొబ్బరినూనెలో గుడ్డలు తడిపితెచ్చి పాదములకుకట్టును.)

చంప—ఏమి చేయమన్నారు! మా పుట్టింటివారు కూర తరగవలసినా నన్ను చెయ్యనిచ్చేవారు కారు. అత్తింటికి వచ్చి కొద్దికాలమే అయింది. ఇక్కడకూడా పనులు చేయటం యేమీ అలవాటు కాలేదు. పాపము! అన్ని పనులూ ఆయనేచేసుకుంటూ వున్నారు!

శ్రీని—ఆడపిల్లలను యీలాంటి పెంపకాలు పెంచిన పుట్టింటివారికి ఏమి శిక్ష వేసినా దోషంలేదు. అత్తింటికి వెళ్లినాక ఆపిల్లల అనుభవాలు తెలుస్తాయి! ......నీకాళ్లు యెక్కువ బాధ పెడుతూవున్నాయా?

చంప—(తనలో 'బాధగా వున్నదని చెప్పితే. నన్ను యీ సాయంత్రం సినీమాకు వెళ్లనివ్వరు. కనుక బాధ దిగమింగుతాను' అనుకొని) అంత బాధలేదు లెండి! నూనెగుడ్డలు కట్టినాక చల్లగా వున్నది.

శ్రీని—నీవు యింక రాఘవయ్యకు కాపడం యేమి పెట్టగలవు? నీ వొళ్లు మళ్లీ కాల్చుకోవడమే కాకుండా అతని వొళ్లుకూడా తెగకాలుస్తావు. నా భార్యను కూడా పిలిపించి మేమిద్దరము తంటాలు పడి, కాపడంపెడతాములే. (అని వేడినీళ్ల గిన్నె తానే రాఘవయ్య పరున్న మంచమువద్దకు తెచ్చి తనభార్యను కూడా పిలిపించును.)

వెంకు—నాథా! ఎందుకు నన్ను పిలువనంపిరి?

శ్రీని—రాఘవయ్యకు కాపడం పెట్టటానికి వేన్నీళ్లుకాస్తూ కాళ్లు తెగకాల్చుకున్నది. మనమిద్దరమూ కలసి ఆయనకి కాపడం పెడుదామని పిలిపించినాను.

వెంకు—అయ్యో! పాపము! చంపకవల్లిని చూస్తే నాకు జాలివేస్తుంది. వొక్కపనీ చేతకాదు. రేపు పిల్లలు పుట్టితే వాళ్ల పాట్లు యేమిటా అని నాకు విచారం కలుగుతుంది. పనులు చేసుకోలేని ఆడది, చదువురాని మొగవాడు యీ లోకములో యెందుకూ పనికిరారు. ఎంతడబ్బువున్నా, యెందరునవుకర్లువున్నా ఆడది అన్ని పనలూ చేసుకోవటం నేర్చివుండాలి. ఎల్లకాలం వొకలాగు వెడుతుందా? ఎప్పటి కేమి అవసరం వస్తుందో.

నాథా! నేనుండగా మీరు కష్టపడవలసిన పని లేదు. నేనొక్కర్తెను కాచగలను. మీరు చూస్తు కూర్చోండి.

(అని చెప్పి తాను వొక్కర్తె రాఘవయ్యకు కాపడం పెట్టును.)

చంప—నేను బజారుకువెళ్లి ఆయనకు కావలసిన మఫ్లరు, స్వెట్టరు కొని అక్కడనుంచి సినిమాకు వెళ్లి యెనిమిదిగంటలలోగా వస్తాను. పంతులుగారు! మీరు దయచేసి నేను వచ్చేవరకూ యిక్కడ కూర్చుంటారా?

వెంకు—(ముక్కుమీద వ్రేలుపెట్టుకొని ఆశ్చర్యపోవుచు) ఎంతటికైనా తగినదానవమ్మా నీవు! భర్తగారు జబ్బుతో పరుండియుండగా నీవు ఆయనను వదలివెళ్లి సినిమాచూచుటకు కాళ్లెట్లాడునోకదా! పైగా నీకాళ్లు కూడా కాలి బాధపడుతూవున్నా సినిమాకు వెళ్లకతప్పదా?

చంప—ఎల్లాగైనా బజారుకు వెళ్లి రావాలి కాదండీ!

శ్రీని—నీ కిదోవొంక దొరికిందా? బజారుకు నేనువెళ్లి కొనుక్కొని వస్తానులే. నీవు ఇంట్లోకూర్చుంటావా?

చంప—ఈఫిలిం యీవాళతో ఆఖరుట, వెళ్లిపోతుంది. చివరవరకు వుండకుండా కొంచెంసేపుచూచి వచ్చివేస్తాను.

శ్రీని—అలా చెప్పరాదూ! బజారు వొంకపెట్టటం యెందుకు! కాలినకాళ్లతో వెళ్లగలవా?

చంప—జట్కాచేసుకు వెళ్లివస్తాను. క్షమించి కొంచెంసేపు కూర్చోండి. నేను త్వరలోనే వస్తాను.

రాఘు—పోనివ్వండి, పాపం, దాని సంతోషం చెడగొట్టటం యెందుకు?

(చంపకవల్లి నిష్క్రమించును.)

వెంకు—(పంతులుగారితో) నాకు యింట్లో పనులు వున్నవి. నాకు అనుజ్ఞయిచ్చెదరా?

శ్రీని—సరే వెళ్లు

[కొంతసేపు జరిగిన తర్వాత]

[రాఘవయ్య హఠాత్తుగా కాళ్లూ చేతులూ మంచంమీద కొట్టుకొని, పళ్లు బిగిసిపోయి కళ్లు నిలువు గుడ్లుపడి, స్పృహతప్పి శవమువలె పడియుండెను.]

శ్రీని—అయ్యో! యిదేమిటి! హఠాత్తుగా యితడు స్పృహతప్పి కొయ్య అయిపోయినాడు! భార్యకూడా దగ్గరలేదే! ఎవరోయి అక్కడ! జవానూ! తక్షణం పరుగెత్తి డాక్టరుగారిని యిక్కడకు పంపి, అక్కడనుంచి సినీమాహాలువద్దకు పరుగెత్తి లోపల చంపకవల్లెమ్మ వుంటుంది. మీభర్తకు జబ్బుగా వున్నది, తక్షణం రమ్మన్నారు అని చెప్పు.

రామసింగు—చిత్తం (అని పరుగెత్తును)

(శ్రీనివాసరావు రాఘవయ్యకు చెవులుమూసి ఉపచారములు చేసినను తెలివిరాలేదు. శ్రీనివాసరావు కేకలువిని యిరుగుపొరుగు స్త్రీలు కొందరుచేరి దూరముననిలచి చూచుచుందురు)

జయలక్ష్మి—చూచావా కామాక్షీ! ఆయిల్లాలుకు యెంత రాయిగుండెయో కాని. పెనిమిటికి యింత జబ్బుగా వుండగా వొదిలిపెట్టి, సినిమా చూడటానికి వెళ్లిందిట! ఆయన చచ్చిపోతూవున్నాడు! చచ్చిపోయినతర్వాత వస్తుందికాబోలును! ఇల్లాంటి ఆడవాళ్లే మనస్త్రీజాతి అందరికీకూడా అపఖ్యాతి తెస్తారు. ఇల్లాంటివాళ్లు వుంటేనేమి, చస్తేనేమి?

కామాక్షి—మన ఆడవాళ్లల్లో యెంతటివాళ్లేనావున్నారు. మొగుడుకు విషంపెట్టిచంపినవాళ్లు లేరా? ఈమెది వొకజన్మమేనా? జన్మఅనగా ఆమహాయిల్లాలు వెంకుబాయమ్మగారిదే జన్మ. నిరంతర పతిసేవానిరతురాలు. ఆమెను చూస్తేనైనా యీపిల్లకు బుద్ధి రాదేమి? అడుగో! జవానువొక్కడే వస్తూవున్నాడు. ఇప్పుడైనా సినీమానుంచి రావటంలేదు. దాని మొండితనం చూడు. నలుగురూ ఛీ! ఛీ! అంటారని సిగ్గైనా లేని శిఖండీసుమీ!

(రామశింగు ప్రవేశించును.)

శ్రీని—డాక్టరుగారు యేరి? చంపకవల్లి యేది?

రామ—డాక్టరుగారు యేదో అర్జంటుకేసువుండి దగ్గిరవూరికి పోయినారట. చంపకవల్లి అమ్మగారితో చెప్పగా, ఇప్పుడే మంచికథపట్టులోవున్నది. వొకపావుఘంటలో వొస్తానని చెప్ప అన్నారు.

శ్రీని—అన్నా! ఏమి యీ పిల్లదుండగము! డాక్టరు అయినా లేకపోయినాడే! నేనేమి చేయను! దైవంమీద భారంవేసి కూర్చోవలసినదే!

ఒక అరగంట అయినతర్వాత జట్కాలో

చంపకవల్లి ప్రవేశించును.

చంప—ఏమండి, పంతులుగారూ! ఏలావున్నది! అంత అర్జంటుగా కబురుపంపినారేమి!

శ్రీని—ఎల్లావున్నదా! ప్రాణావశిష్టంగావున్నది. వొకనిముషానికో, ఘడియకో అన్నట్లుగా వున్నది. డాక్టరుకు కబురుచేస్తే వూళ్లోలేడు.

చంప—ఇంతలో యింత ముంచుకువచ్చునని యెరుగనైతినే! (అనుచు చంపకవల్లి వేగముగా లోనికిబోయి, మంచముమీద స్పృహతప్పి పడియున్న భర్తనుజూచును. నిలువుగ్రుడ్లు పడిపోయి, నోరుతెరచి మృతకళేబరమువలెనున్న భర్తనుచూడగా, ఒక్కసారిగా ఆమెకు తన ప్రవర్తననుగురించి మిక్కుటముగు పశ్చాత్తాపమును, పట్టరాని దుఃఖమును హృదయమున ముప్పిరిగొన, కన్నీరు వెల్లువలై పారుచుండ, గోలుగోలున నేడ్చుచు, భర్త శరీరముపైపడి, కౌగలించుకొని యిట్లు విలపింప దొడగెను.)

చంప—నాథా! ప్రాణేశ్వరా! నేను మీయెడల యెంత గొప్పయపరాధినై పోతిని! నావంటి దురాత్మురాలికి రౌరవాది నరకములు చాలక భగవంతుడు క్రొత్త నరకములు సృష్టి చేయవలెను కదా! నన్ను పెండ్లాడినది మొదలు ఒక్కరోజైననూ నావలన సుఖపడియెరుగుదురా! పెద్ద యింటిలో పుట్టిన పిల్లనను గర్వమును, హూణవిద్యయు నా గొంతుక కోసినవి. జనులు తలంచుటకైననూ సాధ్యము కాని రాక్షసినైతిని. సర్వదా మీ చేత దాస్యము చేయించుటయేగాని మీకు వొక్కపూటయైననూ పట్టెడు మెతుకులు వొండిపెట్టి యెరుగని పాపాత్మురాలను గదా! మీరు జబ్బుగా నున్నప్పుడైననూ చెంతనుండి దాస్యముచేసి ఋణముతీర్చుకొనక సినీమా చూచుటకు పోయెడు గుండెనిబ్బరముగల నా వంటి స్త్రీరూపధారియగు పిశాచము లోకములో నుండునా! నే నెంత బాధ పెట్టిననూ విసుగుజెందక ప్రేమరసముతో నా వైపు చూచెడి చూపులతో యిప్పుడొక్కసారి నన్ను జూడరా! నాథా! నాథా! యని పిలచిననూ పలుకరేమి! నేను చేసిన దురాగతములకు నాపై కోపము వహించిపలుకకున్నారా? కోపమన్నది యెట్టిదో యెరుగనిమీరు. నేను నాయందు కినుకవహించి యెన్నిసారులుపిలచిననూ పలుకకుండుట ధర్మమా? నన్ను సినీమాకు వెళ్లవద్దని పంతులుగారు వాదించుచున్నప్పుడు

"పోనివ్వండి, పాప, దానిసంతోషము చెడగొట్టనేం యెందుకు" అని హీనస్వరముతో పలికిన మధురవాక్యములే యీపాపిష్టిచెవులకు సోకెడు తుదిపలుకులాయనా ప్రాణవల్లభా! మిమ్ములను దీనముగా బ్రతిమాలుకొనుచున్నాను. (అనుచూ రాఘవయ్య గడ్డముక్రింద చేయియుంచి బ్రతిమాలుకొనుచూ) నా ప్రార్థనమువిని ఒక్కసారి చిరునవ్వుతో నావైపునకు జూచి నాతో బదులు పలుకరా? ఇంక నాకేమిగతి, నన్నెవరికి వప్పగించి పోయెదరు? నేను మీయింటికి వచ్చినదిమొదలు ఒక్కదినమైననూ నన్నువిడచి యెరుంగరే, అట్టి మీరు నన్ను అనాథ యువతినిజేసి పోదలచినచో నే నూరకుందుననుకున్నారేమో. లేదు, లేదు యిదుగో! నేనునూ మీవెంట వచ్చుచున్నాను. (అనుచు పైటచెరగు గొంతునకు ఉరిపోసుకొనబోగా శ్రీనివాసరావు బలవంతముగా వారించెను.)

మీరు లేనిచో నాకీ చక్కదనము లెందుకు? ఈ శృంగారము లెందుకు, ఈ ఆభరణములెందుకు? (అనుచు తాను తొడుగుకొన్న స్వెట్టర్, బూట్సు) మెడలోని యలంకారములు తీసి నేలపై పారవైచి, నే నెన్ని వేషములు వేసికొని తిరిగిననూ నే నెంతస్వార్థపరురాలనైననూ స్వకీయ సౌఖ్యాభిలాషినై సంచరించిననూ పరపురుషుని మనసున తలంచనైననూ తలంచనిదాననగుచో ఆ పరమేశ్వరుడు నా మెడలోని మంగళసూత్రమును నిలబెట్టునుగాక. (ఆకాశమువంక జూచుచూ) పరమదయాళూ! దీనరక్షకా! గడచిన నాజీవితమువిషయమై ఒక్కనిముషములో పశ్చాత్తాపము గలిగించి ఒక్కక్షణములో నా ఆశయములన్ను మార్చినదినీవు. అమృతతుల్యుడు అగు ఈ భర్తకు దాసురాలనై నీ పాదారవిందములయందుజ్ఞానము కలదాననై కొంతకాలము నవీనజీవితము గడుపుట కవకాశము గలిగించవా? తండ్రీ! యింక నా కెవరుదిక్కు? యేమిచేయుదును? అయ్యయ్యో! (అని తల నోదుకొనుచూ నేలపైగూలి పెద్దపెట్టున యేడ్చుచుండును. ఆ రోదనము విని, మార్గమువెంటబోవుచున్న ఒక యోగి లోపలికి వచ్చి రాఘవయ్య స్థితినిజూచి)

యోగి—కుమారీ! విలపింపకుము, శాంతింపుము నేనిప్పుడే నీభర్తనాడి పరీక్షించి చికిత్సచేసెదను. (అనుచూ రాఘవయ్యనాడిని పరీక్షించి) అమ్మాయీ, భయపడకుము. నీభర్తకు ప్రాణభయములేదు. శ్లేష్మము గుండెలకు తట్టుటచే నిట్లు స్పృహతప్పియున్నాడు. నే నొకమందుపొట్లము ఇచ్చుచున్నాను. ఇది నీళ్లలోకలిపి గొంతుకలో పోసినయెడల కొంచెమైనను లోపలికి దిగినచో ఈయన స్వస్థత జెందగలడు. (అనిచెప్పుచు మందును నీళ్లలో కలిపి, గొంతుకలోబోయును) ఈయనకు తెలివి వచ్చినవరకు నే నిక్కడనేయుండెదను. (మందు నోటిలో పోసిన అయిదునిముషములకు ఒకపెద్దశాంతి అయి తరువాత రాఘవయ్య కనులు తెరచును.)

రాఘు.—(నాలుగువైపులా జూచుచు మెల్లన) నేను చాలసేపు గాఢనిద్ర జెందినాను కాబోలును. ఈ యోగీశ్వరు లెవరు?

చంప—(యోగీశ్వరుని పాదములపైబడి) నాకు భర్తృదానముచేయుటకు అవతరించి వచ్చిన పరమేశ్వరుడని తలంచెదను. తండ్రీ! నీఋణమెట్లు తీర్చుకొందును?

యోగి—అవాప్తకాములమగు మాకు కావలసినదేమున్నది? లోకోపకారార్థమై హిమవత్పర్వతములో మా గురువుల కటాక్షముచే పొందిన యీ క్రియలను అవసరమగుచో నుపయోగించుచుందుము. భర్తయందెక్కుడు అనురాగము గలదానవై సుఖముగా జీవించుము. (అని చెప్పి నిష్క్రమించును)

రాఘు—అబ్బా! నా కంత జబ్బు చేసినదా?

శ్రీని—ఏమి యీ యద్భుతము! పరమేశ్వరుని లీలావిలాసము ఎన్ని యింద్రజాలముల నైననూ చేయగలుగును గదా! రాఘవయ్య ప్రాణావసాన దశలోనున్నవారు. ఈ యోగీశ్వరుని మహిమచే పునర్జీవితుడగుట ఒక అద్భుతము. అంతకన్ననూ యెక్కువఆశ్చర్యకరమైనది. చంపకవల్లియొక్క జీవితవిధానము ఒక్కక్షణములో మా కన్నుల యెదుట యిట్లుమారుట ఆ పరమేశ్వరుని కటాక్షముగదా.

చం--మీరుచెప్పినట్లు యిది అంతయూ యింద్ర జాలమువలె కనుపించుచున్నది. నే నింతవరకూ గడిపిన స్వార్థపరజీవనమును తలచుకొనిన దేహమునకు కంప మెత్తుచున్నది. క్షణభంగురమైన యీ దేహము నలంక రించుకొని, తిరుగుటయే పరమపురుషార్థముగా భావించు కొంటిని. మాంసపిండ వికారమైన యీ దేహమును, జర, వ్యాధి, మృత్యువులను శత్రువులు క్షణములో నాశనము చేయగలవను స్మృతియే లేకయుంటిని. అట్టిస్థితిలో మరణావస్థయందున్న నాభర్తశరీరము ఒక్కమారు చూచునంతట యీశరీర మెంత యశాశ్వతమాయనియూ పరమార్థ చింతలేక యైహికసౌఖ్యమునకై జీవితమునం తనూ వినియోగించుట యెంతటి బుద్ధిహీనతయో యనియూ మనస్సునకు స్ఫురించెను. ఆ నిముషమునందే నా జీవితమునంతయూ పూర్ణమైన మార్పు జెందెను.

శ్రీని—నీలో కలిగిన మార్పునకు నాకపరిమితా నందము కలుగుచున్నది. రఘువయ్యను యీ రాత్రి బహు జాగరూకతతో కనిపెట్టియుండవలయును. భగవ దనుగ్రహముచే యీయనవ్యాధి శీఘ్రకాలములో కుదుర గలదు. రాత్రి ఆయనప్రక్కను కనిపెట్టుకునియుండు టకు నాఖరు నొకని నియమించుదము.

చం— నాభర్తకు పెద్దనౌకరును నేనుండగా యింకవేరే నౌఖరులెందుకు? నేను పూర్వపుచంపకవల్లి నని తలంపకుడు. ఈరాత్రియంతయు ఆయన మం చముకద్ద కన్ను మూయక నిరీక్షించివుండగలను. మీరు చాలాశ్రమ తీసుకొన్నందులకు వేనవేలు వందనములు. ప్రొద్దుపోయినది, వెంకుబాయమ్మగారు మీకై నిరీక్షిం చియుందురు.

శ్రీని—నేను పోయివచ్చెదను. తిరిగి రేపు కలు సుకొందును (అని నిష్క్రమించును.)

5-వ రంగము

(మదరాసులో రాఘవయ్య గృహము. ఉదయం యేడుగంటలకు రాఘవయ్య కచ్చేరిగదిలో ఆఫీసుపని చూచుకొనుచుండును. చంపకవల్లి స్నానమాడి, కురు లను వేలుముడి వేసుకొని, నుదుటియందు పావలాకా సంత కుంకుమబొట్టును ధరించి, ఆరవేసిన మడిచీర కట్టుకుని ప్రవేశించును.)

చం—ప్రాణేశ్వరా! కాఫీ సిద్ధముచేసినాను. వచ్చి పుచ్చుకొని వెళ్లండి. మళ్లీ మీకు ఆఫీసునకు వేళ కాకుండా వంట చేసుకుందును.

రాఘ—నీవుకూడా కొంచెము కాఫీ పుచ్చు కుంటానంటేగాని, నేను రాను. నీవు బొత్తిగా కాఫీ మానివేసినావు యెందుచేత?

చంప—నన్ను క్షమించండి. నేను పూజచేసు కుంటేనేగాని నోట్లో యేమీ వేసుకొనను.

రాఘ—మనము వూటీ వెళ్లివచ్చినప్పటినుంచీ నీకు పూజలు, ఆచారములు యెక్కువైనవి. వూటీ అనుభవములు జ్ఞాపకమున్నవా?

చంప—అన్నియూ జ్ఞాపకమున్నవి. "సొమ్మొ పోను శనీపట్టె" ననెడు సామెత నిజమాయెను. మొదట మదరాసులో అమ్మిన నగగాక వూటీలో డాక్టరు బిల్లు వగైరాలకు అమ్మిన బంగారుగాజులతో మొత్తము రూ ౭౦౦/- ఖర్చైనవి. ప్రాణావశిష్టులమై తిరిగి యిల్లు చేరితిమి. పాశ్చాత్యుల జీవితమునుబోలు జీవితమును అనుసరించవలెననెడి పిచ్చికోరికతో మనకనుకూలముగా నిపునులను జేయుటచే యీ యనర్థములన్నియు సంభవిం చినవి. ఎన్నికష్టములుపడినను, ఎంతసొమ్ము వ్యయ మైననూ తుద కాపరమేశ్వరుని యనుగ్రహముచే నామం గళసూత్రము నిలచినందుల కాదయామయునికి వేనవేలు నమస్కారములు. శీఘ్రముగా కాఫీ తీసికొనుటకు రండి.

[ఇద్దరులోపలికి బోవుదురు.]

# "క్షంతవ్యుఁడుగారు"

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

క్రమంగా "విమర్శకబుధుఁడు" గారు "క్షంతవ్యుఁడు" గారుకిందికి వచ్చినందుకు కొంత సంతోషించవలసివుందిగాని యింకా ఆమాట వ్రాయడంలో కొంత వెనకాముందూ తొక్కులాడుతూవుందిగానికలంచూర్గా నడిచినట్లుమాత్రం ఆ ఘట్టంలో మాటలు వక్కాణించడం లేదు. యింకా పింగళి సూరన్నగారిని తిరుపతి వేంకటకవులు ప్రభావతీప్రద్యుమ్ననాటకంలో వెక్కిరించారన్నమాట సమర్థనీయం అవుతుందనే ఆశ "క్షంతవ్యుఁడు" గారికి వుందే అనుకుందామా? శివశివా! సాహిత్యశిరోమణి ప్యాసైన ఆమాత్రం జ్ఞానంకూడా వుండకుండా వుంటుందా? తి. వేం. కవులు శుచిముఖి పాత్రద్వారా ప్రకటించిన ప్రజ్ఞలవల్ల "బుధుఁడు" గారు ఇటీవల "కొబ్బరిచెట్టూ - దూడగడ్డీ" సామెతగా అపలపించిన వ్రాఁత సమర్థింపఁబడదని పూర్తిగా తెలుసుకున్నారు. దానిమీఁదే యీ "క్షంతవ్య" పదం బయటికి వచ్చింది. యిప్పుడున్న అపేక్షేమిటంటే? దేనిలోనో వకదానిలో నెగ్గకపోతామా? యేమాత్రం నెగ్గినా ఆత్మపక్షీయులు కొంతకాకపోతే కొంతేనా సంతోషిస్తారుగదా అని వుంది పాపం! అయితే యీ "పిచ్చిసోమయాజులిని" యీ "క్షంతవ్యుఁడు" గారు బాగా యెఱుఁగరు. ముసలాఁడుగదా అనుకున్నారు. సభలో పిం. సూ. గారిని తి. వేం. కవులు వెక్కిరించడాన్ని సమర్థించడం కృష్ణలో సూచించాటప్పటికి కొంతమట్టుకు పశ్చాత్తాపం కలిగింది. మళ్లా కొన్నిశంకలు పుట్టుకువచ్చాయి. పుట్టుకురాక అంతతో శాంతిస్తాయా? "మనోరథాః". ఆశంకలలో, "వ్యాకరణవిశేషాలు నాటకాలలో వాడవచ్చునా!" అన్నదానికి లఘువుగా సమాధానం కృష్ణలో యివ్వఁబడ్డదే. అది అంతతో నివర్తించివుంటుం దనుకుంటాను. నివర్తిస్తేమాత్రం పిడివాదం తప్పుతుందా? తప్పదు. యిఁక శుచిముఖిని పక్షిగానే నటింపఁజేయడం యెట్లాగ? అంటూ వక పెద్ద శంక. ఆ శంకకి మళ్లా బాధకలుగుతుందేమోనని, "ఆంజనేయుః, గరుత్మంతుఁడు" అంటూ యిద్దఱిని వుచ్చరించి వీరికి తప్ప యితరులకు అట్టి అవకాశం లేదనడం వకటి. యీ వినాయింపెక్కడ వుందో కదా! పాపం కొంచెం యెదటిదెబ్బ కాసుకునే వుపాయం వుంది. కాని హృదయంమాత్రం మంచిస్థితిలో లేదు. వుంటే "చక్కని రాజమార్గం" లోనే ప్రవర్తించి సందేహనివృత్తి చేసుకోవచ్చునుగదా! అసందర్భంగా— "వెక్కిరింపఁబోయి" అంటూ తారతమ్యజ్ఞానవిరహితంగా వుపక్రమించడం యెందుకు వస్తుంది? యీ వుపక్రమణానికి పూర్వగాథ చాలా వుంది. ఆ పొత్తము చిరకాలంనాఁడే అచ్చయి వుంది. పని పడ్డప్పుడు దానిపేరు తెలుపుతాను. యిటీవలి శంకలలో వకశంకని వుపపాదించాను గదా! యింకొకటి కృష్ణునికి ప్రద్యుమ్నసాంబులు కొమాళ్లు కాఁబట్టి వారిద్దఱి కొడుకులున్నూ మనమలవడం బాగుంది కాని, గదుఁడు సోదరుఁడు గదా! అతని కొడుకు మనమఁడేలా అవుతాఁ డంటూ వకశంక. మొట్టమొదట మాతో పాటుగా తానున్నూ గదుణ్ణి ప్రద్యుమ్నాదులతోపాటుగా జమకట్టుకొని యిప్పుడిప్పుడు తప్పు దిద్దుకొన్నట్లు అభినయించడంకూడా జరిగింది. మేము మొదటినుండిన్నీ వీరు మూఁగురున్నూ సోదరులే అన్న అభిప్రాయాన్నే కనపఱిచివున్నాము. జంకుతూ జంకుతూ "క్షంతవ్యుఁడు" గారు శంకించడం ఆరంభించారు. మే మెందుకు సోదరుణ్ణి పుత్రుఁడని మార్చి వ్రాశామో సభాముఖాన్ని వుపన్యసించి మెప్పిస్తాము. దానికోసమే నా సభకు దయచేస్తారేమో అని మనవిచేసుకొంటూ వున్నాను. యివి ప్రధానశంకలు. అప్రధానాలింకా కొన్నివున్నాయి. హృదయం చక్కగా వుంటే యేప్రశ్న అడిగినా అడగనువచ్చు, తెలుసుకోనున్నూవచ్చు. అది మంచిస్థితిలో లేనప్పుడు "హార్టు వీకు"

గా వుండడంచేత ఆపురుషుఁడు యేంచేసినా అవ్యక్తం గానే వుంటుంది. వాఁడు యీలోకం కాదని "గంధర్వ లోకం" దాఁకా వెళ్లినప్పటికిన్నీ అదిన్నీ తుట్టతుదకు తలవంపునే సంఘటిస్తుం దని నావిజ్ఞప్తి. వృథాగా పత్రికలగౌరవం చెడఁగొట్టడానికిఁ గాని యీపనికిమాలిన శంకలు యెందుకున్నూ పనికిరావు. కనక కాకినాడ లో "విమర్శకాగ్రేసరాది" బిరుదులతో ప్రకాశిస్తూవున్న పెద్దలు వున్నారు. వా రేమంటారో ఈశంకలకు? వక పర్యాయం కనుక్కుంటే బాగుంటుం దని నే నిందు మూలంగా విన్నవిస్తూవున్నాను. యెందుచేతంటే నాకు ప్రస్తుతం ఇంతకన్నా నీరసస్థితిలోనే అయినా గురువు గారిశంకలు ప్రధానంగా వుత్తరింపవలసిన పని అవశ్య మయిందిగా యేర్పడింది. ఆ పెద్దపనిలో ఈ "పిల్లసవేఁరీ" నిమిత్తం కాలం కర్చుపెట్టి పత్రికలకు పని కల్పించడం మంచిదిగా తోఁచడంలేదు. అదీ గోళ్లనితీరేపనే. ఇదిన్నీ అట్టిదే. అయినా వారు గురువు లవడంచేత కొంత గౌరవం వారికి సంబంధించినదానికి యివ్వడం యుక్తం. దీనికో! "ప్రతి చిగిలింతమొక్కా చింతమొక్కాతో" అంటూ వెనక వకాయన సామెత వకటి వాడివున్నారు. కాఁబట్టి సభలో తేల్చేస్తే తీరిపోతుం దని తోఁచింది. పత్రికవారినికూడా ఈవాదం యీలాగే తీర్చుకోవలసిం దిగా సలహా యివ్వవలసిం దని కోరుతాను. లేకపోతే మూల కూర్చుని గిలకడంగనక వాదిప్రతివాదు లిద్దఱూ యేదో గిలుకుతూనేవుంటారు. యెంత చక్కనిసమాధానం వ్రాసినప్పటికీ అది యింకా నచ్చలేదనే యేనో దాన్నిగూర్చి అపలపిస్తూనే వుంటారు. వెనకాల తండ్రిగారో, లేక "గంధర్వలోక" సజాతిధర్షగమో "మావాఁడిప్రశ్నలకు జవాబులు రానే లే"దని హంగు చేస్తూనేవుంటారు. అందుచేత అర్ధాంగీ కారంగా "క్షంతవ్య" పదంతో వ్రాసిన విషయాన్నిగూర్చి యేమి, యితీవల యివేనా నెగ్గకపోతాయా అనుకున్న విషయాలకేమి వకమాటు సభకే పనిచెపితే పీలుగా వుంటుం దనుకుంటాను. యీ అంశం యింతగా కాక పోయినా కొంత సూక్ష్మంగా "యింకో అపవాద" అన్నవ్యాసంలో కృష్ణాపత్రికాద్వారా తెల్పడమయింది. యిప్పుడు మఱీ స్పష్టంగా తెల్పుతూవున్నాను. వక సంగతి మఱిచాను. ఆసభలోకి "గంధర్వలోకం"చుట్టం గారినికూడా తీసుకురావలసిం దని మనవి. ఆయన పిఠాపురంలోనే వుంటా రనుకుంటాను. ఆయన "బహిరంగలేఖ" కూడా సభాముఖాన్ని వినికిచేస్తాను. మీ వద్దకు వచ్చిందంటూ తాము "భారతి"లో యిదివఱలో వ్యక్తీకరించిన "బహిరంగలేఖ"నికూడా తీసుకువస్తే దాన్నీ దీన్నీ సరిచూచి సభాధిపతులు మీకు యేలాటి బంధుసముద్రులు ప్రస్తుతవిషయంలో సహాయులుగా నున్నారో ఆవిషయంకూడా పనిలోపని తేల్చివేస్తారు. దానితో "సర్వం సంపన్నం, సుసంపన్నం" గా సమస్తమూ చక్కపడడం అవుతుంది. యింతే నా మనవి. అందునిమిత్తం త్వరపడండి. వచ్చేవోపికవుంటే ఆసభకు నేనే వస్తాను. లేదా? నాతరఫున మీఅన్న చి. సూర్యనారాయణశాస్త్రి రాఁగలఁడు. లేదా! మఱి వక రెవరేనా వస్తారు. దాని కేమి? "నందో రాజా భవిష్యతి." యింతే ముమ్మాటికిన్నీ నామనవి.

['శ్రీ వేంకటశాస్త్రిగారు' వాదులసంశయములను సభలో తీర్చెదమనుచున్నారు. అట్లుచేయుటవలన వాదులకు, ప్రతివాదులకు, పత్రికకు, పాఠకులకు చాల అనవసరపుపని తగ్గిపోవును. కావున నికముం దెందుకుసంబంధించినచర్చ ఏదియు ఎవ్వరిదియు భారతియందు ప్రకటింపబడదు. సం. భా.]

---

# నరస భూపాలీయము

ఆకెళ్ల శేషాద్రి.

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు మార్చినెల భారతిలోఁ జూపిన మూర్తికవిలోపములలోఁ బదింటిపై నాయభిప్రాయభేదమును మేయినెల భారతిలో నేను వ్రాసితిని. వానిలో నైదంటివిషయమున శ్రీ వేంకట రమణయ్యగారు నాతో నేకీభవించుచు మిగిలిన యైదును నిజముగా మూర్తి కవిలోపములే యని జూలైనెల భారతిలో సమాధానము వ్రాసియున్నారు. వారి సమాధానములలోఁ జాలవఱకు నామదికి సరిపడకుండుటచే నాకుఁ దోఁచిన సంగతుల నిట వ్రాయుచున్నాను.

౧ పరిణామాలంకారవిషయము:

నరసభూపాలీయమందలి రూపకపరిణామలక్షణము లొకమాదిరిగ నున్నవనియు, ఉదాహరణములును నట్లే యున్నవనియు వేంకటరమణయ్యగారు వ్రాసిరి. కాని యీ రెండలంకారములకును భేదము నరసభూపాలీయమున స్పష్టముగనున్నది. చూడుఁడు- మూర్తి కవిరూపకలక్షణము

"అల సందేహముమాడ్కిఁగాక యుపమే
యం బెన్న నచ్ఛన్నమై
యలఘూత్ప్రేక్షయు నా
నభిన్నమతి జంబైయుండ కారోప మిం
పలరంగాఁ బ్రకృతోపయోగి
పరిణామారోపతుల్యంబుగా
కలయారోపిత మిందు
రంజనము సేయన్ రూపకంబై తగున్."

ఆరోపితము రూపకములో రంజనము * మాత్రము చేయుననియు, పరిణామములోవలె నిచ్చటి యారోపము ప్రకృతోపయోగికాదనియు నిచ్చటనే రెండలంకారములకును భేదము స్పష్టముగా వ్రాసియున్నాఁడు.

ఇంక దీని యుదాహరణము:

"నరసింహుని కీర్తియనెడు పాలసముద్రము హిమత్పర్వతమనెడి ద్వీపము కలదియై యమరుచున్నది.

ఇచ్చటఁ గీర్తియందు సముద్రత్వము మాత్ర మారోపింపఁబడినది. కాని యీ యారోపమునకుఁ బ్రకృతోపయోగిత్వము లేదు.

మూర్తికవి పరిణామాలంకారలక్షణము:—

"ధరలో నుపమేయమునను
నరుడుగ నారోప్యమాణమగు నుపమానం
బరయఁ బ్రకృతోపయోగా
కరముగఁ బరిణామమయ్యె........"

ఉపమేయమునందు నారోపింపఁబడు నుపమానము ప్రకృతోపయోగియైనచోఁ బరిణామమని దీని యర్థము. ఇంక దీని యుదాహరణము—

"ఓరాజా! నీఖడ్గ మప్సరః స్త్రీల సంభోగమునకై స్వర్గమున కేఁగునట్టి నీశత్రువులకు నిచ్చెన యయ్యెను."

ఇక్కడ ఖడ్గమునందు నిచ్చెనధర్మ మారోపింపఁబడుచున్నది. అట్లారోపించుట ప్రకృతమగు స్వర్గారోహణమున కుపయోగించుచున్నది. రూపకములోవలెఁగాక యారోప మిచ్చటఁ బ్రకృతోపయోగమగుటయే విశేషము. ఇదియే రెండలంకారములకును భేదము. ఈ భేదమును మూర్తికవి వైలక్ష్యలక్షణములలో స్పష్టముగాఁ జూపియేయున్నాఁడు. ఆలంకారికులందఱును నంగీకరించియున్నారు.

మఱియు శ్రీ వేంకట రమణయ్యగారు "ఉపమానమున ఉపమేయత్వ మారోపింపఁబడిన పరిణామము;

* "ఉపరంజక మారోప్యమాణం త ద్రూపకంమతమ్."

ఉపమేయమున నుపమానతఁ ఆరోపింపఁబడిన రూపకము" అని రెండలంకారములకును క్రొత్తగా భేదము చూపి యున్నారు.

ఇట్టి భేద మలంకారశాస్త్ర సంప్రదాయ విరుద్ధము. 'నేత్రమనెడి పద్మము' అనెడి రూపకమునందును, 'నేత్రమనెడి పద్మముతోఁ జూచుచున్నది' అను పరిణామాలంకారమునందును నేత్రమునందే పద్మత్వ మారోపింపఁబడుచున్నది; కాని, పరిణామమునఁ బద్మమునందు నేత్రత్వ మారోపింపఁబడుటలేదు. "ఆరోప్యమాణ మారోపవిషయాత్మతయా స్థితం, ప్రకృతోపయోగిత్వే పరిణామః" అని చెప్పిన ప్రతాపరుద్రీయమును, నింకను నితరాలంకారగ్రంథములను, నుపమేయమునం దుపమానతయే యారోపింపఁబడునని స్పష్టముగాఁ జెప్పుచుండలేదా?

ఇంక స్వతస్సిద్ధార్థ శక్తిమూలాలంకార కృత వస్తుధ్వనికిచ్చిన యుదాహరణ పద్యమున మూర్తి కవి సమన్వయము చేసినట్లు పరిణామాలంకారము నిజముగా లేదనియు, కాని యిచట నితనిమతమునఁ బరిణామమనియు శ్రీ వేంకట రమణయ్యగారు వ్రాసిరి.

కాని నిజముగా నిచటి యలంకారము రూపకమేయనియు, మూర్తికవి పరిణామములో నారోపము ప్రకృతోపయోగికావలయునని లక్షణము చెప్పియుండుటచే నీతనిమతములోఁ గూడ నిది పరిణామమగుటకు వీలులేదనియు, కాన నిచటఁ బరిణామాలంకారము కలదని మూర్తికవి సమన్వయించుట ప్రమాదము కావచ్చుననియు నా యాశయము. మూర్తికవి యిట్లు తప్పుగా సమన్వయించిన స్థలములు నరసభూపాలీయమున లేకపోలేదు.

ఈ లక్ష్య సమన్వయము మూర్తికవి పొరపాటు కావచ్చునుగాని యితని రూపక లక్ష్యలక్షణములును, పరిణామలక్ష్య లక్షణములును సరిగనే యున్నవనియు, రెండలంకారములకును భేదము నాతఁడు స్పష్టపఱిచియే యున్నాఁడనియు ననక తప్పదు.

ప్రతాపరుద్రీయమందలి "రాజా! నీయాజ్ఞయనెడి పుష్పమాలను నీ సామంతరాజులు శిరస్సులందు ధరించుచున్నారు" అను పరిణామాలంకారోదాహరణమునఁ బ్రకృతతాదాత్మ్యము కలదా యనుసందర్భమున "శిరస్సులందుఁ బుష్పమాలను ధరింతురుగాని యాజ్ఞను ధరింపరుగదా" అని నేను వ్రాసినదానికి వేంకట రమణయ్యగారు "ఆజ్ఞను శిరసావహించుట అసంభవము కాదు. లోకమున నిట్టి వాడుక కలదు" అని వ్రాసిరి.

లోకములో లాక్షణికములగు నిట్టి ప్రయోగములకుమాత్రమే సంభవమున్నది కాని నిజముగా నాజ్ఞను దలపైధరించుట మాత్ర మసంభవమే! ఇట్టి ప్రయోగములందు ముఖ్యార్థబాధవలన లాక్షణికార్థమును గ్రహింపవలెనుగదా!

౨ ఉత్సాహస్థాయిభావ విషయము:

మూర్తికవి స్థాయిభావపరిగణనపద్యమున "రతిహాసశోకయత్నములు" అని యుత్సాహమునకు బదులు యత్నము చెప్పుట తప్పని వేంకటరమణయ్యగారనిరి. పుటయడుగునఁ జూపఁబడిన "రతిహాసశుగుత్సాహములు" అనుపాఠాంతరమే గ్రాహ్యమని నా వ్రాఁత. దానిపై వేంకటరమణయ్యగారు, పైపాఠము శ్రీ వెల్లాల సదాశివశాస్త్రులుగారు కల్పించినదే కాని మూలములోనిది కాదనియు, ఈ పాఠములో 'శుక్' అనునది శోకమును బోధింపకున్నదనియు, అట్లే యయినచో క్రోధమునకు బదులు కోపరోషాది పదములను వాడవలసివచ్చుననియు నాశంకించుచున్నారు.

కాని, సదాశివశాస్త్రులుగారు తమ యిష్టము వచ్చినట్లు పాఠములను దిద్దినారనుటకంటె వారికి దొరకిన ప్రతిలో నాపాఠము కనపడియుండుననియనుకొనుట యుక్తముగాఁదోఁచెడిని.

మఱియు నలంకారగ్రంథములలో స్థాయి, సాత్త్విక వ్యభిచారి భావాదుల నామములు విభిన్నములై చూపట్టుచున్నవి:

౧. నిర్వేదము = శమము.
౨. కంపము = వేపథువు.
3. లజ్జ = వ్రీడ.
౪. ఈర్ష్య = అసూయ
౫. సుప్తి = స్వప్నము, సుప్తము.

ఈశబ్దెన్నియేని పర్యాయపదములను వాడియుండఁగా నేకధాతుజన్యములగు 'శుక్', శోకము అనునవి పర్యాయపదములు కాఁగూడదా? పద్యములలో నేనేర్లన్నిటిని గుదుర్పవలెనన్న నిట్టిమార్పులు చేసికొనవలసియుండుట వింతకాదు.

మఱియు వేంకటరమణయ్యగారు క్రోధమునకు బదులు రోషమని వాడఁగూడదని స్పష్టముగా నొక్కి చెప్పియున్నారు. రసగంగాధరకారుఁడు భావశాంతి భావోదయో దాహరణములలో రోష శాంత్యుదయములు వ్యంగ్యములని వ్రాసియున్నాఁడు. అతఁడు వ్రాసిన రోషపదము క్రోధమునకు బదులు పదమో, మఱియే భావమునకైన పర్యాయపదమో కాని, యెచ్చటను రోషమును నేభావములలోను నాలంకారికులు పరిగణించి యుండలేదు.

ఇంక 'నిత్యముఁదలఁచు ప్రయత్నముత్సాహము' అను మూర్తికవి తెనిఁగింపు 'స్థేయాన్ ప్రయత్న ఉత్సాహః' అనుమూలమునకు సరిపడదనియు, నిత్యముఁదలఁచునది యస్థిరమును గావచ్చునియు వేంకటరమణయ్యగారు వ్రాసిరి. కాని, నిత్యముఁదలఁచునవి చాలవరకు స్థిరములగుటయే ప్రసిద్ధముకానట్లు మూర్తికవి తెనిఁగించి యుండునని నాయూహ!

### ౩ అక్కఱలేని పెంపు విషయము:

'కావ్యములు కాంతాసమ్మితములు' అనుమూలమునకు మూర్తికవి 'అంగనాజన విలాసాలాప లీలాసము ప్రాదుర్భావములు' అని పెంచినాఁడని వేంకటరమణయ్యగారు వ్రాయుచు "కాంత తన యభీష్టమును ప్రియునికి మాటలచేగాక చేష్టలచేతనే తెలియజేయును. ఇందు దానికి విరుద్ధముగ 'ఆలాపలీలా సమప్రాదుర్భావ' అని చెప్పఁబడినది" అని వ్రాసిరి. నేను దానిపై కాంత మాటలచేతనే తనకోరిక తెలియఁజేయుట యనుభవసిద్ధమనియు, విరుద్ధము కాదనియు వ్రాసితిని. దానిపై వేంకటరమణయ్యగారు, వారు మొదటివ్యాసములో వ్రాసిన "కాంత తన యభీష్టమును మాటలచేఁగాక చేష్టలచేతనే తెలియఁజేయును." అనువాక్యమునకు, "స్త్రీ తన యభీష్టమును వాచ్యవిధిని మాటలచేఁ దెలుపక వ్యంగ్యవిధిని చేష్టలచేఁ దెలియఁజేయును" అను నభిప్రాయమును వివరించిరి.

కాని "మాటలచేఁ దెలుపదు" అనుదానివలన "వాచ్యవిధిని మాటలచేఁదెలుపదు" అను నర్థ మెట్లు వచ్చునో! పోనిండు. మాటలచే వాచ్యవిధిని దెలుపమిచే వ్యంగ్యరీతిని మాటలచేఁ దెలుపవచ్చుననియే కదా వారి యాశయము! అట్లయిన మొదటి వ్యాసమందలి "ఇందు విరుద్ధముగ ఆలాపలీలాసమప్రాదుర్భావ అని చెప్పఁబడినది!" అను వీరి వ్రాఁత యెట్లు పొసఁగునో!

### ౪. శబ్దశక్తిమూలాలంకారధ్వని విషయము:

ఈధ్వనికి మూర్తికవి యిచ్చిన "ఈకోమలి పద్మిని, నీ వినుఁడవు" అను నుదాహరణమునకును, శబ్దశక్తి మూలాలంకార ధ్వని సిద్ధాంతమునకును నేమాత్రపు సంబంధము లేదనియు, నిచట రూపకాలంకారము వాచ్యముగా నున్నదనియు శ్రీ వేంకటరమణయ్యగారు మొదటి వ్యాసమున వ్రాసిరి. 'పద్మిని, ఇనుఁడు' అను పదములు ప్రస్తుతాప్రస్తుతోభయార్థకములు గాన, నా రెండర్థములకును నుపమ వ్యంగ్యమనియు, నందుచే నిది యాధ్వని కుదాహరణము కానోపుననియు నేను వ్రాయఁగా, వ్యంగ్యమయినను ప్రధానము కామింజేసి ధ్వనికాదని సద్దుకొనియున్నారు.

మరియు శబ్దశక్తి ధ్వనిలో నేయలంకారము వ్యంగ్యమగు నను విషయములో "ఉపమ, శ్లేష, రూపకము" అను విభిన్నమతములలో రూపకవాదియగు రసగంగాధరకారుని మతము ననుసరించియే తామీ యుదాహరణ పద్యమున 'రూపకాలంకారము వాచ్యము' అని వ్రాసితిమని చెప్పసాహసించినారు.

కాని యలంకారధ్వని కలదని యంగీకరించిన పద్యమున నా యలంకారమేది యనువాదములో రూపకమే యనిచెప్పిన రసగంగాధరకారుని మత మెక్కడ? అలంకారధ్వని కీపద్యమున సంబంధమే లేదని వాదించు వేంకట రమణయ్యగారి మత మెక్కడ? రసగంగాధరకారుని మతము ననుసరించియే వారు రూపకము వాచ్య

మని నారట! రూపకము వాచ్యమని వాదించుతాము వ్యంగ్య సందర్భములోఁ బ్రసంగించిన జగన్నాథుని ననుసరించితి మనుకొనుట యనాలోచితము కాదా!

మేయినెల భారతిలోని నాసమాధానముల యందలి వ్రాఁతనుబట్టి, తమవ్యాసమునఁ బడిన తప్పులను గోరంతలు కొండంతలుగాఁ జేయుటయందే నాకు మిక్కిలి పూనిక కల్గినట్లు శ్రీ వేంకట రమణయ్యగారభిప్రాయపడియున్నారు. గమ్యోత్ప్రేక్ష, రసవదాద్యలంకారములు మొదలగు విషయములలో నెక్కువగాఁ బ్రమాణములను నేను జూపుటయే వారిసందేహమునకుఁ గారణమైయుండును. కాని నా రా విషయములలో "ఆలంకారికుల యనుశాసనము, ఆలంకారికుల సిద్ధాంతము" అని వ్రాసియుండుటచేతను, అట్టి యనుశాసనములు నాకుఁ దెలిసినంతవఱకు నలంకార గ్రంథములలోఁ గన్పడకుండుటయేకాక తద్విరుద్ధముగ వానిలో గోచరించుటచేతను, నా యీ సందేహముల నలంకార శాస్త్ర పండితులగు శ్రీ వేంకటరమణయ్యగారి యొద్దనే తెలిసికొనఁదలంచి యిట్లు వ్రాసితిని గాని వేఱొండుకాదు.

---

# సన్నుతి లేదా?

## యం. వి. కృష్ణరావు

౧

"పద్మా! మీనాన్నెవరే?"

"ఏమోనమ్మా నాకు తెలియదు."

"కాదులే, నీకు తెలుసు. నువ్వు వేశ్యకూతురువి"

పద్మమనసు చివుక్కుమన్నది. తత్క్షణం యింటికొచ్చి తల్లినడిగింది.

"అమ్మా! మా నాన్నెవరే?"

"మీ నాన్న చాలగొప్పవాడు. సరియైన సమయాన్ని రానీ, మీ నాన్నెవరో చెబుతాను."

(ఇదిపూర్వగాథ.)

* * *

పద్మాసని యౌవనవసంతములో తొలిఅడుగు వేసిన జవరాలు. చాలసుకుమారమైన హృదయం ఆపిల్లది. మొగలిపూవువంటి మేనిఛాయ, ముఖంమీద ఎఱ్ఱటి పెద్దబొట్టు, భ్రూమధ్యమునుంచి ఫాలముమీద సగము వరకూ కుంకుమపువ్వురేకవలె ఉన్నది. విశాలమైన మెరకకళ్లు, కొంచెంముందుకువంగి ఉద్రేకం సూచించే ముక్కు, గడ్డముమీద చిన్నగుంట, కాలిమీదనుంచి చీలమండలవరకూ నల్లని శిరోజాలు పడుతూంటాయి. చక్కని, గుండ్రని, నునుపైన పిక్కలు. వొంటినిండా నగలే. కళ్లు నవ్వుతుంటాయి. పద్మసంగీతసాహిత్యాలలో అసమాన ప్రజ్ఞనునేర్పును గడించింది. చిన్నప్పటినుంచీ సకల భోగ భాగ్యాలతో తులతూగుతూండేది; ఎప్పుడూ ఆనందవారాశి దొప్పతోగుతూండేది. వీణమీద 'జాగేలరా కృష్ణా!' అని పాడుతుంటే యెట్టిమనసైనా కరిగి నీరౌతుంది.

పాఠశాలలో మర్యాదగల కుటుంబాల్లోపుట్టిన పిల్లలతో కలసిమెలసి తిరగడము, తనతోటిపిల్లలకు పెళ్లిళ్లుకావడముకూడా గమనించింది ఆవేదనాహృదయంతో. వేశ్యకులంలో పుట్టినందుకు పద్మయొక్క లేతహృదయం యెంత తరుక్కుపోయిందో!

"అమ్మా! ఈపాఠశాలలో చదువు పూర్తిఅయింది. మరి నాకు పెళ్లెప్పుడుచేస్తావు? నాతోటిపిల్లలలో చాల మందికి పెళ్లిళ్లయినాయి."

"తొందరపడబోకే పద్మా! నీకు తగినవాళ్లొకణ్ణి కుదురుస్తాను. అయితే అందరికీ జరిగినట్లు నీకుమాత్రం పెళ్లి జరగదు."

పద్మకీ జవాబేమీ అర్థంకాలేదు. అప్పటికి తటస్థంగా ఊరుకుంది.

౨

పద్మకు మొదటినుంచీ తన ఉపాధ్యాయురాలు నళినీబాయి అంటే పరమప్రీతి. ఆమెయింటికెళ్లి వాళ్లమ్మయిచ్చిన జవాబుకి అర్థం అడిగింది. నళినీబాయికి కళ్లనిండా నీళ్లు వచ్చాయి.

"పద్మా! నువ్వునాకు మల్లేనే సంఘ దౌర్జన్యానికి బలియైన ఒకవ్యక్తివి. నేను విధవను. మరి నువ్వో అవినీతికరమైన జీవితానికి అర్పించబడ్డ వేశ్యకన్యవు".

"అయితే నా కెప్పుడూ పెళ్లికాదంటారా?"

"ఊహూం. మీ అమ్మ చెయ్యనంతకాలం కాదు."

"మా అమ్మ నా కెందుకు చెయ్యదు?"

"నీకు పెళ్లికాకుండావుంటేనే మీ అమ్మకు లాభం. పిన్నలు, పెద్దలు, పెళ్లిఅయినవాళ్లు, కానివాళ్లు-ఒకళ్లేమిటి, అందరూ మీయింటికొస్తారు. నీశరీరాన్ని నాశనంచేస్తారు; మీ అమ్మకు అంతులేని ధనంయిస్తారు.

నువ్వు పెళ్లి చేసుకుంటే మరీ ఐశ్వర్యమంతా యెలా వస్తుంది?"

"అయితే మాఅమ్మకు నాసౌఖ్యంకంటే ధనం యందే యెక్కువ వ్యామోహమా? మా అమ్మ నన్ను గాఢంగా ప్రేమిస్తుం దనుకుంటాను. అట్లాంటిది నా సౌఖ్యాన్ని భంగపరచ నేమీచేయదు".

"పిచ్చిపిల్లా! నువ్వడిగే ప్రశ్నలకు జవాబివ్వడం కష్టం. మీ అమ్మకు పెళ్లిఅంటే పరమ అసహ్యం. పెళ్లిచేసుకోకుండా ఉండే జీవితమే యెక్కువ సుఖకర మైందని ఆవిడదృఢవిశ్వాసం."

"నేను పెళ్లిచేసుకుంటానని మా అమ్మతో ఖం డితంగా చెప్పేస్తాను. తప్పకుండా వొప్పుకుంటుందను కుంటా."

"ఆమె అట్లావొప్పుకుంటుందా? నీమాటల్ని లక్ష్యపెట్టదు."

"ఊఁ. పెళ్లి చేసుకోకుండా ఆమెగడపిన జీవితం అవినీతికరమైందని, పాపభూయిష్ఠమైందని అమ్మకు నచ్చచెబుతాను. నాకు పెళ్లిచేసుకుని మర్యాదగా బ్రతకాలని వున్నది. అట్లాంటిది నన్నెట్లా బలవంతపరు స్తుంది?"

"వేశ్యాగృహాల్లో ప్రతినిత్యంజరిగే తగాదాలే యివి. ఇష్టంలేని పిల్లల్ని తల్లులు బలవంతంగా యీ నీచవృత్తిలోకి దింపుతున్నారు. ఈవృత్తిచేపట్టిన కొద్ది కాలంలోనే పిపాస అనేది యేమన్నావుంటే అది కాస్తా హరించిపోతుంది. ఒక అలవాటు నిర్వర్తించుకో వడంలోకి దిగుతుంది. ఇతరులధనం తానుకోరి తీసుకుం టూవుంటే, ఆకొందరు యితరులు కోరకుండానే దుస్సహమైనవ్యాధులు యిచ్చిపోతారు. వాళ్లలో మను పున్న అంగసౌష్ఠవం వుండదు. సహజంగా కాంతులీనే కళ్లలో కళవుండదు. జీవచ్ఛవాల్లా తయారౌతారు."

"భయంకరం! ఇట్లాంటివి జరుగుతుంటే సం ఘం యెట్లా ఊరుకుంటుంది?"

"సంఘంకూడా మీ అమ్మమాదిరే. విజ్ఞానఘ నులమని చెప్పుకునేవాళ్లలో కొందరు ఈపడుపువృత్తి చాల ఆరోగ్యకరమైనదని, హిందూసంఘాని కత్యవసర మని గంభీరంగా సెలవిస్తారు. ఈవృత్తినవలంబించే వని తలందరిని పవిత్రమైన (?) దేవాలయాల్లో అర్చకురా ళ్లగా భావిస్తారు. ఎందుచేతనంటే దేశంలో అధికంగా మిగిలిపోయిన కామాన్నంతా మింగాలిబ వాళ్లులేకుంటే ఆకామమే కులకాంతలమీదకు విజృంభించేది. విలాస పురుషులు కొంతకాలం వేశ్యలతో తందనాలాడి, తర వాత కులకాంతల్ని చెరచడానికి ప్రయత్నిస్తారు సర్వ విధాలా. ఒక్కవేశ్యజాతిమాత్రం అవినీతికరమైన జీవి తాన్ని గడపాలంటానికి సంఘాని కేమీ హక్కులేదు"

"అట్లాగైతే నేను పెళ్లి చేసుకుతీరుతాను మా అమ్మమాటలను ధిక్కరించవలసినా పెళ్లిచేసుకుంటాను. నాప్రాణాలనన్నా అర్పిస్తాగాని ఈకులవృత్తిమాత్రం యెట్లా అనుసరిస్తాను? అనుసరింపజాలను."

"పద్మా! నీది ప్రశంసనీయమైన ఆశయం. అది నువ్వు నెరవేర్చుకోలేవేమోనని నాభయం. ఈ నీమహా దాశయంలో సహాయంచేసేవాళ్లు బహుతక్కువ. అదీ కాక నిన్ను పెళ్ళిచేసుకుంటానికి ప్రతివాడు ఝంకుస్తాడు. అవినీతికరమైన పనులుచేయడానికి మీదగ్గరకు వస్తారు గాని, యీమర్యాదస్థులంతా మిమ్మల్ని పెళ్లిమాత్రం చేసుకోరు. సంఘసంస్కర్తలు, దేశనాయకులు ఎవరు పడితేవాళ్లు ఎవర్నిపడితేవాళ్లని పెళ్లిచేసుకోమని సలహాచెబుతారుగాని వాళ్లుమాత్రం జలనిధులింకుగాక అంతపని చెయ్యరు. మీ అమ్మను తిరస్కరిస్తే నిన్ను యింట్లోంచి పొమ్మనచ్చు. స్వభావంవల్లగాని, చదువు వల్లగాని ధనం ఆర్జించి గౌరవప్రదమైన జీవితాన్ని గడపతగినంతశక్తి నీకగ్గరలేదు. కాబట్టి తొందరపడక. ముందు నిన్ను పెళ్లి చేసుకునే యువకుణ్ణి చూసుకో. ఆ పిమ్మట మీ అమ్మని యెదిరించవచ్చు. నిన్ను దేవుడు ఆశీర్వదించుగాక!"

"ఆపత్కాలంలో మీరు నాకు సహాయం చేస్తారనకుంటా."

"అందుకు సందేహమేమిటి? నా చేతనైనంత చేయడానికి సిద్ధంగావున్నా".

వివాహంచేసుకుని తనభర్తతో యెన్నో సదాశయాలు పూరించాలనుకున్న పద్మాసని వీటన్నిటికి దూరం కావలసివస్తుందా? అటువంటి నీచమై దుర్భరమైన పాడుజీవితాన్ని ఒక్క క్షణమైనా గడుపగలదా శేతహృదయం? ఈ ప్రక్క రాక్షసిలా తల్లి పెళ్లంటే భగ్గుమని మండిపడుతుంది. ఈ పాపాన్ని యెదుర్కొనే సాహసం, తల్లిని తిరస్కరించే ధైర్యం పద్మాసనిలో ఉన్నదా? ప్రస్తుతపుస్థితిని ఆలోచించుకుంటూ నీళ్లలో పడ్డ ఈగలా కొట్టుకుంటూన్నది పద్మాసని.

## 3

"నటేశచెట్టి! నీకు వయసులో ఉన్నవాళ్లంటే వ్యామోహంగాని వయసుమీరిన నాలాంటి వాళ్లంటే అంతయిష్టం లేదు."

"నువ్వు ముసలిదానవా శశిరేఖా! ఇంకా ఏభై యేళ్లవరకు నీవొళ్లు ముడతలుపడదు; నేను చెబుతున్నా చూసుకో."

"ఎన్నోవేషాలునేర్చిన దొంగవిసుమా! అందుకనే యింతమందుండగా నిన్నుమాత్రమే పద్మకి కన్నెరికం పెట్టమని అడుగుతున్నా."

"అయితే యెప్పుడాశుభకార్యంకాస్త జరగటం? ఇదుగో చూశావు శశిరేఖా! ఎంతతొందరగా అయితే అంతమంచిది."

"నేటిరాత్రే. బహుమతీగా వెయ్యిరూపాయిలు తీసుకురా. మరి పద్మకేమన్నా ఓ చంద్రహారం".

"అబ్బో! చాలయెక్కువే."

"ఆఁ. నీకీసొమ్మెంత? అసలు నిన్ను కన్నెరికం పెట్టమని అడగటం నాదేపొరపాటు. సరే, వెంకన్న చెట్టిని కుదురుస్తాలే."

వెంకన్నచెట్టిపేరు వినేసరికి నటేశచెట్టికి ఎక్కడలేని రోషం పుట్టుకొచ్చింది. అయితే దాన్ని బయటపడనీయకుండా,

"కోపపడమాక శశిరేఖా! ఏదో అనుగ్రహించు. నువ్వెంత కావాలంటే అంతిస్తాను".

"చెట్టీ ఒకవిషయం. పద్మ నాకూతురైనా చాల పవిత్రమైనకన్య. యింతవరకు యేపురుషుడిగాలీ సోకి ఎఱుగదు. మరెట్లా దారికితెచ్చుకుంటావో?"

"అది నాకునోదులు. మన ఆకారం, మనమాట, మన[illegible]తో, ఊఁహూఁ, యెంతమంది గడుసు పిండాల్ని పట్టిమాశామో. ఒక్కరాత్రి ఆపిల్లతోపాటు నన్ను వొంటరిగా వుండనియ్యి. తరవాతచూడు నా తడాఖా."

"నాకుమట్టుకు నమ్మకం తక్కువే. బొత్తిగా నేచెప్పినమాట వినడంలేదు."

"ఈ ప్రపంచంలో డబ్బుకి, బలానికి, మోసానికి లొంగనిదేం లేదు."

చెట్టి మధురాలోచనతో స్వగృహానికి దారితీశాడు. రాత్రి ఏడుగంటలకల్లా పద్మ యింటికొచ్చింది. శశిరేఖ కూతుర్ని కావలించుకుని,

"పద్మా! మాటదక్కించుకున్నాను. నీకు లక్ష్మీపుత్రుడైన చక్కని నటేశచెట్టిని కుదిర్చాను."

"మనయింటి కప్పుడప్పుడు వస్తూంటాడు, అతనేనా? అతనికి వేరే పనేమిలేదా, అందరియిళ్లచుట్టూ తిరగడం మినహా? "

"అవునతనే! అతనంటే నీకిష్టమేనా?"

"అయితే అతనికి పెళ్లి అయినట్లుంది. భార్యరూపవతిగూడా! బహుశః పెళ్లాన్ని సరిగా ఏలడం లేదేమో. అట్లాంటివాణ్ణి నేను చేసుకోను. అదీకాక పెళ్లాంవున్నవాడు నన్ను మళ్లీ యెట్లాచేసుకుంటాడు?"

"అమ్మాయి, నిన్ను చెట్టిని పెళ్లిచేసుకోమనడంలేదు. నీకిష్టంవున్నంతకాలం నీప్రియుడుగావుంటాడు, అంతే!"

"అట్లాగైతే అతన్నెప్పుడూ మనింటికి రావద్దని చెప్పు. అటువంటివాళ్ళతో నాకేమీసంబంధంవద్దు."

"ఏమీ నామాటవినవు? అమ్మాయి, నామాట వినవు? "

"అమ్మా! యేమీ ప్రయోజనంలేదు ఏమైనాసరే ఈ వేశ్యావృత్తిమాత్రం అవలంబించను. అందరిమాదిరి పెళ్లిచేసుకుని సుఖంగావుంటాను. నేను చావడానికైనా సిద్ధంగా వున్నానుగాని............"

"నీకేం వెఱ్ఱితలలేస్తున్నాయా? పెళ్లిచేసుకున్న వాళ్లుమాత్రం యేం సుఖపడి యేడుస్తున్నారు! వాళ్లకి ధనంలేదు. సుఖం అంతకన్నాలేదు. ఇంట్లో అరవ చాకిరీచెయ్యడం - పిల్లల్ని కనడం; ఎక్కువ కాన్పుల వల్ల దుర్బలత్వమున నీరసించిన దేహంతో, కృశించిన హృదయంతో కాలంగడుపుతారు. నీ ప్రేమకోసం లక్షాధికారులంతా నీకు జోహారు పడతారు."

"ఇక నీలెక్చరు ఆపు. వేశ్యవనితలకుండే దర్జా నాకక్కరలేదు. వేశ్యవనిత సమస్తరోగాల మరికిగుంట. ఎన్నిఅబద్ధాలు! యెన్ని అక్రమాలు!! యెన్ని అప్రమాణాలు!!! ఎంతోమోసంచేసి చీదరవిటుల్ని కామిస్తున్న దానికంటె నీచమైన బ్రతుకీ ప్రపంచంలో యెక్కడా లేదు."

"అదంతా యిప్పుడెందుకుగాని, యీ రాత్రి నశేశచెట్టి నీప్రియుడుగా ఉంటాడు."

"ఊఁ హూఁ."

"ఆఁ. నిన్నుకని యింతసుఖంగా పెంచినతల్లినే ధిక్కరిస్తావా?"

"ఆ కన్నంతమాత్రాన పిల్లని నైతికంగా చంపడాని కెంతమాత్రం హక్కు లేదు."

"నశేశచెట్టి నాకు వెయ్యిరూపాయలు, నీకో చంద్రహారం చేయించాడు."

"ఆయనవి ఆయనకిచ్చేద్దాం."

"ఇట్లాంటిదానివి నాకడుపు నెట్లా పుట్టావే?"

"ఇంకోకడుపునన్నా పుడితే నా కీబాధ ఉండకుండా పోయేది."

"సరే. నీకోసరం ఖర్చుపెట్టిన ఐదువేలు నాకు తిరిగి యిచ్చేసెయ్యి; నాయింట్లోంచి వెళ్లిపో."

"నాదగ్గర యిప్పుడేమీలేదు. నువ్వునాకోసరం ఖర్చుపెట్టినది వడ్డీతోసహా తీరుస్తాను."

"ఈవృత్తి అనుసరించకపోతే అదెట్లా వీలవుతుంది? నువ్వు సంపాదించేవరకు నే నాగను. కాబట్టి నేచెప్పినట్లల్లా చెయ్యి."

"నాకు సాధ్యమైనంతత్వరలో యిస్తాను."

ఆదేసమయానికి చెట్టివచ్చినట్లు కబురువచ్చింది.

"అమ్మా! అతణ్ణిచూడటానికి నాకిష్టంలేదు."

"నువ్వుచూడాలి; నీకోసమే వచ్చాడు - నిన్ను చూస్తాడు."

"సరే, కానియ్యి."

"అతనితో యిట్లా పిచ్చపిచ్చగా మాట్లాడావంటే నాయింట్లోంచి ఈక్షణం వెళ్లగొడతాను; జాగ్రత."

౪

నశేశచెట్టి ఘుమఘుమాయింపు సెంటుతో, జల్తారు వస్త్రాలు ధరించి అడుగుల్లో అడుగులు వేసుకుంటూ శోభనపు పెళ్ళికొడుకులాగ బుట్టెడు పూలదండలతో హాజరైనాడు.

"శశిరేఖా! ఏదీ పద్మ?"

పక్కనేవున్న పద్మనిచూసి నిస్తబ్ధుడైనాడు; చంద్రహారం పద్మమెళ్లో వేశాడు. తక్షణం పద్మ అది తీసేసి,

"ఇది తీసుకెళ్ళి నీపెళ్లానికియ్యి. నిక్షేపంలాంటి పెళ్లాన్నివిడిచి వేశ్యల యిళ్ళకుపోయి, వాళ్ళను పాడుచేసి నువ్వు చెడిపోవడ మెందుకు? నువ్వీ వేశ్యాగృహాల చుట్టూ ప్రదక్షిణాలు చేస్తుంటే నీభార్యమనసు యెంత ఖేదిస్తోందో!"

"పద్మా! యింటికొచ్చిన పెద్దమనిషి నట్లా అవమానం చేస్తావా?"

"నేను అవమానం చేయడం లేదమ్మా. ఆయనకు బుద్ధివచ్చేటట్లు చెయ్యాలని చూస్తున్నా. చెట్టీ! నీకేం సిగ్గులేదు? ఇక్కడనుంచి శాంతంగా వెళ్లిపోగూడదు?"

"నాయింట్లోంచి పొమ్మనడానికి నీకేం అధికారం ఉన్నదే? ఇది నాయిల్లు; అతను నా అతిథి."



"ఇవ తీసుకెళ్ళి నీ పెళ్ళానికియ్యి"

"అయితే నేనే యీ పాపభూయిష్ఠమైన కొంపలోంచి లేచిపోతాను."

"ఎక్కడికే?"

"ఎక్కడికో!"

"వయసులోవున్న నీలాంటివాళ్లు రాత్రిసమయంలో బయటకు పోకూడదు."

"ఈ యింట్లోకంటె బయట నాకింకెక్కువ హానికలగదు. ఈ క్షణం నీ యిల్లువిడిచి పోతున్నా."

"నీకర్మం నువ్వనుభవించు."

*　　*　　*　　*

"ఏమిచెట్టి! నీప్రతాపం అంతా యిట్లా తగలబడ్డదే!"

"నాపని అయిపోయింది. ఇంక నాకొంపకి నే వెడతాను. ఇన్నాళ్లు బ్రతికి యింటివెనక......అన్నంత అయింది నాపని. ఆపిల్ల అన్నమాటలు నాహృదయాన్ని దూసుకుపోయినాయి. ఈచంద్రహారాన్ని, పద్మ అన్నట్లు, నాభార్యకే యిస్తాను. ఎన్నాళ్లో అయింది దానితో మనసారమాట్లాడి సరే, యింక సెలవు."

శశిరేఖస్థితి కొంత విషమించింది. కళ్లనెంబడి నీళ్లు ఏకధారగా ప్రవహిస్తున్నాయి. తనసంపాదనలో యేమీ మిగుల్చుకోలేదు. ఎత్తినకాలు దించకుండా సర్వసౌఖ్యాలు మూరగొన్నది. ఎంతకాలమని గట్టిగా ఉంటుంది శరీరం? శారీరకంగాచూస్తే వయసు ముదిరింది; వృద్ధాప్యం తొంగిచూస్తోంది. ఇంకెంతకాలమని విటులువస్తారు? తనభావికాలం యావత్తు పద్మనాపై - ఆపిల్ల సంపాదనమీద ఆధారపడిఉన్నది. తాను సారాయి బోతే మధురరసాలు త్రాగడానికికూడా అలవాటుపడ్డది. ఏంచేయడానికీ తోచక పక్కమీద పడుకుని వెక్కివెక్కి యేడ్చింది శశిరేఖ.

ౘ

నెల్లాళ్లయినా పద్మాసని నిజగృహానికి తిరిగిరాలేదు. నళినీబాయియింట్లో వాసంచేస్తూ ఆమెసహాయం వల్ల అయిదుగురు పిల్లలకు సంగీతంనేర్పుతూ నెలకు సునాయాసంగా అరవైరూపాయలు సంపాదిస్తోంది. ప్రతినెల తనతల్లికి ముప్పయిరూపాయలు పంపిస్తూండేది. ఇంతకుముందు తండోపతండాలుగా వస్తూండేవాళ్లు యిప్పుడొక పిట్టకూడా రావడంలేదు శశిరేఖయింటికి. సంపాదన పూర్తిగా తగ్గిపోయింది; జీవితం దుర్భరమైపోయింది.

తలవనితలంపుగా రాణీపేట జమీందారు శశిరేఖ యింటికి చక్కా వచ్చాడు. జమీందారుని శశిరేఖ ఉచితరీతి మర్యాదచేసింది. ఎక్కువ కాలయాపన చేయకుండా అసలుగ్రంథంలోకి దిగాడు జమీందారు,

"మీకూతురు అసమాన సౌందర్యవతి అని నాకు మొన్నీమధ్యనే తెలిసింది. మీ అమ్మాయి విషయమై చాల భోగట్టా చేశాను. రాజోద్యానంలో పుష్పించ

వలసిన పుష్పం పద్మాసని. నళినీబాయియింట్లో వున్నంతకాలం మీ పద్మాసనితో మాట్లాడేభాగ్యం నాకు కలగలేదు. కాబట్టి యీ విషయంలో నువ్వు నాకు తగు సహాయంచేస్తావా? అందుకు నిన్ను, మీ అమ్మాయిని సంపూర్ణంగా బహూకరిస్తాను."

"చిత్తం. దేవరవారి అనుగ్రహం మామీద కలగడానికి ధన్యులం. ప్రభువులవి దివ్యసుందరస్వరూపం మా అమ్మాయి నాదగ్గరకు మళ్ళీ వస్తుందనే నమ్మకం నాకు లేదు. కాబట్టి మీరేమన్నా సలహాయిస్తే శక్తివంచనలేకుండా ప్రయత్నంచేస్తాను."

"శశరేఖా! నాకొకటి తట్టింది. మీ అమ్మాయి దగ్గరకెళ్ళి 'నువ్వులేందే బ్రతకజాలను. ఈ వృత్తి పూర్తిగా మానేశాను. వచ్చి నాతో ఉండు.' అని బొల్లి బొల్లి యేడ్పులు యేడ్చి పద్మాసన్ని బ్రతిమాలుకో. నీ ప్రార్థనకు పద్మ తప్పకుండా అంగీకరిస్తుంది. అటునుంచి నేను నరుక్కొస్తాను."

"అయితే ఈ దాసికి బహుమతీ యెంత?"

"ఓ. ఎంతకావాలంటే అంత! పద్మాసనే నాచేతికి దొరకాలిగాని. సరే నేనింక వెళ్తాను. దీన్ని గురించి తీవ్రమైనప్రయత్నం చెయ్యి."

* * * *

"పద్మా! ఎన్నాళ్లకెన్నాళ్లకే! నాకళ్లు కాయలుకాచినాయి. నువ్వులేందే యిక బ్రతకలేనే అమ్మాయి. ఈదుఃఖం నాహృదయశోణితాన్ని తాగేస్తోంది. వృత్తి సంపూర్ణంగా వదలిపెట్టేశాను. నాతో కలిసి ఉండమ్మా."

"అమ్మా! నువ్వుమాట్లాడేది నిజమేనా?"

"సందేహమేమిటి? కడుపు తరుక్కుపోతోంది. ఇందుకు ఆదేవుడే సాక్షి. ఇక నేనెక్కువకాలం బ్రతకను."

"ఇప్పటికి నీత్యాగశీలం నాకు బోధపడ్డది. నీది చాలమృదువైన మనస్సని నాకు మొదటినుంచీ తెలుసు. మనకు మంచిరోజులువచ్చాయి. మనింటికిపోదాం."

పద్మాసని శశిరేఖతోసహా నిజగృహానికి వచ్చేసింది. ఇప్పుడు శశిరేఖయింటికి వొక్కడుగూడా రావడంలేదు. ఈపరివర్తనం పరికించేసరికి పద్మ కంతులేని సంతోషం కలిగింది. ఆనాడురాత్రి శశిరేఖ కొవుత్తరం వచ్చింది. అది లేతరంగుకాగితం; చక్కని పరిమళం దానినుండి వెలువడుతూంది.



"మనకు మంచిరోజులువచ్చాయి. మనింటికిపోదాం"

"అమ్మా!

ఎన్నిదినాలైంది నిన్నుచూసి. ఇంతకాలం నిన్ను చూడకుండా వున్నందుకు క్షమించు. నేను దేశాలు తిరగడంలో మీ యోగక్షేమాలు విచారణచేయలేకపోయాను. ఈ అప్రయోజకుణ్ణి యింకా ప్రేమిస్తున్నారనే నానమ్మకం. నాముద్దుచెల్లెలు పద్మ కులాసాగా వుంటోందా? రేపురాత్రి మిమ్మల్ని చూడటానికి మీ యింటికొస్తాను. అమ్మగారికి నానమస్కారాలు. చిన్నచెల్లెలుకి నాముద్దులు.

ఇట్లు,

రాణీపేట జమీందారు."

"మనకష్టాలు గట్టెక్కాయే. మీ అన్నయ్య మన్ని చూడటానికి వస్తున్నాడుట. పాపం మన్ని మరిచి పోలేదు."

"రాణీపేట జమీందారా?"

"అవునే పద్మా. అతనితండ్రే నీతండ్రికూడా!"

"అమ్మా! అతనంటే నాకు చాలాయిష్టం. చాల చక్కటివాడు. నేనొకమాటు గానసభ చేసినపుడు నాకో బంగారుపతకంకూడా యిచ్చాడు. అతన్నిచూడాలని నాకెంతో కుతూహలంగావున్నది."

మర్నాడురాత్రి పదిగంటలకల్లా టంచన్‌గా తలుపుతట్టాడు జమీందారు. పద్మ పరుగెత్తుకుంటూ వెళ్ళి తలుపుతీసింది. జమీందారు పద్మని వొక్కసారి గట్టిగా కావలించుకుని,

"అప్పుడే పెద్దదానవయావు పద్మా! ఎన్నాళ్ళయిందమ్మా నిన్నుచూసి. అమ్మాయి, నీకే చంద్రహారం తెచ్చాను. చూడు." అని పద్మమెళ్లో ఆచంద్రహారాన్ని వేశాడు. పద్మ స్వర్గంలోవున్నట్లుంది. పద్మకి తెలియకుండా, శశిరేఖ జమీందారుచెవిలో యేదోవూది,

"ఈ మంచిరోజున మనమందరం తిరిగి కలుసుకున్నందుకు ద్రాక్షపళ్ళరసాన్ని త్రాగుదాము."

అంత ద్రాక్షపళ్ల రసాన్ని తాగారు; మెల్లగా శశిరేఖ ఆగదిలోంచి బయటకు వెళ్లిపోయింది.

౬

జమీందారు పద్మని పూర్తిగా నిషాయెక్కేటట్లు ద్రాక్షపళ్లరసం త్రాగనిచ్చాడు. ఆపిల్లయింత కన్నులు, కానుతిరిగిన చక్కని శ్వేతభుజాలు, గాజుల గలగలతోకూడిన పొడుగాటిచేతులు, ఘనమైన వక్షోభాగం, వీటియొక్క ఆకారంచూసి జమీందారు ముగ్ధుడైపోయాడు. పద్మబుగ్గలు పాలుచిలుకుతున్నాయి. భుజాలు యెత్తుగావుండి యెప్పుడు చేతులు వేస్తావా అంటూ జమీందారుచేతులు ముందుకు వెళ్తున్నాయి. ఆకళ్లు విశాల పద్మపత్రాల్లాగు-కాదు, లేడికళ్లలాగు మిలమిల మెరసిపోతున్నాయి. దుస్తులలోంచి తొంగి



"అంత ద్రాక్షపళ్ల రసాన్ని తాగారు"

చూస్తున్న ఆమె తనుసౌందర్యం ప్రస్ఫుటంగా కనబడుతోంది. పద్మ సౌందర్యపు తలపే అతని నాళాలలోని రక్తాన్ని పరుగులెత్తించింది. జమీందారునోరు ఊటవూరిపోతున్నది; కళ్లుయింతచేసుకుని చూస్తున్నాడు.

ఆ కోమలివెనకనుండి చేతులుపోనిచ్చి పద్మని ఆలింగనం చేశాడు. తన కఠోరమైన బాహువులతో ఆసుకుమారశరీరాన్ని నలిపేస్తున్నాడు. మైమరచివుండటంవల్ల విస్పష్టంగా 'అబ్బ' అన్నది. జమీందారు మరింత ఉత్సాహంతో ఉబ్బిపోయాడు. అతని కామాట వీణమీటులా వినబడ్డది.

*   *   *   *

ద్రాక్షపళ్లరసం మైకం తగ్గిపోయింది. కళ్లు తెరిచి చూసేసరికి తాను జమీందారుచేతుల్లోవున్నది. కళ్లు

నులుముకుంది. అబద్ధంకాదు - భ్రమకాదు. తన్నిపట్టుకున్నది, తన్ని చేతుల్లో గాఢంగా నలిపేసింది, తన్ని ముద్దుపెట్టుకున్నది తన అన్న అని చెప్పుకున్న ఆజమీందారే. అత నా సుందరిని వదలడములేదు. జమీందారు మళ్ళీ బలవంతముగా ముద్దు పెట్టుకోబోతున్నాడు.

"విడు. నన్ను విడిచిపెట్టు. నీ కేం మతిపోయిందా?"

ఎంతచెడ్డా జమీందారుకింకా పాపభీతిపోలేదు. బిక్క మొహంతో,

"ప్రియురాలా! నిన్ను మోసంచేసినందుకు క్షమించు. నిన్ను పొందాలనుకున్నాను. అందుకు వేరేమార్గం కనబడలేదు. కాబట్టి ఈవిధంగా.........ఎటువంటి శిలాహృదయుణ్ణన్నా తలక్రిందుచేయగల నీ అప్రతిమాన సౌందర్యం యెదట వూరోకలేక......."

"చాలుచాలు. ఇక ఆపు నీవాగాటి. ముందు నన్ను విడిచిపెడ్తావా లేదా?" అని పద్మ గంభీరస్వరంతో అన్నది, "నాఅమ్మ నువ్వు యేకమై చేశారన్నమాట."

ఆయన ఉత్తమనైతిక బలగౌరవాలముందు గడ్డిపోచ అయిపోయినాడు.

"అవును."

"మా అమ్మ కెంతిచ్చావు?"

"మొత్తముమీద పదివేలు."

"వెధవడబ్బుకోసం తల్లి కూతురిసుఖాన్ని, మా నాన్ని అమ్మాలని చూసింది. జమీందారని పేరు పెట్టుకుని, గౌరవమర్యాదలతో బ్రతుకుతున్నానని అందరికి చాటుతూ, అసహాయురాలైన ఒక కన్యని మైకంకమ్మించి చెయిస్తావు. నీకేంసిగ్గులేదు?"

"పద్మాసనీ! కోపపడవద్దు. నాతప్పు నేను వొప్పుకుంటున్నాను; పశ్చాత్తాప సంతప్తహృదయుడైన ఈజనుడు నీ క్షమార్పణకు తగినవాడుసుమా! నారాజగృహానికి తీసుకెళ్ళి, ఆజన్మాంతము నిన్ను, నీపిల్లల్ని నా భార్యాబిడ్డలులా పోషిస్తాను. అయితే నిన్ను న్యాయసమ్మతంగా వివాహంమటుకు చేసుకోను."

"నోరుమూసుకో. ఇంకా మాట్లాడతా వెందుకు? నే నొక అసహాయురాలైన వేశ్యకన్యనైనంతమాత్రాన నాలో పవిత్రత లేదనుకున్నావా? నీ అప్పనుగాని, చెల్లెల్నిగాని ఎవరన్నా యీవిధంగా చేశారనుకో. నువ్వు యేంచేసేవాడివి చెప్పు"

"ఉన్నవాణ్ణి వున్నపళాన చంపేసేవాణ్ణి. అది ఉత్తమక్షత్రియధర్మం. మరి నువ్వు రాచకన్యవు కావుగా!"

"నన్ను నువ్వు చెఱచనంతవరకు నేను రాచకన్యలంత పవిత్రంగా ఉన్నాను." అని అతని ముఖాన్ని తీక్ష్ణంగా చూసింది.

"అదిమాత్రం వొప్పుకుంటా."




"ఇదిగో నాదగ్గర రివాల్వరుంది. దాంతో......"

"అయితే నీరాజధర్మం నెరవేర్చుకో. నీశౌర్యము, పౌరుషము ఏమైనాయి? ఏంచేసేవాడివో అంత నీమీద నువ్వుచేసుకో. చెయ్యలేవు? పిరికిపందవా?? ఇతరుల విషయంలో నీప్రాణం వెనక్కిలాగుతోందేం? ఏం నీప్రాణమంటే అంతతీపా?"

ఈ ఉద్రేకపూరితమైన మాటలు వినేసరికి జమీందారు పరవశుడై పోయాడు.

"ఇదిగో నాదగ్గర రివాల్వరుంది. దాంతో నన్ను కాల్చెయ్యి"

"సామాన్యకన్యనైన నాకు రాజకుమారుణ్ణి చంపడానికి చేతులు రాకుండా వున్నాయి."

"నేను చావుకుభయపడేఅంత పిరికిపందనుగాను" అని జమీందారు రివాల్వరు పేల్చాడు; కుప్పగా నేల మీద పడిపోయినాడు.

"ఎంత ధైర్యసాహసాలున్న యువకుడు! ఇంకో విధంగా పెంచబడినట్లయితే దేశానికెంత ఉపకారం చేసేవాడో! పాపం, చేసినపాపానికి పరిహారం చేసుకున్నాడు. పాపపంకిలమైన యీ శరీరంవల్ల యేమీ ప్రయోజనంలేదు." అని అనుకుని తానుకూడా రివాల్వరుతో కాల్చేసుకుంది.

సంఘ దౌర్జన్యానికి, అసహ్యమైన వాడుకలకు యెంతమంది బలి ఐతేనోగాని మనదేశం బాగుపడదేమో. హిందూసంఘం యిప్పుడు జీవంలేని అస్థిపంజరం లాంటిది. ఇట్లాంటివి మతమునే పేరుక్రింద వాడుకలు, అలవాట్లు యెన్నో ఉన్నాయి. అవి పోతేనేగాని దేశానికి మోక్షంలేదు. ఎంతమంది ప్రాణాలు అర్పించందే ప్రజల మనస్సులలో సంచలనం కలుగుతుంది, హృదయ పరివర్తనం వస్తుంది?

అయితే యీలోగా సన్నుతిలేదా వేశ్యాజాతికి?



# తెల్లకుష్టము, పొడలు

కొద్దిరోజులు యీమందును వాడినచో తెల్లకుష్టము, పొడలు అత్యద్భుతముగా మటుమాయ మగును. హకీములు, డాక్టర్లు, కుదుర్చలేని వ్యాధులన్నియు దీనిచే నిమ్మళించును. గుణమియ్యనట్లు ఋజువుచేసినచో రు 500 లు బహుమతి యివ్వబడును. ఖరీదు రు. 2 లు. జాబులు యింగ్లీషులో వ్రాయుడు.

**Vaidyaraj**
**Akhil Kishore Ram**
**No. 15/2 P. O. Katrisarai (Gaya)**

## రూ 100 లు యినాం!

(ఇంద్రజాల అంగుళీయము)




మిక్కిలి శక్తికలది. కాంతి గలది. దీనిశక్తిచే అతికఠినమగు పనికూడ నెరవేరును. ఎవరిని మీరు కోరెదరో వారు దీనిచే మిమ్ముల ప్రేమించెదరు. పరీక్షలందు, వ్యాజ్యెములందు జయము గలుగును. ఉద్యోగము మగసంతానము, భాగ్యము మున్నగునవి కలుగును. ఇది గుణము లేదని ఋజువుచేయువారికి రూ 100/- బహుమానము. కష్టపడ నవసరములేదు. దానిని మీయొద్ద ఉంచుకొనుడు.

**BENGAL MESMERISM HOUSE,**
Panchpota, Bengal (B. M.)

## లివరు రిస్టు వాచ్



చాలాకాలము పనిచేయును. సరియైన గంటలను తెలియజేయును. 5 సం॥ల గ్యారంటీ యొసంగబడును. పట్టితోగూడా పంపబడును. వెల నెం. 1 రూ. 4-4-0, నెం. 2 రాంకు షేపు రూ. 2-15-0, రేడియం రూ. 5, రోల్డుగోల్డు నెం. 2 రూ. 4-8-0, నెం. 1 రూ. 5-8-0, చదరము రూ. 7-8-0, పోస్టేజి 7 అణాలు ప్రత్యేకం. 3 గడియారములు ఒకేసారి కొనేవారికి పోస్టేజి వుచితము.

## రూబీ బాక్సు కెమెరా



దీనివలన ఎట్టివారైన నిమిషములోగా కార్డుసైజులో ఏ ఫోటోనైనా తీయవచ్చును. ఒక దినమునకు, రూ. 5 లు సంపాదింపవచ్చును. ప్లేటు పేపరు, డెవలపింగ్ ద్రావకం, ఉపయోగించు విధము ఉచితముగా పంపబడును.

వెల రూ. 4-0-0. పోస్టేజీ, ప్యాకింగ్ వేరు.

## మిగుల నైపుణ్యముగాను, మంచి గట్టివైన ఎక్కువ శ్రేష్ఠమైన దోమతెరలు.



మిగుల శ్రేష్ఠమైన తెల్లనూలు పోగులచేత కుట్టబడి చాలాకాలము మన్నునట్లుగ తయారుచేయబడినవి. మేలిరకపు పంచరి ఆకుపచ్చ, నీలము, ఎఱుపు, పసుపు మొదలగు రంగులలో ఆవెలకే లభించును.

| పొడుగు. | వెడల్పు. | ఎత్తు. | వెల. |
|---|---|---|---|
| 6 అ. | $3\frac{1}{2}$ అ. | $3\frac{1}{2}$ అ. | రూ. 1-12-0 |
| 6 ,, | 4 ,, | 4 ,, | ,, 1-14-0 |
| $6\frac{1}{2}$ ,, | $4\frac{1}{2}$ ,, | $4\frac{1}{2}$ ,, | ,, 2- 6-0 |
| 7 ,, | $3\frac{1}{2}$ ,, | 5 ,, | ,, 2-10-0 |
| 7 ,, | 5 ,, | 6 ,, | ,, 2-14-0 |
| $7\frac{1}{2}$ ,, | 6 ,, | 6 ,, | ,, 8-14-0 |

తపాలాచార్జి ప్రత్యేకం. ప్యాకింగు ఉచితము.

ఒకేసారి 3 తెరలను కొనువారికి 6 అ. పొడుగు $3\frac{1}{2}$ అ. వెడల్పు, $3\frac{1}{2}$ అ. ఎత్తుగల ఒక తెర ఉచితము.

విలాసము:— నేషనల్ ట్రేడింగ్ కంపెని,
(వి.వి.) P.O., బీడన్ వీధి, కలకత్తా.

# స్పెయిన్ విప్లవం

## (రా వు జీ)

(రాయిటర్)

ప్యారిస్, ఆగస్టు 15:—

"నిన్న సాయంత్రం విద్రోహులు బడజాజ్‌ను పట్టుకున్నారని లిస్‌బన్‌నుంచి తంతివార్తవచ్చింది,,

(రాయిటర్)

లిస్‌బన్, ఆగస్టు 16:—

"బడజాజ్‌లో విద్రోహులు మహా భీకరమైన చిత్రవధ చేస్తున్నారు.

"ప్రభుత్వపక్షాన పోరాడి వుండవచ్చునని అనుమానం తోచిన ప్రతివ్యక్తిని కాల్చివేస్తున్నారు.

"ఇంతవరకు కనీసం ౨,౦౦౦ మందిని చిత్రవధ చేసివుంటారు.

"తనయులను గోల్పోయిన తల్లుల కడుపుకోత, భర్తలకు దూరమైన భార్యల ఆక్రోశం, తండ్రులను పోగొట్టుకున్న బిడ్డల దీనాలాపాలు మహాహృదయ విదారకంగా వున్నాయి!

"ఏగోడను చూచినా తుపాకిగుళ్ల తూట్లు కనబడుతున్నాయి! ఏవీధికి వెళ్ళినా రక్తస్రవంతులు ప్రవహిస్తున్నాయి. ఏవాడకుపోయినా శవాలు పెంటలు ఎదురౌతున్నాయి!"

ఈవిధంగా ఏనాటి కానాడు స్పెయిన్ విప్లవ దౌర్జన్యాలను గురించి వార్తలు వస్తున్నాయి!

ఒకనాడుకాదు, రెండురోజులు కాదు, విప్లవం ప్రారంభమైన ఈరెండు మాసాలనుంచీకూడా ఇదేవరస.

పైగా ఆనాటి కానాటికి ఈదౌర్జన్యాలు అతిరాక్షసం అయిపోతున్నాయి.

అప్పుడే అనేక ప్రదేశాలలో అష్టకోటిని గోల్పోయి, దుఃఖసాగరాన మునిగివున్న స్త్రీలు, శిశువులు వినా మచ్చుకైనా మగపురుగు లేకుండా పోయినట్టుకూడా తెలుస్తున్నది! విప్లవాలు, రక్తపాతం మానవ ప్రపంచానికి కొత్తఏమీకాదు. అయినా, ఇంత ఘోరం మాత్రం ఇంతకుముందు కని విని యెరగము.

అంతకుపూర్వం జరిగిన ఏ విప్లవంలోకూడా ౧౯౧౭ నాటి బోల్షివిక్ విప్లవంలో జరిగినంత జననష్టం జరగలేదని చెబుతూవుండేవారు! ఇప్పుడు ఆ (అ?) ప్రతిష్ఠ స్పెయిన్‌కు దక్కింది!

అసలు స్పెయిన్‌లో విప్లవం ఎందువల్ల వచ్చింది? అది ఇంతటి మహా తీవ్రరూపాన్ని ఎందుకు గ్రహించింది? ఇన్ని రాక్షసకృత్యాలు జరగడానికి కారణం ఏమిటి? ఈవిప్లవం చివరకు ఎలా పరిణమిస్తుంది? స్పానిష్ విప్లవవిషయంలో ప్రతివారువేసే ప్రశ్నలు ఇవే, వీటికి సంగ్రహంగానూ, సమగ్రంగానూ ఇక్కడ జవాబులు చెప్పడానికి ప్రయత్నిస్తాను.

ముందు మొదటిప్రశ్న: స్పెయిన్‌లో విప్లవం ఎందువల్ల వచ్చింది?

మొన్నటి ఫిబ్రవరిలో ఎన్నికలు జరిగినాయి. ఈ ఎన్నికలలో రిపబ్లికన్లు, సోషియలిస్టులు, కమ్యూనిస్టులు, అనార్కో సిన్‌డికలిస్టులు గెలిచారు. రిపబ్లికన్‌పక్షము వాడైన సీనార్ అజానా అధ్యక్షపీఠాన్ని అధిష్ఠించాడు. ఇది మానార్కిస్టులకును, ఫాసిస్టులకును కడుపుమంటకు కారణమైంది. అందుచేత వారు ప్రభుత్వంమీద తిరగబడ్డారు.

ఇలా చెబితే మొదటి ప్రశ్నకు సరైన జవాబు చెప్పినట్టే! అయితే ఇలా చెప్పడంలో ఒక్కటే చిన్న లోపం వుంది. ఆలోపం ఏమిటంటే చెప్పింది ఏమీలో

ఎవ్వరికీ బోధపడదు! అంచేత విషయాన్ని కొంత వివరిస్తాను.

ఎన్నికలలో కేవలం ఏదో ఒకపక్షం వోడిపోవడంవల్ల ఏదేశంలోనూ విప్లవంరాదు. విప్లవం ప్రజ్వరిల్లడానికి అంతకంటె బలమైన కారణాలు వుండాలి. చారిత్రక సంబంధమైన కారణాలు, ఆర్థికంగా చెప్పరాన్ని చిక్కులూ, ప్రాణమానవిత్తాలకు రక్షణవుండదనే ఆశంక—ఇలాంటి ఇంధనాలు చాలా చేరితేనేగాని విప్లవాగ్ని అంటుకోదు.

కొంచెం జాగ్రత్తగా చూస్తే ఇప్పటి స్పెయిన్ విప్లవానికి ఈ అన్ని కారణాలుకూడా దోహదం అయినట్టు కనబడుతుంది.

ఒక కారణంవల్ల మరొక కారణం కలుగుతూవుంటుంది గనక ఇది చారిత్రక సంబంధమైనది, ఇది ఆర్థిక సంబంధమైనది, ఇది మరి ఏదో సంబంధమైనది అని విడదీసి చెప్పడానికి వీలుపడదు. అంచేత ఇప్పటి స్పెయిన్ విప్లవానికి దోహదం ఇచ్చిన కారణాలను గుదిగుచ్చి ఏదో వొక వరసలో చెబుతాను.

స్పెయిన్ విస్తీర్ణం, ౧,౯౦,౦౦౦ చదరపు మైళ్లు. వైశాల్యాన్నిబట్టి చూస్తే యూరపియన్ రాజ్యాలలో అది మూడవదిగా నిలుస్తుంది. ఫ్రాన్సుకంటె అది ఏ కొంచెమో చిన్నది. జర్మనీకంటె చాలా పెద్దది. అయినా దాని జనసంఖ్య ౨½ కోట్లకు మించదు. పోతే ఫ్రాన్సుజనసంఖ్య దాదాపు ౪ కోట్లు; జర్మనీ జనసంఖ్య ౭ కోట్లు! విస్తీర్ణం హెచ్చుగా వున్నా, స్పెయిన్ జనసంఖ్య తక్కువగా వుండడానికి ఆదేశ దారిద్ర్యమే కారణం.

స్పెయిన్ భూములు అంత సారవంతమైనవికావు. పైగా కొన్నిచోట్ల అతివృష్టి; మరికొన్నిచోట్ల అనావృష్టి. సమతలంకంటె మిట్టపల్లాల ప్రదేశం హెచ్చు. రాకపోకలకు తగిన సౌకర్యాలు తక్కువ! ఈ అన్ని కారణాలవల్ల ఆదేశం తక్కిన యూరపియన్ రాజ్యాలవలె భాగ్యవంతంగా వుండడానికిగాని, తక్కినవానిలోవలె అక్కడకూడ జనవృద్ధి జరగడానికిగాని అవకాశాలు లేవు.

నైసర్గికమైన ఈచిక్కులకు రాజకీయమైన కారణాలు మొదటినుంచీ తోడవుతూ వచ్చాయి. అదేమి పాపమోగాని ప్రజాక్షేమాన్నే తన క్షేమంగా ఎంచుకొన్న ప్రభువు ఒక్కడుకూడా స్పెయిన్‌లో పుట్టలేదు. స్పెయిన్ రాజులు అందరూకూడా దుర్మార్గులు, దురహంకారులు! అందుచేత ౧౯ శతాబ్దంలో తక్కిన అన్ని యూరపియన్ రాజ్యాలుకూడా ఇంతో అంతో పారిశ్రామికంగా అభివృద్ధిపొందితే, ఒక్క స్పెయిన్ మాత్రం ఈ విషయంలో చాలా వెనకబడిపోయింది. ప్రజలు నిరక్షరకుక్షులు కావడంవల్ల, కనీసం వ్యవసాయ పద్ధతులు వృద్ధిఅవడానికైనా అవకాశం లేకపోయింది. ఇందువల్ల యూరప్‌లో బీదతనానికి అగ్రతాంబూలం ఎప్పుడూ స్పెయిన్‌దే!

స్పెయిన్‌లో వున్న మరొక విపరీతమైన పరిస్థితి ఏమిటంటే,—అక్కడ సాగుబడిభూమిలో చాలా భాగం జమీందారుల అధీనంలో వుంది. భూమిని చక్కగా పండించాలనీ, మంచి ఫలసాయం తియ్యాలనీ వారికి ఆందోళన ఏమీలేదు. రైతులు తమ రక్తాన్ని ధారవోసి పంటలు పండిస్తూవుంటారు. ఆ పంటల్ని అందినంతవరకు జమీందారులు హరిస్తూవుంటారు. ఇక దేశం సుభిక్షంగా ఎలా వుంటుంది?

తమ రెక్కలకష్టం తమకు దక్కకుండా పోతున్నదని ప్రజలు అనాదికాలంనుంచీ కూడా ఆందోళన పడుతూనే వచ్చారు. కాని, జమీందారుల ధాటీకి వారు తాళలేకపోయారు. జమీందారులు ఎప్పుడు రాజును ఆశ్రయించుకుని వుండేవారు. రాజు జమీందారులను ఆదరిస్తూ వుండేవాడు. వీరు ఉభయులు సేనాధిపతుల ప్రాపకంకోసం దేవులాడుతూ వుండేవారు. దుష్టచతుష్టయం పూర్తికావడానికి పీఠాధిపతులు పైముగ్గురితోనూ చేతులు కలిపేవారు. అర్థబలం, అధికారబలం లేని ప్రజలు ఇక ఏమిచేయగలరు?

అక్కడికీ స్పానిష్ ప్రజలు సంస్కరణలకోసం చాలా ఆందోళనచేశారు. అప్పుడప్పుడు హతాశులై

విప్లవాన్ని చేశారు. అయినా, ఎప్పటికప్పుడు దుష్ట విప్లవానికే విజయం సంప్రాప్తించింది.

స్పానిష్ ప్రజలు చేసిన ఈ అన్ని తిరుగుబాట్లను గురించి చెప్పాలంటే పెద్దగ్రంధం అవుతుంది. అంచేత ఇటీవలి స్పానిష్ చరిత్రను మాత్రం ఇక్కడ క్లుప్తంగా ఉదాహరిస్తాను.

ప్రజా విశ్వాసాన్ని కోల్పోయిన ప్రభువు పశుబలంమీద ఆధారపడాలి. స్పెయిన్ రాజులు ఈ సూత్రాన్ని అనుసరించి ఎల్లప్పుడు తమ సేనాపతుల మీదనే ఆధారపడి వుండేవారు. ఆసేనాపతులుకూడా కేవలం స్వార్థాన్ని ఆశించి, తమకు అనుకూలంగా పరిపాలన సాగిస్తూ వుండేవారు. వారిలో ఒకరికొకరికి మధ్య కలతలువస్తే పరస్పర నాశనంకోసం ప్రయత్నిస్తూ వుండేవారు. నిరంకుశుడైన ఒక సేనాపతిపోతే, వాడి స్థానంలో ఇంకొకడు వస్తూవుండేవాడు. అంచేత స్పెయిన్ చరిత్రను అతిసులభంగా సేనాపతుల శకాల క్రింద విడదీయవచ్చును.

సేనాపతుల శకాలలో ఒకశకం ప్రైమోద రివెరా శకం, ౧౯౨౩లో ప్రారంభమయింది. ఈరివెరా బార్సిలానాలో కెప్టెన్ జనరల్. అప్పటి స్పానిష్‌రాజు అల్ఫాన్‌జో నిరంకుశాధికారాన్ని సుస్థిరం చెయ్యడానికి ఇతగాడు ౧౯౨౩ లో ఒక సైనికవిప్లవాన్ని లేవదీసి ప్రభుత్వాన్ని పూర్తిగా వశపరుచుకున్నాడు.

౧౯౨౩ నుంచి ౧౯౩౧ వరకు రివెరా అవిచ్ఛిన్నంగా రాజ్యం ఏలాడు. మొట్టమొదటిలో అతని ప్రభుత్వం పూర్తిగా సైనికప్రభుత్వంలా వుంది. కాని ప్రజాందోళన కొంతవరకు తీవ్రం కావడంవల్ల ౧౯౨౫ లో అతడు నామకః ఒకమంత్రివర్గాన్ని ఏర్పాటు చేశాడు. ఇది కూడ ప్రజలను సంతృప్తిపరచకపోవడంజూచి, తనప్రభుత్వం ప్రజాప్రభుత్వంగా అగుపించాలని అతడు మరికొంత కపటనాటకం ఆడాడు. ఈకపటనాటకంలో ఒకభాగం ఏమిటంటే—నామినేటెడ్ సభ్యులతో ఒక పార్లమెంటును ఏర్పాటుచెయ్యడం.

రివెరా చాలా నిరంకుశంగా పరిపాలించినమాట నిజమేగాని అతగాడు తాను శాశ్వతంగా డిక్టేటర్ కావాలని ప్రయత్నించలేదు. దేశంలో తమగుప్తచతుష్టయం స్థానం తగినంత బలపడగానే ఏదో లోకప్రజాప్రభుత్వాన్ని ఏర్పాటుచెయ్యాలనే అతనియుద్దేశం. అందుచేతనే అతను పార్లమెంటును పిలవడం వెందలయిన గొడవల్ని చేయడం! కాని, ఇదే అతని పతనానికి కారణం అయింది. నిజమయిన అధికారాన్ని తమకు ఇవ్వలేదని ప్రజలు ఒకవైపున అసంతృప్తిపడ్డారు. ప్రజల కోర్కెలను మన్నించడానికిప్రయత్నిస్తున్నాడని ఇంకోవైపున ప్రభువు ఆగ్రహపడ్డాడు. తగిన అవకాశాన్ని చూచుకొని ౧౯౩౦ లోఅల్‌ఫాన్‌జో రివెరాచేత రాజీనామా పెట్టించి, ఆపదవిని జనరల్ బెరెన్‌గైరుకు ఇచ్చాడు.

ఈలోపుగా దేశంలో అశాంతి చాలా పెచ్చుపెరిగి పోయింది. అక్కడక్కడ కార్మికులు సమ్మెలు కట్టడం ప్రారంభించారు. ఈసమ్మెలను ఆపుచెయ్యడం ప్రభుత్వానికి అంతకంతకు దుర్ఘటం కాసాగింది. అయితే, ప్రజాపక్షాలలో అప్పటి కింకా ఒకవిధమైన ఐక్యత ఏర్పడలేదు. సిండికలిష్టులవారి వేరు, సోషియలిస్టుల దారివేరు. రాడికల్సు ఒకపక్కకు ఈడిస్తే, ఎర్రరియన్సు ఇంకొకపక్కకు ఈడుస్తారు. స్పానిష్ దేశాన్ని అంతటిని ఒక్క కేంద్రప్రభుత్వం అధీనంలో వుంచాలని కొందరు: కాదు వివిధభాగాలను స్వతంత్ర రాజ్యాలుగా చెయ్యాలని మరికొందరు. ఈవిధంగా రకరకాల భేదాలవల్ల ఏపార్టీ ఆపార్టీకి విడిగా వుండిపోయింది!

కాని, ౧౯౩౦ జూన్, జూలై ప్రాంతానికి జనరల్ బెరెన్‌గైర్ నిరంకుశత్వము బొత్తిగా దుర్భరం కావడంవల్ల, అన్ని పార్టీలవారుకూడ ఏకమైనారు. సాధారణంగా మితవాదులుగా వుండేవారుకూడ ఈ ప్రజాపక్షకూటమిలో చేరారు. ఇన్ని పక్షాలవారు ఒక్కటి కావడంవల్ల జనరల్ బెరెన్‌గైర్ ప్రభుత్వం కూలిపోకతప్పదని నిశ్చయమైపోయింది. ఇంతలో ఆ డిశెంబర్ నెలలో గ్రైటిజెన్‌లాఫ్ వైమానికాశ్రయంలో విద్రోహం ప్రారంభమైంది. ఈ విద్రోహాన్ని ప్రభుత్వం

కొంత కష్టంమీద అణచివేసింది. చాలామంది రిపబ్లికన్ నాయకులను బందిఖానాలో పడవేసింది.

బింకానికి దౌర్జన్యవిధానాన్ని అవలంబించినా ప్రజాశక్తికి లోలోన కొంత వెరిచి ౧౯౩౧ మార్చిలో ఎన్నికలను జరుపుతానని ప్రభుత్వం ప్రకటించింది. ఈ ఎన్నికలతర్వాత ప్రజాశాసనసభకు కొంత రాజ్యపాలనా స్వాతంత్ర్యం ఇస్తాననికూడా మాట ఇచ్చింది.

అయితే అప్పటి స్పెయిన్ పరిస్థితులనుబట్టి ఎన్నికలు సక్రమంగా ధర్మన్యాయంగా జరగడానికి సావకాశంలేదు. ప్రత్యక్షంగా కాకపోతే పరోక్షంగానయినా ప్రభుత్వం వోటర్లను బెదురుపెట్టి తీరుతుంది. అంచేత కేవలం ప్రభుత్వానికి జోహుకుం అనేవారు మాత్రమే ఎన్నికలలో నెగ్గుతారు. ఈ చిక్కును కనిపెట్టి ప్రజాపక్షమువారు తాము ఎన్నికలను బహిష్కరిస్తామని ప్రకటించారు.

ఈ ప్రకటనను చూచినమీదట ఆల్ఫాన్జో రాజు ఒక మెట్టు క్రిందకుదిగి ప్రజావాంఛలను కొన్నింటిని మన్నించక తప్పినదికాదు. ప్రభుత్వము కొంత రాజీకి దిగడం చూచి లిబరల్ పార్టీవారు ఎన్నికలను తాము బహిష్కరించమని ప్రకటించినారు. కాని, వారి ముఖ్యనాయకుడు కౌన్టు రోమనోన్సు "కాన్సిట్యుఎన్ట్ ఎసంబ్లీ" విషయమై తాను పట్టుపట్టకతప్పదని ఖండితంగా చెప్పాడు. ఇది తెలియగానే ఆల్ఫాన్జో అసలు ఎన్నికలనే రద్దుచేసివేశాడు!

ఎన్నికలను రద్దుచెయ్యడంవల్ల ప్రభుత్వం మరీ అల్లరిపాలయింది. జనరల్ బెరెన్గైర్ రాజీనామా ఇచ్చాడు. అప్పుడు – సేనాపతులంటే విసుగుపుట్టి కాబోలు-నౌకాదళాధిపతిఅయిన ఎడ్మిరల్ ఆజ్నార్కు ఆల్ఫాన్జో ప్రభుత్వాధికారాన్ని కట్టబెట్టాడు.

ఎడ్మిరల్ ఆజ్నార్ అధికారానికి వచ్చిన రెండు మాసాలకు ౧౯౩౧ ఏప్రిల్లో పురపాలకసంఘాల ఎన్నికలు వచ్చాయి. ఈ ఎన్నికలలో రిపబ్లికన్నుకు అఖండమైన మెజారిటీ వచ్చింది. ఈ విజయం ఫలితం ఏమిటంటే—ఎడ్మిరల్ ఆజ్నార్ రాజీనామా యివ్వడం! ఏప్రిల్ ౧౪వ తేదీని స్పెయిన్ ప్రజాస్వామిక రాజ్యమని ప్రకటన జరగడం!!

ప్రజాస్వామికరాజ్యప్రకటన జరగగానే, ఆల్ఫాన్జో స్పెయిన్నుంచి పలాయనం చిత్తగించాడు; రాజు పారిపోవడం చూచి స్పానిష్చర్చి గురువుకూడా రోంనగరం పోప్దగ్గరకు పరుగెత్తాడు!!

అంతకు పూర్వం ఇటు రాజుకూ, అటు చర్చికీ తమ దేశంలో పెద్దస్థానం వుంటం వున్నదనీ, వారిని ఒకపట్టాన అధికారంనుంచి కూలద్రోయడం సాధ్యంకాదనీ ప్రజలు భయపడుతూ వుండేవారు. తాము కొంచెం ఐక్యత చూపడంతోనే ఉభయులుకూడా కాలికి బుద్ధిచెప్పడం చూచి వారు నిజంగా ఆశ్చర్యపడ్డారు.

ఆల్ఫాన్జో దేశంనుంచి పారిపోయినా తాను సింహాసనాన్ని త్యజించలేదనీ, తన అధికారాలను తాను వదులుకోననీ ప్రకటించాడు. అయితే ఈప్రకటనను ఎవ్వరూ లక్ష్యపెట్టలేదు. తాత్కాలికంగా వ్యవహరించడానికి డాన్ జామెరా ఆధిపత్యంక్రింద ఒకప్రభుత్వం యేర్పడింది. చట్టనిర్మాణాన్ని చెయ్యడానికి ఒక ప్రత్యేకసంఘం యేర్పాటు అయింది.

చట్టనిర్మాణం చెయ్యడంలో కొన్ని చిక్కులు వచ్చాయి. ఈచిక్కులలో ప్రధానమైనది మతపీఠాల భూములనుగురించి భేదాభిప్రాయం. జెసూయట్సు పీఠాల భూములను జప్తుచేసి, వాటిని ప్రజలకు పంచి ఇవ్వాలని చట్టనిర్మాణానికి ఏర్పడినసంఘం సిఫార్సు చేసింది. దాన్ని చూచి, జామెరా తనపదవికి రాజీనామా ఇచ్చాడు. అంతట సీనార్ అజానా ఆయన స్థానాన్ని తాత్కాలికంగా ఆక్రమించాడు. చివరకు ౧౯౩౧ నవంబర్లో నూతనచట్టము ఆమోదనబడసింది. క్రొత్తచట్టంక్రింద జామొరాను స్పానిష్ప్రభుత్వాధ్యక్షునిగాను, అజానాను ప్రధానమంత్రిగాను ఎన్నుకొన్నారు.

నూతనప్రభుత్వం ఎన్నో సమస్యల్ని పరిష్కరించవలసి వచ్చింది. వాటిలో ముఖ్యమైనది భూమికి సంబంధించిన సమస్య. కష్టపడి పని చేసుకునే రైతులకు భూమిలేదు. పండించకుండా ఫలసాయం దిగమింగే

జమీందారులకు ఎన్నో భూములు వున్నాయి. అంచేత ఈసమస్యను ఎలా పరిష్కరించడం?

ఆల్‌ఫాన్‌జో దేశద్రోహంచేశాడు గనుక అతను నేరస్థుడని రిపబ్లికన్ ప్రభుత్వం నిర్ణయించింది. అతని భూముల్ని జప్తు చేసింది. ఈభూముల్ని మతపీఠాల వారిదగ్గరనుంచి జప్తుచేసిన భూముల్ని కలిపి, ప్రభుత్వం కొందరు ప్రజలకు పంచి ఇచ్చింది.

ఇంతేగాక ౧౯౩౨ సెప్టెంబరులో ప్రభుత్వం ప్రత్యేకంగా ఒకశాసనాన్ని చేసి, ఆ ఆగస్టులో ఆల్‌ఫాన్‌జోకు తిరిగి పట్టంకట్టాలని విప్లవం చేసినవారి (మొనార్కిస్టులు)భూముల్ని, మరికొందరు జమీందారుల భూముల్ని నష్టపరిహారం అయినా లేకుండా జప్తుచేసి, ప్రజాబాహుళ్యానికి పంచిపెట్టింది.

ఏవో కొన్ని ప్రత్యేక సందర్భాలలో మాత్రం ప్రభుత్వం ఈవిధంగా నష్టపరిహారం లేకుండా భూముల్ని జప్తుచేసింది. పోతే, సర్వసాధారణంగా పసిఅయిన సేద్యంలోలేని భూముల్ని వాటిఖామందులకు ఏదోకొంత సొమ్ము ఇచ్చి తీసుకుని, స్వయంగా సాగుచేసుకునే రైతులకు ఇచ్చింది! ఇలా తీసుకున్న భూములకు విలువ నిర్ణయించడంలో ప్రభుత్వం అంతకు పూర్వం ఆ భూఖామందులు చూపించిన ఆదాయపు పన్ను లెక్కలమీద ఆధారపడింది! ఆదాయపుపన్ను తక్కువకావాలని ఆస్తివిలువ తక్కువకట్టుకోవడం మామూలు గనుక, ఈఏర్పాటు ప్రభుత్వానికి మహా రాయితీగా వుండేది!

భూమివిషయమై ఇంతేగాక మరికొన్ని సంస్కరణములను కూడ సీనార్ అజానాప్రభుత్వం చేసింది! అయితే, ఆయన ఎలాగూ కొంతమితవాదిగనక పోవలసినంతదూరం పోలేదనే చెప్పాలి!

అజానా కొంతవరకు మితవాదవైఖరి వహించినా, అక్కడికే ఆయనచేసిన సంస్కరణములు పెద్ద పెద్ద భూస్వాములకును, పీఠాధిపతులకును, మరికొందరికిని దుస్సహములైపోయినవి. వీరందరుచేరి ౧౯౩౪ లో విప్లవాన్ని సాగించారు. పరిస్థితులు విషమించే సూచనలు కనబడడంవల్ల, అజానా రాజీనామా ఇచ్చాడు. ఆయనస్థానంలో సిల్‌రోబెల్సు అధికారానికి వచ్చాడు. ధర్మసంకోచాలువున్న అజానా ప్రతికక్షులవిషయంలో దయాదాక్షిణ్యాలు చూపాడుగాని ఈనూతన ప్రభుత్వం వారు మహాదారుణమైన చిత్రవధ ప్రారంభించారు. ఆకారణంగా ౧౯౩౪ లో తిరిగీ స్పెయిన్‌లో సంఘర్షణలు ప్రారంభమైనాయి; తిరిగీ రక్తస్రవంతులు ప్రవహించినాయి. ఆసంవత్సరంమొత్తంలో ఈసంఘర్షణల కారణంగా ౧౪,౦౦౦ మంది చనిపోయారు. ఆ మరు సంవత్సరంలో ప్రభుత్వం ౨౫,౦౦౦ మందిని సామ్యవాదులని చెప్పి—సామ్యవాదికావడం మహానేరం కాబోలు—ఖైదుచేసింది!!

ఈ తీవ్ర నిరంకుశవిధాన ప్రయోగంవల్ల భూస్వాములు, సైనికోద్యోగులు, మతాధికారులు మొదలైనవారు ఇక తమను ప్రతిఘటించడానికి ఏపక్షంవారూ సాహసించలేరనీ, ఎన్నికలలో తమకు విజయం అమోఘమనీ, తామే శాశ్వతంగా అధికారపీఠంలో కూర్చుంటామనీ ఆశించారు. కాని మొన్నటి ఫిబ్రవరిఎలక్షన్‌లో వారు పూర్తిగావోడిపోయారు. సీనార్ అజానా(ఈసారి) అధ్యక్షుడు అయ్యాడు. సీనార్ గిరాల్ ప్రధానామాత్యుడు అయ్యాడు. ఎన్నికల ఫలితం చూచినమీదట దుష్టచతుష్టయానికి ఆల్‌ఫాన్‌జో పరదేశాల పాలయ్యాడు గనక దుష్టత్రయం అని అనాలి కాబోలు—కలిగిన ఆశ్చర్యం, ఉడుకుపోతుతనం, కడుపుమంట, కోపం ఇంతింతకాదు.

పూర్వం సీనార్ అజానా ప్రధానామాత్యుడు కావడానికి ముఖ్య కారణం: రిపబ్లికన్ పార్టీవారి మెజారిటీ. అంచేత ఆయన సాంఘికవ్యవస్థలలో విప్లవకరమైన మార్పులను తెచ్చిపెట్టక కేవలం స్వల్ప సంస్కరణములతో సంతృప్తిపడినాడు. ఈసారి ఆయన అధికారానికిరావడానికిసోషియలిస్టులు,కమ్యూనిస్టులు,ఆనార్కోసిన్‌డికలిస్టులు మున్నగు అతివాదపక్షములవారి సహాయం కొంతవరకు కారణం! అంచేత ఆ పక్షములవారి సహాయాన్ని పోగొట్టుకోకుండా వుండడానికి అజానా విప్లవకరమైన మార్పులను తీసుకురావడానికి ప్రయ

త్పించవచ్చును! ఇది దుష్టత్రయాన్ని కలతపెట్టిన పెద్ద భయం.

పైగా ప్రపంచ ఆర్థికమాంద్యంవల్లను ఇతర కారణాలవల్లను స్పెయిన్ ఆర్థికస్థితి మహాఘోరమయి పోయినది. ఏదో వొక్క గొప్పమార్పు జరిగితేనేగాని గత్యంతరంలేదు. కాని మార్పు అంటే దుష్టత్రయానికి గిట్టదుకదా?

ఈ అన్ని కారణాలవల్ల స్పెయిన్‌లో విప్లవం బయలుదేరింది. పోతే "ఇది ఇంతటి మహాతీవ్రస్వరూపాన్ని ఎందుకు ధరించింది?" అనే రెండవ ప్రశ్నకు వస్తాను.

ఇంతకుపూర్వం విప్లవాలలో సేనాపతులను అనుసరించే సైనికులు కూడా వుండేవారు. కాని ఈసారి సైనికులు సేనాపతులమీద తిరుగబడ్డారు. కొన్ని కొన్ని చోట్ల కుట్రచేస్తున్న సేనాపతులను వారు చంపివేశారు కూడా! ఈ కారణంవల్ల ఈసారి విప్లవాన్ని-సాధారణ పరిస్థితిలో అయితే-అణచివెయ్యడం మహాసులభం కావలసింది. కాని అది ఇంతకాలంపాటు సాగడం, ఇంత భయంకరరూపం దాల్చడం— ఇది ఎందువల్ల?

విద్రోహ సేనాపతులకు పరదేశాల సహాయం వుంది. లేకపోతే విప్లవం ప్రస్తుత స్థితివరకు వచ్చేదేకాదు. ఇటలీ, జర్మనీ, పోర్చుగల్ ఈమూడు రాజ్యాలూ కూడా విద్రోహులకు కొంతవరకు బహిరంగంగానూ, చాలభాగం రహస్యంగానూ సహాయం చేస్తున్నాయి.

ఇటలీ, జర్మనీరాజ్యాలనుంచి విద్రోహుల సహాయార్థము విమానాలు వెళ్లినాయి. పోర్చుగల్‌నుంచి వారికి ఆహారపదార్థాలు సప్లయి అవుతున్నాయి. హిట్లర్, ముసోలినీలు రహస్యంగా ధనసహాయంకూడా చేస్తున్నారట.

హిట్లర్, ముసోలినీల ప్రోద్బలమే లేకపోతే ఇప్పుడు స్పెయిన్‌లో ఈవిప్లవం అసలు వచ్చివుండేది కాదు అని కూడా కొందరు అంటున్నారు.

ఈనాజీ, ఫాసిస్టు నియంతలకు స్పానిష్ విద్రోహులపై ఇంత అభిమానం వుండటానికి కారణంయేమిటి? స్వార్థమా? రాజకీయమైన ఒకయెత్తు మాత్రమేనా? లేక రెండూనా?

ఇంతవరకు బయటపడిన పరిస్థితులనుబట్టి చూస్తే రెండూ అని అనవలసివస్తుంది. విద్రోహనాయకుడైన జనరల్ ఫ్రాన్‌కో తమ స్పానిష్ మొరాకో సామ్రాజ్యంలో కొంతభాగాన్ని మీకు ఇస్తామని హిట్లరుకు వాగ్దానం చేశాడట. బాలేరిక్ ద్వీపాలను ఇస్తానని ముసోలినీని ఆశపెట్టాడట.

పోతే, ఇందులోవున్న రాజకీయపుఎత్తు ఏమిటంటే, ఇందుమూలంగా ఫ్రాన్సు, బ్రిటన్, రుష్యా రాజ్యాలమీద గట్టిదెబ్బ తీయవచ్చును. ఒకవైపున జర్మనీ, ఇంకోవైపున ఇటలీ బ్రహ్మాండమైన యుద్ధసన్నాహాలను చెయ్యడంచూచి ఫ్రాన్సు గడగడలాడిపోతున్నది. ఈఫాసిస్టురాజ్యాల ముప్పునుంచి తప్పించుకోడానికి అది అటు రుష్యా, పోలెండ్ దేశాలతోనూ ఇటు బ్రిటన్‌తోనూ మైత్రిచేస్తున్నది. అందువల్ల ఈ మూడుదేశాల కలయికనూ, అందువల్ల వాటికి విడివిడిగానూ, మొత్తంమీదనూ చేకూరే బలమునూ వమ్ముచెయ్యాలంటే, స్పెయిన్‌కూడా ఫాసిస్టురాజ్యం కావడం అవసరం! స్పెయిన్ ఫాసిస్టురాజ్యంఅయితే, మెడిటరేనియన్‌లో బ్రిటన్ ప్రాబల్యం తగ్గుతుంది. పైగా ఫ్రాన్సుకు దాదాపు మూడువైపుల ఫాసిస్టురాజ్యాలు మూడు పెద్దపులులుగా వుంటాయి!

స్పెయిన్ పశ్చిమభాగంలో ఈ రాజ్యాలు అభేద్యమైన ఒక నౌకాశ్రయాన్ని కడితే, బ్రిటన్‌పని బోనులోపడ్డ ఎలుకచందం కాకతప్పదు.

పైగా, స్పెయిన్ ఈదెబ్బలో ఫాసిస్టురాజ్యం కాకపోతే, త్వరలో తప్పకుండా బోల్షివిక్‌రాజ్యం అయితీరుతుంది. బ్లం సోషియలిస్టు కావడంవల్ల ఇప్పటికే యూరప్‌లో సోషియలిస్టు భావాలకు చాలా ప్రాబల్యంవచ్చింది. ఇప్పుడు స్పెయిన్‌కూడా రుష్యా, ఫ్రాన్సులతో కలిస్తే తమకు కొంతనష్టం వాటిల్లుతుంది,

ఈకారణంవల్లకూడా వారు జనరల్ ఫ్రాన్కోకు సహాయంచేసితీరాలి.

హిట్లర్, ముసోలినీలు చేస్తున్న సహాయంవల్లనే స్పెయిన్ విప్లవం ఈస్థితికివచ్చింది. కాకపోతే ఏనాడో సమసిపోయి వుండేది.

ఇక మూడవ ప్రశ్నకు వద్దాము.

స్పానిష్ ప్రజలకు తోటి మానవుడి నెత్తురు కళ్ల జూడడం ఒక పెద్ద విషయంకాదు. బలిసిన ఆబోతులతో వినోదార్థంపోరాడే జాతి అది! సి. జినరాజదాసగారు ఆ మధ్య చెప్పినట్టు క్రౌర్యం వారిరక్తంలో జీర్ణించిపోయింది. అంచేత వారు ఇంతటి ఘోరకృత్యాలకు దిగడంలో ఆశ్చర్యం ఏమీ లేదు.

పైగా, ఇప్పుడు ఉభయపక్షులవారుకూడా తమ ప్రాణమానవిత్తాలకోసం పోరాడుతున్నారు.

ఈ భీషణ సంఘర్షణలో పరాజయమందిన పక్షం సర్వనాశనం అయినదన్నమాటే! అంచేతనే ఉభయులుకూడ చావో, బ్రతుకో తేల్చుకోవాలని పోరాడుతున్నారు.

గమనించవలసిన మరొకవిషయం ఏమిటంటే— స్పానిష్చరిత్ర మొదటినుంచీ కూడా హత్యలతోనూ, చిత్రవధలతోనూ, అంతర్యుద్ధాలతోనూ నానాబీభత్సంగా వుంటూ వచ్చింది. అంచేత వారికి ఇది కొంతవరకు పరిపాటి అయిపోయింది.

విప్లవ దౌర్జన్యాలమాట యెలావున్నా, ప్రజాపక్షాన చాలమంది స్త్రీలు తమ పురుషులతోపాటు అతిధైర్యస్థైర్యాలతో రణరంగంలో నిలిచి పోరాడడం మహాశుభసూచకం. ఇంతవరకు స్పానిష్ స్త్రీ సాంఘికంగా చాలా నీచస్థితిలో వుంది. ఈ విప్లవ పర్యవసానం ఎలా తేలినా, ఇకముందు స్పానిష్ స్త్రీ గృహబానిసత్వాన్ని అంగీకరించడం మాత్రం కల్ల!

ఇక చివరి ప్రశ్నకు వస్తాను.

"చివరకు ఈవిప్లవం ఎలా పరిణమిస్తుంది?"

స్పెయిన్ సింహాసనానికి ఎవరు రావాలి అనే ప్రశ్న ౧౮౭౦ లో ఫ్రాంకో—ప్రష్యన్యుద్ధానికి కారణం అయింది. అలాగే ఈసారికూడా ఈ స్పానిష్ విప్లవం యూరపియన్ యుద్ధానికి దోహదంఅవుతుందా అనే భయం మొదటిలో కలిగింది. కాని, ఫ్రెంచివారు విప్లవవిషయమై తటస్థవైఖరిని అవలంబించడానికి చేసిన సూచనలు వివిధ యూరపియన్ రాజ్యాల ఆమోదాన్ని పొందినాయి. అంచేత ఇక ఈ భయానికి అవకాశం లేదు.

అయితే ఈఫ్రెంచి సూచనలు ఒకవిధంగాచాలా అన్యాయమైనవని చెప్పాలి. ఫ్రెంచివారు ఇటుస్పానిష్ విద్రోహులను, అటు స్పానిష్ప్రభుత్వాన్ని ఒకేవిధంగా చూడాలని ఒకసూత్రం చేశారు. ఈసూత్రంప్రకారమే ఉభయులకుకూడా ఆయుధముల ఎగుమతి చేయరాదనీ ధనసహాయంకూడదనీ, యేవేవోషరతులు పెట్టినారు. విద్రోహం చేస్తున్నవారిని, చట్టసమ్మతంగా ఏర్పడిన ప్రభుత్వంవారిని సమానంగా చూడడం తప్పు.

పైగా అంతర్జాతీయధర్మప్రకారం జర్మనీ ఇటలీ రాజ్యాలు స్పానిష్ విద్రోహులకు ఆయుధాలను, ధనాన్ని సప్లయి చెయ్యడం యుద్ధప్రక్రియగానే యెంచాలి. అమెరికా సంయుక్తరాష్ట్రాలలో పూర్వం అంతర్యుద్ధం వచ్చినప్పుడు బ్రిటన్ దక్షిణరాష్ట్రాలకు సహాయం చేసింది. అందుమీదట ఖండనమండనలుచాలాజరిగాయి. చివరకు 'బ్రిటన్ చేసిన పని తప్పు' అని నిర్ణయంఅయింది. ఇదేవిధంగా ఇప్పుడు జర్మనీ, ఇటలీలు తప్పుచేస్తూ వుంటే తక్కిన రాజ్యాలుచూచీచూడనట్లు నటించడం ఒకతప్పు. పైగా విద్రోహులను ప్రభుత్వపక్షంవారిని ఒక్కతాయాలో పెట్టడం రెండోతప్పు.

ఫ్రెంచి ప్రజలు స్పానిష్ప్రభుత్వము తరఫున చాలా సానుభూతిని చూపుతున్నారు. చాలమంది వారి పక్షాన పోరాడడానికి వాలంటీర్లుగా వెడుతున్నారు. ధనసహాయంకూడా విశేషంగా జరుగుతున్నది. ఫ్రెంచి ప్రభుత్వానికికూడా సానుభూతి ఎంతోవున్నది. అయితే తాము బహిరంగంగా సహాయంచేస్తే హిట్లర్, ముసోలి

నీలు ఎక్కడ కొంపముంచుతారో అని భయం. అం చేత అన్యాయమని తెలిసీ కూడా తటస్థవిధానాన్ని తయారుచేశారు.

ఈవిప్లవంలో విద్రోహులు జయమందితే (న్యూ స్టేట్సుమన్ అండ్ నేషన్ పత్రిక వ్రాసినట్టు) మహా దారుణమైన చిత్రవధలు జరుగుతాయి. స్త్రీలు, శిసువులు, వృద్ధులు అనేభేదం అయినాలేకుండా అందరూ కూడా కత్తికి ఎరఅవుతారు. ప్రజాబాహుళ్యం కల కాలం దాస్యశృంఖలాబద్ధు లైపోతారు.

దారిద్ర్యదేవత,మరణదేవత దేశంలో తాండవం ఆడతాయి. శాంతికీ, సౌఖ్యానికీ, ఆనందానికీ స్పానిష్‌ప్రజలు ఆ జన్మాంతం దూరం అయిపోతారు. యూరప్ ఫేసిజం వెల్లువ ముంచివేస్తుంది! ఎప్పుడు వచ్చి పడుతుందో అని మానవప్రపంచం అంతా భయభ్రాంతం అవుతున్న మహా సంగ్రామం త్వరలోనే సంభవిస్తుంది!! దానితో యుగయుగ సంచితమైన ఈవిజ్ఞానం, ఈసభ్యత నాశనం అయిపోతాయి!!

ఇక, స్పానిష్ ప్రభుత్వమువారే విజయలాభాన్ని పొందితే, ప్రపంచానికి ఇంతలో ఈఫేసిజం విజృంభణ భయం, ఈమహాసంగ్రామ భయం తప్పడమే కాకుండా, స్పెయిన్ సర్వతోముఖాభివృద్ధి గాంచడానికే స్పానిష్ ప్రజలు పరితృప్తులుగానూ, ప్రమోదంగానూ బ్రదకడానికే అవకాశం ఏర్పడుతుంది!

(౫-౯-౩౬)

ఈ వ్యాసాన్ని వ్రాసి పూర్తిచేసిన తర్వాత స్పెయిన్‌విప్లవ పరిస్థితులలో ఎక్కువగా ఎన్నదగిన మార్పులు ఏవీ జరగలేదు. సెప్టెంబర్ ౫ వ తేది నాడు ఎలావుందో, అలాగేఈనాడుకూడా స్పెయినుభవిష్యత్తు సందిగ్ధంగా వుంది.

పోతే, ఈలోపుగా జరిగిన కొన్ని స్వల్పమైన మార్పులు ఏమిటంటే, ఒకటి రెండు ప్రదేశాలలో విప్లవకారులు విజయలాభాన్ని పొందారు; అంతకుపూర్వం అధికారంలోవున్న మంత్రివర్గం రాజీనామా ఇచ్చింది. దానిస్థానంలో పూర్తిఅయిన సోషియలిస్టు మంత్రివర్గం పదవికి వచ్చింది. జర్మనీ, ఇటలీ పోర్చుగల్ రాజ్యాలు విద్రోహసేనాపతులకు రహస్య సహాయం చేస్తున్నమాట మరింత ఖాయపడింది. ఇంతకు వినా, ఆనాటికీ ఈనాటికీ స్పెయినుపరిస్థితులలో గొప్ప మార్పుకనబడదు.

(౨౪-౯-౩౬)



# నానాదేశ స్త్రీలు

ఆపస్తంబ

## మలనేషియా

(చైత్రమాస భారతియందలి)

న్యూహిబ్రడీసుదీవులలో పురుషుడు తనభార్య చిన్నదైనయెడల నామెకు సహాయార్థము ఒకవయసుచెల్లిన వితంతువును వివాహమాడును. ఒకడు చనిపోయినయెడల వానిభార్య భర్తవంకవారికి కుటుంబాస్తిగ గణింపబడను. ఆమె తనభర్త యొక్క సహోదరునికిగాని, వాని కుమారునికి గాని భార్య కావలెను. ఈ పద్ధతివలన ఒకనికే యనేకభార్యలేర్పడుట తటస్థించుటకలదు. కాని అట్లు సంక్రమించినవారినందఱిని వివాహమాడక ఒకరిద్దరినిమాత్రమే చేపట్టును. ఒక్కొక్కప్పుడు పురుషుడు ధనికుడైనయెడల ఇష్టము వచ్చినప్పుడంతయు యౌవనవతియగు మఱియొక స్త్రీని వివాహమాడుటయు, మొదటిభార్య యాత్మహత్యగావించుకొనుటయు సంభవించును.

న్యూబ్రిటనులో ఒకడు రెండవభార్యను తెచ్చుకొనినయెడల ఆమెవచ్చిన రెండవరోజున సవతులిరువురును పదిమందియెదుట పోట్లాడుదురు. ఇది యొక వేడుకగొలుపు నాచారము. పోట్లాడుటకు బదులుగా నిద్దరును, ఎఱ్ఱనిరంగును ఒంటినిండ పూసికొని సముద్రపు దరికి పోయి ఒకరినొకరు సముద్రములో త్రోసికొన ప్రయత్నింతురు.

ఇట్టి చర్యలవలన వారికిద్దరకును, మున్ముందు ఏలాటిస్పర్ధలు లేక యుండగలరని వారి నమ్మకము.

మలనేషియాలో సాధారణముగా వ్యభిచారము తీక్ష్ణదండనకు కారణమగును. వివాహమునకు పూర్వము వ్యభిచరించినయెడల మరణదండన విధింపబడును. వివాహము నిశ్చయమయినతర్వాత కన్యలను బహు జాగ్రత్తగా కనిపెట్టియుందురు. దుర్నడవడికగల కన్యలకు విలువ తక్కువయగును.



గొప్పకుటుంబమునకు జేరిన ఫిజీ స్త్రీ.

సాలమను దీవులలో కొన్నిచోట్ల మాత్రము కన్య ఎంత ఎక్కువమంది పురుషుల నాదరించిన నంత గొప్పగా నెంచబడును. పురుషులలో నెవడైననొకడు తన్ను భార్యగా వరించినయెడల వానిని వివాహమాడి సుఖముగా నుండును. మొత్తమునకు ఇట్టి నడవడిగల స్త్రీలకుగాని, వారికుటుంబములకుగాని గౌరవము తక్కువగానే యుండును.

న్యూ బ్రిటనులో స్త్రీ వ్యభిచరించినయెడల నామెను బల్లెముతో పొడిచిచంపుదురు. దొరకిన యెడల నా పురుషునిగూడ నలియగొట్టి వాని మెడను మెల్లిద్రిప్పి విడుతురు. వాడు తర్వాత కొన్నిరోజులవరకు బాధ ననుభవించి చనిపోవును. ఈ దీవియందే యుత్తర తీరవాసులలో వ్యభిచరించిన స్త్రీకి శిక్షలేదు. పురుషునికి మాత్రము శిక్షకలదు. వాడు తన దుష్కార్యమునకు అపరాధకానుక నిచ్చుకొనవలసియుండును. కానుక నివ్వనియెడల వానియింటిని దగులబెట్టుదురు. ఒక్కొక్కప్పుడు ఇరుగుపొరుగు



ఫిజీద్వీపబాలిక. వివాహమునకు పూర్వము జడను దువ్వుకొనురీతి

వారు వానిని బలవంతపెట్టి కానుకను చెల్లింప జేయుటకని, వారియిండ్లకుగూడ నిప్పంటించ జూతురు. ఇదియు సాధ్యముకానియెడల నేరస్థుని బంధువులపై కసిదీసికొన జూతురు. కడకు వీరిలో నెవ్వరైనసరి, కానుకనిచ్చినయెడల అపరాధి క్షేమముగానుండగలడు.

సాలమను దీవులలోగూడ వ్యభిచరించిన స్త్రీని జంపుదురు. లేదా, యొకచెట్టునకుగట్టి దారినిపోవు ప్రతివాడును ఒకబాణము నామెపై వేసి పోవును. అప్పటికిని చావనియెడల నామె నేరస్థురాలుకాదని తీర్మానించబడి విడుదలచేయుబడును. భార్యాభర్తలిరువురిలో నెవరికిష్టములేకున్నను వివాహబంధమును వీడుకొనవచ్చును. భర్తవిషయమున నిది సులభతరము.

భార్యను కాజాడినయెడల నామె పుట్టింటికి పోవచ్చును. అపుడామెభర్త ముందు వివాహకాలమున తానొసగిన శుల్కధనమును మరల కోరినయెడల దానినిచ్చి వేయవలసియుండును. అట్టి స్త్రీ పునర్వివాహము చేసుకొనవచ్చును. ప్రథమవివాహమయినతర్వాత ఎంతకాలము భార్య భర్తతో కాపురము చేసియుండునో దానికి తగినట్లు తిరుగు చెల్లించవలసిన శుల్కధనము తగ్గును. ఏలయనగా నామె ఈ కాలమున భర్తకై పాటుపడియుండును. సాధారణముగా భార్యాభర్తలకుగల విరోధమును పోగొట్టుటకన్ని ప్రయత్నములును జరిగి విఫలమైన తర్వాతనే వారు వేరుగా పోవుదురు. ఒకానొక పురుషుడు తనభార్యను మరియొకని కిచ్చి తాను తొలుతనిచ్చిన శుల్కధనమును వానివద్దనుండి తీసికొనుటయు అరుదుగా జరుగుటకలదు.

సాలమను దీవులలో భర్తయందు మిగుల అనురాగముగల స్త్రీ భర్తమరణానంతరము ప్రాణత్యాగము చేసికొనును. న్యూ హిబ్రిడీసులో భర్త మరణించగనే అతనికి పరలోకమున తోడగుటకు భార్యను చంపుదురు. భర్త మరణించిన యుత్తరక్షణముననే భార్యనుగూడ పంపనియెడల వారియాత్మలు వేరుపడునేమోయని వారిసంశయము. ఇట్టి విధవలను చంపుటకై యొకకుల్లాయికలదు. ఇది సాలీడు గూడుతో చేయబడును. భర్తమరణించగనే చావున కిచ్చగించనిస్త్రీ భర్తయందనురాగములేనిదను అపవాదమునకు గురి

యగుదను కాన, మరణమే మేలని యెంచును. ఫిజీదీవులలో స్త్రీలను భర్తలవెంట పరలోకమునకు పంపుట యావశ్యకమనుట కొక కథగలదు. వివాహము చేసికొన్ననే పురుషుడు ఇహలోకమున గౌరవపాత్రుడు కాజాలడు. పరలోకమునకు పోవుమార్గమున నొకచెట్టు కలదట. వాడు ఆచెట్టును సమీపించగనే తనస్నేహితులు తనకిచ్చి పంపిన తిమింగిలపువంటిని చెట్టుపై విసరివేయవలెను. ఆతనివెంట నొకస్త్రీయాత్మ రానియెడల గురితప్పి ఆ చెట్టునకు తగులనేరదట. గురితప్పకున్న వాడు సంతోషియై పరలోకమునకు పోగలడు. గురితప్పిన, పిశాచమై, "నేను నాతండ్రిని ప్రీతితో పోషించలేదా, స్నేహితులకు సహాయము చేసినవాడనుగానా, ఏల నాస్నేహితులు నా భార్యను నావెంట పంపలేదు.'' అని దుఃఖించుచుపోవునట. పోనుపోను మార్గమున నొక భయంకరమగు మార్గరక్షకభూత ముండునట. ఈ భూతమునకు బ్రహ్మచారినిగన్న ద్వేషమట. స్త్రీయాత్మకూడరానివారందఱును బ్రహ్మచారులని దానితీర్పు. కాన అది, స్త్రీ లేక వచ్చు పురుషుని పట్టుకొని ఒకరాతికేసి కొట్టునట. స్త్రీతోకూడవచ్చు వానిని నిరాటంకముగ పోనిచ్చునట. పురుషుడు లేకవచ్చు స్త్రీగతియు నింతే. పురుషునికన్న ముందుమరణించు స్త్రీతోగూడ పురుషుడు పోనక్కరలేదు. కాని, అట్టిస్త్రీ వివాహితయనుటకు పురుషుని గడ్డమునందలి వెండ్రుకలను కొంత దీసికొనిపోయిన చాలును.

'మలెకులా' దీవియందు వితంతువులు పునర్వివాహము చేసికొనువఱకు భర్తల గోరీలపై నిద్రించుచుందురు.

ఇచ్చట ముసలి మగవారిని చంపుట యాక్షేపణకరముకాదు వారిని గొంతుపిసికిగాని, పాతిపెట్టిగాని చంపుదురు. ముసలివారే దీనికి సంతోషముతో నొప్పుకొందురు. ముసలిస్త్రీలను మాత్రము చిన్నవారికి బుద్ధుల గఱపుటకై బ్రతికియుండనిత్తురు.

న్యూకెలడోనియాలో వితంతువు ఒక అందమైన గంపయందు తనభర్తయొక్క కపాలపు టెముకను ఎల్లప్పుడును తనవెంట దీసికొనిపోవుచుండును. అప్పరితో ఎర్రని విత్తనములను,



ఫిజీదేశములో అవివాహితురాలైన స్త్రీ. చేపలను పట్టుటకు పోవుచున్నది.

సువాసనగల యొకచెట్టుపాలనుగూడ దీసికొనిపోవుట వాడుక.

### కుటుంబమున స్త్రీస్థితి

మలనేసియాలో స్త్రీలేయెక్కువ పాటుపడవలసినవారు. పురుషులకు శత్రువులతో పోరాడుటయు, స్వగృహరక్షణమును ముఖ్యవిధి. స్త్రీలకు గృహకృత్యముల నిర్వర్తించుట, పురుషులకు సౌకర్యములను గలుగజేయుట ఇవి వారిలోగల కర్మబాధ్యత.

అనాగరికులలో ఒకరితోనొకరుగాని, ఒక జాతితో ఒకజాతిగాని నిరంతరాయముగ పోట్లా

డుచుండవలసిన పరిస్థితులే సర్వసామాన్యముగ పరిగణించబడుచు వచ్చుచుండుటవలన పురుషులెల్లప్పుడును యుద్ధసన్నద్ధులై యుండవలసియుండి గృహకృత్యములందు పాల్గొనుట కవకాశములేనివారై యున్నారు. అందువలన గృహకృత్యముల నిర్వర్తించుట స్త్రీలవిధిగా నేర్పడియున్నది. ఒకవేళ పురుషులకు యుద్ధసన్నాహ విధి లేకుండుట తటస్థించినను, నాగరికులలోవలె వారు కుటుంబ పోషణార్థము పాటుపడక సోమరులై కాలముపుచ్చుచు, కుటుంబపోషణకు



సాలమన్ దీవులలో రూబియానా దేశబాలిక. గవ్వలతో కూర్చబడిన దండను ధరించియున్నది.

గాను పాటుపడు స్త్రీలకు సహాయభూతులుకాక యుండుట వాడుకయైనది. అందువలననే నాగరికులలోకన్న అనాగరికులలో స్త్రీలకు స్వాతంత్ర్యములేదను అపవాదున కవకాశము కలిగినది. కాని కొన్నివిషయములలో నాగరిక స్త్రీలకన్న అనాగరిక స్త్రీలకే యెక్కువ స్వాతంత్ర్యముకలదు. స్వాతంత్ర్యమెక్కువగాగల విషయములు మలనేషియాలో రెండుకలవు: (౧) తల్లివంక వారికి ఎక్కువ హక్కు, (౨) స్త్రీ పార్శ్వముననే ఆస్తిపాస్తులు సంక్రమించుట.

(1) తల్లివంకవారి హక్కు అనగా వంశక్రమము తల్లిపార్శ్వముననే గణింపబడుచుండుట. ఇందువలన తండ్రికన్నగూడ తల్లితోబుట్టువే (మేనమామ) బిడ్డలకు సన్నిహితుడు. వివాహానంతరముగూడ స్త్రీ తనతల్లి యాస్తికి హక్కుగలదై యుండును. ఆమె కుమారులకుగూడ నా యాస్తియందు హక్కుగలదు. తండ్రియాస్తి వానిసోదరియొక్క సంతానమునకు చేరును. తండ్రిస్వార్జితమున కొంతభాగమును తనబిడ్డల కివ్వనచ్చును గాని, వానియాస్తియందు గల మొదటిహక్కు వాని సోదరిబిడ్డలదే. కొన్నిచోట్ల కుమారులతోబాటు కుమార్తెలకుగూడ భాగము గలదు.

మానవజాతియందు వాడుకలు, ఆచారములు, హక్కులు ఇత్యాదులు పరిసరములను (Environmnts)e బట్టియు, జాతిని (Race) బట్టియు, కాలములేక యుగమును (Epcch) బట్టియు, ఏర్పడుటగాని . మారుటగాని సంభవించును. ఈ మూడువిషయముల బట్టి చూచినయెడల న్యూకెలడోనియాలోని పరిస్థితులు మిక్కిలి క్లిష్టములైయున్నవి. అందు పెంపుడుమృగములుగాని, యడవిమృగములుగాని లేవు. ప్రయోజనకారులగు వృక్షములును మృగ్యములు. అతికష్టముమీదగాని భూమిలో నేమియు పండజాలదు. ఇట్టిదేశములో పైరు పండించుటకుగాను కష్టపడవలసినవారు స్త్రీలే యయియున్నారు. పురుషులు సుఖముగ నీడలుపెంచుకొని తలలుదువ్వుకొనుటయందును, ఇతరమైనన్నికైసేతలయందును తత్పరులైయుండ! స్త్రీలు ముందిత్తలై యావత్కాలమును పొలములలో పాటుపడి వాడివత్తలై యుండవలసిన వారైయున్నారు. వారు భారవాహకమృగములవలె జూడబడుదురు. దీనిఫలితమేమన నిట్టిస్త్రీలకు గలుగు సంతానము బలహీనమయి అల్పాయుష్కమయి యుండక తప్పనిదగుచున్నది. మగవారిలో ౩౦ సంవత్సరములు బ్రతికినయెడల నది బహువింత

విషయము. స్త్రీలు ఇరువదేండ్లప్రాయముననే ఏబదేండ్లవారుగ నగుపడుదురు. కాని యిట్టి విపరీతపరిస్థితులకు కేవలము పురుషుల నిందించిన లాభములేదు. ఏలనన ఏదైనకష్టములువచ్చిన యెడల బలహీనులే యాకష్టముల భరించవలసినవారుగ నేర్పడుట లోకసహజము. అటులనే న్యూకెలడోనియాలోని క్లిష్టపరిస్థితులలో కష్టముల ననుభవించవలసినవారు అబలలగు స్త్రీలే యయిరి. ఇన్నికష్టములలోను కొన్నియనుకూలాంశములు వారికి లేకపోలేదు. వివాహవిషయమున స్త్రీలు స్వతంత్రులు. వారియిష్టానుసారముగ పురుషులతో ప్రవర్తించుకొనవచ్చును. స్వయంవరము ఇచ్చటి యాచారము. ప్రతిసంవత్సరమునను జరుగు పంటసంబంధమగు పండుగులలోను, ఉత్సవములలోను స్త్రీలకు ప్రధానస్థానము కలదు. స్త్రీలు చేయవలసినపనిలో పురుషులు వారికి సహాయపడుట యనునది యచ్చటిస్త్రీల సామర్థ్యమునకు న్యూనతదెచ్చునదను నభిప్రాయము ఇచ్చటివారికి కలదు.

బిస్మార్కుద్వీప సముదాయమునగల న్యూహానోవరు (New Hanover) ద్వీపము చిన్నదైనను జలసమృద్ధిగలిగి సారవంతమయి యున్నది. ఇచ్చటి పురుషులు ఏకభార్యావ్రతులు. వారిలో భార్యలకు విశేషాధికారముకలదు. బేరములందు స్త్రీలయనుమతిలేక పురుషులు వస్తువులను విక్రయించగూడదు.

న్యూ ఐర్లాండునందు భూమి యంత సారవంతముకాకయు, జలవసతి తక్కువగను నుండును. అందువలన పొలములలో పనిచేయు బాధ్యతగల స్త్రీలకు కష్టమెక్కువ. ఈదేశమున భార్యలపై భర్తల కధికారము మెండు. వివాహానంతరము భార్యపైగల సర్వాధికారము భర్తదికాన, భర్త తనభార్యను చంపినను ఆమె బంధువులకేజోక్యమును కలుగజేసికొను నధికారము లేదు. న్యూబ్రిటనులో స్త్రీలకు గొప్పగౌరవస్థానముకలదు. ఇక్కినదీవులలో లేని గౌరవము వీరి కిచ్చటగలదు. పురుషులు వ్యాపారముచేయ నిచ్చగలవారుకాన తామును స్త్రీలతోబాటు పాటుపడుచుందురు. భర్తకేయధికారమును లేక స్త్రీ తన కష్టార్జితమును చేర్చిపెట్టుకొని ధనికురాలు కావచ్చును. కాని యందువలన భార్య కొంతకష్ట



న్యూకెలడోనియా స్త్రీ.

మునకు గురియగును. భర్త భార్యసొత్తును కృత్రిమమార్గమున గొనజూచి యామెపై యపవాదమునుమోపి యామె కాగ్రహమువచ్చునట్లు చేయును. అందుపై యామె తన్ను దూషించినయెడల న్యాయవిచారణమొకటి యేర్పఱచును. తన భార్యపై నేరమును స్థిరపఱుపగలిగినయెడల యామె మానసనష్టపరిహారముగ తనధనములోగాని, యాస్తిలోగాని కొంత భర్తకిచ్చి తప్పించుకొనవలసివచ్చును. నిష్కారణముగ భార్యసొత్తును భర్తతీసికొనుట కధికారములేదు. భర్త భార్యపై మోపు నింద నిజముకావచ్చును, కాకపోవచ్చును. కాని భర్త తనయెడల నేకారణమున్ననైన దౌష్ట్యము చూపగల డను భయమువలన కొంతధనము వానికిచ్చి సుఖముగానుండ యత్నిం

చును. ఎట్లయినను ఆస్తుల గడించుటకును, వాటి క్రయవిక్రయములను స్వతంత్రముగా జేసికొనుటకును స్త్రీ కధికారము కలదు.

సాలమన్ దీవులలో నిట్లు కాక స్త్రీలు కష్టజీవులయ్యు స్వాతంత్ర్యరహితలు. ఇందు జనులు పరస్పరము వేటాడుకొనుచుందురు. ఇచ్చటి ప్రభుత్వము బలహీనమయియుండుట యిందుకు కారణము.

బోగైన్ విల్లెజలసంధిదీవులలో ,గోరాయ్ అనువాని పాలనమున జనులు కట్టుబాట్లకు లోబడియుండుటయేగాక స్త్రీలను గౌరవముతో చూచుట యేర్పడెను. గోరాయ్‌కి ౮౦-౧౦౦ భార్యలు కలరట. కాని వారినందరను కరుణతోను, గౌరవముతోను చూచుచుండుటయేగాక వారికి కొన్ని యధికారములుగూడ నిచ్చియున్నాడు. వానిభార్య లెవరును పొలములలో పనిచేయు నవసరములేదు. వారు భర్తకు సహచారిణులే కాని, బానిసలుకారు. అనేకమైన చేతిపనులలో కుశలులైన వారు తమ భర్త యింట నుండు తరుణమున వాని కానందము నొడగూర్చుచుందురు. వారిలో కొందఱు పొలములలో పనిచేయువారినైన తనిఖీచేయునధికారము కలిగియున్నారు. భర్త స్వయముగా పనిచేయ బూనుకొన్ననే భార్యలును వానితో పనిచేయ బూనుకొందురు. తీరుబడియున్నగాని నాగరికతాభివృద్ధి కవకాశము కలుగదు. సాలమన్ దీవులలోని స్త్రీలు చేతిపనులలో నిపుణులు. చెట్లపట్టతో వస్త్రముల జేసికొందురు. గడ్డిపోచలతోను, టెంకాయనారతోను, అరటియాకులతోను అల్లి, బుట్టలు, చాపలు, వస్త్రములు, తడకలు, మెడలకును, నడుములకును దట్టీలు మొదలగువాటిని చేయుదురు. ఇచ్చటి స్త్రీలు చేయు పూసలపనులు ప్రశస్తములు గాన వాటివలన విశేషధనమును సంపాదించుకొందురు.

సాలమన్ దీవులలోను, లాయల్టీ దీవులలోను, స్త్రీలకు, అందును వృద్ధస్త్రీలకు మాట చెల్లుబడి యెక్కువ. వృద్ధస్త్రీలకు మంత్రములు తెలియు నను నమ్మకమువలన వారినిజూచిన నందఱును భయపడుదురు. ఒకవృద్ధస్త్రీ యెవనినేని 'బిడ్డా'యని పిలచినయెడల నతని కేయాపదయు రానీయక తనబిడ్డవలెనే భావించి కాపాడును.

ఈ జాతులవారితో నేపన్నైనను కొనసాగించుకొనవలెనన్న వారిలోని వృద్ధస్త్రీలకు కానుకల నిచ్చి సంతృప్తిపఱచిన నది చాలును. వారే మన పనిని చక్కచేయగలరు. ఒకస్త్రీపై నిష్కారణముగ నపనిందమోపబడినయెడల అదికారణముగా రెండు తెగలవారికి గొప్పపోరాటము కలుగుట కలదు.

న్యూ హిబ్రిడీసులోని శీతోష్ణస్థితి అనారోగ్యకరమయినది. ఎప్పుడును జ్వరభయమును, జ్వరబాధయు ఎక్కువ. ఇచ్చటి స్త్రీలస్థితి మిక్కిలి క్లిష్టమయినది. వారు బానిసలకన్న నీచముగ జూడబడుదురు. అన్నిపనులునుస్త్రీలేచేయవలెను. పురుషులకు చేపలఁబట్టుట ముఖ్యమగు వృత్తి. పురుషులు చేపలబట్టునపుడు, స్త్రీలె వారిపడవలను, దోనెలను నడుపవలెను. ఎప్పుడును, ఎక్కువభారమును మోయుటవలన స్త్రీలు సాధారణముగా గూనుకలవారై వికారస్వరూపులయియుందురు. వారికి సుఖమనునదిలేదు. ఆనందమనునది లేదు. అంబ్రీముదీవిలోని పరిస్థితులు ఇంకను చిత్రమయినవి. అచ్చటి పురుషులలో పదితరగతులుకలవు. అందు కడపటితరగతి 'బెరాంగ్' అనునది. కొన్ని పందుల నిచ్చిననేగాని ఈ తరగతిలో చేర్చుకొనబడరు. దీని నుండి పైతరగతులకు పోవలెనన్న గొప్పగొప కానుకల నిచ్చినగాని యది సాధ్యముకాదు. అన్ని

టిలోను గొప్పతరగతి 'మాల్' అనునది. ఈ తరగతికి చేరగలిగినయెడల నదియే పురుషునికి దేవేంద్రపదవి లభించినట్లు. ఇట్టిపదవులు మనదేశములోని రావుసాహేబు, రావుబహాదూరు ఇత్యాదులవంటివి. పురుషులందుగల యీ తరగతులను జూచుకొని స్త్రీలును తమలో ఎనిమిదితరగతులను ఏర్పరచుకొనియున్నారు. ఇందలి తక్కువతరగతి బేరంగ్-వీర్ (Berang-vir) అనబడును. క్రమముగా ఎనిమిదవ యంతస్తును చేరిన స్త్రీ, పురుషులలో కడపటియంతస్తున నుండువానికి సమానురాలుగా నెంచబడును.



ఒకానొక ఫిజీదేశ స్త్రీ. తలవెండ్రుకల కొనలందు కుచ్చులుగా నేర్పాటు చేసికొనును. యొకవిధమగు కైసేత.

ఈ దీవిలో పురుషుని జూడగనే స్త్రీ మోకరించి వానిని దాటిపోవువఱకు దోగాడుచుపోవలెను. ఈ ద్వీపసమూహములన్నింటిలోను ఫిజీద్వీపవాసులుమాత్రమే మిక్కిలి నాగరికతగలవారని చెప్పవచ్చును. ఫిజీదీవులు జలవసతిగల్గినవై యడవులతోనిండి సారవంతములై, ఆరోగ్యవంతములై, సస్యసమృద్ధిగల్గినవై యున్నవి. వీరు ఆచారములందును, రూపమునందును, భాషయందును మఱొకజాతివారగు పాలినేషియాదీవులవారిని బోలియుందురు. ఇందలి పలుతెగలునువాటివాటియధిపతుల సత్పరిపాలనకులోనై నాగరికతగల్గినవై యున్నవి. ఇచ్చటిస్వకీయపరిపాలనాపద్ధతులవలన జనులు సోమరులుకాక పాటుపడనిచ్ఛకలవారై యున్నారు. గొప్పవారిలో స్త్రీలకత్యున్నతస్థానము కలదు. అధిపతులు తమ స్త్రీలను గౌరవముతో జూచుచుందురు. స్త్రీలకు కష్టము గలుగజేయునెడల నాజాతికంతకును కష్టములును, తలవంపులును కలుగగలవను నమ్మకముగల యీ ఫిజీవాసులు తమభార్యలకే కాక సేవకస్త్రీలకును గౌరవము జూపుదురు. క్లిష్టపరిస్థితులుగల చోటులలో మాత్రము స్త్రీలకు కష్టమెక్కువ. ఇట్టిచోట్ల భారముల మోయుపనియుండిన నది స్త్రీలపనియగును. కొన్నిచోట్ల స్త్రీలు పొలములకు పోవుటయే యరుదు. గొప్పకుటుంబమునకు జేరినస్త్రీలు మిక్కిలి నాగరికులై యుందురు. నాగరికతలేని ఫిజీస్త్రీకిని, నాగరికతగల స్త్రీకిని అజగజాంతరము. ఫిజీస్త్రీలు నృత్యమునందు నిపుణులు. వారినృత్యము వింతగనుండును. ఫిజీయులు చట్టములకు బద్ధులుగా నుండగోరువారు. ప్రతివిషయమును న్యాయశాలలలోను, చట్టసభలలోను నిర్ణయింపబడుటవలన జనులు న్యాయబద్ధులుగానుందురు. ఒకశుభకార్యవిషయము దీసికొనినదానికి జేరినవారు సభగూడి యాకార్యమున నిచ్చిపుచ్చుకొనవలసిన వస్తువులును, వాటిపరి

మితియును వారిచే నిర్ణయింపబడును. తర్వాత అదేరీతిగ నందరును నడచుకొన బద్ధులుగానుం దురు. వస్తువుల పంపకమును గురించియు నిట్లే జరుగును. మనస్తాపములకు చోటి య్యరు.

మొత్తమున మలనేషియాద్వీపసమూహ ములలో స్త్రీలే జీవదాతలు. వారికష్టములే యా దీవులవారికి ప్రాణదాతలు. పొలములలో పాటుపడి పైరులపండించుటకేమి, ఫలసాయ ములను పొలములనుండి యిండ్లకు మోచికొని పోవుటకేమి, అంగళ్లలో బేరసారముల జేయు టకేమి, ఆహార సంగ్రహణమునకేమి, పచనము నకేమి అంతటికిని స్త్రీయే యాధారము. గృహ ములలో కావలసిన సామగ్రులనుగూడ స్త్రీయే తయారుచేసికొనవలెను. ఇన్నిపాట్లుపడు స్త్రీజా తియొక్క యోరిమి ప్రశంసనీయము.



సూర్యనమస్కారము D. A R

# నానాదేశ సందర్శనము

'గ్రహ' వీక్షణము

౧. స్పెయిను:

ఇండియాకు గోమాత యెట్లో అట్లు ఒక్కొక్క దేశమునకును ఒక్కొక్క జాతీయ జంతువు సంప్రదాయసిద్ధముగ నేర్పడియున్నట్లు తెలియుచున్నది. బ్రిటనుకు సింహము; రష్యాకు భల్లూకము; ఫ్రాన్సుకు కోడిపుంజు. ఇక ప్రస్తుతము ప్రపంచదృష్టికి కేంద్రమయిన స్పెయినుకు అట్టిది వృషభమట!

స్పెయినుదేశస్థులు వినోదార్థము వృషభములను చంపుదురు, నిజమే. కాని దానికేమి? ఇంగ్లీషువారుకూడ సింహములను వేటాడుదురు. గుండెలలో కత్తి గుచ్చుకొని, మోకరిల్లి, అసువులను బాయు వృషభము మంచిచావు చచ్చినదన్నమాట. మహావిజృంభణముతో నుండి చచ్చినచో మరింతగొప్ప. వృషభోత్సర్జన శాలలలో ప్రేక్షకులు అట్టి విజృంభణమునకు వృషభములను రేకొట్టుచుందురు.

ఈసాహచర్య సంపదవల్లనే కాబోలు, స్పెయినుదేశస్థులకు వృషభలక్షణములు కొంతకుకొంత పట్టువడియున్నవి. ఎఱ్ఱగుడ్డ జూచినచో చాలును, వారు బెదురుకొని నిలుపున లేతురు. ఉద్రేకము, ఆవేశము వారి సహజగుణములు.

ఫ్రెంచివారికన్నను, ఇటాలియనులకన్నను వారు బలాఢ్యులు; కాని బుద్ధిచురుకుమాత్రము తక్కువ. తమసోదరలాటినులతో పోల్చిచూచినను వారిది వెనుకముగ్గే. బద్ధకము వారికి హెచ్చు.

స్పెయినుదేశస్థులలో దైన్యము సదా తొణికిసలాడుచుండును. వారిని నవ్వు మొగములతో చూచుట అసంభవము. వీధిని బోవుచు పరిహాసమునకు ఒకపిల్లడి వెంట్రుకలు లాగినను, వానితో తమాషాగా మాట్లాడి నను ఏమో మునిగిపోయినట్లు వాడు వీనిని తీక్ష్ణముగా జూచును.

నడువేసవిలోకూడ వారు నల్లనిదుస్తులనే వేసుకొందురు. అది ఆజాతిలక్షణము. ఇంగ్లీషుయాత్రికులను వారు వారి ట్వీడుదుస్తులకు అసహ్యించుకొందురు. వారికి మర్యాద కొరవయందురు.

జాత్యభివృద్ధిలోకూడ వారిది వెనుకంజయే. ఆ మాటయే వారు తలపెట్టరు. ఇతరదేశ వ్యవహారములలో కూడ వారి కభిరుచి పూజ్యము.

వారికిని ఒకప్పుడు రోజులు బాగుండినవి. కొంత రాజ్యమును క్రొత్తగ సంపాదించియు అయినది; పోగొట్టుకొనియు అయినది. దక్షిణ, మధ్య అమెరికాలలో చాలభాగము వారి యాక్రమణకు పాలయినది నేడు వారిపట్టు తప్పిపోయినది.

స్పెయినులో వ్యవహారములు తక్కువయినను మర్యాదనడతలు విశేషము. అన్న, పాన, విహారములు జీవితములో ప్రధానాంశములు.

వంటసరంజాములోకూడ వారి కొక ప్రత్యేకత కలదు. తెల్ల బటాణీల చారుకు వారు నాలుక కోసుకొందురు. నల్లచేపలుకూడ చారులోవేయుట వారిలో కలదు. నల్లలు నల్లలుగావానిన ల్లైపాత్రలోవేసికొంచెము సే పుడికించినచో లోని ప్రాణులుడికి పైపెంకులు చిట్లిపోవును. ఆరసము ఎంతో రుచిగానుండునట. అన్నము వండుటలో వారు ప్రవీణులు. వారి ముఖ్యాహార పదార్థము బియ్యమే.

అతిథి అభ్యాగతులను ఆదరించుట వారికి పరమ ప్రీతి. రైళ్లలో ప్రయాణము చేయునప్పుడు తామేమయినను తినునప్పుడు తోడి ప్రయాణికులకు ఇవ్వనిదే

సుతరాము వీరు ఉండనొల్లరు. సారాయిమొదలగు పానీయముల ప్రసక్తిలోకూడ సీసా అయిదారుగురికోట బడి రావలసినదే. ఒంటిగా దారినడువ గూడదను సామెత వినియున్నాము. ఒంటిగా అన్నపానములు ముట్టరాదని వారిమతము. అది అన్నపానముల పుష్టిగల దేశము. అందువల్ల అక్కడ ప్రతివాడును దేహపుష్టి గలిగియుండును. బిచ్చగాండ్రుకూడ దేహపుష్టి తప్పియుండుట అక్కడ చూడము. ఇంత ఆహారసమృద్ధమైన దేశములోకూడ బిచ్చగాండ్రు పుట్టలుపుట్టలుగా నుండుట ఒకవిశేషముగా నున్నది. ఈ మధ్య నేర్పడియుండు కల్లోలములవలన వారుగూడ పనిపాటలకు పూనుకొనుచున్నారుగాని వారి వృత్తిని మాన్పుట అసాధ్యమేమో యనియే చెప్పవలసియున్నది. బిచ్చము వేయుట మహాపుణ్యకార్యమని, తమ పవిత్రధర్మమని తలంచు కాథలిక్కులు వీరికి దోహద మొసగుచున్నారు. ఫ్రెంచివారివలె స్పెయినుదేశస్థులును ఒళ్లువంచి పాటుపడ బూనుకొన్నచో నక్కడ బిచ్చగాండ్రపేరే ఉండ నవసరములేదు. కాని పరిశ్రమలవైపు, వ్యవహారముల వైపు వారికి అభిప్రాయమేలేదు. ఒకప్పుడు వారు ధనదాసులయి యుండిరి. కాని నేడు ఒకడును ధనమునకు ప్రాకులాడువాడే లేడు.

కాని, విద్యావంతులు, కులీనులమాట ఎట్లున్నను గ్రామీణులలోను, పాటకపుజనులలోను కొంత ఉత్సాహోద్యోగములు గోచరించుచునే యున్నవి. వారికన్న వీరు పలుమడుంగుల కార్యవ్యాపృతి చూపుచుందురు.

ఉత్తరమున బిల్బావులోను, దక్షిణమున బార్సిలానాలోను-అవి జాతి, ప్రకృతులలో పరస్పరము విశేష వ్యత్యాసము గలవేయైనను- ఆధునికమైన, సజీవమైన సంప్రదాయవ్యవహారములు దృగ్గోచరమగుచున్నవి.

టొలెడోనగరము స్పెయినుదేశముయొక్క నిర్వికారతను చాటు నొక శిలాస్తంభమై వెలయుచున్నది. అందు ఒక ప్రాచీనమైన కెతీడ్రల్ ఉన్నదే కాని మచ్చునకైన అందు ఒక్క సినిమాగాని, ఒక్కట్రాము బండిగాని లేవు.

౨. రష్యా:

రష్యావారివి పెద్ద తలలు. అందుల కనుకూలముగా వారి మెదళ్లుకూడ గొప్పవే. చదరంగములో ప్రపంచోన్నతి నందినతడు రష్యావాడు. జర్మనీలో కెల్ల చదరంగమున గొప్పదనమును సంపాదించినతడును రష్యావాడే. కాని వారివి ఉపయోగకరమయిన మెదళ్లు కావు.

మామూలు ఇంగ్లీషు యాంత్రిక నిపుణుడు చిన్న తలకాయయే కలిగియున్నప్పటికిని, పేర్కొనదగిన మెదడు కలిగియుండకపోయినప్పటికిని ఆకలిగినదేదో తనకును, తన సంఘమునకును ఉపయోగపడునట్టిదై యున్నది. రష్యావారికి జ్ఞాపకశక్తి యెక్కువ. విద్యార్జనయందు దాసక్తియు నెక్కువయే. కాని వా రాచరణశూన్యులు. ఎంతో నిపుణతతో ఎంతోమంది ఉత్తమ శ్రేణిలో వైద్యవిద్య నభ్యసించినవారు వారి లోకలరు. కాని గొప్ప వైద్యులుగ తయారయినవారు మాత్రము వ్రేళ్లకు. వారిలో ఎన్నో ఇంజనీయరు పరీక్షలయందు తేరినవారును కలరు. కాని మంచి ఇంజనీయర్లు మాత్రము లేరు. రాజకీయములందు కూడ వారు గొప్ప గొప్ప సిద్ధాంతముల నల్లగలరే కాని వాని నాచరణలోనుంచి నిర్వహించగల నేర్పు మాత్రము వారివద్ద లేదు. కాని రష్యావారు మంచి వాక్నైపుణి గలవారు. వారితో సంభాషణ మొక ఆనందము. వారు మంచి వ్రాతగాండ్రుకూడ.

రష్యావారివద్ద చైతన్య మెక్కువగా కలదు. పాశ్చాత్యులు అంతకన్న బలవంతులేయైనను రష్యావారి ముందు నీరసిల్లి పోవుదురు.

యూరపులోని తదితర దేశములవా రపేక్షించునంత నిద్ర వీరి కవసరములేదు. పడమట దేశము సజీవమయియున్న కాలములో ఏండ్ల తరబడి నిద్రించుచుండిన హేతువున కాబోలు వారి చైతన్యశక్తి పేరుకొని పోయియున్నది. నిద్రలేని రాత్రిళ్లు మనకు తోచినట్లు వారి కాయాసముగ తోచనే తోచవు. ఈ సౌకర్యము వారి యాచారవ్యవహారములందు పెక్కు అక్రమములకు కారణమైనది. ౨౪ గంటలసేపును వారు ఫాగ ద్రావు

చుండవచ్చును. దినమొక్కంటికి వరుసతప్పక అలవాటుగ ౨౦౦ సిగరెట్లు కాల్చువారుకూడ ఆదేశమున గలరు. కాని యేమాత్రము చెడుగును వారు అనుభవించుటలేదు, వ్రేళ్లుకొంచెము రూపరి పోయి నాలుకలు కొంచెము ముతుకపారియుండుటతప్ప.

ఇంటిలో అలవాట్లనుకూడ వారు మితిమించుచునేయుందురు. భోజనములో తాము తినకలిగినది తిని యింకను ఎక్కువతిందురు. సోవియటువారి ఆహార నియమనమువల్ల కొన్నియేండ్లుగా వారు ఆహారపరిమితిని అతిక్రమించలేకున్నారు గాని అన్నపానములందు ఇతర దేశములవారికన్న రష్యావారిదే పైచెయ్యి. వారితలల వలెనే వారి కడుపులుకూడ పెద్దవే. కాని సమయము వచ్చినచో వారు దట్టీలను బిగించి దినమున కరపౌను నల్లరొట్టెమీదనే కాలక్షేపము చేయగలుగుదురు.

ఇంగ్లండులోనున్నట్లు రష్యాలో గృహ మొక పవిత్రసంస్థగా భావింపబడుటలేదు. సంసారజీవితమున కక్కడ ఫ్రాన్సుజర్మనీలలోనున్న ప్రాముఖ్యమును లేదు. వివాహబంధములు విడివడిపోవునపుడు బిడ్డలకు మాత్రము సంరక్షణ కావలసియుండును.

రష్యాలో బిడ్డలు ప్రభుత్వమువారి సొత్తు. జననీజనకులు కేవలము జాగ్రత్తరుగానే. బాలబాలికలకు తక్కినదేశములందు కన్న అక్కడ స్వాతంత్ర్య మెక్కువ. అతి చిరుతవయస్సులోనే వారు రాజకీయసంఘములందు ప్రవేశించుచుందురు. కాని వారి పోషణ వ్యయభారము మాత్రమే తల్లిదండ్రులదే. అక్రమసంతతినిపోషించువ్యయమునకు తల్లిదండ్రులను నిర్బంధించునట్టి రష్యాకాకమరొక్కటి కనుపించుటలేదు.

అక్కడ గొప్పవారు, చిన్నవారు అను తరగతి విభేదమేలేదు. ఉన్నచో అది ఐశ్వర్యమువల్ల రావలసినదే. ఐశ్వర్యవంతులక్కడ లేనేలేరు. కోటీశ్వరులంతర్ధానమయిపోయినారు. మరల జన్మింపలేదు. అర్ధకోటీశ్వరులు, పాతికకోటీశ్వరులు, చివరకు సంవత్సరమునకు ౧౦ వేలు వచ్చువారుకూడ నేడు లేరు. అందరునక్కడ ఒక్కతరగతివారే.

రష్యాలో అందరును సామాన్యపు పాటకజనుల దుస్తులనే ధరించుచుందురు. ఎవరోకొందరుగాని హ్యాటులను వేసుకొనరు. వ్యవసాయదార్లకు అక్కడ మంచి ప్రోత్సాహము గలదు. సాముదాయిక వ్యవసాయశాలలెన్నియో ఆదేశమున నెలకొలుపబడినవి. కొత్త కొత్తపనిముట్లు అందు ప్రవేశపెట్టబడినవి.

రష్యావారికి ప్రాచీన సంప్రదాయముల మీద విశ్వాస మెక్కువ. యక్షిణీవిద్యను, దృష్టిదోషమునువగైరాలను వారు విశ్వసింతురు. వారికి చాదస్తములుమెండు.

స్థిరనిర్ణయము వారికి లేదు. ఇటీవలి వివాహవిధానములు ఈ విషయమునకు దృష్టాంతములుగా నున్నవి. ఒకడు ఒకానొకబాలికను ట్రాముబండిలో చూచును, వెంటనే వివాహమునకు నిశ్చయించుకొనుట జరిగిపోవును. తరువాతిట్రాము ఆపుదలలోనే వారిరువురును దిగి వివాహమగుదురు. తరువాత ఆకన్య 'సాయంకాలము మూడుగంటలకు మాతల్లిని, కుటుంబమును వచ్చి చూడు' డని చెప్పి వెళ్లిపోవును. ఆప్రకారమే ఆనూతనభర్త ఆయింటికి వెళ్లును. అక్కడ అపూర్వమైన సమ్మానమున కేర్పాట్లుజరిగి, ఎదురుకోలుకు పెక్కు యువతులు హాజరగుదురు. అందులో తనభార్య యెవరో ఇతను గుర్తుపట్టలేడు. ప్రమాదమున నెవరెవరినో కౌగిలించుకొనును. అలజడికలుగును. అతని నటతకు అతనిభార్య ఏవగించుకొనును. వెంటనే విడాకులకు ఏర్పాట్లు జరిగిపోవును.

రష్యావారికి యోచనాశక్తి విపరీతము. క్రొంగ్రొత్త భావప్రపంచమును రష్యా ప్రపంచమునకు ప్రసాదించుచుండును.

ఎంతమందినో మహామహులను ప్రసవించినదైనను రష్యా యూరపులో ఇంకను వెనుకకే తగ్గుచున్నది. నిత్యము వారికింకను 'రేపటికి మనకన్నము దొరకునా' యనియే యాలోచన.

---

# ఆంధ్రకేసరి ప్రకాశం

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

ప్రబోధనమును పడసి ప్రజ్ఞజూపగలవారు కొందఱు, దాని నందినను వెనుకంబడువారు కొందఱు, శిక్షకు మనసిచ్చువారు కొందఱు, ఈయని



శ్రీ టంగుటూరు ప్రకాశంగారు

వారు కొందఱు, ఒకరియుద్బోధన మందకున్నను వివిధ శక్తులను, భిన్నానుభవములను దమయందు నిహితమై యున్నశక్తులను లేపినపుడు ఎదుటితెరువున చరచర సాగిపోవువారు కొందఱు మానవులం దున్నారు. మనుష్యమానసమున నెన్నిరీతు లున్నవో! వీనిని గుర్తింపగలుగుట సామాన్యక్రియకాదు. వ్యక్తిగతమైన సహజశక్తి హృదయమున నుండును. అనుకూలస్పర్శ నందినపు డిది తలయెత్తును.

స్వీయమానసగ్రహనముపై కన్నువేయజాలు వాతడు ఆత్మశక్తి యెట్టిదో గ్రహించి, ఆత్మోన్నతి నందగలుగును. కనులు మూసికొని చూపులోపు నంతరంగములోని కెక్కుబెట్టి అంపలి మత్స్యయంత్రము గుర్తించుట విజయునకు కాగోరు వరుని కర్తవ్యము.

ఆత్మపరిశీలనమున కెంతేని అభ్యాస మవసరము. చెప్పినట్లువిను చూపుమాత్రమే పరిశీలనమునకు పనికివచ్చును. మానసముయొక్క సగము చూపునకు ప్రాపించును. చేపవలె నిలుకడలేక చలించును కావున మనసును మత్స్యయంత్ర మంటిమి. కన్నులవంటి చూడ్కి యన్నిదెసలకు దుముక గమకించును. పగ్గముచే చూపుగుఱ్ఱమును లోనికి మరలించువాతడు జితేంద్రియుడు.

చిత్తశక్తికతన ఆత్మపరిశీలన మలవడును. ద్వేషముగాని, అనురాగముగాని నిష్పాక్షికమైన విమర్శనమునకు, సత్యాన్వేషణమునకు చెఱుపు వచ్చునని కదా తర్కశాస్త్రము వాకొనుచున్నది. ఈ సూత్రము పరవిమర్శనమునకు మాత్రమేగాక ఆత్మవిమర్శనమునకుగూడ చెల్లును. తననుగూర్చి అధికముగగాని, అల్పముగగాని తలచువాతడు సత్యమునకు దూరస్థుడైయుండి తన కెంతేని చెఱుపుదెచ్చుకొనును. తాను ఘనుడనని యపోహపడువాడు సంతృప్తిపడిపోయి, చలనమెఱుగక, శిలావిగ్రహమై నిలుచును. తానల్పుడనని యూహించుకొనువాడు నిట్టూర్పులందు బ్రతుకీడ్చి, అంతరంగస్థశక్తిస్ఫులింగములను రవులుకొల్పుటకు మాఱు దానిపై నెంతేని నివురు చేరనిచ్చును. క్రమయత్నముకతన సత్యపరిశీలనము సాధ్యమగును. వాడికొలది కత్తివాడి యధికమగులీల, క్రమనిష్ఠకతన బుద్ధినిచూడ్కి వాడియగును. వాడిచూపు కెందును ఎదురగు.

ఆత్మపరిశీలన మలవడినంతన నాత్మజీవనమున మనుజుడు పథికుడుకావలెను. ఈతనిమార్గము కంటకభూయిష్ఠమె యుండును. ముళ్ళుపల్లములలో నిండియుండును. చెమ్మటలనేకాదు నెత్తురుచుక్కలను గూడ రాల్చి, ఈ పథికుడు తనయాత్రను సాగించవలెను. తలపై పిడుగు రాలుచున్నను, ఈతడు కిక్కురుమనరాదు. నగుమోముతో వేడినిప్పుల నరచేత బట్టితీరవలెను. అస్సురుస్సురులు, ఆర్తనాదములు ఈతని నపజయమున గూల్చివేయును! తన సేవలను లక్ష్యింపక, వానికి బలాదూరని, చిఱునవ్వుతో ముద్దిడుటకై ముందులకువచ్చు ప్రలోభములపై కన్నువేయక ఎత్తుకొండపై నెగబ్రాకు పథికుడు నిండుపండునట్లు తనయాశయమును పుడికి జీవనమును సార్థకమొనరించుకొనును. దిక్కులందు ప్రతిధ్వనులు లేపుచు ఘంటారవ మొనరించును! విజయభేరి మ్రోగించును! ఈతనితలపైజేరిన ఈతముండ్లు నాడు సుధావర్షముగురిపించు గులాబులగును! ఈతడోడ్చిన రక్తబిందువులు దేవవీరులకు కల్యాణతిలకములగును! తమకు నోజ్జబంతికాగలదని నిలింపు లీతని జీవనచరిత్రమును తమ పూజాపీఠములం దిడికొని వాడనిపూలతో, నారని దీపజ్యోతులతో దానినిబూజింతురు. మనుష్యులం దీతడు మనుష్యుడని యుగము లీతని పవిత్రజీవనముపై ముత్తెములను, నవలను చల్లును; వీని! పద్యముల నర్ఘ్యమిచ్చి, గీతాంజలి సమర్పించి, కోటికుంకులందు నక్షత్రప్రదీపములు నిలిపి వానితో వీనిపూర్ణజీవనమునకు నివాళియిచ్చును. వాల్మీకిదృష్టియందలి వీర్యవంతుడును, గుణవంతుడును, దృఢవ్రతుడును * ఈతడే!

ఆత్మపరిశీలనమునకు, అద్భుతయాత్రకు అంతరంగప్రోత్సాహ మవసరము. అదృష్టవంతుడగుచో, నొకమహావీరు డీ పథికుని కనులెదుటదోచి, తనప్రబోధమువలన, తనదృష్టాంతముకతన వీనియంతరంగస్థశక్తుల నొకమా టు కదపును! వానిపై సమిధలువేయును. అవుడవి ప్రజ్వలించును. అప్పటినుండి ఈ యదృష్టవంతుడు ఆత్మపరిశీలనము సాగించుచు, జెండాబూని గమ్యస్థానముదెస నడచును. కిరణచుంబనమువలనగదా కుట్మలము కుసుమమగును! సమీరస్పర్శ నందికదా

(శ్రీమద్వాల్మీకిరామాయణము; బాలకాండము.)

స్మితముఖియై సుమసీమంతిని పయ్యెదవిదల్చి పవన తనయునకు సుధాస్తన్య మొసగును! పులకితయై తీవచేడియపై నొరగి కనులప్పగించు కవికుమారునకు సౌందర్యము నప్పన మని, అధర మాకించినంతనే ఆతని కవిరళ సౌరభమును ప్రసాదించి ధన్యనైతినని పుష్పప్రణయిని కులుకదా? హృదయమును విప్పి "ఇందలి యనంత సామ్రాజ్యము నేలుకో" మ్మని కుసుమప్రేయసి కవిసుందరునకు అన్నిహక్కుల నిచ్చివేయదా? అనురాగ కల్హారమున నాతనితో జలక్రీడలు సలుపదా? ప్రేమస్పర్శ యెట్టిదో గ్రహించితిరా? ఒకమహాత్ముని భావస్పర్శవలన హృదయమందలి స్వర్గము, స్వప్నమునుండి, ఆత్మవిస్మృతినుండి మేల్కాంచి మంగళ సంకీర్తన మొనరించును! వీరుని స్పర్శకతన అంతరంగమందలి ఆత్మశక్తి ఉవ్వెత్తుగ లేచి, విజయడిండిమమును మ్రోగించును. ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున దివ్యపురుషు డవతరించినపుడు మహావీరు లెందఱో ముందులకరుదెంచి శంఖములను బూరించుటకు కారణ మిదె. హృషీకేశుడు పాంచజన్యమును పూరించినంతన, ధనంజయుడు దేవదత్తమును, భీమకర్మయాం దాటితేజిన వృకోదరుడు పౌండ్రమును మహాశంఖమును, యుధిష్ఠిరుడు అనంతవిజయమును, నకులసహదేవులు సుఘోషమణిపుష్పకములను బూరించిరికదా!

భారతాంబ సర్వకాలములందు వీరప్రసవిని. విజ్ఞానులను, వీరులను, సంయములను ఈతల్లికడుపున నేడును (నాటివలె నేడు వీరసంఖ్య యధికముగాకున్నను) పుట్టుచునేయున్నారు. శాక్యముని చెంగట, నేసుదాపున నిలువనర్హుడైన మహాత్ముడు నేడు భారతదిగ్వలయమున ద్యుమణికరణి తేజరిల్లుచున్నాడు. ఈతని భాసమాన భావమయూఖలు స్పృశించినంతన వసుంధరాదేవి నవజీవనము నందినది. నే డొకమాల

* "కో న్వస్మి న్సాంప్రతం లోకే గుణవాన్కశ్చ వీర్యవాన్, ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః"

ఫిరంగులు ప్రేలుచున్ననేమి, విషవాయువులు వీచుచున్ననేమి, పూర్వపరమతియందు గాంధి వెలసినాడని ఆతని ఘన హృదయమునుండి జాలువారు శాంతివృష్టి పశ్చిమావనియందలి యగ్నిగుండము నార్పివేయునని, నేడుగాకున్న నీశుభముహూర్తము రేపైన తలసూపునని పల్వురు ప్రతీచీమనీషులే వాకొనుచున్నారు. అన్యదేశముల మాటయటుండ, భారతావనియందు గాంధి స్పర్శకతన నెందఱో వీరులు ధర్మక్షేత్రమున గోచరించిరి. అహింస, ఆత్మసంయమము, ఆత్మగౌరవము, ఆత్మశక్తి, ఇచ్ఛాశక్తి, క్షమ, ధృతి, దృఢనిశ్చయము, స్వార్థత్యాగము, సత్యాగ్రహము మున్నగు మహద్గుణములను*మహాత్ముని ప్రబోధదృష్టాంతములకతన వీరలవఱచుకొనిరి. వీరిలో ప్రకాశ మొకడు. ఈతని యంతరంగమందలి శక్తి గాంధిచేతి తాకుడువలన వేయిపడగలతో శిరమెత్తినది. తన మణిమ్యుఖలతో మహాత్ముని కనులకు మిఱుమిట్లుగొలిపినది.

నిప్పచ్చరమున బుట్టినగాని కాలక్రమముననైన నెవ్వడును మహాపురుషుడు కాలేడని నాగట్టినమ్మకము. కఠినదారిద్ర్యమునకు కన్నబిడ్డకౌగాలున దృష్టి మెందఱికి లభించును? ధనికునింట జన్మించినను, పేదఱికము నాచార్యుని గావించుకొని దాని చెప్పుచేతలకు లొంగి దానిహుకుము నౌదల దాల్చి, కఠిననియమములకు జోహారని వర్థిలు వ్యక్తి ఆత్మసంయమమందు మహాపురుషు డగును. చిఱుతప్రాయమునుండి మనసుపై నుత్తెపోటులు పడుచునేయుండవలెను. పదేనపుడు లోనిపసిండి మెఱుపుల జిమ్మును. భారతమహాపురుషులందు రవీంద్రు డైశ్వర్యమున జనించినాడు. ఇతడు దేవేంద్రనాథుని కడుపున బుట్టినవిషయము మనము మఱువరాదు. అతులవిభూతిసంపన్నుడయ్యు దేవేంద్రనాథుడు దారిద్ర్యమును కవుంగిలించికొనినాడు. కఠోరనియమముల ననుసరించి అడుగులు వేసినాడు. నేను శాంతినికేతనమున కరిగినాను. గుంపుగనిలిచిన వృక్షసాలములనడుమ, మాధవీలతలకుజగల నొకచక్కని వేదికను పరిశీలించుడు. తూరుపున రవిని విలోకించినంతన భక్తునిచేతులు తమంతటదాము ముకుళితము లగునట్లు, పొడుపుకొండపైలు వేదికనుచూచినంతన మా కరకమలములు మొగుడ్చుకొనును. నేడు దేవేంద్రు డదృశ్యుడైనాడు. కాలవిముక్తులమున కారుమొగుళ్ళు తోచినను, అవి సూర్యగోళమును ముఱుగుపఱుచుటుండనట్లు దిగ్భ్రమింగ గలవా? ముయిలుగుండియలను చీల్చుకొని వాడిమైన రవికిరణములు వెలువడవా? విహాయసమునుండి కనకరశ్మికుంభవృష్టిగ జగతిపై కురియదా? భక్తుని హృదయమందలి మహత్తరభావమట్లు, రక్తాభదాల్చి మొగిలుగములు సూర్యభగవానునకు మ్రొక్కి తరలిపోవా? దేవేంద్ర

* "I believe that non-violence is infi-nitely superior to violence, forgiveness is more manly than punishment...............Forgiveness adorns a soldier. But abstinence is forgiveness only when there is power to punish; it is meaningless when it pretends to proceed from a helpless creature............Strength does not come from physical capacity. It comes from an indomitable will......I am not a visionary. I claim to be a practical idealist. The religion of non-voilence is not meant merely for the rishis and Saints. It is meant for the common people as well. Non-violence is the law of our species as violence is the law of the brute. The spirit lies dormant in the brute and he knows no law but that of physical might. The dignity of man requires obedience to a higher law—to the strength of the spirit......I have therefore ventured to place before India the ancient law of self-sacrifice...The Rishis who discovered the law of non-violence in the midst of violence, were greater geniuses than Newton. They were themselves greater warriors than Wellington........." (Vide: Gandhiji's great article, 'The Doctrine of the Sword' published in 1920.)

నాథుని ప్రభాకలితజీవనమునుండి నేడును సప్తరాగ సంభరితములైన మరీచిసమూహములు వెడలుచున్నవి. శాంతినికేతనమందలి వేదికనుండి జ్ఞానమరీచులు ప్రసరించుట బహుయాత్రికులు నేడు వీక్షించుచున్నారు. పెంపొందుకుచుట్టును జేరిన ముత్తైదువులవలె, జాబిలికి నలువలంకులందు గూడిన చుక్కపడంతులట్లు, జవ్వనియైన పూవునెలంత నాశ్రయించిన గండుతుమ్మెదలలీల విజయునిచుట్టును నిలిచిన వందిమాగధులవడువున, కమలభవనర్తకుని వెన్కనాడు దేవభాగవతులకైవడి, పరంజ్యోతిచుట్టు తన్మయనృత్యమొనరించు పరమాళయ వితానముపగిది, శ్యామసుందరునకు నలువలంకులందు రాసక్రీడలు తేలు గోపికానివహమట్లు, పట్టరానియానందమున శ్రీరామునిచుట్టు గంతులేయు కోతిమూకలవలె, దేవేంద్రనాథుని పవిత్రస్మృతిచుట్టు జేరి యెల్లసీమలు కొన్నిదశాబ్దులనుండి జేజేలుపాడుచున్నవి; వేదికదాపున లతాలలనలు రాల్చు పూలు దేవేంద్రునికీర్తిసూనములని నమ్మి వానిని గైకొని భక్తిపురస్సరముగ కనుల కద్దుకొనుచున్నవి. తపస్వియైన దేవేంద్రనాథుడు తనయుని వ్రతపీఠమున నాసీనుజేసి, తానే వానిని దీక్షాజీవనమున ప్రవేశపెట్టినాడు. రవీంద్రు డెన్నడును కలమాన్నమును మెక్కియుండలేదు. పైడిగిన్నెలందు తేనెలను గ్రోలలేదు. ఇలువేలుపులని హేమరాసుల నారాధింపలేదు. హిమగిరిప్రాంతమున తపోవనమున తాను కొంతకాలము వసించి, వనశృంగారమునకును, శీతవాతూలమునకును దేవేంద్రుడు రవీంద్రు నప్పగించినాడు (Vide: Rabindranath's "Reminiscences"). ధనరాసులపై రవికవికి మక్కువలేదు*. కావున లక్ష్మీగృహమందే జనించినను, రవీంద్రుడు శారదకరుణ నందగలిగినాడు.

ప్రకాశమునకు ఉగ్గుబాలిచ్చినది దారిద్ర్యము. ఉపనయన మొసగినదియు దారిద్ర్యమే! ఇక్కట్టులందు పెరిగియేకదా మహారాష్ట్రులును, రసపుత్రులును యోధులైరి. ఇక్కట్టులచెలిమికలిమి నందియే ప్రకాశము యోధుడైనాడు. పట్టుదలకు ప్రకాశము పర్యాయపదము, *సాహసమునకు రూపాంతరము, సహనమునకు మాఱుపేరు. ధృతిగుణము రూపుదాల్చి ఆంధ్రకేసరి యైనది. ప్రకాశ మెన్నడు సుఖమపేక్షింపలేదు. స్కూలుచదువునెట్లో యైనదనిపించి, ఎట్లెట్లో మనసీమయందును, ఇంగ్లాండునను 'లా' చదివి, న్యాయవాదవృత్తి నవలంబించి, చరచర సాగిపోయినాడు. ఇతడు చెన్నపురిలో బల్లగట్టినపుడు ఆంధ్రన్యాయవాదులసంఖ్య మిగుల నల్పమై యుండెడిది. ప్రకాశం గట్టిఘటం! మొండిఘటం! పెంకిఘటం! జంకుగొంకులు లేనివాడు. సహజవివేకముగల పెంకిఘటము న్యాయవాదియైనయెడల, తాను విజ్ఞాని కాకున్నను, తనవృత్తికి తప్పక మామిడితోరణము గట్టగలడు. ప్రకాశ మట్లు కట్టినాడు.

విజ్ఞానియైన న్యాయవాది తనవృత్తియందు నెగ్గునని తలపరాదు. విజ్ఞాని కానిన్యాయవాది తనవృత్తియందు చతికిలపడునని యూహింపరాదు. విజ్ఞానులైన న్యాయవాదులలో దరిద్రు లున్నారు. కంచములతో రూకలు కొలబోసికొనిన న్యాయవాదులలో తప్పక గ్రామరుతప్పులతో మాట్లాడు మహాశయులు కలరు. లాయరు 'లా' తెలిసికొన జాలకపోయినను 'లా' యెందున్నదో తెలిసికొనవలెను.

వృత్తికి సంబంధించిన ఎత్తులు కొన్ని కలవు. ఇవి నాటకములకును, బూటకములకును సంబంధించినవి. వృత్తి నల్లబడుకొలది ఈయెత్తు లధికమగుచున్నవి. కాని

---

* "Whatever we treasure for our-selves separtes us from others; Our possessions are our limitations" Tagore.

* ప్రకాశము జీవనమును సింహావలోకన మొనరించితిమేని, ఈతనిపట్టుదలను రూఢిచేయు దృష్టాంతము లెన్నో గోచరించును. రాజమండ్రిలో నీతడు సాధారణ న్యాయవాదియై యున్నపుడు ఎడ్వకేటుతో నీతని నుజ్జీజేయుహక్కుగాని, ఘనతగాని ఈతనికి లేదని ఒకరెత్తిపొడిచిరట! తోడనే ప్రకాశ మవ్వలికరిగి, ధనికుడు కాకున్నను ఎట్లో రెక్కలుకట్టుకొని, ఇంగ్లాండు నకరిగి, "లా" చదివి, 'గ్రేస్ ఇన్'లో పసదనమంది, బారిస్టరై స్వీయసీమకు మరలివచ్చి తనవృత్తిపై విజయధ్వజమును నెలకొలిపినాడు. ఇదొక్క దృష్టాంతము మాత్రమే!

న్యమందును, శాఠ్యమందును, దుర్వ్యాప్తులందును, దుర భ్యాసములందును 'రాడు వేజీ' తనవృత్తియే తనదైవతమని యెంచునాతడు.(వానిదే వృత్తియైనను)తన హృదయమును పాతాళలోకమందు లోతుగపూడ్చిపెట్టి, తనమెదడును బాగుగ బలియునిచ్చి, యెదుటివాని మొగమునకు మసిపూసి తన మొగమునకు మెఱుగుపూసి, తన యాత్మగౌరవమును చిటచిటలాడించి, అక్కఱకు వేళలందు కొందఱు లక్ష్మీప్రసన్నులకు 'దాసోహం' అని, ఎదుటివాని దుస్థితిని తనబలముజేసికొని, లోకువైన వానిని మేకుతో పొడిచి, ఒక నిముసము క్రౌర్యమును, వేఱొకనిమిషమున నవ్వును అభినయించుచు. ఒకతూరి దేవతయై మాపట్టి వేఱొకపర్యాయము ఘోరపిశాచమై ప్రత్యక్షమై తనకై యమలోకము చీరసింగారించుకొనిన దని యెఱుగక, రాశిరాసులుగ ధనముతోపాటు పాపమును సంపాదించును. అధునాతననాగరకత ఈతనికి మిగులగూర్చునెచ్చెలి. బుద్ధిగలమహాపాపి మదనును మురికి గుంట గావించినను, తియ్యగ మాటలాడగలడు. గుండెలో కార్చిచ్చు జ్వలించుచున్నను, మొగమున చిరునగవు తళ్కొత్తింపగలడు. కావున నీతడు మానవసంఘమునకు దాపురించిన ప్రారబ్ధమని చెప్పకతప్పదు.

విశేషకాఠిన్యమున కొడిగట్టని పుణ్యాత్ములు కొందఱున్నారు. వీరు జూనియరుల మొగములు చూడరు. వారు వంగి వందనమిడినపుడొకమాఱు రెప్పలెత్తుదురు. వారు తమంతటదాము ఆఫీసునకువచ్చి తమంతటదాము పోవలెను. Facts కు Law ను apply చేయుటెట్లో, కేసును పిడికిట బట్టుటెట్లో యెఱుగని జూనియరులు ఈరీతిసీనియరుల ఆఫీసులలో 'దిష్టిపిడతలై' యుండవలసినదే! కోర్టులందు 'దిష్టిబొమ్మలై' యుండవలసినదే! ఎన్నో అవతారములెత్తి ఒకజూనియరు ఏదైనచక్కని కేసునుదెచ్చి సీనియరునకు అప్పగించినయెడల పచ్చని క్రొత్తక్లయంటును సీనియరుగారు మెల్లగ తనయొడిలో జేర్చుకొని, జూనియరునకు 'ఇంచక్కటి' ఆయజెల్లము పెట్టి "హూత్! కాకి!"అని ఆయభాగుని మఱపించును. "జున్నుముక్కవంటి తన క్లయంటును యీయయ్య ఎగదన్నుకొని పోయె"ననిమాత్రము ఈ వెర్రిమొహం చాటున మాటున నేమో అఘోరించి ఎన్నటికైన తన యిలువేలుపైన సీనియరుగుండె కరగునేమో అని తడయును, కొట్లకుక్కవంటి దారిద్ర్యమునకు తన తనువు నప్పగించును! చావలేక, చావదుకావున, బ్రదికినను చచ్చినట్లేయుండును కావున చచ్చి మరల జూనియరై పుట్టుటకంటె, యిప్పుడే ఆజూనియరు పీరియడ్ ముగింప నుద్దేశించువాడు కావున శ్మశానమువలె భయదమైయున్న మొగముతో గతిమోక్షములు లేక, పిచ్చివానివలె నితడింపందు మసలుచుండును. తనవృత్తిలో స్వర్గము కానుపించునని యెంచి, దానిని దేవత జేసికొని తరతరములనుండి పెరిగిన ఆస్తిని దానికి నైవేద్యముగ సమర్పించి, తన యారోగ్యమును మానాభిమానములను దానికి బలియిచ్చి, తనతో తనవారినున్మాదుల జేసికొను ఈజూనియరుకంటె దౌర్భాగ్యుడు ప్రపంచమందు ఎందైననుండునా? ఇట్టివారికు పుట్టకముందు బల్లకట్టి మడిమాన్యములను మస్తుగ సంపాదించి, కోర్టునుదేవాలయముజేసికొని బ్రదుకు నందే కడపి అందుండియే డైరక్టుగా పరలోకమునకు వేంచేయవలెనని ముచ్చటపడువారు కొందఱున్నారు. తులసీజలము చేబూని, వీరికి పిలుపువచ్చు పవిత్రముహూర్తమునకై గ్రుక్కిళ్లుమ్రింగు చుట్టులున్నారు. నేటి న్యాయవాద వృత్తికి దాపురించిన దుస్థితిని వర్ణించుట కెవ్వరికిని సాధ్యముకాదు. ఒకవైపున కండకావరములు పెరుగుచున్నవి. వేఱొకవైపున నెముకలు నేల రాలుచున్నవి. ఎన్నటికైనను పున్నెము నెగ్గకమానదు; పాపము బ్రద్దలు కాకమానదు. ఎట్టిదుష్కృత్యమైనను Nemesis నుండి దాటిపోగలదా? నేడు చంకలుకొట్టుకొనువారు నేడభాగులైన పిన్నలతోడ్పాటులేక రేపాకయడుగు వేయజాలుదురా? వృత్తి సంతానమును మాడనిచ్చి,తాము బూచులవలె దయారగువా రెంతకాలమునిలుతురు? న్యాయవాద వృత్తి నేడు తప్పనిసరిగ ఆంతరంగికపరివర్తన మందవలెను. చచ్చి మరల బ్రదుకవలెను. దీనికి సత్వరమైన Resurrection అవసరము.

న్యాయవాదవృత్తి కీ దురవస్థపట్టినది నేడే! ఒకప్పుడు గుండెగలసీనియరులు కొందఱీవృత్తియందుండిరి. ఆశుతోషునకు రాష్‌బిహారీఘోష్ చేయూతనిచ్చినాడు కావున ఆతడు తనవృత్తియం దగ్రస్థానము వహించి, దానికి వన్నెదెచ్చినాడు. అల్లాడికి సుందర అయ్యరు ప్రోత్సాహ మొసగినాడు కావున నేడు దక్షిణసీమయం దాతడు సాటిలేని న్యాయవాది యైనాడు. గాంధి చిత్తరంజనులును, లజపతిమోతీలాలులును తమవృత్తికి గౌరవముదెచ్చి, దానివలన పడసిన ప్రజ్ఞావిశేషములను దేశాభ్యుదయమునకై వినియోగించిరి; తమ వృత్తి మహత్తరమైనదని సభ్యజగతియందు రూఢిచేసిరి. తమ్ము నమ్ముకొనిన ఎప్రెంటిసులను, జూనియరులను కన్నబిడ్డలట్లు చూచిరి. నేడిట్టిసీనియరులు ఇంచుమించుగ నంతర్ధానమైరి. నేటిపెద్ద లాయరులు మేఘములపై కుర్చీలువేసికొనియున్నారు! ఊర్ధ్వదిశ జూడుక్కల బంధించిరి! అభాగ్యులైన యువకులమొగము లెందుకు చూతురు?

లాయరులందు కలగూరగంప ఉండితీఱును. అనంతకృష్ణ అయ్యరువలె నీతినియమములం పాటించువారును, ఉత్కృష్టాశయములకై ఆత్మార్పణ మొనరించుకొను దాసు ప్రభృతులును, స్వార్థపరులును వీరియందు గోచరించుట చూతుము కావున వీరి నిక్కంపు ప్రతిమలు చిత్రింపవలెననిన, ఒక్కొకపుడు కలమును మడ్డిలో ముంచవలెను; వేఱొకప్పుడు బంగారునీరులో ముంచవలెను. ఈ వృత్తియందలి పెద్దలు ఎవరెట్టివారో, ప్రజ్ఞవలన పైకివచ్చినవారో, చక్కని యెత్తులవలన లేచినారో, ఒకనిచేయూతవలన తలయెత్తినారో, గీత బాగుండబట్టి లేవంజాలిరో చెప్పలేము.

ప్రకాశం వృత్తి మొదలిడినపుడు దేశపరిస్థితులును, లాయరుల మానసికపరిస్థితులును అనుకూలముగా నుండెడివి. ప్రకాశము విశాలహృదయుడు. స్వార్థము చుట్టు ఈత డెన్నడును రామభజనము చేసియెఱుగడు. పేరినారాయణమూర్తివలె తనజూనియరులకు చక్కని ప్రోత్సాహమిచ్చినాడు. ఈతనికడ తరిఫీదునందినవారు కొందఱు కాలక్రమమున న్యాయమూర్తులు కాగలిగిరి.

పదునాఱేండ్లకుమున్ను కురుక్షేత్రమున గాంధి కావించిన శంఖారవము ప్రకాశముచెవుల బడినది. నడుముగట్టి ప్రకాశము ముందుల కురికినాడు.

త్యాగికి దీర్ఘయోచనము కూడదు. కండ్లుమూసికొని యెవ్వడును సుడిగుండమున లంఘింపరాదు. వాడికోరలుగల ఆపదను పిలిచి, దానినోట తలదూర్చరాదు. కన్నుతెఱచియే ఒకడు మహాత్యాగ మొనరింపవలెను. మీనమేషములను లెక్కింపరాదు. హేమ్‌లెట్ వలె, టెన్నిసన్ చిత్రించిన సర్ బిడివియర్ ('Vide. Idylls of the king') పాత్రవలె అత డూగిసలాడరాదు. ఒక్కొకపుడు చివాలున దుముకవలెను. బిడ్డ దావానలమున బడినపుడు కన్నతల్లి నీళ్లునమలుచు నిలువంబడునా? కమలకాసారమున తటాలున వ్రాలు రాజహంసవలె పవడపురాశిలో రాలు నవభర్మశలాక లీల, చారుపల్లవముల కుప్పలో పడు మంచుతుంపురు చొప్పున, సాంద్రవనమున జారిపడు వెన్నెల నాక వడువున తననిసుగునకై నిప్పుకుప్పలో లంఘింపడా? అధునాతన భారతీయులలో నిట్టిత్యాగముజూపిన మహాపురుషుడు చిత్తరంజనుడు. తన యైశ్వర్యమును పునాదులతో త్రవ్వి యాతడు రస్సారోడ్డులో పోసినాడు. విలువగల వలువలు వదలీ దీక్షావస్త్రములుకట్టి జోలి చేతబుచ్చుకొన్నాడు; జోగియైనాడు. త్యాగసమయమున నరనిముసమైన యోచింపనిపాడు చిత్తరంజనుడు.

ఒరులందువలె ఆంధ్రులందును లోపములున్నవి. కాని త్యాగముచేయు నవసరమున వీరు వెనుకకు చూడక ముందంజవేతురు. వీరి ఉత్సాహము మెండు. ప్రతి యుద్యమమందును వీరు వంగీయులకు సైదోడులట్లు మెలగుచున్నారు. వంగసీమయందు తలసూపిన రాజకీయోద్యమములే కాక మత మహోద్యమములుకూడ వీరిసేవల నందినవి. వంగరాష్ట్రమందు పొడసూపిన బ్రహ్మసమాజమతము ఒక్క ఆంధ్రావనియందే తన శాఖోపశాఖలను నెలకొలుపగలిగినది. రామకృష్ణమఠములు మనరాజధానిలోనే పెంపొందుచున్నవి. సారస్వతమందు వంగీయులకు తక్క ఆంధ్రులింకెవరికిని దీసిపోరు. ఆంధ్రులలో

నందఱు నాయకులు కావలెనని ఆతురపడుచుందురను అపోహ కలదు. కనులముందు ఉన్న తాళయము నిలుపుకొనుట సాధారణులకు సాధ్యముకాదు. తమకు దిగువనున్న మహాశయులవలె రాహుకాలము దాటనిచ్చి నాయకపదవికై లంఘించి, త్యాగసమయమున నాంధ్రులు కలుగులలో దూరరు. త్యాగకుండమున శుభాలగ్న లంఘించిన ఆంధ్రవీరులలో ప్రకాశ మొకడు.

త్యాగమునకును, కళోపాసనమునకును ఒకేరీతి చిత్తవృత్తి, ఒకేతెఱగు ప్రవృత్తి యుండునని తెలుపుచుందురు. ఈరీతి మానసికగ్రథనము తమిళులందు అంతగా గోచరింపదు. ఇతనికి కావలసినంత మెదడున్నది. ఇందుచేతడు ప్రపంచమందే జాతికిని తీసిపోడు. తన యద్భుతమేధాశక్తికతన నీతడు శాస్త్రముల నవలీలగ గ్రహింపగలడు. ఘనపాండిత్యము సంపాదింపగలడు. ఈతని తలకు వీనిగుండె సరితూగదు. అది చిన్నది.

పూలతోటలోని సౌరభమువలెవ్యాపించు భావముగాని, సుధాంశుసౌందర్యమట్లు తెరలుతెరలై జాలువారు భావముగాని, ప్రభాతకాలమున బింబసుందరి హృదయమున దివ్యదృశ్యములు ప్రదర్శించు మిహిరమండలము పోలు భావముగాని, చల్లని అనసూయ చేతివలె ముమ్మూర్తులను దనుపగలభావము గాని హద్దులేని హృదయ సామ్రాజ్యమందే, నందనమువలె నెనలేని హాయులనొప్పు గుండెయందే, బృందావనమువలె సౌందర్య మాధుర్యములకు నిధానమైన ఎడందయందే ఉదయించును! ఇట్టి భావములకే సృష్టిశక్తి యుండును. వీనినే కళాసామగ్రి యందుము. వట్టి పండితుడు పండితుడుమాత్రమే! ఇతనికి సృష్టిశక్తి హుళక్కి. "కవిత్వ వైదుషీవేశికయోచు" నీతడు పేర్పడజాలడు, ఆడుదానికి మగవేషమువేసినట్లు లలితకళల కీతడు బండరూపు నిచ్చును.

శాస్త్రముపై నిలిచినను కళ దశదిశలందు తన సామ్రాజ్యమును స్థాపించుకొని, వైకుంఠమువలె విస్తృతమగు నను విషయ మెఱుగక, కళయొక్క కాలిక్రింద నుండవలయు శాస్త్రమును లేవనెత్తి తమిళులు దానిని కళనెత్తిపై బెట్టిరి. కాలిక్రిందనుండవలయు బండరాతిని తలపైబెట్టిన నది చితుకదా? అరవలు సంగీతము నేమి చేసిరో చూడుడు. సంగీతము కళయనునంశమును మఱచి దానిని శాస్త్రము చేసి వదలిరి. జగన్మోహినికి మీసములను, గడ్డములను అంటించిన నామె యెట్లుండును? కోయిలకంఠమును సానబెట్టినయెడల నది తెగి ముక్కలుకాదా? గంధర్వకన్యవలె వెలయు గులాబిపూవును ఉనిపి యునిపివదలిన నది ఘోరదుర్మరణమునకు బాల్పడదా? సౌందర్య మాధుర్యసౌరభముల ప్రధానగుణములు స్వాతంత్ర్యమును, సహజవృద్ధియును. ఈరెండుగుణములకును దోహద మిచ్చునంతదనుక శాస్త్రము ఆదరింపదగినది. కళకు శాస్త్రము చరణాశ్రితదాసియై, చెలికత్తెయై యుండవలెను. ఇది తనహద్దున దా నుండవలెను. తమిళులు చెలికత్తెను రాణిని గావించి, రాజ్ఞిని సైరంధ్రినిజేసి వదలిరి. శాస్త్రప్రజ్ఞ కళాప్రతిభ యని భ్రమపడుచుండిరి. శాస్త్రప్రజ్ఞను పదుగురు మెచ్చుదురే కాని కళాప్రతిభకు పదునాలుగుభువనములును ప్రణమిల్లునమనంశము నెఱుగకున్నారు. గ్రుక్కతిప్పగని చిట్టెలు చిరుకెరటాల కెనయగు సంగీతసంగతి సంతసు లెట్లగును? అస్సురుస్సురులు ముక్కపడంతుల గుసగుసల కీడువచ్చునా? పువ్వునెచ్చెలుల చిరునవ్వులతో తులదూగునా? కోయిల కూహుకూహూల కుజ్జీయగునా? వికృతముఖవైఖరులు, వికృతవిజృంభణములు కళకు సరిపడునా? కళను గుర్తింపజాలకపోవుటచే తమిళులు కవిత్వమహత్త్వమును చూపజాలకపోవుచున్నారు. దేశమున నేడెంతో సంచలనము పొడసూపినను తమిళసారస్వతము తళుక్కుల నీనుచుండుటలేదు. నేడది నీరసించియున్నదని అరవలే యనుచుందురు.

కళనెఱుగని అన్నయ్యలు, ప్రతిభలేని దేవయ్యలు, సాహిత్యవాసన లెఱుగని ఓబయ్యలు త్యాగమునంతగా నెఱుగరు. తమిళులం దిరువురు తప్పబుట్టిరి. కళనెఱిగినవాడు ఒక్క శ్రీనివాసశాస్త్రి మాత్రమే! త్యాగ మెఱిగినవా డొక్క రాజగోపాలాచారి మాత్రమే! మిగిలినవారి వ్రాతలుగాని, ఉపన్యాసములుగాని, చేతలుగాని గంధబంధురములై యుండునా? సత్య

మూర్తి పెద్దవక్తయని పేరుగాంచినాడు. నిజమే! ఈ మహాశయుడు ఇంగ్లీషు శబ్దములను కంఠస్థము గావించినాడు. ఇతనికి రౌద్రము కలదు. వీనిమాటలందు వేడిసీసము పొంగుచుండును గాని సుధాలహరి తొలుకాడదు. సత్యమూర్తిలో భావనాబలము బండిసున్న. ఇతనిహృదయము పుష్పవనము కాదు. కావున నీతనిశైలియందు సౌందర్యసౌరభ మాధుర్యములు లేవు. కన్నుపొడుచుకొనిన అందు కళాశోభ కానంబడదు.

హృదయమును, మేదస్సును ఇంచుమించుగ సరిసమముగ గలవారు భారతభూమియందొక్క ఆంధ్రులు మాత్రమే! వంగీయులకు తలకంటె గుండె పెద్దది. తెంచుగ వారు ముందువెన్కలు చూడక పరుగులెత్తుచుందురు. పంజాబీలు, హిందూస్థానీయులు, రాజస్థానవాసులు బుద్ధిబలమునకై శ్రమింపరు. వారికి కండబలము మెండు. వీరికంటె మహారాష్ట్రులు మేలు. ఓఢ్రులు వంగీయులకు తమ్ములు. కృషిసలిపినచో వారు వంగీయులతో నుజ్జీకాజాలుదురు. కాని వారిలో తపసు తక్కువ. కావున వారిగుండె మెదడుకంటె చిన్నదిగను, మెదడుకంటెగుండె చిన్నదిగను గోచరించుచున్నది. వానిలో నేడే సంచలనములేదు, ఏవిజృంభణములేదు. ఎట్లో కాలక్షేపముచేయుచున్నారు. అల్లరిపిల్లకాయలు కారు కాబట్టి అవలీలగ రాష్ట్రము దెచ్చుకొన్నారు.

కళకును త్యాగమునకును ఆంధ్రప్రకృతి అనుకూలమైనదే కాని తెలుగుసైదోడులందు ఉత్సాహమునకు నీడువచ్చు సంసీభావము లేదు. వారిప్రజ్ఞకు సరివచ్చు నిష్ఠ నేడింకను గోచరించుటలేదు. తమ ప్రజ్ఞాప్రతిభలను గుర్తించి ద్విగుణీకృత నిశ్చయశక్తితో దీక్షను నెఱపిరేని సర్వవిజ్ఞానశాఖలందును, లలితకళలందును, త్యాగాది మహాగుణములందును వసుంధరయం దాంధ్రులజేయులై యుండజాలుదురు.

కాంగ్రెసుమహోద్యమమునకు దక్షిణసీమయందు సారథులైన వా రాంధ్రులేయయ్యు, అఖిలభారత రాజకీయములందు వీరి కంతగా పలుకుబడిలేదు. అఖిల భారత రాజకీయములను నడుపవలయు దక్షిణదేశస్థుడు కావలసివచ్చుచో ప్లేట్‌ఫారమ్‌మీద పెద్దగొంతుకతో నఱచు తమిళుడే ముందులకువచ్చును. పెద్దలాయరు కాబట్టి శ్రీనివాస అయ్యంగారొకప్పుడు గద్దెపైదుమికిరి! ఆంధ్రత్వము తమిళములో తలదూర్చివేయవలెనని ఒకప్పుడీయన సెలవిచ్చినారు. కొంతసేపు కలాపనమువినిపించి వీరు మరల జవనికవెన్కకు తరలిపోయిరి. వేళమునకు తా నవసరమైనచో మరలవచ్చి పందిరిలో నిలుతునని వీ రిపుడు సెలవిచ్చుచున్నారు. ఆత్మహృదియందు చప్పుడుచేయు ఆతురపాటునకు చెవియొగ్గి, ఆత్మసుఖమును పడదన్ని, అగ్నివర్షము కురియుచున్నను, బ్రహ్మాండ మడ్డునిలిచినను కర్తవ్య నిర్వహణమునకై వీరుడు ముందుల కురుకును. ఎవరో వచ్చి కాళ్లకు పారాణిపట్టించి, నొసలున నోముబొట్టుపెట్టి, వాయనమున కాహ్వానించినయెడల ముందులకువచ్చి జయమంగళము పాడుదుననువాడు వీరుడు కాడు. అయ్యంగారు అంతఃపురములో నుండగా నాయకత్వముపై కన్నువేసినవాడు సత్యమూర్తి! పల్లి దగ్గినను, కుక్క చీదినను ఇతడు తప్పక ఇంటర్‌వ్యూలు ఇచ్చుచుండును! గడుసువాడు! గట్టిబుఱ్ఱగలవాడు! పస్తాయించి పస్తాయించి, దూరమాలోచించి ఈశ డొక పర్యాయము జెయిలులోని కరిగినాడు! "పదవులకై మోకరించువారము కాము, చేతులు మొగుచువారము గాము, డేకుకొని పోవువారము కాము" అని పట్టాభి యనినాడు. పదవులకు చక్కని ప్రేమలేఖలు వ్రాయగలవాడు సత్యమూర్తి! చెన్నపురినిర్మాణమునకును, వృద్ధికిని జనకులైన వా రాంధ్రులని చరిత్ర తెలుపుచున్నను చెన్నపురి ఆంధ్రులదికాక అరవలదని, పైకిరావలసిన మాట అరవలది గాని ఆంధ్రులదికాదని, ముందునిలువవలసినవారు తమిళులు కాని తెలుగులుకారని అట్టహాసము చేయుచున్న పెద్దమనిషి యితడే!

ఆంధ్రమాతకనిన బిడ్డకావున నాగేశ్వరరావు, సాంబమూర్తి, పట్టాభిప్రభృతులవలె కలకత్తా అవసర కాంగ్రెస్ మహాసభలోనే ప్రకాశము తనమణికట్టునకు కంకణముగట్టుకొన్నాడు. దీక్షావస్త్రములు ధరించి, వ్రతపీఠమం దాసీనుడై "స్వాహా!" యని తనలక్షులను

హోమకుండమున కర్పించినాడు. తనకు భరించునది నిప్పచ్చరముగాని యైశ్వర్యముగాదని తనయింటినుండి ప్రకాశము లక్ష్మిని తరిమికొట్టినాడు!

భారతరాజకీయములందు ఆంధ్రవ్యక్తిత్వమునకు తావురావలెననిన ఆంధ్రుల కొక దైనికాంగ్లపత్రిక అవసరమని ఆంధ్రనాయకులు తమ రాష్ట్రసభలందు పలుమారు తీర్మానములు గావించిరి. వీనిని పురస్కరించుకొని ప్రకాశము "స్వరాజ్య" ను నెలకొలిపినాడు. ఆంధ్రయువకులము ఎగిరిగంతువేసితిమి. దేశసేవకును, సారస్వతసేవకును చక్కనితరుణము లభించినదని యుబ్బిపోతిమి.

ప్రకాశమునకు గుండెకాయ కుజ్జీకాగలదు తలకాయ లేదు. ఇతనికి బొత్తుగా మెదడు లేకపోవుట ఆంధ్రుల దురదృష్టము. ఇతడు విజ్ఞానికాడు; వ్యవహర్తకాడు. చేతలందు దిట్టగాని భావములందు పెద్దకాడు; మాటలందు నేర్పరికాడు. కడుపులో సరుకు లేనివాడుకావున సరుకున్నవానిని గుర్తింపలేడు.

"స్వరాజ్య"పత్రికకై సొంతపైకమును విశేషముగ వెచ్చించినాడు. స్వీయసీమనుండియేగాక దాపున నున్న దీవులనుండి చాలధనమును దానికై కొల్లగొట్టుకొని వచ్చినాడు. నిర్వహణనైపుణ్య మెఱుగడుకావున నెగ్గలేకపోయినాడు. బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు నన్నుగుఱించి తనతో పెద్దగాజెప్పినారని నాకు జాబువ్రాసి, తన ఆఫీసులోని కీతడు. వన్నాహ్వానించినాడు. తాను మాడి మమ్ములను మాడ్చి వదలిపెట్టినాడు. "మతము కాలుచున్న కడుపులకు గా"దనికదా రామకృష్ణపరమహంస పలికినాడు! వ్యవహారమున ప్రకాశ మించుక కౌశలము జూపియుండినచో, నాడు మా కట్టిగతి పట్టకుండెడిది వాయుభక్షణము నభ్యసించియుండినచో, నాడు మాకెట్టియిబ్బంది కలుగకుండెడిది. ప్రాయోపవేశమునకైన నొకహద్దులేదా? ౧౯౨౫ ఆఖరున నాసంపాదకత్వమున తెలుగు "స్వరాజ్య"ను నెలకొలుపవలెనని ప్రకాశ ముద్దేశించినాడు. కావలసినంత అనుభవమును హృదయంగమ మొనరించుకొని, "స్వరాజ్య"కు జోహారని, "స్వరాజ్య" ఆఫీసునకు ప్రణమిల్లి "స్వరాజ్య"పత్రికాధిపతికి సలాముగొట్టి మరల కలకత్తాకు కదలిపోతిని. నాడుగాని నేడుగాని ప్రకాశమును చూచినపుడు జాలికలుగును గాని కోపమురాదు.

ప్రకాశముబుఱ్ఱలో గుంజులేనట్లే కడుపులో కుళ్లులేదు. ఒకని కష్టపెట్టవలెనని ఈతను కలలోనైన నూహింపడు. దూరదృష్టి లేనివాడుకావున తఱచుగ నీతడు చిక్కులలో కూలబడుచుండును. ఈతని దాపున జేరువారి కీతనిజిహ్వ పట్టుకొనితీఱును. ఇతని మాటలు మోటుగానుండును. కాని యివి యెదుటి మనసున పోటుబెట్టవు. తనయంతరంగమిత్రుడు జాన్సనును గుఱించి గోల్డ్‌స్మిత్ వాకొనిన నుడువులు ప్రకాశముపట్ల జెల్లును.*

నాడు నేను కలకత్తా కరిగినపిదప "స్వరాజ్య" పడుండినది. పడపడి పునరుద్ధరణ మందినది. సంతోషము. ధాత సంవత్సరాదినుండి ప్రకాశము "ఆంధ్ర స్వరాజ్య" పత్రికను నెలకొలుపు నను వదంతి పుట్టినది కాని ఆంగ్ల 'స్వరాజ్య' మరల నిద్రామగ్నమైనది. ఈమాసాంతమునుండి మరల నది తలసూపుననియు, తోడ్తోడనే తెలుగు స్వరాజ్య నెలకొనుననియు వినుచున్నాము. ఈయుద్యమము నెఱవేఱుగాక! కవలలట్లీపత్రిక లాచంద్రతారార్కము నిలుచుగాక!

'స్వరాజ్య' పత్రికాజీవనము ప్రకాశముయొక్క ప్రకృతిని చెప్పక చెప్పుచున్నది. నిజముగ నీతడు జోగియైన దీ పత్రికాపుత్రికకొఱకే! పట్టుపరపులనుండి దిగి కటికినేలను శయ్యనుచేసికొనినది, తొలితరగతి రైలుపెట్టెనుండి చోటులేని తుది తరగతిలోనికి జారినది, కలమాన్నమునుండి గంజిమెతుకులలోనికి దిగినది, దోసిళ్లాది రూకలను వదజల్లి నే డనివార్యమైన అక్కఱలకై అవస్థపడుచున్నది 'స్వరాజ్య' కొఱకే! ఈ

---

"He has, to be sure, a roughness in his manner; but no man alive has a more tender heart, He has nothing of the bear but his skin."

"స్వరాజ్య" నిక్కంపు స్వరాజ్యమునకు సింహద్వారము కాగలిగినచో ఈరాజకీయ భిక్షుకుని తపను పండిన దని భారతాంబ ఎంతో మురియును. ప్రకాశము ప్రయత్నముపై పచ్చతోరణము గోచరించునో, గోచరింపదో తెలుపజాలను. కాని, యీస్వార్థత్యాగిప్రయత్నమహత్త్వమునకు చేతులు జోడింపనివా రుండరు. పిడుగులు తలపై ఢుల్లిపడుచున్నను, తనయున్నతాశయమునుండి దృష్టిమరల్పని స్థితప్రజ్ఞులు మానవమాత్రులందు నెంద రుందురు? విజయుని దృష్టిని, జగదీశుని చూడ్కిని ఆకర్షించువా రిట్టి మహాపురుషులే కదా!

'ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్,
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే.'
(శ్రీభగవద్గీత, అధ్యాయము ౨; శ్లోకము ౫౫)

ప్రకాశమునకువలె, శ్యామసుందర చక్రవర్తికిని కొంతపోలిక కలదు. రాజకీయములందు ప్రవేశించి ప్రకాశమువలె నిక్కంపు సన్యాసియైన మహాపురుషుడు శ్యామసుందరుడు. అతడు నిరుపేద. అరవింద, తిలక్, లజపతి, చిత్తరంజన్, గాంధి ప్రభృతులతో కలసి మెలసియుండి మాతృభూమిని సేవించినాడు. వంగ హిందీ భాషలలోవలె నాంగ్లమున చక్కని పరిశ్రమ చేసినాడు. హృదయము నాకర్షించు ఆంగ్లమును వ్రాయు కొలదిమంది భారతీయులలో శ్యామసుందరు డొక్కడు. ఈతనిశైలినిజూచి ఒక్కొకపుడు ఇది యరవిందుని రచనయేమో!" అని యనుకొందుము. కలకత్తాలో, సీల్డాదాపున, హుజూర్‌మల్ లేన్‌లో కానినెలగల పత్రికను నెలకొలిపినాడు. నాన్‌కో ఆపరేషన్ రోజులలో ఈతని "Servaut" చేసినసేవ అత్యద్భుతమైనది. కాని, యీతనిపేదఱిక మీతని పత్రికను పట్టి పల్లార్చినది. అది నేలగూలినది. శ్యామసుందరుడు పలుమారు కారాగారమున ప్రవేశించినాడు. కొంతకాలము అరణావెలగల ఇంగ్లీషు "వసుమతి" లో పనిచేసినాడు. వృద్ధుడై పడరానిపాట్లుపడిపడి తుద కాయువును గోల్పోయినాడు. "కఠినదారిద్ర్యము వలన గలిగిన తెవులొకటి ఈతని జంపివేసిన" దని సురేంద్రనాథసెన్ ఆల్‌బర్ట్‌హాల్ మీటింగు (౧౯౩౨) లో చెప్పగ వింటిని. శ్యామసుందరునిగుండె నిండుకుండవంటిది. ఈతనిది పెద్దకంఠము. కివ్వన కేకలువేయుచు నీత డుపన్యాసమిచ్చువాడు. రాజకీయములతో నారంభించి, భూగోళము నొకమారు చుట్టివచ్చి, ఖగోళమున కెగసి, గురుగోవిందుని వృత్తాంతముతో నీతడు మూడు గంటలలో తనయుపన్యాసమును ముగించువాడు. యోధాగ్రేసరునివలె నెంతోయావేశముతో ధోరణిని మొదలిడి ఆకుదానివలె డగ్గుత్తికతో దాని నీతడు తెముల్చువాడు.

ఉపన్యాసము, వ్యాసము, కథ, పద్యము, స్త్రీరూపము ఒకే తెగలోనివని నాయభిప్రాయము. స్త్రీరూపమునకు వలసినవి సౌందర్యసౌష్ఠవములు. పచ్చని మేనిచాయ గలదియైననేమి, అంగసౌష్ఠవము లేనిదేని ఆడుది రూపవతికానేరదు. అక్కఱకుమాలిన అంగము అందమును చెఱచును. దబ్బపండునకెనయైన చాయగలిగినను, రెండుముక్కులతో నొకయాడుది ప్రత్యక్షమైనచో "అమ్మో!" యని తుళ్లుమనమా? గంధఫలివలె నుండవలసిన నాసిక జీడిమామిడికాయవలె నున్నచో, ఉపమలకై తడుములాడుకవి దానినిచూచి సిగ్గుపడి పాఱిపోడా? తిమ్మయమ్మను చంద్రాననయని వర్ణించుటకాతనికి మన సెట్లు ఒప్పును? గూనుగల యువ్వను జవ్వని యనగలడా? అక్కఱకుమాలిన కండగలిగి, ఎంతో క్రొవ్వునుపెంచిన ఆడుది పిల్లకొండవలె, వీథియరుగుడంబున, దరోతీస్త్రీమరుచందమున నుండదా? వినాయకుని అప్పగారని ప్రజలీమెకడనుండి పాఱిపోరా? ఆడువారివ్రేళ్లు బెండకాయలట్లుకాక పొట్లకాయలవలెనో, నాగుబాములవలెనో ఉన్నయెడల ఎదుటిగుండె దడదడలాడదా? ఆఱువ్రేళ్లుకలచేయి అసహ్యముగా నుండదా? కథకు అక్కఱరాని సరుకు కథలో చేరిన యెడల, అది కంతులతో వికృతమైన శరీరమువలె, వ్రణములతోనిండిన యొడలువలెవున నుండును. పద్యముపట్ల, వ్యాసముపట్లగూడ నీపలుకు చెల్లును. కాని శరీరమునకు తగుసౌష్ఠవము కావలెననిన అక్కఱకైన రక్తమాంసము లుండవలెను. వీనిని కొఱవడిన కాయము వెదురుకఱ్ఱకు చెల్లెలివలె, చీపురుపుల్లకు అక్కవలెనుండి సృష్టికర్తకు తలవంపులుతెచ్చినను దెచ్చును. వ్యాసమందును, ఉప

'న్యాసమందును అంగప్రత్యంగములన్నియు నుండవలెను. ఇవి పుష్టిగలిగియుండవలెను. శరీరసౌష్ఠవమును గ్రహింపుటకు మాపుగల కన్నుండవలెను; వ్యాసమును గుర్తింపుటకు చక్కని ఆంతరంగికదృష్టి యుండవలెను. వివిధాంగములనుజూచి "ఎందులకీసంఖ్య?" యనరాదు. ఉండవలసిన అంగములందు లోపము గోచరించినను, వానిసంఖ్యతగ్గినను అందముచెడదా? వీనియన్నింటికిని ఆంతరంగికమైన సంబంధ ముండును. ఏదేనియంగము తెగిపడినయెడల వ్యాసము కుంటుపడదా? పరీక్షించిన యెడల ఆదర్శవ్యాసమందు, చక్కనియుపన్యాసమందు Sensory nerves, motor nerves ఉండును. ఇవి నిడివిగలవైననేమి, ఆజానుబాహువులైన రామలక్ష్మణు లట్లుండును. సురేంద్రునిభావవలె బిపిన్‌చంద్రపాల్ భావ ఎన్నో మెఱపుల నెఱుగదు; కాని పాల్‌మహాశయుని వ్యాసమందును, ఉపన్యాసమందును అక్కఱకుమాలిన సరుకు ఉండెడిదికాదు. వానిసౌష్ఠవము, సౌరు అద్భుతములు. కూడలిమాంసము నెఱుగవుకావున వానిగమనము చక్కనైయుండెడిది.

విభజనాదిక్రియలు (Analysis, Division, classification etc) సైన్సునకు సంబంధించినవి. ఈ నిబంధనలను పాటించి కళ తనచిత్రములను చిత్రించును. బొమ్మను అల్లదలచినబాలిక తొలుత బొమ్మరూపమును ఏర్పఱచుకొనును. పదంపడి దానిపై రంగుదారములల్లి మనోహరమైన రూపమును సృష్టించును. రాగమందలి కళలకును, ప్రతిమయందలి రంగులకును, నృత్యమందలి వివిధభంగిమములకును, ఎమ్మెలపై శోభిలు వివిధాంగ ప్రత్యంగములకును, వివిధ వ్యాసాంగములకును, కథా భాగములకును, ఉపన్యాస భాగములకును పరస్పర సంబంధ ముండితీఱును.

శ్యామసుందరుని ఉపన్యాసమందు చక్కని భాషను చూడజాలువారము. కాని అందు సౌష్ఠవమును గాంచువారముగాము. అతనిధోరణిలో analysis ఉండెడిదిగాదు. సన్యాసియైన శ్యామసుందరునకును, జోగియైన ప్రకాశమునకును ఎంతోపోలిక యున్నట్లు వక్తయైన శ్యామసుందరునకును, ఉపన్యాసకుడైన ప్రకాశమునకును ఎంతోపొందు కలదు. శ్యామసుందరుని వలె ప్రకాశము కెవ్వుకెవ్వున కేకలువేయజాలక పోయిననేమి, ఆతనివలె చక్కనిభాషను ప్రయోగించు టెఱుగక పోయిననేమి, ఆతనిపగిది వానాలప్ప తిరుగు టెఱుగును. ఏదోధోరణి మొదలిడి, దండకారణ్యములను, సప్త సముద్రములను దాటి తనకూడ శ్రోతలను చెడద్రిప్పి, తుదకు వారి నేయండమానులలోనో ప్రకాశము విడిచి వేయును.

చెప్పబోవు విషయమున చక్కని పాండితి నలవఱచుకొనిన సాహితీవిశారదుడే మంచివక్త కాజాలును. ప్రకాశముయొక్క ఉపన్యాసములలో నైదు ష్యముసున్న. ఆంగ్లసాహితియందు గాని, ఆంధ్రసాహిత్యమునగాని ప్రకాశమునకు ఆనంతయైన ప్రజ్ఞలేదు. వివిధ విజ్ఞానశాఖలం దీతడు విశేషప్రయాణము సాగించి యెఱుగడు. ఒకప్పుడు 'మారకము'ను గుఱించి ఇతడేమేమో చెప్పువాడు. చిత్రమేమన నొకపర్యాయము "మారకము"నుగుఱించి గుంటూరులో నుపన్యాస మొకటి యేర్పఱచి దానికి టిక్కట్లుపెట్టినాడు. అర్థశాస్త్రము నం దీతడు అందవేసిన చేయియనుట తప్పు. రాజకీయము లందైనను ఈతడు క్రమపఠనము నెఱుగడు. కంచుకాగడాలతో వెతకినను ఈతని యుపన్యాసములందు అసలైన సరుకు కానంబడదు. మాట్లాడవలసివచ్చినపుడు జంకుగొంకులులేక ఇతడేమేమో మాటలాడును. ఇతని ధోరణిలో బియ్యముకంటె ఊక అధికముగా నుండును. తవుడు సమృద్ధిగా నుండును.

వక్తృత్వమునకును, రచనమునకును ఒకేరీతివిజ్ఞాన సంపత్తి అవసరము. ఇట్టిసంపత్తి ప్రకాశమునకు నాడును లేదు, నేడునులేదు. ఇతడు వక్తకాడు, వ్రాతగాడును కాడు. పట్టుమని ప్రకాశము సొంపుగ పదిపంక్తులను వ్రాయగలడనుట కెట్టినిదర్శనములును కానరావు.

జీవనాంగణమున జరుగవలయు క్రియలెన్నో యున్నవి. అన్నిటిని ఒక్కడెన్నడునుచక్క బెట్టలేడు. యోధుడు కవితజెప్పలేడు. కవి కదనాంగణమున కం

డలు నేలరాల్పలేడు. ఇరువురును విశాలహృదయులే. ఇర్వురగుండెలును స్వర్గమునకు ప్రతిరూపములే! ఏకైక హృదయశక్తిని క్రమనిష్ఠకతన నిరువురును విభిన్నపంథలందు వ్యక్తీకరింతురు. అంతియే! రణోర్వియందు ప్రకాశమును మించిన మహారథుడింకొక డుండడు.

సైమన్ కమిషన్ తో లుత చెన్నపురిలో కాలిడినపుడు చాలయల్లరిజరిగినది. అపాయకరస్థితియందుకదా మనుజుని సత్తువయెట్టిదో, ఉద్దేశమెట్టిదో, హృదయమెట్టిదో స్పష్టమగును. సూర్యునిజూచి పరుగులెత్తు అంధకారమువలె అపాయమునుచూచి వాచాలురు కాలునకు బుద్ధిచెప్పను. ఫలియెుమటు నిలిచినపుడు మహోపన్యాసములును, మధురగీతికలును, ఘనపాండితియు బనికివచ్చునా? నాటియల్లరిలో నేనో ముసలమున్నదని ముందే యూహించిన మదరాసుమహా వక్తలు తోకలు ముడుచుకొని తమ కలుగులలో తాము దూరిరి! వక్తకాని ప్రకాశము, మనుష్యుడైన ప్రకాశము, రచయితకాని ప్రకాశము, ఆంధ్రకేసరియైన ప్రకాశము రాజస్థానరణాంగమున చివాలున లంఘించిన రాణాప్రతాపునివలె నాటి భీషణవిజృంభణమున దుమికినాడు. ఎంతకును అధికారులకు లొంగని బహుళ సంఖ్యాకుల నొక్కమాటలో కూడజేరదీసికొనినాడు. ఆంధ్రకేసరిసింహనాదములేపిన ప్రతిధ్వనులు నేడును శ్రుతిగోచరమగుచున్నవి! గుండె నెదుట నిలిపి ప్రకాశం గుండుదెబ్బల నాహ్వానించినాడు! ఆత్మత్యాగము గావించుకొన దలపడినాడు!

మనుష్యజీవనముపై మణిమకుటమును నిలుపునది, మనుష్యజీవనమును నవరత్నములతో పూజించునది, మనుష్యజీవనమును దివ్యసింహాసనమున నాసీనగావించునది, మనుష్యజీవనమునకు మహాయుగములచే నూడిగము జేయించునది, మనుష్యజీవనమున కమరత్వము ప్రసాదించునది, మనుష్యజీవనమున దివ్యభావమహోదధుల నుప్పొంగించునది, మనుష్యజీవనమునకు శతకోటినక్షత్రజ్యోతులతో నివాళియిచ్చునది, మనుష్య జీవనమును శమంతకకౌస్తుభమణులచే నలంకరించునది ఇట్టియుద్భుత త్యాగమే! గుట్టలకొలది పుస్తకములను దిగమ్రింగినంతన మనుష్యజీవనము ధన్యత గాంచదు. రాశిరాసులుగ ధనమును ప్రోగొనరించి వానిచుట్టును భజనచేసినంతన మనుష్యజీవనము సార్థకముకాదు. జీర్ణముకాని గ్రంథములకు కడుపులో గూడ చెదపట్టతీరును. పంకిలమందు ప్రోగొనరింపబడిన ధనము పేడకుప్పయై, క్రిమిప్రపంచమున కాలవాలమై, దుర్గంధమునకు పుట్టినిల్లయి యుండును. దుర్గంధము నాశ్రయించునది దౌష్ట్యము; పంకిలమునకై ప్రాకులాడునవి దోమలును, ఈగలును. పాపియైన ధనికునిచుట్టును జేరు వందిమాగధులు దుష్టక్రిములే! ఆతనికి నైవేద్యమగునది కంపుగొట్టు పొగత్రయే. కౌపీనధారియైనను, కడలేని గ్రంథములను మెక్కకపోయినను, తన రక్తమాంసముల నొరులకు కలమాన్నములు జేయువాడు, తనయెముకలచే దరిద్రనారాయణునకు పాకలు నిర్మించునాతడు, తన యెత్తుగుండియను జగదీశునకు ముక్కాలిపీట జేయువాడు, తనజీవనమును తునకతునకలుచేసి కాలుచున్న కడుపులను నింపునాతడు, వాడిమేకులకో, ఈటెముల్లకో, విచ్చుకత్తులకో, చింతనిప్పులకో పరార్థజీవియై తనప్రాణము లప్పగించువాడు నేడు పలుగాకుల జుగుప్సకు, దుర్మతుల క్రౌర్యమునకు, గుష్టుల వెక్కిరింతలకు, పాపుల యుమ్ములకు, దుమ్మునకు, దూషణలకు పాల్పడిననేమి, రేపు పదునాలుగుభువనములు నీతని పవిత్రజీవనమును యాత్రాస్థలముజేసికొని, దానిచుట్టును జేజేలు పాడును! ఈతన తలపై రాలిన దుమ్ము రేపు పుప్పొడియగును! ఈత డోడ్చిన రక్తబిందువులలో నొక్కొక బిందువందు కోటికోటివీరు లుద్భవింతురు! ఈతడు రాల్చిన కన్నీటిచుక్కలు అవిరళామృతధార లగును! ఈతనిపై నెల్లకాలములు పూలవానలు కురిపించును! ఈతని యద్భుతగుణము నలవఱచుకొనుటకే దేవతలు మనుష్యులై పుట్టి భూలోకమున మసలుదురు! ఈతని మహత్తరజీవనము మహాకవుల హృదయములందు భావస్రవంతుల నుప్పొంగించును! త్యాగులచుట్టునుగదా వీరు తమమహాకావ్యముల నల్లినారు!

సాగరతీరమున ననంతగీతికను వినుచు చల్లని గాలిలో హాయి ననుభవించుచు, ఠీవిగా విరిదండలను దాల్చి, మేఘ గంభీరస్వరమున బహుసంఖ్యాకుల ప్రాణాల దేశభక్తిని ప్రదర్శించుటొకటి, వక్తృతాకౌశలము నెఱుగక, పిడుగులురాలుచున్నను తడయక, అడలక కర్తవ్యరంగమున లంఘించికన్నతల్లికై ఆత్మజీవనమును నైవేద్యముగనర్పించుట వేఱొకటి! చేవగలరచయితలెందఱోని యున్నారు, వినుతికెక్కిన వక్తలున్నారు, బహుశాస్త్రపారంగతులైనవా రున్నారు. వీరందఱును మనుష్యులని తలచుట తప్పు. వీరిలో కర్తీశ్వరుడు చాల కలరు. కలుషమందు కలము ముంచిన రచయితలను, గుండెయందు యమలోకము నిముడ్చుకొనిన వక్తలను, దౌష్ట్యమున దిగబడిన శాస్త్రవేత్తలను ప్రపంచ సారస్వతము మనకనులెదుట నిలుపుచున్నది. ధూర్తులైన విద్వాంసులు ప్రపంచమందు ప్రత్యక్షమగుచున్నారు. ఈరీతివిద్వాంసుల సంఖ్య నేడు తెగబలియుచున్నది. మనుష్యుడుగాని వక్త ఉన్ననేమి, లేకున్ననేమి? మానవత్వమును నటమాయమొనరించిన వ్రాతగాడు పుట్టిననేమి, గిట్టిననేమి? మనుష్యత్వమును చంపుకొనినవిద్వాంసుడు బ్రతికిననేమి, చచ్చిననేమి? వక్తగాక, వ్రాతకాడుకాక, మహావిద్వాంసుడుగాక ప్రకాశము మహావీరుడైనాడు, మహాత్యాగియైనాడు, మనుష్యుడైనాడు. మనుష్యులైనవారీతనిజీవనముపై మణిమకుటమును నిలిపి తీఱుదురు.

గాంధివంటినాయకు లున్నతావున ప్రకాశముపోలు యోధు లుండకతప్పదు. "ఏమి ?", "ఏల ?" అని ప్రశ్నించుట యోధునకు తగదనియు, "నాయకునిమాట శిరసావహించుటే ఆతనికర్తవ్య"మనియు టెన్నిసన్ మహాకవి పలికినాడు. నాయకులుకావలెనని కాంక్షించువారిసంఖ్య అధికమైయుండును. ఒకనియాజ్ఞను తలదాల్చినిర్వహించువారిని అఱుదుగా చూడము. రామచంద్రునివంటి అవతారపురుషులు మఱితొమ్మండుగురు పుట్టిరి, గిట్టిరి. హనుమంతునిబోలిన సేవకుడును, యోధుడును రెండవవాడు పుట్టనేలేదు. పుట్టినహనుమంతుడు గిట్టక నేడును మనియున్నాడని చెప్పుకొనుచుందుము. సేవామహత్త్వము చావదనిగదా ఈ యంశమువలన మనము గ్రహింతుము! దండములుగ్రహించుటకు [illegible] తెగదిద్ది, ముందులకువచ్చువా రెందఱో ఉందురు. భక్తివినయములను రెండు చేతులతో జోడించి సేవ నిలువేలుపుజేసికొనువా రెందఱున్నారు? నాయకునికంటె ఆతనిచేతిక్రింద నుండువాడే మహాత్యాగియని చెప్పదును. నాయకునిదోసిలందు యశశ్చంద్రికలు రాలును. ఎఱుకబడకుండగనే పదాతి ప్రాణములనర్పించును. ఈతనికై యెందరు పొగులుదురు?

గాంధి అడుగుజాడలనుబట్టి నడచిన మహనీయుడు ప్రకాశము. గాంధియంతరంగశిష్యులలో ప్రకాశమొక్కడని పలికినాడు శంకరనాయరు. కొంతకాల మైశ్వర్యమనుభవించిన ప్రకాశము ఆకస్మికముగ బూడిదబుస్సన్నయైనాడు. ఈతనితో నీతనియర్ధాంగలక్ష్మి పడరానిపాట్లుపడినది. తుద కాయిల్లాలు తనదారి తాను చూచుకొన్నది. దరిద్రుడైనప్రకాశమునకు నేడు పెండ్లాము లేదు. బారిష్టరైన ప్రకాశము, మేడలందు, మిద్దెలందు వసించిన ప్రకాశము నేడిట్టులైనాడు. గుండెలేనిరాళ్ళు కూడ ఈ యమాయకుని దుస్థితిని చూచి కడవలకొలది కన్నీటిని విడువవా?

కష్టమునుచూచి వెఱవకుడని తెలుపుచుందును. మనుష్యసహనమునకు హద్దుకలదని యిపుడు చెప్పవలసి వచ్చినందులకు దుఃఖించుచుంటిని. పుట్టినదిమొదలు చచ్చువఱకు మనుజుడు దేనినిగాని కిక్కురుమనకుండ సహించుచునే యుండగలడా? మనుష్యహృదయము "వజ్రాదపి కఠోర"మనిన భవభూతి "కుసుమాదపి మృదు" యని గూడ పలికినాడుకదా!* ప్రఫుల్లహృదయమునకగ్నికణమునురాల్చునది ఘోరదారిద్ర్యము. కావుననేకాబోలు ఒకతమిళకవి "జగదీశా! ఎట్టికష్టములనైన నాకిమ్ము గాని దారిద్ర్యమువలద"న్నాడు. ఉన్నత గుణగ్రథనమునకు దారిద్ర్య మవసరమైనను, ఇది హద్దు

* 'వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి, లోకోత్తరాణాం చేతాంసి కోనువిజ్ఞాతు మర్హతి."

మీఱి పోరాదు. హద్దుమీఱిన పేదఱికముకతన సాధారణులమాటయటుండ పెద్దపెద్దలే గంగపాలైరి. ఆంధ్రులలో శమంతకమై తేజరిల్లిన దుగ్గిరాల గోపాలకృష్ణయ్య వీరిలో నొక్కడు. ధనముపై నీమహాపురుషు డెన్నడు కన్నునిలుపలేదు. ఈత డెట్లో విదేశమున చదువుసాగించినాడు. ఈతని లేఖలను జూచినపుడు, నిప్పచ్చర మీతని నెల్లవేళలం దాశ్రయించియుండెనని గ్రహింతుము. గాంధి శిష్యుడై యితడు 'సెంటుపెర్సెంటు' జోగియైనాడు. తుదకు ప్రాణములర్పించుటకు మున్ను తనశరీర మందలి మూడువంతుల నీతడు దారిద్ర్యమునకు నంజకొన జెట్టినాడు. దేశభక్తికి దారిద్ర్యము కట్నమైనది ఒక్క భారతదేశమందే! విద్వాంసు డొకడు కఠినదారిద్ర్యమునకు కబళమగు ప్రారబ్ధము సభ్యజగతిలో ఒక్క భారతదేశమందుమాత్రము కానబడుచున్నది. మనదేశమందు చెల్లుబడియగుచున్న ఆర్థికవిధానమే యీదుస్థితికి కన్నతల్లియైనది.*

దురంతదారిద్ర్యమును కవుంగిలించుకొనిన ప్రకాశము కడలేని భారతదారిద్ర్యమును కడమట్టించుటకై శ్రమపడుచున్నాడు. ఆకలి దప్పుల నడంచి, ఎండవానల నోడించి, భీమకర్ముడై యితడు దేశమందు మసలుచున్నాడు.

రాజకీయముక్తికిని, ఆర్థికముక్తికిని అవినాభావ సంబంధమున్నది. రాజకీయముక్తి యిప్పుడు లభించినను, లభించకపోయినను ఆర్థికపాలనావిధానమున అనుకూలమైనమార్పులు జరిగినను, జరుగకపోయినను, గృహపరిశ్రమల నుద్ధరించియు, సంఘమందు విజృంభించు దురాచారముల దుంపతెంచియు, హరిజనుల నుద్ధరించియు, భారతజాతిని పీడించు దుస్థితిని కొంతవరకైన మాపుచేయవలెనని మహాత్ముడు నిశ్చయించినాడు. ప్రకాశము ప్రభృతులు నాయకుని అడుగుజాడలబట్టి నడచుచు నీయుత్కృష్టాశయసిద్ధికై వేయిపరువులు వోవుచున్నారు.

మనదేశమందలి వివిధపరిశ్రమలనుగురించి ఈతనిలో నన్యోన్యవ్యక్త భావములు చెలరేగినవి. వీనిని చెండాడి గాంధి గృహపరిశ్రమలను పునరుద్ధరించుచున్నాడు. చేసి చెప్పుట ఈతని యభ్యాసము. ఒకప్పు డీతడు చాకలిపని చేసి గోఖలేను మెప్పించినాడు. చెప్పులుకుట్టి ఒకతెల్ల నెచ్చెలికిచ్చినాడు. పాకీపనిచేసి ఒకప్పుడు రవీంద్రునకును, శాంతినికేతనవాసులకును ఎంతో ఆశ్చర్యమును

* ఈయార్థికస్థితిని గుఱించి కొలదిమాసములకు మున్ను మన రాధాకృష్ణు డేమనినాడో గమనింపుడు: An economic condition which doesnot offer secure and self- respecting employment to millions of young, brainy, educated and sensitive men and women, has no justification. It is absolutely neces-sary to bring about a radical revision of our present economic condition" తన తాత్త్విక జ్ఞానమును తన యంగరక్షగా జేసికొని మఱియువాడు కాడు రాధాకృష్ణుడు. భారతావనిప్రస్తుతదుస్థితికై దుఃఖింపగల దొడ్డమనిషి రాధాకృష్ణుడు. దానికై ఆగ్రహింపగల వీరుడు రాధాకృష్ణుడు. నేడీతడు ఆక్స్‌ఫర్డున పూజనీయుడై ప్రాచీప్రతీచీసఖ్యమునకై శ్రమించి, పదంపడి స్వీయసీమముక్తికై, మానవాత్మముక్తికై పాటుపడునని జోస్యము చెప్పవచ్చును. వేడిపెనమునుండి రాలిన నూనెబొట్టులు రాధాకృష్ణు డుచ్చరించినవాక్కు సంతప్తహృదయమునుండి వెడలినది. నేటిదుస్థితికి రాధాకృష్ణుడు తనునాపథమును పేర్కొనినాడుకాడని "The MadrasMail" అతని నెత్తిపొడిచినది. రాధాకృష్ణుడటుండ, గాంధియైన నీదుస్థితిని పోగొట్టగలడా? ఈ దుస్థితిని దెచ్చిపెట్టిన కారణములను దునుమాడునవి దేశస్వాతంత్ర్యమును, అనుకూల ప్రపంచ పరిస్థితులును. రాధాకృష్ణుడు తాత్త్వికుడు, గాంధి మహాత్ముడు; వీరు మాంత్రికులు కారు. శాంతము నుద్బోధించు మహాపురుషులు. చేత నధికారము నందిననాడు వీరు దేశదౌర్భాగ్యమును మాపుచేయగలరు. భారతసీమయంతయు నొకపెద్దజెయిల్ అనినారు గాంధి, జవహర్‌లాలులు. రాధాకృష్ణుడును ఈజెయిల్‌లోనివాడే! మహావిద్వాంసుడైననేమి, కారాగారవాసి యేమిచేయగలడు? ఘోషపెట్టగలడు. కన్నీరొడ్వగలడు. విన్నపములు అధికారులచెవి సోకనపుడు, శాంతిమంత్రము వారికి తారకమంత్రము కానపుడు వారి హృదయపరివర్తనమునకై, తాను తెలుపుచుండు Inward reneawal కై వేయిదేవుళ్లకు మ్రొక్కగలడు. అంతియే !

గలిగించినాడు. నేతకాడవనియు, కర్షకుడవనియు, ఎన్నికవలన హరిజనుడవనియు మహాత్ముడు తెలుపు కొనుచుండును.*

గాంధీజీవలె కర్షకుడును, నేతకాడును కాగలుగు వాడు ప్రకాశము. కలమునుబట్టజాలని ప్రకాశము చక్కగ హలమును బట్టగలడు. నేడు కర్షకక్షేత్రమే ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమైనది. ఒకచేత నాగలిని, రెండవచేత రాట్నమును బట్టు ప్రకాశము రేపటిముక్తిదాత కాగలడు.

ఆంధ్రజాతి పునరుద్ధరణమునందినగాని భారత పునరుద్ధరణమునందని పొల్లానలేదు. వంగీయులవలె భారత సమస్యలపై ఆంధ్రులు వేళ్ళొకకన్నుంచవలెను. ఈవిషయమునకు ఆంధ్రులీవఱలో నవగతులుకాలేదు. రేపు నెలకొను ఫెడరల్ విధానమున లోపము లెన్నో పొడసూపును. అయినను, దానికతన ప్రత్యేకజాతులును, ప్రత్యేకరాష్ట్రములును ప్రాముఖ్యమందితీఱును. ఆంధ్రజాతి తన ప్రత్యేకవ్యక్తిత్వమును, ప్రత్యేక ప్రజ్ఞను నిలుపుకొనవలెను ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రి మేర్పడిన

* మహాత్ముని గురుగంభీర ప్రబోధముకతనను, మహత్తరదృష్టాంతములవలనను భారతావనియం దద్భుత భావసంచలనము కలిగినది. ప్రజలమనసులు వికసించి నవజీవనసౌరభమును వెలారించినవి. భీరువులైపడియున్న వారు వీరులై తలలెత్తిరి. అహింసాతత్త్వమును గుర్తించి అసిధారావ్రతదీక్షకు గడంగి, 'అనంతవిజయము' ను పూరించి, అవనీతలమున అపూర్వదృశ్యమును ప్రదర్శించిరి. జవహరుపండితుని పలుకులను పరికిలింపుడు:

"It was this extraordinary stiffening up of the masses that filled us with confidence. A demoralized, backward, andbroken-up people suddenly straightened their backs and lifted their heads and tookpart in disciplined, joint action on a country-wide scale. This action itself, wefelt, would give irrestitable power to the masses. We ignored the necessity ofthought behind the action; we forgot that without a conscious ideology and objective the energy and enthusiasm of the masses must end largely in smoke To some ex-tent the revivalist element in our movement carried us on; a feeling that non-voilence as conceived for political or economic movements or for righting wrongs was a new message which our people were destined to give, to the world." (Vide Pandit Jawaharlal Nehru's Autobiography" Page 76.)

గాంధిజీ రాజకీయములనుండి తరలుటచేతను, చిత్తరంజనమోతీలాలు మహమ్మదలీ మున్నగు సర్వోత్కృష్టమహారథులు దివంగతులగుటచేతను, కాంగ్రెసువారు లందే అభిప్రాయభేదములు పొడసూపుటచేతను, కొందఱు పెద్దలనబడువారిదృష్టియే పదవులమీదను, పైకముపైనను, బిరుదులదిక్కునను ప్రాలుటవలనను, పెద్దలయడుగుజాడల బట్టిచను ప్రజలందు నేడు నాటిదీక్షగాని, పట్టుదలగాని గోచరించుటలేదు. నిర్దిష్టనియమములపై హంసపాదులెగ ప్రాకినపుడు, ఏకాగ్రదృష్టికి భంగపాటు కలుగదా? విమర్శింపక ప్రజలు నేడేపాటకైనను అనుపల్లవిపాడుచున్నారు. తొల్లింటి భావౌన్నత్యమునుండి జారిపడుచున్నారు. తమమణిబంధములమీది కంకణములను సడలనిచ్చుచున్నారు. ముందంజవేయుటకుమాఱు చతికిలపడుచున్నారు. దురదృష్టము. కాని మొయిలుపై కెంపుకాంతి తళుక్కుమన్నది! భారతరాజకీయ దిగ్వలయమున జవహరు తేజరిల్లుచున్నాడు! మహాత్మునివలెనొరుల కష్టగండ్లను తనవిజేసికొని, పరార్థజీవియై, ఈతడాత్మసుఖమునకు తిలోదకములు వదలినాడు. ఇట్టిత్యాగులకతననే దేశదౌర్భాగ్యము చచ్చితీరును. నేడుగాకున్న రేపైన భారతభాగ్యోదయము పొడసూపును. నాగేశ్వరరావు ప్రకాశము ప్రభృతు లిట్టిత్యాగులు. చెన్నరాష్ట్రి కాంగ్రెసు పార్లమెంటరీబోర్డున కిపు డాతి దధ్యక్షుడు, ఈతడు కార్యదర్శియుగదా! వీరిపురోభాగమున నిపుడు మహత్తర కర్తవ్యముకలదు. తమ Manifestoలో కాంగ్రెసు వీరులు తమ గంభీరాశయములను వ్యక్తపఱచిరి. ప్రజాదృష్టియం దివి దివ్యజ్యోతులై వెలుగొందుగాక!

గాని ఈయాశయము పూర్ణముకాదు. ప్రత్యేకరాష్ట్రమందే ఆంధ్రసారస్వతము వృద్ధినందును; ఆంధ్రజాతి తక్కినజాతులవలె గొంతయభ్యున్నతి నందగలదు. ఒకే తల్లికడుపునపుట్టి, ఒకేజనని స్తన్యమును గ్రోలితిమను విషయమును మఱువక తమరాష్ట్రమునకై ఆంధ్రులు ఆందోళనము సలుపవలెను. ఆంధ్రసమస్యకై ఆంధ్రమహాపురుషు లీవఱలో శ్రద్ధవహింపలేదు. ప్రకాశముప్రభృతులు భారతరాజకీయములందు మునిగియుండిరి. వీరులందు వీరులైన వీవురుమగ లెందుబనుండ "ద్రౌపదీవస్త్రాపహరణము" ఒకప్పుడు భారతభూమియందు ప్రదర్శింపబడెను. ఒకప్పుడాసేతుశీతనగమువఱకు రాజ్యమేలిన ఆంధ్రులు కష్టైదుః నిలిచియుండ, ౨ కోట్ల ౩౦ లక్షల ఆంధ్రవీరులు మనియుండ పంద్రెండుకువేల చదరపుమైళ్ల విస్తీర్ణముగల ఆంధ్రభూమిపై నొరులచేతులు పడినవి. కాలక్రమమున ఆంధ్రభూమియందలి ముఖ్యభాగములు తమిళులపాలబడును; కర్ణాటకవాసులచేత బడును. ఆంధ్రులకై మిగులు నేల కాపీనమందగ్ధభాగముండును. తమరాష్ట్రమున కపచారము జరుగుచుండ నాంధ్రులు నిద్దురపోవుచున్నారు. తమ యాంధ్రత్వమును గుర్తింపక తమ మనుష్యత్వమునకు వీరు తలవంపులుదెచ్చుకొనుచున్నారు. ఇప్పుడైనను తమ్మగ్రజాచి "ధిక్" అని వీరు లేచినయెడల జరిగినఅపచారము బూడిదలోని యక్కరమట్లు అదృశ్యమగును. వంగీయులతో "వందేమాతరం!" అని యావేశపూరితులై పలికిన ఆంధ్రులువారు"సోనార్ బంగ్లా!"యని కంఠమెత్తిపలుకునట్లు "మాస్వర్ణ-ఆంధ్ర" మని ఒక్కమాటైన నుచ్చైస్స్వనమున బలికిరా? సుబ్బులోనున్న ఒకరిద్దఱాంధ్రులకు నేడు కొంత కదలిక పుట్టినది. శ్రీయుత సుసర్ల శ్రీరామనృసింహంగారు సంవత్సరాదినుండి "ఆంధ్రనవరాత్రములు" జరుపుడని మొరపెట్టుకొనుచున్నారు. ఊరేగింపులు, దీక్షాతోరణములు, బహిరంగసభలు జరుగవలెనని ఘోషించినారు. ఈయుత్సవములు తొమ్మిదినాళ్ల ముచ్చటైనవి! పండుగనాడు కట్టుకొనినతోరణములు నవమికడచినంతన పుటుక్కునతెగిపడినవి! తమయుద్దేశము సిద్ధించునంతదనుక తమకంకణములనాంధ్రులువిప్పరాదని గ్రహించిరికారు. మనికట్టులపై నిని మనియున్నంతకాలము తమనిశ్చయశక్తిని దూలింపరాదని యెఱిగిరికారు.

రాజకీయములందు విక్రమసింహులై విజృంభించిన యోధులు ఆంధ్రపునరుద్ధరణ మహోత్సవమున బాధ్గానవలెను. ఇట్టియుత్సవములు బహుళముగ వంగదేశమందు జరిగినవి. వంగరాష్ట్రరాజకీయములే పదంపడి భారతరాజకీయములైనవి. ఇందలిపరమార్థమును ఆంధ్రులు గుర్తించుట పాడి. ఇంటగెలిచినగాని రచ్చనెవ్వరు గెలువలేరు. ఆంధ్రధర్మమును నెఱపుకొనిననాడే మనము భారతధర్మము నిర్వహింపగలము. ఆంధ్రనాయకుల మనసులు స్థిరపడినపుడు, వారిలోసంఘీభావము పొడసూపినపుడు, ఆంధ్రమాతజై నవారు ఆదరంపు జూష్కి సారించినపుడు,ఆంధ్రప్రజలు కలయిక నెఱిగి చేతులుకట్టుకొని వారిమ్రోలనిలిచి యెట్టిముదలకైన శిరములొగ్గుదురు. యువకులుపల్వురు వారిమ్రోలకు నడుముకట్టుచు వత్తురు! వారితో సర్వపక్షములను సహకరించి, ఏకగ్రీవముగ జాతీయగీతినాలాపింతురు!

ఆంధ్రవిక్రమసింహులలో నాంధ్రకేసరియొక్కడు కదా! ప్రతిక్రియయందు తలమార్చి నేడీతడు అనేకుతుపారాదివఱకు పరుగులెత్తుచున్నాడు. తనయోపికను, తన ధైర్యమును, తన సాహసమును, తన శక్తిని, తన యుత్సాహమును కొంతకాల మీతడు స్వీయజాతి పునరుద్ధరణమునకై వినియోగింపవలెను. కేసరి ముందునిలిచిన నెగ్గజాలనిక్రియయేది? ఈతడు శంఖమును పూరించి నంతన ఈతనినైదోడులుంహుడ శంఖములను బూరించుచు, నేటికురుక్షేత్రమున జేరుకొందురు.

దీక్షాజీవియైనప్రకాశము, స్వీయసీమకై పాపలు ప్రకాశము,బాలకునివలె పవిత్రహృదయుడైనప్రకాశము, అసిధారావ్రతమున నాతితేలిన ప్రకాశము, మహోన్నతాశయమునకై తనతనువును, తనసాయుధ్యము పరిత్యజింపగల ప్రకాశము ఆంధ్రపునరుద్ధరణమునకై, భావిభాగతాభ్యుదయమునకై, మానవకల్యాణమునకై నవ్యశక్తితో, ద్విగుణీకృతోత్సాహముతో, నిరుపమానస్ఫూర్తితో గడంగిన మహాత్ముగుని నాకలమును స్వర్ణసలిలమున ముంచి, ఈతనిచరిత్రకు మఱింతవన్నెదెత్తును.

# ఆడవలసిన అబద్ధం

కొడవటిగంటి కుటుంబరావు

అతని పేరుతో మనకు ప్రసక్తి లేదు. అది చాలా సామాన్యమైన పేరు. ఆ పేరుగలవారు ఆంధ్రదేశంలో అనేకమంది ఉంటారు. మాటవరసకు అతన్ని నేతిసుబ్బారావు అని పిలుద్దాం.

ప్రతివాడికీ జీవయాత్ర విశాలమైన తారురోడ్ల మీద సుఖకరమైన మోటార్లలో ప్రారంభంకావటం అసంభవమే. కాని వారి అక్కడక్కడా అప్పుడప్పుడూ చదునుగా కనిపించకపోతే సామాన్యవ్యక్తికి పిచ్చిఅయినా ఎత్తుకుంది, ఆత్మహత్య అయినా చేసుకుంటాడు.

సుబ్బారావు ఏవిధంగానూ అసామాన్యవ్యక్తి కాడు. సామాన్యమానవుడు చెయ్యలేనిపని అతనేదీ చెయ్యలేదు. అయినా అతని జీవయాత్ర ముళ్ళకంచెల మధ్య ప్రారంభమై భయంకరమైన ఊబిలోకి తీసుకుపోయింది అతన్ని. రెండుసంవత్సరాలపాటు అతనికి పూర్తిగా మతిచెడిపోయింది ఇంకా రెండునెల్లలో అతనికి మంచిరోజులు వస్తున్నవనగా అతను ఆత్మహత్య కూడా చేసుకోజూచాడు. అందులోకూడా విధి తనకు విరుద్ధంగానే నడవాలా అని అతను చింతించాడు. అతని ఆత్మహత్యాప్రయత్నం జయప్రదం కాలేదు.

ఇంతకూ ఆరోజులన్నీ గడిచిపోయినై. ఇరవై మూడేళ్లు వార్ధక్యం కాదు. అందరిచేతనూ గర్హించబడే భీమాకంపెనీ ఏజంటుపని ప్రారంభించి సుబ్బారావు నెలకు నూరు, నూటయాభై సంపాదనలో పడ్డాడు. అతని కిప్పుడేమీ కొరతలేదు. అతన్ని అందరూ ఎంతో దయతో చూస్తారు. లోపల ఏమనుకుంటారో ఈశ్వరుడి కెరుక. పైకి అతన్ని ఎవ్వరూ అసహ్యించుకున్నట్టు కనిపించరు.

ప్రపంచంలో ఇంతమంది గొప్పవాళ్లున్నారు—కళోపాసకులు, శాస్త్రజ్ఞులు, ఉపన్యాసకులు, రచయితలు—వాళ్ల జాబితాకు అంతులేదు. అనుదినమూ అతనికి కనిపించేవారిలో సహాయం చేసి పేర్లు ఏదో కారణంవల్ల ఆంధ్రదేశానికి బాగా పరిచయములైనవే. వారితో తనకు పరిచయం కలగటమే తనభాగ్యం అనుకునేవాడు సుబ్బారావు. అతని పేరెంత సామాన్యమైనదో అతనుకూడా అంత సామాన్యుడే కదా! అతనిచేత గొప్పవారికింద గణింపబడేవారి కందరికీ విహ్యాంగా గోచరించే ప్రపంచం సుబ్బారావుకు చాలా భయంకరంగా కనిపించింది. ఇరవైమూడు సంవత్సరాలపాటు అన్నివిధాల ప్రాపంచికసుఖాలకూ దూరుడై ఉండిన సుబ్బారావు తాను చిట్టచివరకు ఈప్రపంచంలో సుఖపడటం భగవంతుడియొక్క దయవల్లననీ, ప్రపంచం తనకు చూపిన ఆదరంవల్లననీ నమ్మాడే కాని తన ప్రజ్ఞవల్లనని అనుకోలేదు. ఇంతకాలమూ తనప్రజ్ఞ ఏమి చెయ్యగలిగింది?

అతని కల్లా ఒక్కటేకోరిక—జరిగినదంతా స్మరణకైనా రాకూడదని. గతాన్ని అతను పూర్తిగా విసర్జించాడు; అందులో తన కేమీ మిగిలిలేదు—కనీసం అత నట్లా భావించుకున్నాడు.

పూర్తిగా రెండు సంవత్సరాలపాటు సుబ్బారావు తన కష్టదశను మరిచి ఈనూతన జీవితాన్ని ఆరంభించాడు. పాతస్నేహితుణ్ణి ఒక్కణ్ణి అయినా పొగొట్టుకోకుండా రోజూ కొత్తస్నేహితులను సంపాదించుకుంటున్నందుకు అతను చాలాగర్వపడేవాడు. ఆరోజు కారోజు అతని ఆర్జనకూడా జాస్తి అవుతున్నది. కొద్దిరోజుల క్రితమే అతను వెనక తీసుకొన్న రెండువేల పాలసీకాక మరొక మూడువేలకు మరొకపాలసీ తన కంపెనీలోనే తీసుకున్నాడు. అదికాక అతనిపేర బాంకులో ఒక వెయ్యిరూపాయల డిపాజిటుకూడా ఉన్నది. అతను ఎక్కువడబ్బు ఖర్చుపెట్టే మనిషి కాడు. మంచి

దుస్తులూ, మంచి ఆహారమూ, మంచి ఇల్లూ మించి అతను కోరిందేదీ లేదు—ఒక్కటితప్ప. మంచిభార్య! అతని సామాన్యతను సహించ గల మంచిభార్య-అదీ అతను గాఢంగా కోరింది. అది అతనికి తీరని కోర్కె అయిపోయింది. అతనికి అందమనేదికూడా తెలియదు పాపం. అతని స్నేహితులలో గొప్ప చిత్రకారు డొకడున్నాడు. అతను మధ్యమధ్య ఏవృక్షమో ఏ స్త్రీనో చూసి, "ఆహా! ఏమిసౌందర్యం!" అనే వాడు. ఆ సౌందర్యం ఎక్కడ ఉందో, దాని స్వరూపమేమిటో గ్రహింతామని సుబ్బారావు విశ్వప్రయత్నం చేసికూడా విఫలుడైనాడు. సుబ్బారావుకు సౌందర్య పిపాస కలిగింతామనే సదుద్దేశంతో ఆ చిత్రకారుడు "నీకు అందంగా కనిపించే మొహాలు నాకు చూపిస్తూ ఉండు!" అన్నాడు సుబ్బారావుతో. సుబ్బారావు చూపించాడు. చిత్రకారుడు నిస్పృహుడైనాడు. కాని ఆ చిత్రకారుడు ఒకపని చెయ్యవలిసింది. సుబ్బారావు కళ్లకు అందంగా కనిపించిన మొహాల తాలూకు మనుష్యుల ప్రకృతి ఎటువంటిదో విచారించి ఉండవలిసింది. వారంతా సాధువులు, మంచివారికింద పరిగణింపబడదగినవారు!

సుబ్బారావు తనకు "ఆకన్ను" లేదనే నిశ్చయానికి వచ్చాడు.

మరొక గాయకుడైన స్నేహితుడు సుబ్బారావుకు "ఆ చెవి" కూడా లేదని నిరూపించాడు. సుబ్బారావు దిగులుపడలేదు. తనను భగవంతు డట్లా సృష్టించాడు. అంతే!

"నాకు అందమైన భార్య అవసరంలేదు. నే నామెసౌందర్యం అనుభవించలేను. అప్పుడామెకు చాలా కష్టంగా ఉంటుంది. ఎన్నడూ ఎవరితోనూ పోట్లాడనిది, ఎప్పుడూ సంతోషంగా ఉండగలది, సులభంగా తృప్తిపడగలది, నన్ను చూసి అసహ్యపడనిది అయిన భార్య నాకు చాలు!" అనుకున్నాడు సుబ్బారావు. మరుక్షణం అతనికి తనకోరిక గొంతెమ్మకోరిక మాదిరిగా కనిపించింది. ఎందుకంటే, రాజాధిరాజుకైనా అంతకన్నా ఎక్కువకోరిక ఉండనవసరంలేనట్టు కనపడ్డది. కాని అంతకన్న తక్కువభార్యతో తనకు సుఖం ఉండదని అతను గ్రహించాడు.

"ఈ కోరిక తీరని కోరికే. పోనీ, యావజ్జీవమూ ఇట్లాగే బ్రహ్మచర్యంలో ఉంటాను. ఒక నేతి సుబ్బారావుకు ఒక్క తీరనికోరిక ఉండటం అసహజమా ఏమిటి?" అని అతను నిట్టూర్పు విడిచాడు. భార్యకోసరం వాంఛించటమే తను మానుకుందామనికూడా అతను ప్రయత్నంచేశాడు. కాని అతని ప్రయత్నం లేకుండానే అది సముద్రతరంగంమాదిరిగా అతని మీద విరుచుకుపడేది.

అన్నివిధాలా తను అసమర్థుడు కావచ్చును. కాని తనలో ప్రేమించేశక్తి ఉన్నది. తనహృదయం ప్రేమతో నిండి పొర్లికూడా పోతున్నది. తనకు ఆశక్తినిచ్చిన ప్రకృతి దాన్ని సద్వినియోగంచేసే అధికారంకూడా ఇచ్చింది. తను తనకు తగినభార్యకోసం—తనప్రేమకు నిజంగా పాత్రురాలయే స్త్రీకోసం—ఎందుకు వెతకకూడదూ?

కాని అతను ఆ అన్వేషణ ఎన్నడూ ప్రారంభించలేదు. అతని ఆంతరంగికస్నేహితులు ఒకరిద్దరు అతన్ని ప్రోత్సాహించారు కూడాను. కాని అతను భార్యకోసరం ప్రయత్నాలుప్రారంభించలేదు. "ఇప్పుడు కాదు. నే నింకా గట్టితీర్మానానికి రాలేకుండా ఉన్నాను." అని అతను తప్పించుకునేవాడు. అతను ఖయాలీమనిషి కాడని వారెరుగుదురు. అందుకని వారు అతని సందేహానికి కారణం ఉంటుందని నమ్మి ఊరుకున్నారు.

రోజులు గడిచినై.

ఒకనాడుదయం అయిదుగంటలకు అతను పక్కలో లేచి కూర్చున్నాడు. కిటికీలోనుంచి చక్కని చల్లగాలి వీస్తున్నది. కిటికీబయట ఉన్న ఒక చిన్న పూలమొక్క అతన్ని చూసి నవ్వింది.

"వసంతకాలంవచ్చింది!" అన్నది పూలమొక్క. "నాకోసరం కాదు!" అనుకుని సుబ్బారావు తల అడ్డంగా తిప్పాడు దీనంగా చిరునవ్వు నవ్వుతూ.

అతను లేచి కాలకృత్యాలు తీర్చుకుని స్నానం చేసేటప్పటికి అతనికి పనిచేస్తున్న కుర్రవాడు ఇల్లు చిమ్మి కాఫీహోటలుకు వెళ్లి అతనికి కావలసిన ఫలహారమూ, కన్నావస్తూ పోస్టాఫీసునుంచి ఉత్తరాలూ తెచ్చి బల్లమీద పెట్టాడు.

ఆనాడు అతనికి రెండే ఉత్తరాలు వచ్చినై. ఒకటి భీమాకంపెనీనించి. ఆ ఉత్తరం చూసి సుబ్బారావు అమితఆశ్చర్యపడ్డాడు. కంపెనీవారు అతన్ని చాలారహస్యమైనటువంటి ఒకపనిమీద నియోగించారు. అంతకుపూర్వం ఎన్నడూ అటువంటిది అతనికి జరగలేదు; మనిషి చాలా కంగారుపడిపోయినాడు సంతోషంతో.

ఆకంగారులోనే రెండోవుత్తరం తీసి చదవటం మొదలుపెట్టాడు.

"'చిరంజీవి'...కంపెనీవారు ఇంతమంది ఏజంట్లలోనించి తన్నే ఎందుకు ఎన్నుకున్నారో...'నీకు చాలాఆశ్చర్యం కలగవచ్చును'...అయితే తనతో కంపెనీవారు చాలా తృప్తిపడ్డారన్న మాట. లేకపోతే తనయందు వారి కంత నమ్మకం... 'మీ మామగారిని క్షమించలేకపోయినా ఆయన ఇప్పుడు చచ్చి స్వర్గాన'ఇది మంచి అవకాశం. ఈ దెబ్బతో తన్ను కంపెనీవారు ఏజిల్లాకో ఏజంటుగా పారేసినా ఆశ్చర్యం లేదు"

ఉత్తరమంతా పూర్తిచేసినతరువాత తనకు అందులోని సారాంశం ఈషణ్మాత్రమైనా బోధపడలేదని సుబ్బారావు కనుక్కున్నాడు. అతను కాస్త మనస్సు నిలకడ చేసుకుని ఉత్తరం ఒక్కసారి పైనించి కిందికి చూశాడు. ఆడెస్టూరి ఎవరిదీ? కింద దస్కతు చూశాడు. "వెంకటరమణయ్య" అని ఉంది. ఎవరీ వెంకటరమణయ్య?

జాగ్రత్తగా ఉత్తరం మొదట మొదలుపెట్టి తిరిగీ చదవటం మొదలుపెట్టాడు.

"చిరంజీవి నేతి సుబ్బారావును (ఫలాని) వెంకటరమణయ్య పుత్రపౌత్రాభివృద్ధిగా ఆశీర్వదించి వ్రాయునది. ఈ ఉత్తరం చూసి నీకు చాలా ఆశ్చర్యం కలగవచ్చును. నీ మామగారు పదిసంవత్సరాలక్రితం చనిపోయినప్పటినించీ నీ భార్య అయిన సీతారామమ్మను నేను పెంచుతూ వచ్చినాను గనుక నేను నీకు మామగారి తుల్యుడను, తండ్రివంటివాణ్ణి. నాకు నీ మేలున్నూ, నీ భార్య మేలున్నూ తప్ప మరేమీ ఎక్కువకాదు. నీకు నీ మామగారు చాలా అపకారము చేసినమాట వాస్తవమే. కాని నీ భార్య చాలా యోగ్యురాలు. పెంచిన మమకారం కావచ్చును. నాకు నాకుమార్తెకంటె ఉత్తమురాలు కనిపించదు. నీవు నీమామగారిని క్షమించలేకపోయినప్పటికిన్నీ పిల్లదాని అమాయకత్వము చూసి దాన్ని నీ భార్యగా తిరిగీ స్వీకరించమని నేను



"జాగ్రత్తగా ఉత్తరం తిరిగీ చదవటం మొదలుపెట్టాడు."

నిన్ను పెద్దవాడవనో చిన్నవాడవనో ప్రార్థించుతున్నాను. మా సీత నాయందు ఎంత ప్రేమగల దయినప్పటికీ దాని మనస్సు భర్తమీదికి పోతున్నదని నాకు తెలియవచ్చినది. అది సహజమే. నేను మిమ్మల్నిద్దర్నీ కలపవలసిన బాధ్యతను స్మరించినవాడనై, నీవు నాసలహాను అతిక్రమించవని నమ్ముతూ, పిల్లను తీసుకుని బయలుదేరుతున్నాను. రేపు ఉదయం తొమ్మిదిగంటలకు మాకొరకు నిరీక్షించుచుండేది.

వెంకటరమణయ్య."

ఆ ఉత్తరంచూసి అతను అమిత ఆశ్చర్యపడ్డాడు. మరిరెండుసార్లు చదివి చూసినా ఆమాటలన్నీ అక్కడే ఉన్నై. ఉత్తరం తనది అవునో కాదో అని కవరుమీద చిరునామా చూశాడు. ఉత్తరం తనదే. ఆ ఊళ్ళోనే మరొక నేతిసుబ్బారావున్నమాట నిజమేకాని ఆయన ఇన్సూరెన్సు ఏజంటూ కాదూ, ఆయన డెబ్భయి అయిదేళ్లవాడుకూడానూ. ఈ ఉత్తరం ఆయనది కావటం అసంభవం. ఉత్తరం తనదే. అయితే?——

ఎనిమిదయింది. ఇంకోగంటలో వస్తారు ఆ వెంకటరమణయ్య, సీతారామమ్మ! సీతారామమ్మ-సామాన్యమైన పేరే.

సరిగా తొమ్మిదీ అయిదింటికి బండీ వచ్చి సుబ్బారావింటిముందాగింది. ఆ బండిలోనించి ఒక నలభై సంవత్సరాలవయస్సుగల ఒక పెద్దమనిషీ, అంతే వయస్సుగల ఒక వితంతువూ, ఒక ఇరవై సంవత్సరాల వయస్సుగల ఒక పిల్లా దిగారు; లోపలికి వచ్చారు.

సుబ్బారావు మర్యాదగా లేచి నుంచున్నాడు అతనికి మాట్లాడటానికి ఏమీ కనిపించలేదు. అతనాప్రయత్నంకూడా చెయ్యలేదు.

"నీభార్యను నీకు వప్పగించాం నాయనా. మాపని అయిపోయింది. ఇక నీయిష్టం, ఆవిడయిష్టం!" అన్నది వితంతువు.

వెంకటరమణయ్య—మరి ఆ పెద్దమనిషి వెంకటరమణయ్యగారే అయిఉండాలి—సుబ్బారావును సమీపించి బలవంతాన దుఃఖం ఆపుకుంటున్నవాడల్లే "ఆపిల్లమీద నాకున్న ప్రేమ నీకిప్పు డుండదు. పైగా నీమామగారు చేసిన పాడుపని నిన్ను కొంత కలవరపెట్టికూడా ఉండాలి. అందుచేత నీభార్యమీద నీకు చప్పున ప్రేమ పుట్టకపోవచ్చును. కాని ఆపిల్లను నీచాతనయినంతవరకు దయతో చూస్తానని నాకు వాగ్దానం చెయ్యి. నీకోసం చాలరోజులనించీ తపిస్తున్నది, అది నేను అనవలిసినమాట కాకపోయినప్పటికీ. నీభార్యను ఏలు, మాను. నేను నిన్ను నిర్బంధించలేను. కాని ఏకారణంచేత గాని దాని మనసు నొప్పించవద్దు. అది నాకోరిక." అని ఆ పెద్దమనిషి చెయ్యి చాచాడు.

సుబ్బారావు మారుమాట్లాడకుండా తనచెయ్యి అందించాడు.

వెంకటరమణయ్యగారి దైన్యం తాత్కాలికంగా ఒక చిరునవ్వుతో కప్పబడినట్లయింది.

"నువు మంచివాడల్లే కనిపిస్తున్నావు నాయనా! జరిగిందంతా మరిచిపోగలిగితే నువ్వూ నీభార్యా చాలా సుఖపడతారని నాకు ధైర్యం ఉంది. సీత వెర్రిపని తలపెట్టిం దనుకున్నాను. అది పొరపాటే!"

సుబ్బారావు అప్పటికీ ఏమీ మాట్లాడలేదు. అతని మొహం చాలా శాంతంగా ఉంది కాని అతని మనస్సు అదివర కెన్నడూ ఆలోచించనంత వేగంతో ఆలోచిస్తున్నది. ఇక ఆ వెంకటరమణయ్య గారూ, ఆ వితంతువూ వెళ్లిపోతారు. ఆపిల్ల—ఎంత అందమైన మొహం!—ఆపిల్లా తనూ అయిపోతారు. అప్పుడు తను ఆమెతో మాట్లాడక తప్పదు. ఏంమాట్లాడాలి? ఎట్లా మాట్లాడాలి?

"ఇక మేం వెళ్లివస్తాం అబ్బాయి." అన్నాడు వెంకటరమణయ్య. ఆయన పెంపుడుకూతురు వంక తిరిగి, "నీకోరిక నెరవేర్చాను తల్లీ. నువ్వూ నీభర్తా తరచు వచ్చిపోతూంటే నేను సంతోషిస్తాను. నిన్ను భగవంతుడు సుఖపెడతాడు" అన్నాడు.

ఆపిల్ల చెంగు అడ్డంపెట్టుకుని ఏడవటం మొదలుపెట్టింది. వెంకటరమణయ్యమొహం చూస్తే సుబ్బారావుకు జాలివేసింది.

చిట్టచివరకు వెంకటరమణయ్య, వితంతువూ వెళ్లిపోయినారు. సుబ్బారావుగుండె గుబుక్కుమన్నది.

సీతారామమ్మ దుఃఖం దిగమింగి కళ్లు తుడుచుకుంటూ ఒక్కసారి అతనివంక చూసింది. అతను ఆమెవంకనే చూస్తూ నిలబడ్డాడు.

ఆమె కళ్లునలపటం పూర్తిచేసి పరధ్యానంగా వాకిలివంక చూస్తూ తన ట్రంకుపెట్టెమీద ఆసీనురాలయింది. అతనుకూడా కుర్చీలో కూర్చున్నాడు. అతని కళ్లు ఆమెమొహంమీదే ఉన్నై.

"ఎంత అందమైన మొహం!" అనుకున్నాడు సుబ్బారావు. "ఎంత అందమైన కళ్లు!" ఏంలాభం—తను అందం అనుకునేది నిజంగా అందంకానప్పుడు? ఎవడికి కావాలి అందం—అసలుఅందం?" అనుకున్నాడతను మళ్లీ—కొంచెం కోపంగా. ఇదే అందం! ఇదే చక్కదనం—వందమంది ఇంకోటి చెప్పినాసరే!

అతని ఆలోచన యావత్తూ చిందరవందర అయేటట్టు సీత పెద్దనిట్టూర్పు విడిచింది. ఆమె వెంకటరమణయ్యనుగురించి విచారిస్తున్నదని కనిపెట్టి అతను "చాలా మంచివాడు పాపం!" అన్నాడు.

ఆమెమొహానికి ఒక్కవెలుగు వచ్చింది. ఆమె చప్పున తన విప్పారిన మొహం అతనివైపు తిప్పి "మా నాన్నకాదూ?" అన్నది.

సుబ్బారావు అవునని తల ఊపాడు. ఆతరవాత సీత తన తండ్రినిగురించి ఆలోచించటం కొంత తగ్గించి సుబ్బారావును గమనించటం మొదలుపెట్టింది.

"మీరుకూడా మంచివారే పాపం. నా మొహం చూడటానికైనా ఒప్పుకుంటారనుకోలేదు మా నాన్న—మా అసలునాన్న—చేసిన వెధవపనికి."

ఆతరవాత కాస్సేపు ఇద్దరూ మౌనంగా ఉన్నారు.

"అయితే నీ పేరు—సీతారామమ్మా?" అన్నాడతను.

"నా పేరు మరిచిపోయినారా?" అన్నదామె నవ్వుతూ. "నేను మీ పేరు మరిచిపోలేదు...నన్నెవ్వరూ అంత పొడుగున పిలవరు. సీత అని పిలుస్తారు...నేను మిమ్మల్ని చివరిసారి చూసినప్పుడు నాకు ఏడు, కాదు ఆరేళ్లు. మీ రప్పుడెట్లా ఉండేవారో కూడా నాకింకా కళ్లకు కట్టినట్టుంటుంది."

"నేను మారానా?"

"మారలేదా?"

"నీకిప్పుడు నేనెవరో పరాయివాడల్లే కనిపించటం లేదూ?"

"మీ రింకా అట్లాగే ఉంటారని అనుకున్నానా ఏమిటి? మారిఉంటారని నేనెట్లాగో అనుకున్నాను. మీ రిన్ని సంవత్సరాలనించీ నన్ను ఒక్కసారిఅయినా తలవలేదా?"

"నువ్వు నన్ను అట్లా అడిగి లాభంలేదు. నాకు ఈ రెండు మూడు సంవత్సరాలనించీ జరుగుతున్న విషయాలే జ్ఞాపకం ఉన్నైకాని అంతకు పూర్వం ఏం జరిగిందో ఏమీ జ్ఞాపకంలేదు."

"నిజంగానా?" అన్నది సీత ఆశ్చర్యంతో. "అయితే మీకు మా నాన్న నాలుగేళ్ల వయస్సుగల వెధవపిల్లను పెళ్లిచెయ్యటంకూడా జ్ఞాపకంలేదా?"

"అట్లా అడిగి లాభం లేదన్నాను కాదూ? నేను పరాయివాణ్ణనుకొని జరిగిందంతా చెప్పు."

"చెప్పేటందుకేముంది? నన్ను కని మా అమ్మ చచ్చిపోయింది. మా నాన్న వ్యాజ్యాలకోసరం ఆస్తి యావత్తూ తగలపెట్టి చివరకు నా మూడోయేట నన్నొక ముసలివాడికిచ్చి పెళ్లిచేసి ఆయనపంచను పడిఉన్నాడు. ఆ ముసలివాడు ఒక్కసంవత్సరంలోగా చచ్చిపోయినాడు. మా నాన్న కాకాస్త అండా పోయింది. దూరదేశంవెళ్లి నన్ను మరొకరికిచ్చి పెళ్లిచేసి మళ్లీ ఎవరి అండనన్నా చేరుదామని ఆయనకు దుర్బుద్ధి పుట్టింది. పూరిలో మీ నాన్నగారు తగిలారు. అప్పటికి మీకు ఏడెనిమిదేళ్లనుకుంటాను. మా నాన్న మీ నాన్నగారిని

యెట్లాగో ఒప్పించాడు మరిద్దరికీ పెళ్లి జరపటం విషయమై. మీ నాన్నగారికి మా నాన్న చెప్పిన జోశ్యంలో గురి కలిగి తనకు మారకం సమీపించిందని నమ్మి అట్లా చేశారు. ఆతరవాత ఒకటి రెండు సంవత్సరాలు గడిచిన్నై. ఈలోపుగా మీ నాన్నగారికి విజయనగరం ఆ స్థానంలో పనికుదిరింది. అక్కడే నా మొదటి పెళ్లి సంగతి బయటపడ్డది. అప్పుడు మీరూ,మీనాన్నగారూ మాయింటికి ప్రయాణమై వచ్చారు. మానాన్నను అనవలసినమాటలన్నీ అని తెగతెంపులు చెప్పి వెళ్లిపోయినారు. నే నదే మిమ్మల్ని కిందటిసారి చూడటం.

"ఆతరవాత మా నాన్న కొద్దికాలానికే చనిపోయినాడు- వీధిలో. నన్నప్పుడు మాయీనాన్న దగ్గిరికి తీసి పెంచటం మొదలుపెట్టాడు. ఆయనకు పాపం ప్లిలు లేరు. నన్ను తన కూతురికన్న ప్రాణంగా పెంచాడు, పెద్దదాన్ని చేశాడు. చదువు చెప్పించాడు. ఉన్నంతలో నా కేలోపం లేకుండా చూశాడు. ఆయన నా కెంత తండ్రిమాదిరిగా అయిపోయినాడంటే ఆయనకు నేనిప్పుడు కృతజ్ఞురాలినిగా ఉండామని ప్రయత్నంకూడా చెయ్యలేను. మీ కర్థమాతుందనుకుంటాను."

సుబ్బారావు తల ఊపాడు.

"నాకు మళ్లీ పెళ్లిచేస్తా నన్నాడు మానాన్న- ఈనాన్న. నేను ఒప్పుకోలేదు. నాసాటివాళ్లంతా వారివారి భర్తలతో చక్కగా కాపరంచేస్తూ పతివ్రతాధర్మం నెరవేరుస్తున్నారు. నేనుమాత్రం ఎందుకు చెయ్యరాదు ? ఎప్పుడో మానాన్న నా కొక అవాచ్యమైన పెళ్లి చేశాడు కనుక నేను అధర్మానికి దూరం ఎందుకైపోవాలి ? వయస్సు వచ్చినతరవాత నేను మరొకభర్తను ఏరుకుని ఆయనతో కాపరంచేస్తే అందులో గొప్ప ఏముందీ ? ఆపని ఎవతె అయినా చెయ్యగలను. పైగా ఇప్పటికాలపు పెళ్లి చేసుకుని పతివ్రతాధర్మం అంటే అంతా నవ్వుతారు. మొగుడికన్న మొగుడి స్నేహితులను ఎక్కువగా చూడటం ఇప్పటి ఫాషనల్లే ఉంది. నాకది రుచించదు.

'నీభర్త నిన్ను ఏలకపోతేనో?' అని మానాన్న నన్నుభయపెట్టేవాడు. పతివ్రతాధర్మానికి అవేవీ అడ్డంరావు. నేను నాభర్త వాకిలి కుక్కగా ఉండిఅయినా నాధర్మం నేను నెరవేర్చగలనని సమాధానం చెప్పాను.

"నేను తెలియనితనంచేత మాట్లాడుతున్నానని మా నాన్న చాలాకాలం సందేహించాడు. ఆ తరవాత నా మొండిపట్టు నేను వదలనని గ్రహించి మీకోసం వెతికించటం మొదలుపెట్టాడు. నేను చెప్పగల విషయాలు బహుకొద్ది. నాకు మీ నాన్నగారి పేరుకూడా జ్ఞాపకం లేకపోయింది. మానాన్న పూరిలోనూ విజయనగరంలోనూ కొంతకాలం విచారించిన తరవాత మీ ఆచోకీ దొరికింది. ఆ తరవాత మీరు ఎక్కడెక్కడ ఎప్పుడెప్పు డున్నారో క్రమంగా అంతా ఆరాతీశాడు మానాన్న. మీసంగతి తెలిసినతరువాత నేను మిమ్మల్ని చూడాలని ముళ్లమీద ఉండసాగాను. అందుచేతనే మానాన్న మీకు అంత అవ్యవధిగా ఉత్తరంరాసి బయలుదేరాం. మానాన్న, పాపం, నామనసు బాగా కనిపెట్టగలడు."

సుబ్బారావు కొంతసేపు మౌనంగా ఉండి, "నీ పతివ్రతాధర్మం చాలా చిత్రంగా ఉంది. నాకు ఆపతివ్రతాధర్మంలో ఎక్కువనమ్మకం లేదు."అన్నాడు.

"మానాన్నకూ లేదు. నా కున్నది!"

ఆమాటకు అప్పీలే లేదు.

"మీరు నిజంగా చెప్పండి. ఈ విషయాలేవీ మీకు జ్ఞాపకంలేవా ?"

"నువు జ్ఞాపకంచేస్తుంటే నాకు ఒకొక్కటే లీలగా జ్ఞాపకంవస్తున్నట్టున్నది."

"మీ రెట్లా మరిచిపోయినారో నేను ఊహించలేకుండా వున్నాను."

"అయినా ఒకటి జరిగిందిలే. మూడునాలుగేళ్ల కిందట నా కొక పెద్దజబ్బు చేసి ఆజబ్బులో మతిపోయింది. వెనకటివి బాగా జ్ఞాపకంరావు."

పదిగంటలకు పనిచేసే కుర్రవాడు వచ్చి వారి సంభాషణకు అంతరాయం కలిగించాడు.

"హోటలునించి భోజనం ఇద్దరికి తీసుకరారా !" అన్నాడు సుబ్బారావు వాడితో.

వాడు చాలాసేపు సీతవంక చూస్తూ నిలబడి మాట వినిపించుకోక చివరకు చివాట్లు తిని టిఫినుకారియరు తీసుకుని వెళ్లాడు.

"సాయంకాలంనించీ నేనే వంటచేస్తాను. నాకు ఇంటిపనులు చెయ్యటం చాలాసరదా" అన్నది సీత.

ఇంట్లో ఆడది తిరుగుతుంటే అదొక శోభగా ఉంది. తన కోరిక భగవంతుడు డీవిధంగా తీర్చదలుచుకున్నాడా? అతని కామాట అనుకుని ఏంతృప్తి? ఇప్పుడీసీతను ఏంచెయ్యాలి? మారు మాట్లాడకుండా స్వీకరించాలా? అందువల్ల తనకు చాలా సుఖం చేకూరేటట్టే కనిపిస్తున్నది. దానికి త నెట్లా అర్హుడవుతాడు? ఆమె తనమీద చూపిస్తున్న ఆపేక్ష తను ఆమెభర్త అనే నమ్మకంతోనే. నేను నీభర్తను కాను అని చెప్పితే ఈ సీతే తనవంక ఎట్లా చూస్తుంది?

ఇటువంటి క్లిష్టపరిస్థితులు తనకే వస్తవా, లేక అందరికీ ఇంతేనా?

ఎంత విచారించినా ఓర్పుతో రాగలదానికి ఎదురుచూడటం తప్ప గత్యంతరం కనిపించలేదు.

మనిషినికనిపెట్టి ఉండటంలో సీత ఎంత నేర్పరి! తన అవసరాలన్నీ చెప్పకుండానే అట్లా గ్రహించి తనకు పరిచర్యచేసే మనిషి తన కన్నడూ ఉండిఉండలేదు. అటువంటి భార్యే ఉంటే కొంప భూలోకస్వర్గం అనిపించదా?

తనను చూసి సంతోషంగా ఉండకుండా ఉండలేదు. తన చూపు ఆమెచూపుతో కలిసినప్పుడల్లా తప్పక నవ్వుతుంది. తనకు కించిత్తు అసంతృప్తిగాని, కష్టంగాని కలిగినట్టు కనిపిస్తే చాలాఆదుర్దాపడుతుంది.

ఇదంతా ప్రేమా?

పతివ్రతాత్వమా, కొంపతీసి!

అందరు భార్యలూ—పాతివ్రత్యంలో నమ్మకం ఉన్న భార్యలు—భర్తలను ఇట్లాగే చూస్తున్నారా? చూస్తే ఆభర్తలంతా తనమాదిరిగా సంతృప్తి చెందుతున్నారా భార్యలతో? అనుమానాస్పదం.

ఇది పతివ్రతాత్వం కాదు, ప్రేమే!

అయితే ఏమీ ఎరగని తనను సీత ఎప్పుడు ఏకారణంచేత ప్రేమించటం మొదలుపెట్టినట్టూ!

సీత అతనికి అర్థంకాలేదు.

ఆమెమీద మాత్రం అతనికి ఆక్షణాని కాక్షణం ప్రేమ పుట్టుకురావటం మొదలుపెట్టింది. ఒకటిరెండు రోజుల్లోనే అది పెద్దప్రవాహమై ఉండేను—అడుగడుగుకూ అతన్ని ఇటువంటి సంశయాలు బాధించక పోతే.

ఏమిటి తన ప్రారబ్ధం? తన కోరిక ఎంతనైపుణ్యంతో తీర్చాలో అంతనైపుణ్యంతో తీర్చాడు భగవంతుడు. అతనికి భార్యామీద మనస్సుపోయినా ఇప్పుడతను ఏచిన్నపిల్లనో చేసుకోవటం అసంభవం. పెద్దపిల్లను చేసుకుంటే ఆపిల్ల అన్నివిధాలా తను కోరిన రకంకాదని అనుమానం. (పెద్ద అయినతరువాత పెళ్లిళ్లుచేసుకునేవాళ్లూ, పునర్వివాహం చేసుకునే వితంతువులూ ఎట్లా అయినా కొత్తగడుసుగా ఉండరూ?) తనకోరిక ఎంత గొంతెమ్మకోరికో అది తీరేవరకూ తెలిసిరాలేదు. ఇప్పుడు?

ఒకసారి పనిపెట్టుకుని ఈవిషయం సీతతో తర్కించాడు.

"సీతా, నీకు నామీద ఎంత అభిమానం?"

"మీకు నిజంగా నమ్మకం ఉందా?" అన్నది సీత నవ్వుతూ.

"నాకు కళ్లూ చెవులూ, లేవా? అయితే నాకొకటే ఆశ్చర్యం."

"ఏమిటది?"

"ఎందుకు నీకా అభిమానం నన్ను చూస్తే?"

"చేసుకున్న భర్తగారు కాదూ?" అని సిగ్గుపడ్డదానల్లే సీత తలవంచుకుంది.

అతని మనస్సు చివుక్కుమన్నది.

ఆతరవాత ఎన్నిసార్లడిగినా సీత అక్కడిదాకా వచ్చి ఆగిపోయ్యేది.

మూడురోజులు గడిచినై. సీతను ఏంచెయ్యాలో అతనికి తెలియనేలేదు. అతను ఆమెకు గజందగ్గిరగాకూడా వెళ్లకుండా ఈమూడురోజులూ గడిపాడు. ఆమె అందుకు చింతించినట్టు కనపడలేదు. కాని తను ఏక్షణం చేతులుచాస్తే ఆక్షణం ఆమె తనదగ్గిరికి పరిగెత్తుకుని వస్తుందని అతనికి నమ్మకమే. ఆమెకళ్లలో ఒక్కొక్కసారి అంత అనురాగం కనిపించేది.

అంతా తన భర్తమీద!

కంపెనీవారి దగ్గిరనించి ఉత్తరంవచ్చి మూడురోజులయింది. ఆవిషయం అతను తగిన చర్య తీసుకోనేలేదు. నాలుగోనాడు ఉదయం ఆపనిమీదే బయలుదేరాడు. అతను భోజనానికి వచ్చేసరికి ఒంటిగంటకావచ్చింది.

అతనికోసంపరం నిరీక్షిస్తున్న మనిషిమాదిరిగా సీత నవ్వుతూ ఎదురువచ్చి అతను విప్పిన కోటూ, చొక్కా తీసుకుంటూ "ఇంత ఆలస్య మయిందేమండీ? పాపం, పొద్దున కాఫీహోటల్లో తిన్నతిండేనా?" అన్నది.

అతను వినుపించుకోలేదు. అతని భోగట్టా ఫలితాలు మహా భయంకరంగా పరిణమించేటట్టు కనపడుతున్నై. ఇద్దరు ముగ్గురు పెద్దలకు జైలుప్రాప్తి కలిగేటట్టు కనపడుతున్నది. కొన్ని విచిత్రములైన విషయాలు బయటపడినై. మరికొన్ని త్వరలో బయటపడనున్నై. సుబ్బారావుమనస్సింకా ఆవిషయాలమీదనే ఉంది.

సీత అతను తన్ను గమనించకపోవటం చూసి ఇంతమొహం చేసుకున్నది. అతను పరధ్యానంగా స్నానానికి వెళ్లాడు. భోజనానికి వచ్చినప్పుడు కూడా అతని మన స్సెక్కడో ఉన్నది.

అతను భోజనం చేస్తూ అకస్మాత్తుగా తలఎత్తి "ఈకూర ఎంత బాగా కుదిరిందీ!" అన్నాడు.

సీత మామూలుఅలవాటుచొప్పున నవ్వినట్టు నవ్వలేదు. ఏమాత్రమో తడిగాఉన్నట్టు కనిపించే కళ్లు అతనివైపు తిప్పి మళ్లీ నేలవంకచూస్తూ ఊరుకుంది. ఆమె కిందిపెదవి ఏమాత్రమో వణుకుతూ ఒక్కసారి ఆమె పైపలువరుసకిందికి వెళ్లివచ్చింది.

"సీతా!" అన్నాడు సుబ్బారావు ఆదుర్దాగా.

ఈసారి సీత తల ఎత్తినప్పుడు ఆమెకళ్లు స్పష్టంగా తడితో మెరుస్తున్నై.

"ఏమిటది? ఎందుకట్లా ఉన్నావు?" అన్నాడతను ఆదుర్దాగా.

"నేనెట్లా ఉన్నాను? మీకే ఎందుకో నామీద కోపం వచ్చింది. నేను ముందు భోంచేశాననో ఏమో! ఇక ఎప్పుడూ భోంచెయ్యను లెండి!" అన్నది సీత.

సుబ్బారావు పొంగిపోయినాడు. ఆక్షణంలో అతను ఆ ఎంగిలిచేత్తోనే లేచివచ్చి ఆమెను గట్టిగా కౌగిలించుకుని ఎందుకు ముద్దుపెట్టుకోలేదో అతనికే తెలియదు ఈనాటికీ. ఇది ప్రేమే! ఇది చాదస్తం కాదు. అయితే తనకంటె ముందు భోంచెయ్యదు.

అతను మృదువుగా "నే నేదో ఆలోచిస్తున్నాను. నాకు నీమీద కోపం వచ్చిందని ఎందుకు నీకంత అనుమానం?" అన్నాడు. అతని మొహంకూడా సంతోషంతో వికసించింది. "నావిషయమై నీకంత ఆరాటం ఎందుకు సీతా!"

సీత జంకుతూ సమాధానం చెప్పింది.

"ఎందుకట్లా అడుగుతారు? నేను మీ భార్యను కామూ?"

అతనికి మొహాన చిరునవ్వు తుడిచేసినట్టు మాయమయింది. అతను మౌనంగా తలవంచుకుని భోజనం పూర్తిచేశాడు.



"ఆ ఎంగిలిచేత్తోనే లేచివచ్చి ఆమెను గట్టిగా కౌగిలించుకుని ఎందుకు......"

అతనివెంట ఆమెకూడా వచ్చింది గదిలోకి.

"నేను అజ్ఞానురాలిని. నావల్ల తప్పులుంటే క్షమించండి. నాకు మీరు సంతోషంగా లేకపోతే చాలా కష్టంగా వుంటుంది. నేను మీ కెట్లాగో ఉత్సాహ భంగంచేశాను. నాకు చాలాకష్టంగావుంది—" పైన మాట్లాడలేక సీత చీరకొంగుతో కళ్లు తుడుచుకో సాగింది.

చప్పున సుబ్బారావుకు వెంకటరమణయ్య స్ఫురణకువచ్చాడు. తరువాత ఆయన చివరచెప్పిన మాటలు అతనిచెవిలో మోగినై. ఆయన వద్దన్న ఒక్కపనీ చేస్తున్నాడు తను. ఆమెను హింసిస్తున్నాడు. ఆమె తన భర్తను ప్రేమించింది కనక తను ఆమెను హింసించాలా? ఆమె తనకు చూపుతున్న ప్రేమకూ, చేస్తున్న సేవకూ ఇదా బహుమతి?

"చూడు, సీతా. నన్ను నాలుగు రోజులపాటు గమనించకు. నే నిప్పుడొక పనిలో మునిగిఉన్నాను. నేను పరధ్యానంగా ఉన్నా, చిరాకుగాఉన్నా తప్పు నీమీద వేసుకోకు. సరేనా? నాకు నీమీద ఏకారణంచేతా కోపంరాదని నమ్ము. అంతకన్న ఇప్పుడేమీ చెప్పలేను. నువ్విట్లా అనవసరంగా చింతించటం నాకు చాలా కష్టంగావుంది," అని అతను డ్రెస్సు వేసుకుని బయటికి వెళ్లిపోయినాడు.

సుబ్బారావు చేసిన భోగట్టా అతనికి వారం రోజులు పట్టింది. ఆతరవాత ఆపనిమీదనించి అతన్ని తప్పించి చెయ్యవలసినదంతా కంపెనీవారే చేశారు. ఆవివరాలన్నీ పత్రికలలో కాలక్రమాన ప్రకటించబడినై.

ఒక్కసారిగానే తన జీవితంలో అడుగుపెట్టిన రెండు సమస్యలలోనూ ఒకటి తృప్తికరంగా ఒక ఒడ్డు చేర్చి రెండవదానివైపు తిరిగాడు సుబ్బారావు.

నిజానికి వెయ్యిమందిలో తొమ్మిదివందల తొంభైతొమ్మిది పైచిల్లరకు ఇది సమస్యేకాదు. తను చెయ్యవలసిందంతా ఏమిటంటే మారు మాట్లాడకుండా సీతను స్వీకరించటం. అందులో తప్పేమీ లేదు. పైగా అది ఉభయులకూ చాలా తృప్తికర మైనటువంటి ఏర్పాటుకూడానూ! కాని—

అక్కడే సుబ్బారావుకు చిక్కు వచ్చింది. అట్లా చేసి సుబ్బారావు సీతతో నిజమైన సుఖం ఒక్కక్షణం అనుభవించలేదు. ఆమెకు తనమీద ప్రేమ ఉన్నదని సంపూర్ణంగా విశ్వసించటానికి తనకు ఎంతమాత్రమూ ఆధారం చిక్కలేదు— చిక్కేటట్టూ లేదు. అతనికి ఆనాటి కానాడు ఆమెమీదప్రేమ ఎంత ధ్రువం అవుతున్నదో ఆమె తనను ప్రేమించటం నిరూపణ కావటం అంత అనుమానాస్పదం అవుతున్నది. 'నేను నీభార్యను కానా? నువు నాభర్తవు కావా?' అనేవాదన సీత నుండి తనంవల్ల చెయ్యటంలేదు. ఆమె కంతకన్న ఆధారం లేదు. పాపం. ఏంచేస్తుంది?

పిచ్చిసీత! అమాయకురాలు! ఆమెను తన ఇంట ఒక్కక్షణం ఉంచుకునే అర్హత తనకు లేదు. అతను ఒక తీర్మానానికి వచ్చాడు.

సీతకూడా ఒక తీర్మానానికి వచ్చినట్లే కన పడ్డది. ఆరాత్రి భోజనానంతరం అతను వెన్నెలషికారు వెళ్లి చాలా ఆలస్యంగా తిరిగివచ్చాడు. సీత గదిలో— వారు వేరువేరుగదుల్లో శయనిస్తున్నారు—దీపంతగ్గించి ఉన్నది. సీత అతని కాలిచప్పుడువిని లేచి కూర్చున్నది. అతను గమనించనివాడల్లే వెళ్లి తనగదిలో పడు కున్నాడు.

అయిదునిమిషాలలో ఆమె మెల్లిగా అతనగదిలోకి వచ్చింది. అతను నిద్రపోతున్నట్టు నటించాడు. ఆమె అతనిమీద చెయ్యివేసింది. అది ప్రథమస్పర్శ. అతని శరీరం జల్లుమన్నది. పక్కలో లేచి కూర్చున్నాడు.

"నామూలకంగా మీ రేదో బాధపడుతున్నారు-ఉండండి! నేను మిమ్మల్ని దెప్పటం లేదు. నేను మిమ్మ ల్నిసుఖపెడదామని వచ్చాను. అది నాచేతకాలేదని తెలుసుకున్నాను. నన్ను మానాన్నదగ్గిరికి పంపిం చండి. ఒకప్పుడు భయపడ్డాను, నన్ను మీరు చాలా చులకనగా చూస్తారని. ఈవిధంగా నన్నుగురించి మీరు లోలోపల విచారిస్తారని నాకు తెలియదు. మీకష్టం ఏమిటో నాకు స్పష్టంగా చెప్పండి, నాశరీరం అమ్మి తీర్చుతాను. మీరు పైకి నాతో మంచిగా ఉంటూ లోపల బాధపడుతుంటే నాగుండె పగిలిపోతున్నది. నే నేదో పాడుఘడియలో ఇక్కడ అడుగుపెట్టాను" అన్నది సీత.

తను పాడుఘడియలో అడుగుపెట్టింకా? ఆ క్షణంనుంచీ తను ఎంతసుఖం అనుభవిస్తున్నాడో ఆమె కేంతెలుసును? ప్రేమించబడటం ఎంత సుఖకరమైన విషయమో ప్రేమించటం అంత బాధాకరం. అతను ప్రేమిస్తున్నాడేకాని ప్రేమించబడుతున్నా డనే నమ్మ కంలేదు. దానికే అతని ఆరాటం యాతనానూ. ప్రేమించి ప్రేమించబడనివాడికి తెలుస్తుంది ప్రేమిం చటం ఎంతకష్టంతో కూడుకున్న విషయమో.

"నువు నన్ను ప్రేమించా ననుకుంటున్నావు సీతా. అది పొరపాటు. నువు పాతివ్రత్య ధర్మప్రకారం నీభర్తను ప్రేమిస్తున్నావు. అది నాకేంతృప్తి? నీభర్త నైనా ఫలాని కారణంవల్ల ప్రేమించకుండా నీభర్తగనక ప్రేమించావు."

"మీరు చెప్పేది నా కర్థం కావటంలేదు. మీరు నాభర్త అయినప్పుడు నేను నాభర్తను ప్రేమించటం మిమ్మల్ని ప్రేమించటంకాదా?"

"నేను నీభర్తను కాననుకో!"

"ఎందుకు కారూ?" సీత కొద్దిగా పాలిపోయింది.

అతను మాట్లాడుతూ సీత మొహంవంక చూడ లేకపోయినాడు.

"నేను అబద్ధం ఆడాను. నా కెన్నడూ మతిచెడ లేదు. నాకు చిన్నతనంనించీ జరిగిన విషయాలన్నీ బాగా జ్ఞాపకంఉన్నై. మనం—మనం భార్యాభర్తలం కాము!"

సీత ఈసారి పూర్తిగా పాలిపోయింది. ఆమె నిలవటానికికూడా సత్తువలేక అతనిమంచంమీద ఒక మూల కూర్చుంది

ఇద్దరూ చాలాసేపు మౌనంగా ఉన్నారు.

"ఇక నీ కిక్కడ ఒక్కక్షణం గడపటంకూడా చాలాకష్టమనుకుంటాను. ఏమిటికర్తవ్యం?" అన్నాడు సుబ్బారావు.

ఆమె చెప్పిన సమాధానం రహస్యం మాదిరిగా ఉంది.

"నా కేమీ తెలియదు. మానాన్నగారింటికి పోవాలి. ఇంకేముందీ?...ఎంత జాగ్రత్తగా విచారించాడు మానాన్న! పొరపాటు ఎట్లా జరిగిఉంటుంది?"

"ఎట్లా జరిగినా జరిగిఉంటుంది. ఆంధ్రదేశం నిండా నేతి సుబ్బారావులే. ఈఊళ్లోనే మరొక నేతి సుబ్బారావున్నాడు. ఈచుట్టుపక్కల గ్రామాల్లో కనీసం నలుగురు నేతి సుబ్బారావు లున్నారు—నే నెరిగినంతవరకు."

మళ్లీ కాస్సేపు ఇద్దరూ మాట్లాడలేదు.

"మీరెంత మంచివారు! మరొకరయితే నన్ను మొదటిరోజునే వంచించిఉందురు. మీ రెప్పుడు నన్ను దగ్గిర కూర్చోపెట్టుకుంటారు, ఎప్పుడు ముద్దుపెట్టుకుంటారు అనిఉండేది నాకు. మీరు దూరందూరంగా ఉన్నారని నాకు చాలా కష్టంగాఉండేది. కాని నేను ఏమీ అడగలేదు. ఒకసారివితంతువును, నా కట్లా అడగటానికి అర్హతఏముందీ?"

సుబ్బారావు కళ్లవెంట నీళ్లు తిరిగినై.

"నేను మంచివాణ్ణయితే నిన్ను ఒక్కక్షణం ఈఇంట్లో ఉండనిచ్చేవాణ్ణా! నాగదిలోనువు అడుగు పెట్టగానే గది కెంత శోభవచ్చింద.లే నిన్ను తిరిగి పంపివెయ్యటం నాకు అసంభవం అయింది. నేను వట్టి స్వార్థపరుణ్ణి. నేను మామూలు పెద్దమనిషినైనా కాను!"

అతను గడియారంచూసి "ఇంకా మెయిలుకు అరగంట వ్యవధిఉంది. బయలుదేరుతావా?" అన్నాడు.

"బయలుదేరుతాను."

"నువ్వు వెళ్లినతరువాత ఈఇల్లు స్మశానంమాదిరిగా ఉంటుంది—కొంతకాలం పాటు." అన్నాడతను చుట్టూ చూస్తూ.

ఆమెకూడా చుట్టూ కలయచూసి "ఈఇంట్లో ఉన్నప్రతి వస్తువునూ ప్రేమించటం నేర్చుకున్నాను. నాకూ కొంతకాలం పాటు ఇదంతా మరుపురాదు." అన్నది.

"ఇకలే! నీబట్టలూ అవీ సర్దుకో! చీరకూడా మార్చుకో."

సీత సరేనన్నట్టు తల ఊపిందికాని కదలలేదు.

"మళ్లా నీభర్తకోసం అన్వేషణ ప్రారంభిస్తావా? నేనుకూడా నాచాతనైనసహాయం చేస్తాను."

"నేనిక ఏమీచెయ్యను. అదంతా వట్టిచాదస్తం అనిపిస్తున్నది. ఈజీవం ఇట్లాగే వెళ్లిపోతుంది."

"లే, సీతా! ఎక్కువవ్యవధి లేదు...నేను నిన్ను తరుముతున్నానా?"

ఆమె మారుమాట్లాడకుండా లేచి కాళ్లీడ్చుకుంటూ తనగదిలోకి వెళ్లింది.

"అయిదు నిమిషాలలో తయారుకా ప్రయాణానికి!"

తనుకూడాలేచి సీతగదికి వెళ్లేలోపల సుబ్బారావు అయిదునిమిషాలు కాదు పదినిమిషా లాగాడు.

అతను వెళ్లేటప్పటికి సీత గది చిందరవందరగా ఉన్నది. ఆమె గదిమధ్య పెట్టెపెట్టుకుని పరధ్యానంగా చూస్తున్నది. ఆమెసర్దుడు ఇంకా ప్రారంభమైనాకా లేదు.

అతన్నిచూడగానే ఆమె లేచి విపరీతంగా ఏడుస్తూ, "నేను పోలేనండీ! నేనిక్కడే వుంటాను. నన్నిక్కడే ఉండనివ్వండి!" అన్నది.

సుబ్బారావు నిర్ఘాంత పోయినాడు.

"ఏం జరిగింది? ఎందు కట్లా బాధపడతావు?" అన్నాడు సుబ్బారావు.

ఆమె నేలమీద కుప్పగాకూలి చెప్పతరంకాకుండా ఏడవటం మొదలుపెట్టింది.

"నేను మా నాన్నగారింటికి పోలేను. నా ప్రాణం ఇక్కడే ఉంటుంది. నాకు నా మొగు డవసరం లేదు. నేను పోతే మిమ్మల్ని ఎవరుచూస్తారు? నేను మిమ్మల్ని విడిచిపెట్టిపోలేను. నన్ను పనిమనిషి కింద నైనా ఇక్కడ ఉండనివ్వండి!"

అతను కలలో కూడా ఆశించనిమాట సీతనోటి వెంట వచ్చింది. అతని కింకేం కావాలి?

అతనుకూడా ఆమెపక్కన చతికిలపడి ఆమెను తన దగ్గిరికి లాక్కుని ఆమెదుఃఖమంతా పొయ్యేటట్టు ముద్దు పెట్టుకున్నాడు.

చివరకు ఆమె అతనివైపు మొహంతిప్పినప్పుడు అతడి మొహంమీద చిరునవ్వువాన కురిసి వెలిసిన ఋదట లేతఆకుగుబురుమీద పడిన సూర్యప్రకాశం మాదిరిగా ఉంది.

"నిన్ను ఎంతలో పోగొట్టుకునేవాణ్ణయినాను. సీతా!" అన్నాడతను నవ్వుతూ.

"నాకేమతిలేదు. మీ రెన్నిసార్లడిగినా నా నోటివెంట నాకు మీమీద ఎంతప్రేమ ఉన్నదీ తెలియ చేయలేకపోతిని. మీరుపడ్డట్టే నేనూ బాధపడ్డాను. మీకు నామీద ప్రేమలేదేమోనని...మనమిద్దరమూ ఇప్పుడు ప్రపంచానికి వెలికామాలు. నేను అదివరకే వెలి. పాపం మీరు—"

"నేను నీమొగుణ్ణి కనక వెలి. నేనేనీ మొగుణ్ణి. నా అవస్థ కనుక్కోలేదా నువ్వు? నిన్ను చూసిన క్షణం నించీ నీకూనాకూమధ్య ఏదీ అడ్డంరారాదని తీర్మానించు కున్నాను. కాని నాచేతులతో కట్టిన మంగళసూత్రమే అడ్డంరావటం మొదలు పెట్టింది. అందుకని ఆ అబద్ధం ఆడాను. నేనునీమొగుణ్ణి కానన్నాను. అనలేదనుకో. ఇద్దరమూ సుఖంగాకాపరం చేసేవాళ్ళం. కాని ఆమంగళ సూత్రం మనిద్దరి మధ్యా అట్లాగే ఉండేది. తరవాత నువ్వు నన్ను ఏవిధంగానూ నమ్మించలేవు. అది ఎప్పటికీ తేలదు—అనిజం. అందుకని నిన్ను పోగొట్టుకోటానికైనా సంసిద్ధుణ్ణి అయినాను."

"అమ్మదొంగా!" అన్నది సీత.

అంతే! సామాన్యవ్యక్తులకే చాతనవును ఇంత అసామాన్యంగా ప్రవర్తించటం.



"అమ్మదొంగా!" అన్నది సీత."

మేటూరు సరస్సు

S. S. S.

దీనిని కట్టుటకు వ్యయము అయిదుకోట్ల రూపాయలు; పదుమూడులక్షల ఎకరముల పొలమునకు దీనినీరు పారును. అనకట్ట పొడవు ౧ మైలు, ౨౦ అడుగులు. ఎత్తు ౨౧౪ అడుగులు. ప్రపంచములోనెల్ల పెద్దసరస్సు. విస్తీర్ణము ౬౦ చదరపుమైళ్లు.

మేటూరు సరస్సు

మీద: నీరుపారు మెట్టుతూములు

క్రింద: అలుగుతూములు

# మహారాష్ట్ర ప్రజాస్వాతంత్ర్యయుద్ధము

## ౨

మొసలికంటి సంజీవరావు

ఔరంగజేబు వివేకవంతుఁడయ్యేనేని మహారాష్ట్రులతోడ సంధి యొనరించుకొనవలయును. పశ్చిమ దక్కనుదేశమును రాజారామునకు వీడి, తాను ప్రాచ్యదక్షిణ హిందూదేశమంతయు నాక్రమింపవచ్చును. ఢిల్లీశుఁడు ఢిల్లీకి మరలుట మఱియు వాంఛనీయము. డెబ్బదితొమ్మిది సంవత్సరములు నిండిన యా వృద్ధసార్వభౌముఁడు ప్రాయమునకు మించిన జవసత్త్వములు గలిగియుండినను, దుష్కరమహారాష్ట్రయుద్ధనిర్వహణమునకు మాత్రము చాలఁడు. మహారాష్ట్రప్రజాయుద్ధతత్త్వ మాతఁడు చిరకాలము గ్రహింపకుండుట మిక్కిలి శోచనీయము. స్వీయస్వాతంత్ర్యోద్ధరణకై మహారాష్ట్రులొనరించునది ధర్మయుద్ధమై సర్వజనసమ్మతమైయుండెను. మొగలులన్ననో! కేవల రాజ్యకాంక్షాపరులై బీజపుర గోలుకొండ రాజ్యముల నాక్రమించి తత్ప్రజాళిని క్షోభపెట్టుటవలనఁ బ్రజాకంటకులైరి. పరాజితులై పలుపాట్లుపడిన బీజపుర గోలుకొండ దేశస్థులు మొగలాయీసైన్య విధ్వంసకార్యతత్పరులైన మహారాష్ట్రులకు సానందముగా సాభిమానముగాఁ దోడ్పడిరి. పాదుషా గాంచిన యపజయముల కిది యొక కారణము. దక్కనుయుద్ధములవలన మొగలాయీ సామ్రాజ్యమునకుఁ గలిగిన నష్ట మనంతము, అగణితము. చచ్చిన సైన్యమునకు లెక్కలేదు, సంవత్సరమున నొక లక్ష సైనికులును, అంతకు మూఁడింతలు గజాశ్వవృషభాది జంతువులును మరణించెనని చరిత్రకారుఁడగు సర్కారు వ్రాసియున్నాఁడు. ధనవ్యయముగూడ నట్టులే యత్యధికముగా నుండెను. సామ్రాజ్యాదాయము యుద్ధవ్యయమునకుఁ జాలక, షాజహాను సార్వభౌముఁడు దాఁచియుంచిన సువర్ణనిధానమును వ్యయింపవలసి వచ్చెను. అంతకంటెను దారుణమగు నష్ట మెద్దియన, చండశాసనుఁడగు నలంగీరు పాతిక సంవత్సరములు తన సామ్రాజ్యమున కవ్వల ప్రవాస ముండుటవలన నచ్చటి ప్రభుత్వము సన్నగిల్లెను. రాష్ట్రపాలకులును, తదుద్యోగులును స్వార్థపరులై ప్రమత్తులైరి. ఆ కారణమున మొగలాయీ ప్రభుత్వమును సైఁపని బుందేలులు, జాటులు మొదలగు జాతులు తిరుగఁబడ నారంభించిరి. ఔరంగజేబు పాదుషా కనుమూసినంతనే తాండవించిన యరాజకమహారాక్షసి కనుకూలమగు పరిస్థితు లప్పుడే యవ్యక్తముగ నేర్పడుచుండెను. దక్షిణ హిందూదేశమన్ననో! పాతిక సంవత్సరము లేకరణరంగ మగుటవలన సర్వవిధముల ధ్వంసమయ్యెను. దక్కను యుద్ధకారణోద్భూతమగు మహారాజకమే యాంగ్లరాజ్యస్థాపనమునకుఁ గారణభూత మయ్యెనని యెఱుంగవలయును. ప్రతిభాశాలురగు మహారాష్ట్రులు మహాసామ్రాజ్యమును స్థాపింపఁజాలిరి. కాని, యా సంధిసమయమున నరుదెంచి తమ రాజ్యమును స్థాపించిన యాంగ్లేయు లంతకంటె ననేక విధంబుల బలవంతులగుటచేత మహారాష్ట్రసామ్రాజ్యము విచ్ఛిన్నమయ్యెను. ఐనను, తదవశేషములగు బరోడా మొదలగు రాజ్యములు నేఁడు గానవచ్చెడిని. కాని, జగదద్భుతమగు మొగలాయీసామ్రాజ్యము మచ్చునకైనను గానరాకున్నది.

ప్రకృతము విచారింతము. హతశేషులగు మొగలు సైనికులు దారపుత్రాది బంధుజనుల చిరవియోగమును నిరంతర యుద్ధవ్యసను భరింపఁజాలక యిల్లు చేరుటకుఁ దత్తరపడుచుండిరి. యుద్ధమువలన ధనమార్జించు దుష్ట సేనానులు తప్ప యెల్లరు సమరవిరామము నాకాంక్షించుచుండిరి. ప్రధాన మంత్రియగు నసదుఖాను సంధి యొనరింపవలయు ననియే హిత మొనరించెను. ఔరంగజేబు పాదుషా యెట్టులో యొడఁబడెను.

సాహూ నృపాలుని బాదుషా తొలుదొల్త విడిచినఁ గాని తాను యుద్ధము విరమించి సంధివచనము లాడనని రాజారాముఁడు తెలియఁజేసెను. సాహూబంధీకృతుఁడై యుండినను అతనినే రాజుగా గణించుచుండిన రాజారాముని పలుకులు సమంజసముగా నుండెను. కాని యౌరంగజేబు క్రుద్ధుఁడై మహారాష్ట్ర రాయబారుల నంపివైచెను. మహారాష్ట్ర సైన్యాధ్యక్షుఁడగు శాంతాజీ యాసమయముననే మరణించెను. అంతవరకును డోలాయమానమానసుఁడై యుండిన యౌరంగజేబు యుద్ధమొనరించుటకే కృత నిశ్చయుఁడయ్యెను.

మహారాష్ట్ర దుర్గము లొక్కొక్కటి యాక్రమించి యాపార్వతేయులను సమప్రదేశమునకుఁ దరిమి జయింపవలెనని పాదుషా యోచించెను. మహారాష్ట్రులను జయించుట కదియే మార్గము. ఔరంగజేబు తొలుతనే యటు లొనరించియుండవలెను.

శత్రుసేనాకాంతారదావానలుండగు శాంతాజీ మరణించెనని వినియుంటిమి గదా. శాంతాజీని జంపిన దుష్టుఁడు ధనాజీ. తనకు రావలసిన సర్వసేనాధ్యక్షపదవి శాంతాజీకి లభించుటచేత నాతనిపై ధనాజీ పగగొనియుండెను. ఇతర స్పర్ధలు నుండిన నుండవచ్చును. ధనాజీ యంతటి ఘోరనేర మొనరించినను అప్రతిహత ధైర్య శౌర్యధుర్యుఁడగుటవలన వానినే మహారాష్ట్ర నృపాలుఁడు సర్వసైన్యాధ్యక్షు నొనరించెను. రాజారాముఁడు వలయు నేర్పాటులు సత్వర మొనరించి పాదుషాను బ్రతిఘటించుటకే కాక, యాతనిం దన రాజధానికిఁ బాఱఁద్రోలుటకుఁగూడ సంసిద్ధుఁ డయ్యెను. మహారాష్ట్ర మహీపాలుఁడు తన మంత్రివర్గము నెట్లు హెచ్చరించెనో చూడుఁడు. "ఔరంగజేబు పాదుషా మన ఆయువుపట్టులను నాశన మొనరింపఁ దలంచువాఁడు; వాని మర్మములనే మనము నాశనము చేయఁగలము. మన సైన్యములు పాదుషా సైన్యములకుఁ దలంకవు. మన పని పూర్తి కావచ్చినది. మన యాశయము ఫలోన్ముఖమునకు వచ్చినది. దేవుని దయవలన, దైవసమానుఁడగు మదీయజనకుఁడు శివాజీ కృపావిశేషమున మనము జయముగాంతుము."

ఔరంగజేబుపాదుషా భీమానదీతీరమున బ్రహ్మపురీ ప్రాంతమున విడిసియుండెను. ఆఁది యపూర్వముగాఁ బొంగి పొరలి యపారనష్టము కల్గించెను. పదిపండ్రెండువేల మొగలుసైన్య మట్లు నదీగతమయ్యెను. అశ్వములు, పసువులు, గుడారము లసంఖ్యాకముగాఁ గొట్టుకొని పోయెను. పాదుషా యట్లు విపరీతమగు నసహాయ స్థితియందుండియు, గాంభీర్యమువహించి, పవిత్రమగు కొరాను మంత్రములను స్వహస్తముతో లిఖించి వరదపై విడిచి, నదీదేవతను శాంతింపఁజేయఁ బ్రయత్నించెను ఈలోన మహారాష్ట్రులు విజృంభించిరి. పగతురను మార్కొనుటకై యఱువదివేల మహారాష్ట్ర సైన్య మాయితమయ్యెను. సేనాముఖమున మహారాష్ట్ర నృపాలుఁడే నడిచెను. పర్సోజీభాసే, హైబతరావు నింబాల్కరు, నేమాజీ సింధియాలు తమతమ సేనావిభాగములతో యుద్ధసన్నద్ధులై యరుదెంచిరి. వారిని వారింపఁ గడంగిన శత్రుసైన్యములు పరాజితములయ్యెను. రాజారాముఁడు గోదావరిలోయసీమయందు చౌతు సర్దేశముఖి పన్నులను బహిరంగముగా వసూలుచేసెను. తత్ప్రణము చెల్లింపఁజాలని గ్రామనాయకులవద్దఁ బత్రములు కట్టుకొని, మహారాష్ట్ర నృపాలుఁడు తదనంతరము ఖాందేషు బీరారులందుఁ బ్రవేశించి, యచటఁ గరపూర్వకముగా ధనసంచయ మొనరించుటయే కాక, తదీయ ప్రజారక్షణార్థము తన యుద్యోగులను నిలిపి, మహారాష్ట్ర రాజ్యమును స్థాపించెను. ఇట్లు పర్సోజీ భాస్లే బీరారుదేశ పాలకుఁడయ్యెను. ఇట్టులే సింధియా ఖాందేషునకును, నింబాల్కరు గోదావరి లోయకును పాలకులైరి. మహారాష్ట్ర నృపాలుఁ డంత ధనవంతమగు జాల్నా పట్టణముం గొల్లగొని విక్రమించెను. సింధియా యొక్క మొగలుసైన్యమును జిందరవందర యొనరించి, మూడులక్షల రూపాయలు దండుగగొనెను.

ఔరంగజేబుపాదుషామాత్ర మూఱకుండినవాఁడు కాఁడు. ఆతడు ౧౬౯౯ అక్టోబరు మాసమున వసంతగడ సాధించి, సతారానుగూడ నాక్రమింపఁబూనెను. మహారాష్ట్రదుర్గములకు వరుసగా వడివడి వశపఱచుకొనఁబోయిన యౌరంగజేబునకు విఘాతములు వాటి

ల్లెను. ఆఱుమాసములకుఁగాని సతారా చిక్కినదికాదు. మొగలు సైన్యము పెక్కుకష్టములకుఁ బాలయ్యెను. బాహ్యమహారాష్ట్ర సైన్యములు సతారాను ముట్టడించు మొగలుసైన్యమునే ముట్టడించి యెంతయు బాధించెను. వారినిబాఱఁద్రోలి, ఆహారపదార్థములను సేకరించి పాదుషా సతారాను ముట్టడించుట బహుకష్టసాధ్యమయ్యెను. సొరంగములు తీయించి, ఫిరంగిమందు దట్టించి, దుర్గప్రాకారములను నిర్భిన్నమొనరించి, సాధింపవలెయునని యౌరంగజేబు యోచించెను. కాని, యొక సువర్ణమొసఁగినఁగాని యొక కూలివాఁడు లభింపకుండెను. అట్టులే మొగలులు శ్రమపడి రెండు సొరంగములుతీసి మందు దట్టించిరి. మొదటి సొరంగము ప్రేలి రెండువందల మహారాష్ట్రులనుజంపెను. మొగలు లంత నుత్సాహపూరితులై ముందున కుఱుకునంతలో రెండవ సొరంగమునకు జానకి త్రాడు ముట్టించిరి. కాని, దురదృష్టవశమున నాప్రాకారము ప్రళయ భయంకరధ్వానమున మింటికెగసి వారి మీఁదనే పడి, యాసేనావిభాగమును జూర్ణీకృత మొనరించెను. అట్లురెండువేల సైన్యము సమసెను. మహారాష్ట్రు లగ్నిగోళములను సునిశిత నారాచములను నవిరళముగాఁ గురియించి శాత్రవుల దవ్వునకుఁ దఱిమిరి. అంత నౌరంగజేబుపాదుషా క్రోధవివశుఁడై యిట్లు గర్జించెను:-"ఏనుంగులను భీమంగుల నొనరించి, తన్మృతకళేబర సోపానములమీఁదుగాఁ బ్రాకారముల నధిరోహించి, దుర్గములోనికి దూఁకుఁడు."

సతారా నిజముగా రెండునెలలోఁ జిక్కవలసినదె. దుర్గమునందలి భోజనపదార్థము లంతవఱకుమాత్రము చాలియుండెను. కాని, పాదుషాపుత్రుఁడగు నజాముషా మహారాష్ట్రులకుఁ బ్రసన్నుఁడై యాహారపదార్థములను బోనిచ్చెను. ఆరహస్యముం గనిపెట్టిన ప్రధానమంత్రి పాదుషాను శాంతపఱచి, అజీముషాను మందలింపవలయునని హెచ్చరించెను. అంతలో రాజారాముఁడు మరణించెను. దుర్గాధిపతి చేయునదిలేక సతారా దుర్గము నచిరకాలమునఁ బాదుషాకు స్వాధీనపఱచెను (౨౧-౪-౧౭౦౦). తనకుమారుఁడు చిన్నవాఁడుండ, అజీముషాయే యద్దానిని సాధించెనని పలాళి భ్రమించునట్లు, సతారాకు 'అజీముతారా' యని పాదుషా నామాంతరమొనరించెను. తదనంతర మాతఁడు పరలీదుర్గాక్రమణమునకుఁ గడంగెను. అనివార్యమగు వర్షర్తువాపన్నము గాకమున్నె శత్రుదుర్గములం జిక్కించి స్వాధీనపఱచుకొనవలయునని యాతఁడు వాంఛించెను. కాని, సతారాను సాధించుటకు విశేషకాలమగుటవలన వర్షములు పైకొని పాదుషాకు నాశాభంగము కల్గించెను.

జుల్ఫికారుఖాను నిక్కముగా మహాయోధుఁడు. ఆతఁడు ధనాజీ ననేకరణరంగములం దోడించి, ప్రాచ్య దక్షిణహిందూదేశమునుండి మహారాష్ట్రసైన్యములను బాఱఁద్రోలెను. జాల్నానగరమును దోపిడిచేసిన మహారాష్ట్రనృపాలుఁ డీలోపుర 'పైఠాను'పట్టణమునుగూడఁ గొల్లగొట్టి, యాధనమంతయు సింహగడమునందు భద్రపఱచుటకు వచ్చుచుండెను. జుల్ఫికారుఖానుఁ డింతలో వచ్చిపడి తోఁడునీడవలె రాజారాము నేఁబదిమైళ్లు వెన్నాడెను. రాజారాము ఖానుని వదల్చుకొని సింహగడముం జేరుట బహుకష్టసాధ్యమయ్యెను.

జింజీరాజధానియం దున్నపుడే రాజారాముని శ్వాసకోశములందు రుగ్మత ప్రవేశించెను. అనంతరము నిరంతరజైత్రయాత్రలవలన నాతఁడు పునరారోగ్యము గాంచు నవకాశము లేకపోయెను. తుదకు, జుల్ఫికారుఖానుని దప్పించుకొని సింహగడఁజేరినంతనే యధికజ్వరార్తుఁడై, రక్తస్రావమువలన నాతఁ డత్యంత బలహీనుఁడయ్యెను. తన యవసానము సమీపించెనని రాజారాముఁడు గుర్తించెను. ఐనను, ఆమహనీయుఁడు తన బాధ తలంపక, మంత్రివర్గమును రావించి, శంభాజీ కుమారుఁడగు షాహూ విడివడువఱకు నిర్నిద్రనిశ్చల చిత్తముతోడ స్వాతంత్ర్యసమరము సాగించి సంకల్పసిద్ధి గాంచవలయునని హెచ్చరించి, మంత్రివర్గమునకు రామచంద్రు నధ్యక్షునిగా నేర్పఱచి ప్రశాంతమనస్కుఁడై మరణించెను (౨-౩-౧౭౦౦).

శివాజీపుత్రుఁడైనందుకు రాజారాముఁడు దుర్వారగర్వోద్ధతుఁడగు ఔరంగజేబుపాదుషాను నిరోధించి సార్థకజన్ముఁడయ్యెను. రాజారాముని మరణము పాదుషాకు మోదకారణమయ్యెను. రాజులేని మహారాష్ట్ర

మింకఁ దనదేయని పాదుషా యుప్పొంగెను. కాని, మహారాష్ట్ర జాతీయతాభ్యుదయ ప్రభావ మెఱుంగని మొగలుచక్రవర్తి యెట్లు భగ్నమనోరథుఁ డయ్యెనో యరయుదము.

మరణించినమహారాష్ట్రనృపాలుఁడు రాజారామునకు నలుగురు భార్యలు కలరు- తారాబాయి, రాజసబాయి, జానకీబాయి, అంబికాబాయి. జానకీబాయి యను భార్య సాయిరాబాయి యను పుత్రికను గాంచి మరణించెను. అంబికాబాయి యనురాణి సంతానవిహీన యగుటచే భర్తృసహగమన మొనరించెను. ఇఁక మిగిలిన రాణులలో నొకతెయగు తారాబాయికి శివాజీ నామధేయుఁడగు కుమారుఁడు కలఁడు. రాజసబాయికిఁగల బిడ్డఁడు శంభాజీ. ప్రతిభాశాలినియగు తారాబాయి తన పుత్రుని రాజ్యాభిషిక్తు నొనరించి, తానురాజ్యముచేయఁ దలంచెను. మహారాష్ట్ర మంత్రివర్గమున కధ్యక్షుఁడగు రామచంద్రుఁ డందుల కియ్యకొనలేదు. మహారాష్ట్రమునకు సాహూరాయే రాజనియు, అతఁడు మొగలాయీ నిర్బంధవిముక్తుఁడగువఱకుమాత్ర మామహారాణి రాజ్యాధిపత్యము వహించునేని మంత్రివర్గ మామెను సేవించుననియుఁ దెల్పెను. తారాబాయి యాశయ మధికతరముగ నుండెను. సమర్థురాలగు నారాణికొందఱు మంత్రులను లోఁబఱచుకొని, కొందఱను వెలపించి, పన్హాలా దుర్గమునం దనకుమారునకు రాజ్యాభిషేకము గావించెను. తన సపత్నివలన నాపదరాకుండ నామె రాజసబాయిని సపుత్రకముగా నిర్బంధించెను (౧౭౦౧).

ఈలోపున నౌరంగజేబుపాదుషా మహారాష్ట్ర దుర్గముల నాక్రమింపఁగడంగెను. రాజారాము మరణించుటయు, నాతని యాదేశమునకు విరుద్ధముగా నాతని రాణి తనపుత్రు నభిషేకించుటయుఁ బాదుషాకు ననుకూలింపవలసినదె కాని ప్రకృతి ప్రతికూలించెను. మొగలులు పారలిదుర్గమును సాధించినంతనే యచటి ప్రవాహము పొంగిపారలి యపారనష్టము గలిగించెను. ఆ సైన్యమునందలి తొమ్మిదిపాళ్లు జలసమాధిగాంచెను. మిగిలినవారు క్షుద్బాధాపీడితులై మరణించిరి. తన తనయుఁడగు నజాముషా శాత్రవానుకూలముగా వర్తించుటచేత నౌరంగజేబు వానిని ఉజ్జయినీ దేశపాలకునిగాఁ దరలించెను. పాదుషా షోలాపురముజిల్లాయందు విడిసి, హైదరాబాదునుండియు, బర్హాన్పుర బీజపురముల నుండియు, హిందూస్థానమునుండియు క్రొత్తసైన్యములను దెప్పించుకొనెను.

కాని, వర్షాధిక్యమునఁ బాటిల్లినసష్ట మపారము. నలుబదియైదు మైళ్లు ప్రయాణముచేసి భూషణగరు సమీపించుటకు ముప్పదియైదుదినము లయ్యెను. పాదుషా యటనుండి ఖావాసపురమునకు వెడలెను. అచట నాహారపదార్థములును పచ్చికయును సమృద్ధిగనుండుటచేత నచటి నండనీనదంబున కిరుకెలంకుల గుడారములు వైచుకొని మొగలు లాకింత విశ్రమించి సేదదేఱఁగోరిరి. ఆ ప్రాంతమున నా యేఱు పూర్తిగఁ దీసిపోయిన కారణమునఁ గొందఱు నదీగర్భముననే యావాస మేర్పఱచుకొనిరి. కాని మొగలులయదృష్టము బాగులేదు. ఒకనాఁటి నిశీథమున మొగలాయీ స్కంధావారమంతయు మైమఱచి నిద్రాసౌఖ్య మనుభవించుచుండ, నదీజలంబు లొక్కసారి మహానిలజవంబునఁ బ్రవహించి, పొంగిపొఱలి విశేష జననాశనము గావించెను. కనువిచ్చి చూచునంతనే చుట్టుముట్టిన కాలార్ణవమునుగాంచి సైనికులు దురంత భయవిహ్వలులై హాహాకారము లొనరింప, మహారాష్ట్రు లాకస్మికముగా వచ్చి పడియుందురని పాదుషా భ్రమించి, తదావేశమునఁ దొట్రువడి నేలఁబడి మోఁకాలు విఱుచుకొనెను. వైద్యు లెంత కష్టపడినను ఔరంగజేబు జీవించినంత కాలమును గొంచెము కుంటుచునే యుండెను.

ఔరంగజేబుపాదుషా యీ విధంబున విశేష కష్టనష్టముల కోర్చి, పన్హాలా, చందను వందను, విశాలగడ, సింహగడ, రాయగడ మొదలగు ప్రధానదుర్గములను నాలుగేండ్లలోపున సాధించెను. ఐనను, మహారాష్ట్రప్రజను జయించుట దవ్వయ్యెను. రాజారాముఁడు మరణించినను, పాలకుఁడు పసిబాలుఁడైనను, మహారాష్ట్రు లజేయులైరి. రాణియగు తారాబాయి బహు సమర్థయై, వర్షాతపంబులను సరకుసేయక సాధారణ సైనికునివలె భూతలంబుననే శయనించుచు, శిబి

రమునుండి శిబిరమునకును దుర్గమునుండి దుర్గమునకునుఁ బరుగిడుచు, విజయములుగాంచుచు ప్రజోత్సాహమును బెంపుచేసెను. రణరంగమునను ఆలోచనామందిరమునను సమానప్రతిభం జూపిన యీమహారాజ్ఞీనాయకత్వము నేవగింపక మహారాష్ట్రనాయకులు దృఢమనస్కులై పనిచేసిరి. ఇఁక మహారాష్ట్రు లాత్మరక్షణపరాయణులై యూరకుండక, పాదుషాను గలంచి తదీయ సామ్రాజ్యమును విధ్వంస మొనరించుటకే తలపడిరి. పాదుషా కొన్ని ప్రదేశముల నాక్రమించి మఱికొన్నింటిని జయించుటకు వెడలునపుడు, మహారాష్ట్రులు తీవ్రవ నరుదెంచి యచటి మొగలుసైన్యములను జెండాడి, ఆయా స్థలంబుల నాక్రమించి పన్నులు వసూలుచేసి, తమ యధికారులను నియోగించి పరిపాలన మొనరింపఁదొడంగిరి. ఇట్లు మహారాష్ట్ర సైన్యములే కాక మహారాష్ట్ర సుబేదారులును, తదితరోద్యోగులును గూడ నెల్లెడలఁ బొడసూపిరి. ౧౭౦౫ లోనే మాజీ సిందియా వింధ్యపర్వతముదాఁటి భూపాలున కేఁబదిమైళ్ల దూరముననున్న సిరంజివఱకునుగల మధ్యపరగణాలను యథేచ్ఛగాఁ గొల్లగొనెను. ఆసమయముననే ఖండేరావు దభాదేయనువాఁడు గుజరాతు రాష్ట్రముపైఁ బడెను. వాని బలసాహసనైపుణ్యములు వ్యక్తముగుట కొక విషయము వర్ణింతము. మహమ్మదు బేగుఖానుఁడను మొగలు సేనాని ఖండేరావు నెదిరింపఁబోయెను. మహారాష్ట్ర నాయకుఁడు మొదట నొక యల్పసైన్యముతో వానినెదుర్కొని పలాయన మొనరించెను. వైరి పరాజితుఁడయ్యెనని ఖానుఁడు భ్రమించెను. తదీయగర్వాతిశయమున నా మొగలునాయకుఁ డప్రమత్తుఁడై నర్మదానదీతీరమున నిశ్చింతగా నిద్రించెను. మహారాష్ట్రాశ్వికదళమంతయు నంతలో వాయువేగమున వచ్చిపడెను. మొగలుల కలవరము విపరీతము. పాఱిపోఁజూచినవారు నదీతోయములంబడి మరణించిరి. నిలిచినవారిని మహారాష్ట్రులు పరిమార్చిరి. సాయంకాలమగుసరికి మొగలాయీ సైన్యమంతయు నంతమొందెను. అహమ్మదాబాదువఱకును గల గుజరాతుదేశమును ఖండేరావు నిర్భయముగా దోపిడిచేసెను.

ఇట్టి యపజయములను గాంచుచుండిన మొగలు సైనికులు ధృతిచెడి, జుల్ఫికారుఖాను నాయకత్వము వహించునపుడు తప్ప మహారాష్ట్రసైన్యము నెదిరించుటకు వెనుదీయుచుండిరి. మహారాష్ట్రులు నిరంతరాభ్యుదయము గాంచుచుండ, మొగలులు నిరుత్సాహులై దుర్బలు లగుచుండిరి. ఇఁక సంధియొనరించుట కర్తవ్యమని యౌరంగజేబునకు స్ఫురించెను. నిర్బంధితుఁడైన తనకుమారుని కాంబఖుషుని వెంటనే విముక్తునొనరించి సంధికార్యమున కాతని నియోగించెను.

తమ నృపాలుఁడగు సాహూను విడుదల చేయవలయునని మహారాష్ట్రులు తొలుదొల్త గోరిరి. సాహూనుఁదోడ్కొని కాంబఖుషు మహారాష్ట్రస్కంధావారమున దిగవిడువవలయును. మహారాష్ట్రనాయకులు సంప్రదించుకొని, తమ యభిప్రాయముం దెలిపెదరు. దక్కనుసుబాలనుండి చౌతుసర్దేశముఖి పన్నులను వసూలుచేయు నధికారమును మహారాష్ట్రుల కీయవలయును. అందులకుఁగాను, మహారాష్ట్రులు వలయుసైన్యముల నాయితపఱచి దేశశాంతికి భంగమురాకుండ నరయుదురు. తదధికారపత్రముం గొనుటకు మహారాష్ట్రనాయకులు పాదుషాను సందర్శింతురు. ఔరంగజేబుపాదుషా యందులకు సమ్మతించి డెబ్బదిమంది మహారాష్ట్రనాయకుల నాహ్వానించెను. కాని, మహారాష్ట్రనృపాలుఁడగు సాహూనుమాత్రము వారుకోరినవిధమున నంపలేదు. పాదుషాచిత్త మనుమానగ్రస్తమయ్యెను. తన పుత్రుఁడే భయకారణుఁడయ్యెను. సాహూనుదోడ్కొను నెపంబున నాతఁడు మహారాష్ట్ర శిబిరముం జొచ్చి, వారి సాహాయ్యమునందనునడంచి సామ్రాజ్యాధిపత్యము వహింపఁగలఁడని యెంచి, మహారాష్ట్రరాయబారులకు సెలవిచ్చి, ఔరంగజేబుపాదుషా తదనంతరము వాకింకేరాయను దుర్గము నాక్రమించుటకు విశ్వప్రయత్న మొనరించెను.

వాకింకేరా బీజపురరాజ్యములోనిది.. బీజపురరాజ్యముతోఁబాటు నదియును మొగలాయీ సామ్రాజ్యాంతర్భాగమయ్యెను. కాని, తదీయాధిపతియగు పైరా

నాయకుఁడసాధ్యుఁడు. షాజాదా కాంబకుషుఁ డాతని నడంచుటకు బయల్వెడలెను. ప్రధానమంత్రియగు నసదుఖానుఁ డాతనికి సహకారిగానుండెను(౧౬౯౩). పాదుషా యంతలో జింజీదుర్గాక్రమణ ముఖ్యతమమని యెంచి, యాసైన్యము నటుఁ దరలించెను. సైరానాయకుఁడు మొగలాయీల దాడిసహింపక, మహారాష్ట్రులకుఁ దోడ్పడి, వారి సాహాయ్యమునం దన స్వాతంత్ర్యము నిలుపుకొనఁజూచెను. ఆతఁడు మొగలుల సంబారముల నడ్డగించి, జింజీముట్టడి దీర్ఘతరమగునట్లు చేసెను. మఱియు పాదుషా మహారాష్ట్ర దేశాంతరదుర్గములను జయించు సమయమున నాతఁడు వారి రసదుసామగ్రిం గొల్లపెట్టి యపారనష్టము గలిగించెను. పాదుషా సహజముగా నాగ్రహావేశుఁడై, వానిని శిక్షించుట వశ్యకర్తవ్యమని నిశ్చయించి, మహారాష్ట్రమువీడి వాకింకేరామీఁదికి వెడలెను. అదియే పాదుషా చరమప్రయత్నము.

మహారాష్ట్రు లానందపరవశులైరి. తారాబాయి తోడనే సమునిత ప్రయత్నము లొనరించెను. మొగలు లాక్రమించిన మహారాష్ట్రదుర్గములనుండి శత్రుసైన్యములను బాఱఁద్రోలి రామచంద్రుఁడు వానిని స్వాధీనపఱచుకొనెను. మహారాష్ట్ర సర్వసైన్యాధ్యక్షుఁ డగు ధనాజీజాదవుఁడు మొగలాయీ సైన్యమును వెన్నంటి వాకింకేరారణక్షేత్రమునకుఁ బోయెను. సైరానాయకుఁ డెంతటి సమర్థుఁడైనను అనంత మొగలాయీ సేనావాహినిని నిరోధించుట దుష్కరము. అతఁ డాకారణమునఁ దహతహలాడుచుండినసమయమున ధనాజీ పిడుగువలె వచ్చి మొగలాయీసైన్యమును దాఁకెను. ఈలోన మహారాష్ట్ర దుర్గములన్నియు వారి యధీనమగుటచేత నాయా సైన్యవిభాగములు కూడ నారణస్థలికి రాఁజాలెను. దుర్గమును సాధించుటకై పాదుషాయును, పాదుషాను భగ్నపఱచి పాఱఁద్రోలుటకు మహారాష్ట్రులును తీవ్రముగ దొరఁకొనిరి. వాకింకేరా కురుక్షేత్ర సన్నిభముగఁ బరిణమించెను. ఈ సందర్భమున మహారాష్ట్రులొకయెడఁజూపిన యుద్దండ సాహసము వారికే తగును. ఏకరణరంగ మనఁదగు పూర్వాపర సముద్ర మధ్యదేశమున శత్రుభయంకరుఁడై స్వైరవిహార మొనరించు ధనాజీ జాదవుఁడు తన స్త్రీజనంబును వాకింకేరాయందుంచెను. అద్యది యనుకూలముగా నుండెను. మహారాష్ట్రకాంతాజనంబు లింకను నందే యుండిరి. కాని, దుర్గము మొగలుల యధీనమగునేని మోసము వాటిల్లును. కావున ధనాజీకుటుంబమును సకాలముననే తప్పింపవలయునని యెంచి మహారాష్ట్రు లతిసాహస మొనరించిరి. నలువంకలను మొగలు సైన్యము కిటకిట లాడుచుండెను. మూఁడువేల మహారాష్ట్రాశ్వికు లాకస్మికముగా శత్రుసైన్యమును ఛేదించుకొనిపోయి, దుర్గముఁజొచ్చి, తదంతర మహారాష్ట్ర కాంతలను హయంబులపై నిలిపి, వచ్చినవిధముననే రిపుసైన్యమునుఁ జీల్చి, నిరపాయముగా నరుదెంచిరి. ఔరంగజేబు క్రోధైకధురీణుఁడయ్యెను. అంతలో, వేలూరుదుర్గమును జయించిన దావూదుఖానుఁడును, నేమాజీ సింధియాను మాళవ దేశమునుండి వెడలించిన జుల్ఫికారుఖానుఁడును నరుదెంచిరి. సమర్థుఁడగు జుల్ఫికారుఖాను వాకింకేరాదుర్గమును సాధింపఁ గృతనిశ్చయుఁడయ్యెను. తనదుర్గమిఁక శత్రువశమగునని యెంచి, యాత్మరక్షణ చింతాపరాయణుఁడై నాయకుఁడు రాయబారముల నెపంబునఁ గాలహరణ మొనరించెను. ఆపత్కాలమున దుర్గమునుండి తప్పించుకొనుటకు రహస్యబిలమార్గములు గలవు. నాయకుఁడు మిథ్యారాయబారములు సలుపుచుఁ దన భార్యాపుత్రాదిబంధుజనంబులను, ధనకనకాది సంచయంబును దరలించుకొని యదృశ్యుఁ డయ్యెను (౨౭-౧౧-౧౭౦౫). శూన్యదుర్గము పాదుషా యధీనమయ్యెను.

ఔరంగజేబు పూర్తిగ భంగపడెను. దక్కను దేశాక్రమణము మృగతృష్ణాజలావగాహన మయ్యెను. మహారాష్ట్రులు తమదుర్గము లన్నింటిని స్వాధీనపఱచుకొనిరి. పాదుషాయారోగ్యము శిథిలమయ్యెను. సహస్రరణరంగ మార్తాండుఁడు పూర్తిగ హతాశుఁడయ్యెను. తానును, తన మహాసైన్యమును నిరపాయముగా దక్షిణదేశమునుండి యింటికిఁ దరలుటయే యిఁకఁ గర్తవ్యమయ్యెను.

కాని, ఆమహా సైన్యమును నిర్మూలింపవలయు నని మహారాష్ట్రులు సంకల్పించిరి. మొగలాయీ సైన్యము చలించినంతనే ధనాజీజాదవుఁడు పిడుగువలెఁ బిఱుందఁ దాఁకి నానాబీభత్స మొనరించెను. అతఁడు చంపఁగల సైన్యమును జంపి, హతశేషులగు సేనానులం బట్టి యుప్పనముఁ గొని విడిచిపుచ్చెను. దండు సామగ్రి యాతని యధీనమయ్యెను. ధనాజీ ఆయూపునఁ బాదుషానుగూడఁ బట్టవలసినదె. చక్రవర్తి కేవల మంగరక్షక పరిరక్షితుఁడై యుండెను. కాని, నానా రాజకిరీట విరాజితపాదుఁడగు మొగలు సార్వభౌమునిఁ బరివేష్టించియుండు నసదృశ తేజో వైభవంబులకు వెఱగంది యాసాహసి వెనుదిరిగెను. పాదుషా యెట్టకేలకు నహమ్మదునగరముం జేరెను (జనవరి, ౧౭౦౬).

పాదుషాస్థితి యెటు లుండెను? పాతికసంవత్సరములక్రిందట మొగలాయీసార్వభౌముఁడు సామ్రాజ్య రాజధానినుండి యనంత సేనాముఖంబునఁ దరలివచ్చి యవిరళ వైభవాభిరాముఁడై విడిసి, సేతుపర్యంత దక్షిణదేశము నల్పకాలమున జయించుటకు సగర్వముగ సంకల్పించెను. నేఁడో! వైభవ మంతరించెను. సైన్యము తఱిగెను. ఆశ లడఁగంటెను. శరీరము శిథిలమయ్యెను. కాలమాసన్నమయ్యెను. తాను కనుమూయునంతనే తన తనయులు సామ్రాజ్యమునకై పోరాడుదురని గ్రహించి యట్టి యనర్థముల దొలగించు నెపంబున సామ్రాజ్యమును విభాగించి వారి కీయఁబోయెను. ఆ విషయ మటుండ, మహారాష్ట్రులు జయోన్మత్తులై భయంకరముగ విజృంభింపఁదొడంగిరి. తన రాజధానికిఁ బోఁజూచినపాదుషాను నిరోధించుటకు మహారాష్ట్రులాయిత్తపడుచుండిరి. సమర్థుఁడగు జుల్ఫికారుఖానుఁడును, ఇఖలసుఖానుఁడును కారుక్రమ్మిన శత్రుకాంతారమును ఛేదించి పాదుషాకు దారిచేయఁదొడంగిరి. కాని, యతఁడు తన రాజధానిం జేరుటకు నోఁచుకొనలేదు. పాదుషా వ్యాధిగ్రస్తుఁడయ్యెను. ఐనను, ప్రార్థనాదినిత్యకృత్యములను యథావిధమున నొనరించుటవలన వ్యాధి బలవత్తరమయ్యెను. ఇఁక నాతఁడు జీవించునది కొలఁది దినములె. ఆముష్మికచింతాపరాయణుఁడై యుండవలసిన యామహనీయునకట్టి మహాసమయమునందైనను మనశ్శాంతి లేకుండెను. ప్రియతనూజుఁడగు కాంబకుషుఁడొక్కఁడే వృద్ధజనకుని చెంగట నుండెను. అహమ్మదునగరము నందుండిన రెండవ కుమారుఁడు—అజాముషా పితృసందర్శనార్థ మనుజ్ఞఁ గోరెను. తొల్లి షాజహానుచక్రవర్తి వ్యాధిగ్రస్తుఁడైనంతనే యితరసోదరులవలె నౌరంగజేబుకూడ యుద్ధసన్నద్ధుఁడై, జనకుఁడు వఁగువలదని హెచ్చరించి శాసించినను, వినిపించుకొనక బయల్వెడలి జ్యేష్ఠభ్రాతయగు దారాను నిర్జించి, రాజధాని నాక్రమించి, జనకుని నిర్బంధించెను. ఔరంగజేబుపాదుషా యాకారణమున ననుమానగ్రస్తుఁడై తన కుమారుని రావలదని యాజ్ఞాపించెను. ఐనను, అజాముషా తదాజ్ఞావిరుద్ధముగాఁ దండ్రిని దర్శించెను. ఆతఁ డరుదెంచినంతనే తన సోదరుఁడగు కాంబకుషునితోఁ గలహించి, వానిని మడియించుటకే ప్రయత్నించెను. తామువ్వురకు నపాయము కలుగకుండవలయునని యోచించి, కాంబకుషుని బీజపురపాలకునిగను, అజాముషాను మధ్యహిందూదేశపాలకునిగను నియోగించి వారిరువురను దరలించెను. ఒకవారము గడచినంతనే—మార్చి మూఁడవ తారీకున నౌరంగజేబుపాదుషా ప్రత్యూషమున మేల్కాంచి, యుదయప్రార్థన మొనరించి, మఱియొక గంటకు లోకాంతరగతుఁ డయ్యెను.

ఔరంగజేబు దక్కనుదండయాత్ర నెపోలియను రష్యనుదండయాత్రను పోలియున్నది. ఐరోపాఖండ చరిత్రం జదివినవారికి నెపోలియనుచక్రవర్తి చరిత్ర సువిదితము.

ఔరంగజేబుపాదుషా నెపోలియను చక్రవర్తు లిర్వురు నఖండ ప్రతిభాధురీణులు, సమరవ్యాపార

---

"had the Mahrattas improved an advantage which they gained, the Emperor of the Moghuls their inveterate foe Aurangzebe would have been a prisoner in their hands"—Grant Duff, vol I, p. 309.

పారంగతులు, విజిగీషులు. తా నొక సామాన్యసైనికుఁడయ్యు భయంకరవిప్లవానలదగ్ధమైన మాతృదేశమును సముద్ధరించి, దేశనాయకుఁడై, అగ్రగణ్యుఁడై, చక్రవర్తియై, నిజసామ్రాజ్య విస్తారకుఁడై, యూరపుఖండమునంతటిని గడగడలాడించిన మహాశూరుఁడు నెపోలియను చక్రవర్తి. తాను తృతీయసోదరుఁడయ్యు ననదృశ ధైర్యస్థైర్యధిషణావైభవంబున బలగర్వితులగు జ్యేష్ఠసోదరుల నడంచి సామ్రాజ్యాధిపత్యము వహించి సామ్రాజ్యము నత్యంతముఁ బెంపుచేసి యేఁబదిసంవత్సరములు నిరంకుశముగాఁ బరిపాలించిన మహాయోధ యౌరంగజేబుపాదుషా. అట్టి నెపోలియను చక్రవర్తి విధిప్రేరితంబునఁ గావలయు దుర్జయమగు నాలుగులక్షల సైన్యముంగొని యతిదూరమగు రష్యాదేశముపై దండెత్తె, గడుసరులగు రష్యనులు తమ యనంత దేశములోనికి వైరి నాకర్షించి యాకర్షించి క్షుధార్తమగు శత్రుసైన్యము పట్టెఁడు గ్రాసము గాంచక మలమలమాడునట్లు తమరాజధానియగు మాస్కో పట్టణమును నిర్దయులై పూర్తిగ దహించివైచిరి. తనదేశ మీలోపున నపాయగ్రస్తమగుటచేత నెపోలియను చక్రవర్తి పరుగుపరుగునఁ బోవలసినవాఁడయ్యెను. తినుటకాహారములేకను, ఊహాతీతమగు మంచునఁ గొఱడుపాఱియు, వెన్నాడు క్రూరశత్రుమారణమునను దిగ్విజయ మొనరింపవలసిన ఫ్రెంచి మహాసైన్య మాలుగులక్షలును నాశనమయ్యెను. దక్కనుదేశముపై దండెత్తిన మొగలాయీ సైన్య మెట్టిబాధలుపడెనో గమనించియే యుంటిమి. నెపోలియను చక్రవర్తి భంగపడినను ఫ్రాన్సుదేశమునకు యథాప్రాముఖ్యము దక్కియుండెను. కాని, ఔరంగజేబుపాదుషాపతన మాతనితోఁ దీఱక, భారతదేశస్వాతంత్ర్యాంతమునకుఁ గారణభూతమయ్యెను.

ఔరంగజేబు మరణించినంతనే తదీయ కుమారులు మువ్వురును యుద్ధసన్నద్ధులైరి. జ్యేష్ఠుఁడగు షా ఆలము కాబూలునం దుండెను. పితృమృతి తెలిసినంతనే యాతఁడు చక్రవర్తిత్వముం బ్రకటించుకొని, బహదూరుషాయను బిరుదము ధరించి సామ్రాజ్య రాజధానియగు ఢిల్లీపట్టణము వడివడిఁ జేరెను. బహదూరుషా కేవల స్వార్థపరుఁడును, దయారహితుఁడును గాఁడు. ఆతఁడు భ్రాతృప్రేమార్ద్రచిత్తుఁడై, సోదరుఁడగు నజాముషాకు దక్కనురాష్ట్రములనే కాక, గుజరాతుదేశమునుగూడ నర్పింపఁబోయెను. కాని, ఆ భ్రాత దురాశాపరుఁడై సమరసన్నద్ధుఁ డయ్యెను. అజాముషా యాగ్రానగరమునకుఁ బదునైదుమైళ్ల దూరముననున్న 'జాజు' ప్రాంతమున రణమొనరించి త్రెళ్లెను. ఇఁక నౌరంగజేబుప్రియతనూజుఁడగు కాంబకుషు మిగిలియుండెను. వానికి గోలుకొండ బీజపుర దేశములను బహదూరుషా యొసంగఁబోయెను. కాని, కాంబకుషు వృథాభిమానియై యుద్ధసన్నద్ధుఁడయ్యెను. జింజీ ముట్టడినుండియు నాతనిపైఁ బగగొనియుండిన జుల్ఫికారుఖానుఁడు తోడనే యాతని నెదుర్కొని, భంజించి, బంధించెను. పాప మాయభాగ్యుఁడు పరాభవ సంస్మరణానలమున మ్రగ్గి మరణించెను. బహదూరుషా యీపగిదిం దన వారసత్వమును స్థిరపఱచుకొనెను. ఆతని సార్వభౌమత్వము సర్వజనసమ్మతమయ్యెను.

ఇఁక సాహూ నిర్బంధవిముక్తుఁడై, రాజ్యారూఢుఁడైన యుదంత మరయవలయును. ఔరంగజీబు మరణానంతరము సాహూ అజాముషాయధీనుఁడయ్యెను. ఆతఁడే సాహూను విడిచిపుచ్చెను. తత్కారణము విచారింతము. సమర్థురాలగు తారాబాయి తన కుమారుని తరఫున రాజ్యము చేయుచుండెను గదా. ఆమె ప్రతిభాసామర్థ్యములు మొగలుల కనుభవవేద్యమె. సామ్రాజ్యసంపాదనార్థము పాదుషాపుత్రులు పరస్పరయుద్ధనిమగ్నులగు సమయమున మహారాష్ట్రులు మఱియు విజృంభింపఁగలరు. మహారాష్ట్రమహారాణి యట్లులే యొనరించెను. కాని, సాహూ మహారాష్ట్రమునకు నిక్కంపు రాజుగదా. తన రాజ్యముకొఱకు సాహూయును, రాజ్యము విడువనొల్లని తారాబాయియును తప్పక పోరాడెదరనియు, తా నాకారణమున నిరపాయముగాఁ దనయన్నపై దండెత్తి ఢిల్లీసింహాసన మధిరోహింపవచ్చుననియు నజీముషా వితర్కించి సాహూను విడిచెను. కాని అజీముషా రణరంగమున నిహతుఁడయ్యెను.

ఔరంగజేబుపాదుషా మరణించినంతనే తారాబాయి పూనా, చాకను మొదలగుస్థలములనుండి శత్రుసైన్యములను బాఱఁద్రోలి మహారాష్ట్రరాజ్యముం బెంపు చేయుటకుఁ బూనుకొనెను. ధనాజీ మొదలగు మహారాష్ట్రప్రముఖులు శక్తివంచన లేకుండ పాటుపడిరి. కాని, సాహూ యంతలో విడివడి యరుదెంచెను. పరిస్థితులు మాఱిపోయెను.

సాహూ అవస్థ నిరుత్సాహకరముగ నుండెను. సుమా రిరువది సంవత్సరములనుండి రాజారాము తారాబాయిల నాయకత్వమున నజేయుఁడగు నౌరంగజేబుపాదుషాను బరాభవించి మహావిజయములం గాంచిన మహారాష్ట్రులు సాహూను విస్మరించిరి. మఱియు తారాబాయి తానే రాజ్యాధిపత్యము వహించుటకుఁ గృతనిశ్చయయై యుండెను. ఆమెకుమారుఁడు కేవలము జడుఁడైయుండక, యేమాత్రపు శక్తిసామర్థ్యములుగలిగి యుండినను, సాహూ రాజగుట యసంభవమైయుండెడిది. ఐనను, మంత్రివర్గమునం దనేకులు శివాజీపౌత్రునిపై నభిమానము వహించియుండిరి. అంత నుపాయశాలినియగు తారాబాయి యొక ప్రవాదము గల్పించెను. అసలైన శంభాజీకుమారుఁడు చిరకాలముక్రిందటనే మరణించెననియు, మహారాష్ట్రులను మోసపుచ్చునెపంబున నానామధేయమున మఱియొకని నౌరంగజేబుపాదుషా పెంచెననియుఁ దారాబాయి కల్పించెను. తొల్లి జస్వంతసింహకుమారులను దుర్గాదాసు తప్పించినపుడు ఔరంగజేబుపాదుషా యటు లాచరించెను. కావున, తారాబాయికల్పన యుక్తియుక్తముగానుండెను. ఐనను తారాబాయిప్రేరణంబున రామచంద్ర బవేడ్కరుఁడును, మఱియిద్దఱునుమాత్ర మామెకుఁ దోడ్పడుటకు శపథముం జేసిరి. మిగిలినవారు సాహూ కపటియని బుజువగువఱకు నాతని రాజత్వ మామోదించుటకు సంసిద్ధులైయుండిరి.

సాహూవలనఁ దన కపాయము వొరయకుండ నజాముషా చక్కని కట్టుదిట్టములు గావించెను. ఆతని భార్యయును, ఆతని జనయిత్రియగు యశోబాయియును, మఱికొందఱును మొగలాయీశిబిరమునఁ బ్రతిభులుగా నుండిపోయిరి.

మహారాష్ట్రరాజ్యము గడింపవలసిన సాహూతోడ నేఁబదిమంది యాశ్వికులుమాత్రము మొగలాయీ స్కంధావారమునుండి వచ్చిరి. సజ్జనసింహుఁడను జమీందారుఁ డాతని ప్రథమమిత్రుఁడై తోడ్పడెను. తారాబాయియభిప్రాయ మాతఁడు తెలిసికొని, మహారాష్ట్ర నాయకులకు జాబులంపెను. పర్సోజీ భాన్లే వెంటనే తన నృపాలు నాశ్రయించెను. అచిరకాలమున హైబతరావు నింబాల్కరు, నేమాజీ సింధియా యను ప్రముఖులు స్వామిభక్తిపరాయణులై చయ్యన నరుదెంచిరి. సాహూ యంతట నుత్సాహియై, తనరాజ్యముఁ దన కప్పగింపవలయునని తారాబాయికి లిఖించిపంపి, యహమ్మదునగరమున విడిసెను. తదనంతర మొకమహారాష్ట్రగ్రామాధికారి సాహూను నిరోధించెను. అట్టి ప్రజాళికి బుద్ధిచెప్పవలయునని యెంచి, యాతఁ డానగరప్రాకారమును శతఘ్నులచేఁ బగులఁగొట్టించి, యా మొఱకునితోఁ బాటు తదితరులంగూడఁ జంపించెను. ఆ గ్రామాధికారికోడలు తన పసిబాలుని సాహూపాదములపై నైచి యర్థించెను. సాహూ దయాళుఁడై, ఆబాలునకుఁ దన ఇంటి పేరిడి, ఫతేసింగు భాన్లేయని పిలిచి, ఔరంగజేబుపాదుషా తనకు వివాహసమయమునఁ గట్నముగా నొసంగిన అకాలకోట యను జాగీరును గూడ సాభిమానముగా నిచ్చెను. ఆబాలుఁడే ప్రవర్ధిల్లి ఇప్పటి అకాలకోటరాజులకు మూలపురుషుఁ డయ్యెను.

సాహూ పూనాదేశము ప్రవేశించినంతనే తారాబాయి పంపిన మహాసైన్యము గోచరమయ్యెను. మహారాష్ట్ర సర్వసైన్యాధ్యక్షుఁడగు ధనాజీజాదవుఁడే యాసేనాముఖంబున నరుదెంచెను. అట్టి ప్రసిద్ధ నాయకునితోడ యుద్ధ మొనరించు టవివేకమని యెంచి సాహూ చక్కని యుపాయమున సులువుగాఁ గృతకృత్యుఁడయ్యెను. శివాజీపౌత్రుఁ డేకపరిచారికా సాహాయ్యుఁడై యొక మదేభ మారోహించి, యుభయసైన్యములును ప్రమాన్పడి చూచుచుండ, ధనాజీజాదవుని డాసి, యాతఁ

యథాపూర్వమహారాష్ట్రనృపాలుని దక్షిణ మాశ్రయింప వలయునని హెచ్చరించెను. ధనాజీ యనుమానము వెంటనే యంతరించెను. సాహూ శంభాజీ కుమారుఁడు కానియెడల నట్టి ధైర్యస్థైర్యములను జూపఁజాలఁడని యెంచి ధనాజీతోఁబాటు మానసింగు మోరే యను నాయకుఁడుగూడ ససైన్యముగా సాహూ నాశ్రయించెను. తారాబాయిసైన్య మాకారణమున సులువుగా నోటువడెను. సాహూమహారాజు అనేకదుర్గములను వశపఱచికొని, మహారాష్ట్ర సంప్రదాయసిద్ధముగా సతారాయందు మహారాష్ట్ర రాజ్యాభిషిక్తుఁ డయ్యెను.

స్వతంత్ర మహారాష్ట్ర స్థాపకుఁడగు శివాజీ మహారాజు మరణించినను, శంభాజీ చిత్రవధకుఁ బాల్పడినను, రాజారాముఁడు మహా సమరమధ్యమున గతాసుఁడైనను, తుద కొక తొయ్యాలి రాజత్వము వహించినను, ఓహటింపక, మహోదగ్రుఁడగు నౌరంగజేబు పాదుషా యంతవానికిఁ బాఱఁద్రోలి తమస్వాతంత్ర్యమును నిలుపుకొనఁజాలిన మహారాష్ట్రులు నిక్కముగఁ బ్రశంసార్హులు. సాహూ మొగలాయీనిర్బంధవిముక్తిఁ గాంచినపుడే బీరార, బీదరు, ఖాండేషు, ఔరంగబాదు, గోలుకొండ, బీజపురము నాఁబడు దక్కను సుబాలనుండి 'చౌతు', 'సర్దేశముఖి' పన్నులను వసూలుచేయు నధికారము గాంచియుండెను. మొగలాయీ పాదుషాయగు బహదూరుషా తదధికారమును స్థిరపఱచెను. అట్లు మహారాష్ట్ర ప్రజాప్రతిభావిశేషమునఁ బునఃప్రతిష్ఠితమైన మహారాష్ట్రరాజ్యము పీష్వాల ప్రతిభాతిశయమున సాహూ జీవితకాలముననే మహాసామ్రాజ్యముగాఁ బరిణమించెను.



గ్రామపరిసరము A. A.

# మెండలీయము–రక్తస్పర్శ

యస్. యం. వేణు

## ౪

క్రిందటిసారి గీనీల విషయమై చర్చించుచు నున యిష్టప్రకారము మగబిడ్డలు కావలసినచో మగబిడ్డలను, ఆడుబిడ్డలు కావలసినచో నాడుబిడ్డలను బడయవచ్చునని మాటలసందర్భిని చెప్పినట్లున్నది. అది మనచేత నున్న పనియా ? అటులయినచో వంశము నిలబెట్టుటకు మగబిడ్డలేదని వాపోవుచున్న యెన్నియో కుటుంబములకు శుభవార్తసుమా యిది. మగశిశువుకావలయునను వాంఛ చేత ఎందఱు ఎన్ని తీర్థయాత్రలు చేయుటలేదు ? అన్న దానములు, వస్త్రదానములు; గుంటలు త్రవ్వించుట, బావులు త్రవ్వించుట; గుళ్లుకట్టించెదమని, గోపుర ప్రాకారాదులు నిర్మించెదమని దేవునకు మ్రొక్కుబళ్లు; "పుట్టిన బిడ్డ నట్లనే నీకు దత్తముచేసెద"మని తిరుపతి వేంకటేశ్వరునకు ప్రార్థనలు; అశ్వత్థవృక్ష ప్రదక్షిణములు; గ్రహ-సోకుడును పోగొట్టుటకుఅమ్మగారికి ఆంజనేయుని గుడిచుట్టు త్రిప్పటలు, మంత్రములు, తంత్రములు, తాయతులు మొదలైన వెఱ్ఱిచేష్టలప్పుడనవసరమని వారెఱిగి యభీష్టము సిద్ధింపజేసికొని ఎంత సుఖింతురో గదా ! అట్టిమార్గమున్నచో నద్దానిని వెలిబుచ్చుడు." అని చదువరులు నన్నడుగవచ్చును. కానే పోగుడు. అట్టిపని ప్రకృతిశాస్త్రవేత్తలచేతిలో నున్నదని నిరూపించెదను.

మనలోను, తక్కిన సమస్తప్రాణులలోను, గల స్వరూపస్వభావాదులకు గీనీల యునికి ఎట్లు కారణభూతమో, అదేవిధముగ ప్రాణులలోని లింగభేదమునకు అణుకోశములలోని వర్ణగ్రాహకముల సంఖ్యాభేదమే కారణము. మగవారి అణుకోశములో నలుబది యేడు వర్ణగ్రాహకము లున్నవి; స్త్రీలలో నలుబదియెనిమిది యున్నవి. మనలో స్త్రీ పురుష భేదమున కిదియే కారణము. ఈ సంఖ్యాభేదము ప్రప్రథమమున బిడ్డలయం దెట్లు కలుగుచున్నదో వివరించెదను.

పిండోత్పత్తికి పూర్వము స్థూలబీజాశయమునందు సూక్ష్మబీజము ప్రవేశమై స్థూల సూక్ష్మబీజ సమ్మేళన మవసరమని మనము తెలిసికొంటిమి. తత్పూర్వము పిండోత్పాదక బీజకణకోశ నిర్మాణము కావలసియున్నది. తన్నిర్మాణమునకు ముందే క్షీణవిభాగము జరుగుటవలన బీజాణుకోశములలోని వర్ణగ్రాహకముల సంఖ్య తక్కిన శరీరావయవ జీవకణకోశములవానిలో సగము మాత్రమే యుండునని మనము చదివియున్నాము. ఘటనాగతి ననుసరించి జరుగు ఇట్టి క్షీణవిభాగమునందిన పిండోత్పాదక బీజకణకోశముల సమ్మేళన గర్భములోని బిడ్డ యొక్క లింగమును స్థిరపఱచును. ఇదెట్లు జరుగుననియు సూచించుట కుదాహరణము నీ క్రింద నిచ్చుచున్నాను.




చిత్రము : ౨౧.
సంతానమునందు స్త్రీ పురుష నిర్దేశము

ఒక స్త్రీయందారు వర్ణగ్రాహకములును, పురుషునియందైదు వర్ణగ్రాహకములును ఉన్న వనుకొందము. ఈసంఖ్య శరీరాణుకోశములలోనిది. జీవోత్పాదక బీజకణకోశ నిర్మాణమునకు పూర్వము క్షీణవిభాగము జరుగును. తత్ఫలితముగ స్త్రీయొక్క బీజాణుకోశములలో మూడేసి వర్ణగ్రాహకములును, పురుషుని బీజాణుకోశములలో కొన్నిటియందు రెండేసియు మఱికొన్నిటియందు మూడేసియు నుండును (చూ. చిత్రము ౨౧). ఘటనాగతి ననుసరించి రెండు వర్ణగ్రాహకములు గల సూక్ష్మబీజాణుకోశము స్థూల బీజాణుకోశముతో సమ్మిళితమైనను, తత్ఫలితముగ గలుగు ఏకబీజాణుకోశము మగశిశువుగా నుత్పత్తియగును. ఏలననగా రెండువర్ణగ్రాహకము లుండిన సూక్ష్మబీజాణుకోశము మూడు వర్ణగ్రాహకములుండిన స్థూలబీజాణుకోశముతో మేళవించినందున తత్ఫలితముగనేర్పడిన ఏకబీజాణుకోశమునం దైదువర్ణగ్రాహకములు మాత్రమేయుండును. దీని ద్విగుణీకృతిచేత నేర్పడు శిశువునందున్నజీవాణుకోశములయందునుఐదువర్ణగ్రాహకములుమాత్రమేయుండును. ఈసంఖ్య మగవానియందుండినదిగనుక శిశువు మగవాడుగనే యుండును. ఇదేవిధముగ మూడు వర్ణగ్రాహకముల సూక్ష్మబీజాణుకోశము స్థూల బీజాణుకోశముతో కలిసినను దానినుండి కలుగు శిశువు ఆడుదిగనే యుండును. ౨౧ - వ చిత్రము ఈ విషయమును చక్కగా విశదీకరించును. దీనింబట్టి శిశువులయందు స్త్రీ పురుష భేదములను గలిగించుట సంపూర్ణముగ మగవానియం దాధారపడియుండుననుట నిస్సందేహము సంగతి యేర్పడుచున్నది. కలుగుబోవుబిడ్డ స్త్రీ కానున్నదియు, పురుషుడు కానున్నదియు స్థూలసూక్ష్మ బీజాణుకోశముల సమ్మేళనమప్పుడే స్థిరపడిపోవును.

కావున మన యిచ్ఛవచ్చిన పిల్లలను గనవలయునన్నచో, తత్సమ్మేళనకు పూర్వమే, అందునను మగవారియందు 'గీసీల' మార్పుజేయుటకు ప్రయోగింపబడిన దానివలె కొన్ని యౌషధములు, ఎక్స్‌రేలు (X rays), అల్ట్రా వైలెట్ (Ultra violet) కిరణములు మొదలైనవాని సహాయమున నిరువది నాలుగు వర్ణగ్రాహకములుండు సూక్ష్మబీజాణుకోశములను నశింపజేసినచో (మనుష్యులలో మగవారిలో నలువదియేడును,




చిత్రము : ౨౨.

X. 24 వర్ణగ్రాహకములుగల సూక్ష్మబీజాణుకోశము ఔషధప్రయోగముచే చంపబడినది.

Y. స్త్రీ సంతానము కలుగక ఆపబడినది.

స్త్రీలలో నలువది యెనిమిదియు నుండును గనుక) వానికి పుట్టు పిల్లలెల్లరు మగవారుగనే యుందురు (చూ. చిత్రము ౨౨) ఇట్టి అవకాశములు త్వరలో మనకు సంప్రాప్తింప నున్నవి. ఇంతవఱకు మనుష్యేతరములపై నీ శాస్త్రీక ఔషధప్రయోగములు చేయబడి చాల వఱకు తృప్తికరమగు ఫలితములు గలిగియున్నవి. అది మనుజులయందును సార్థకమగుననుట కెట్టి సందేహమును వలదు.

సహజముగా నిప్పు డెల్లెడల జరుగుచున్నట్లు శిశుజననవ్యాపారమును దైవానుకూలమున కప్పగించివేసి, మనము చేతులుకట్టుకొని కూర్చున్నచో ౨౧ వ చిత్రమున గన్పడురీతిని ప్రతిదేశమునందును స్త్రీ పురుషుల సంఖ్య సమానముగ నుండవలెను. జనాభా లెక్కలలో నూటికి ఏబదిమంది స్త్రీలు, ఏబదిమంది పురుషులు ఉండితీరవలయును. కాని అట్లెచ్చటను లేదు. ఎటుజూచినను ఆడువారిసంఖ్య యెక్కువగనేయుండును. ఇందులకు కారణము మగశిశువుల మరణసంఖ్య స్త్రీ శిశువులకంటె నెక్కువగానుండుటయే. చనిపోయి పుట్టిన వారిలో చాలమంది మగవారుగనేయుందురు. అదియు

గాక ఆడువారికంటె మగవారి యాయుఃపరిమితి తక్కువ. కనుకనే ఆలుచచ్చినవారికంటె మగడు చచ్చినవా రెక్కువగ నుందురు. ఏమి చిత్రమో గాని పుట్టినప్పటినుండియు మగతనముతో గూడ మృత్యుదనము పెనగొనియుండును. ఈ అననుకూలము ఆడువారికి లేదు. వా రెప్పుడును గడుసువారే.



చిత్రము: ౨౩

జీవాణుకోశము-ద్విగుణీకృతము-క్షీణవిభాగము

A. సూక్ష్మబీజాణుకోశము,

D. స్థూలబీజాణుకోశము.

B. ఏకబీజకణకోశము (పిండోత్పత్తి)

BI<br>BII } B యొక్క ద్విగుణీకృతము- శరీర నిర్మాణము<br>BIII

C. జీవాణుకోశము-క్షీణవిభాగము.

D. బీజాణుకోశము

(వీనిలో వర్ణగ్రాహకములసంఖ్య గమనించునది.)

ఇంతదనుక చెప్పినయంశముల నిచ్చట మఱల జ్ఞాపకార్థము సంక్షేపముగా దెలుపుచున్నాను.

ఏకజీవకణకోశము పిండోత్పత్తి<br>↓<br>దాని ద్విగుణీకృతముచేత వివిధావయవసహితశరీరం } ద్విగుణీకృతము-వర్ణగ్రాహకము సంఖ్య మారదు.<br>↓<br>బీజోత్పాదక కణములు } క్షీణ విభజన. వర్ణగ్రాహకము సంఖ్య శరీ<br>↓<br>బీజోత్పాదక జీవకణ కోశములు } రాణుకోశములలో వానిలో సగముమాత్ర ముండును.

(చూ. చిత్రము ౨౩)

జ్ఞాతి సంబంధములు మనలో నెన్నియో ఏండ్ల నుండి నాటుకొనిపోయియున్నవి. మనదేశములో నుంకు



♀ స్త్రీచిహ్నము
X. ఒకస్త్రీ జీవాణుకోశము. x' x' స్థూలబీజాణుకోశములు. X లోనినల్లని వర్ణగ్రాహకము, దుర్బలమతిత్వకారకులగు గుణవాహకులతో నిండియున్నది. ఈమిథునములోని సంతానములో నూటికి 25 మంది సంపూర్ణముగ దుర్బలమతులు, 50 మంది తలిదండ్రులవలె దుర్బలమతిత్వవాహకులు, 25 మంది. ఆరోగ్యవంతులు.

♂ పురుషచిహ్నము
Y. ఒకపురుషుని జీవాణుకోశము. y'; y'. సూక్ష్మబీజాణుకోశములYలోని నల్లని వర్ణగ్రాహకము దుర్బలమతిత్వకారకులగు గుణవాహకులతో నిండియున్నది. A. B. C.లు X. Y.లసంతానమును దెలుపును. A 25% సంపూర్ణముగ దుర్బలమతులు. B. 50% దుర్బలమతిత్వ వాహకులు. C. 25% ఆరోగ్యవంతులు.

చిత్రము: ౨౪

జ్ఞాతిసంబంధములు—అనర్థములు

ఏ ఐమువందలు, ఏమువందలు, ఎనిమిదివందలు జనసంఖ్య గల చిన్న చిన్న పల్లెలలో ముప్పాతికా ముప్వీసము ఏ రెండు మూడు కుటుంబములవారుగనే యుందురు. ఎవ్వరికైన మేనమామకూతు రుండునట్లాయెనా, పైవారెవ్వరు అయ్యగారికి పిల్ల నివ్వరు. తండ్రిసోత్తునకు తనయుడుహక్కుదారుడైనట్లు అక్కచెల్లెళ్లకు గలుగు ఆడుబిడ్డలు అన్నదమ్ముల సొత్తన్నమాట. ఇట్టి వెట్టి ఆచారములు మన మెప్పుడు వదలిపెట్టుదుము మోగదా! "అటులైనచో జ్ఞాతిసంబంధములు చెడ్డవేనా?" యని మీ రడుగవచ్చును. ఇంతవఱకు దొరకియుండు ఆధారములను బట్టి జ్ఞాతిసంబంధ వివాహములవలన అట్టె సత్ఫలితము గన్పడలేదు. కాని అచ్చటచ్చట కొన్ని మంచి దృష్టాంతము లున్నవి. వీనిలో మెండెలుగారి సూత్రము లనువర్తించును. జ్ఞాతులలో నొకరికి వివాహమైన దనుకొనుడు. ఆ స్త్రీపురుషులు పైకి చక్కని యారోగ్యవంతులుగ గన్పడినను వారు దుర్బలమతిత్వవాహకులుగా నుండవచ్చును. మెండెలుగారి మిశ్రజములయందు గుప్తగుణముగా పరిణమించిన పొట్టితనమువలె వీరిలో దుర్బలమతిత్వము గుప్తగుణముగా నుండును. వారికి గలుగు సంతానమునందు ౨౪-వ చిత్రమున చూపినరీతిని నూటికి ఇరువది యైదుగురు పూర్తిగ దుర్బలమతులుగను, ఏబదిమంది తద్వ్యాధివాహకులుగను, తక్కిన వారు సామాన్యముగ నారోగ్యవంతులుగను ఉందురు. దుర్బలమతిత్వపీడితులగువారి వంశవృక్షమును, వారిలో జ్ఞాతి సంబంధములవలన గలిగిన యనర్థమును ౨౫ వ చిత్రమున చూడుడు. ౨౬ వ చిత్రము గాల్టనుగారి వంశవృక్షము మఱియొక కథను దెలుపును. గాల్టనుగారి దాయాదులలో చాలమంది గొప్పగా బ్రదికినవారు. చిత్రమున చూపియుండువఱకు గల ముప్పదుగురిలో పదకొండుగురు స్త్రీలుపోగా తక్కిన పందొమ్మిదిమంది పురుషులలో పదహైదుమంది గొప్ప పదవుల నలంకరించిరి. ఇందునను మెండెలుసూత్రము లనువర్తించిన వనుటకు సందియములేదు కాని జ్ఞాతిసంబంధములలో నిట్టి ఫలితములు కలుగుట చాల అరుదు. అట్టి సంబంధములు చేయుటలో ఎక్కడనో ఒక్కొకచోట దప్ప తక్కిన అన్నిటిలోను అభివృద్ధి సూచనలు కనబడకుండు టచే నట్టి సంబంధములు మానివేయుట క్షేమకరము. ప్రకృతిశాస్త్ర పరిశోధనలు మఱికొంతదూరము సాగిపోయి, దాయాది వివాహములవలని ఫలితములను స్పష్టము చెప్పిన మార్చుకొనుటకు వీలగునట్లు వసతులేర్పడువఱకు అట్టి వివాహములు దలపెట్టకుండుట శ్రేయస్కరము. "మా కాశాస్త్రములవిషయము వలదు; మే మంతవఱకు కాచుకొని నక్కఱలేదు. మా వివాహవిషయములు మీ చేతులలో బెట్టి అనిశ్చితమగు భవిష్యత్తునకై మా స్వేచ్ఛను, మా సౌఖ్యమును దారబోసికొమ్మందురా? బాగు, బాగు. మీ ప్రకృతిశాస్త్రములు మీయొద్దనే యుంచుకొనుడు. మా జోలి మీకనవసరము" అని మీరనవచ్చును శాస్త్రపరిజ్ఞాన మభివృద్ధియగు కొలది అందలి విషయములు నాగరికత ప్రపంచాభివృద్ధికి మనము వలదన్నను, కావలయునన్నను ప్రయోగింపబడక మానవు. బుద్ధి బలప్రవాహమున కడ్డుతగుల నెవ్వరితరము? విరామములేక కొట్టుకొనుచుండు మనగుండె విశ్రాంతి




చిత్రము : ౨౫.

దుర్బలమతిత్వ బాధితులగువారి ఒకానొక వంశవృక్షము.

నల్లని చదరములు. సంపూర్ణముగ దుర్బలమతులు. పురుషులు.

నల్లని వలయములు. సంపూర్ణముగ దుర్బలమతులు. స్త్రీలు.

నల్లనిచుక్కగల తెల్లని చదరములు. దుర్బలమతిత్వ వాహకులు. పురుషులు.

నల్లనిచుక్కగల తెల్లని వలయములు. దుర్బలమతిత్వ వాహకులు. స్త్రీలు.

తెల్లనిచదరములు. ఆరోగ్యవంతులగు పురుషులు.

తెల్లని వలయములు. ఆరోగ్యవంతులగు స్త్రీలు.

(మెండెలువిధులిందుఎట్లనువర్తించియున్నదో గమనింపదగినది)




చిత్రము: ౨౮

'చార్లస్,' 'గల్టన్'ల వంశవృక్షము.

౧. నల్లని చదరములు-రాయల్ సొసైటీసభ్యులు.

౨. సగము నల్లగనుండు చదరములు ప్రఖ్యాతి గడించిన పురుషులు.

3. వలయములు-స్త్రీలు.

J. w. జోసియా - వెడ్జివుడ్డు (Josiah wedg-wood)

E D. ఎరాస్మస్ డార్విన్ (Eras mus Daruin)

G. గాల్టన్ (Galton)

R D. రాబర్టు డార్విన్ (Robert Darwin)

F G. ఫ్రాన్సిస్ గాల్టన్ (Francis Galton)

E w. ఎమ్మా వెడ్జివుడ్ (Emma wedgwood)

C D. చార్లస్ డార్విన్ (Charles Darwin)

లేకున్నచో త్వరగా నలిపోవునని అరగంటసేపు ఆగ మన్న ఆగను.

54 &.a

జర్మని నియంత హిట్ల[illegible]



చిత్రరూపము



విద్యార్థి (1899)





బవేరియా హైలెండ్సులో హి[illegible] ివాసగృహ[illegible]



సైనికుడు

# విజ్ఞాన విశేషాలు



విషవాయువార్తను తెలిపేవ్యక్తి

## విషవాయునిరోధము

విషవాయువు ఆక్రమణం మూలాన్ని యూరపు ఖండం అంతటా ఒక ఆందోళన బయలుదేరింది. ఇటీవల ఇటాలియనులు విమానాలలోనుండి అబిసీనియామీద విషవాయుపూరితాలయిన బాంబులను కురిపించి చేసిన భయంకర తాండవాన్ని చూచి మానవలోకం మిక్కిలి భీతిని పొందింది. ముందుముందు యుద్ధాలలో నిరపరాధులయిన నగరవాసులు ఈవిషవాయువుబారినుండి తప్పించుకొని బ్రతికే దెట్లా అనేవిషయాన్ని ఆలోచించి దానికి ఉపాయాలను కనిపెట్టడానికి యూరపునందలి అన్ని దేశాల వైజ్ఞానికులు పరిశోధనలుచేస్తూ ఉన్నారు. బాంబులు బద్దలయినతరువాత వాట్లో వుండే విషవాయువు మెల్లమెల్లగా నాలుగువైపులకు వ్యాపిస్తుంది. అది బద్దలయిన వెంటనే గనుక వాయువు వ్యాపిస్తూ ఉందన్న విషయం జనులకు తెలిస్తే వారు పరుగెత్తి నిరపాయకరం అయిన స్థలానికి పోయి దాగుకొని బ్రతికిపోవచ్చును. ప్రజలకు విషవాయువు వ్యాపిస్తూ ఉందన్నవార్తను తెలపడానికి లండను వీధుల్లో ఒక క్రొత్తఏర్పాటును వాడుకలోకి తేవడానికి ప్రయత్నం సాగుతూవుంది. విషవాయు నివారకమయిన ఒకసంచిని ఒకడు ముఖానికి తగిలించుకొని వేగంగా సైకిల్మీద పోతూ వీధుల్లో జనులకు వార్తను వినిపిస్తాడు. ఇందుకు' వార్తను వినిపించడానికి, సైకిలుకు ఒక 'లౌడ్ స్పీకరు- అమర్చబడి వుంటుంది. ముఖానికి తగిలించుకొని వుండే సంచిలో ఒక మైక్రోఫోను ఉంటుంది. ఎలెక్ట్రిక్ బ్యాటరీ సాయంతో మైక్రో ఫోనులో మెల్లగా చెప్పబడేమాట లౌడుస్పీకరుద్వారా బిగ్గరగా ప్రతిధ్వనిస్తుంది.

ఆగస్టు విశాలభారత

---

## 'నల్లముండ' - దాని గర్భశత్రువు

['నల్లముండ' అనే పేరుగల ఒకజాతిసాలెపురుగు చాలా అపాయకరమైంది. దానివిషం నాగుపాము విషంకన్నా ఎన్నోరెట్లు ఎక్కువ అపాయకరమైందని చెప్పటానికి నిదర్శనం పాశ్చాత్యదేశాలలో అనేకమందిజనులు దానికాటువల్ల చనిపోయ్యారు. ఇది అమెరికా దేశంలో ఎక్కువగా కనబడుతోంటుంది. అక్కడిజనులకి దీన్ని చూస్తే అమితభయం.

ఇది సాధారణంగా పాడుబడ్డ యిండ్లలోనూ, శుభ్రంగాలేని యిళ్ళల్లోనూ, యింటి కప్పులమీద,



౧. ఇండ్ల మూలల్లో నూ, శుభ్రంగాలేనిచోట్లా,యీ'నల్లముండ'గూళ్లల్లుకొనివుంటుంది.



౨. బాల్యంలోంచి యౌవనంలోకి రాగానే దీనికి పూర్వరూపంపోయి అందమైన క్రొత్తరూపం వొస్తుంది.



3. యౌవనంతోబాటు దీనికి కామోద్రేకంకూడా పెరుగుతుంది. అప్పుడది మొగదాని కోసంవెతుకుకొంటూ సంచారం బయలుదేరుతుంది.



౪. అలాతిరుగుతోన్నదాన్నిచూసి మొగది చేరవస్తుంది. మొదట కనబడ్డమొగపురుగునే ఆడది ప్రేమిస్తుంది. మొగది చాలచిన్నది.

౫. మొగపురుగు, దాని మర్మాంగాలు చూపడంకోసం,యీచిత్రంలో పెద్దదిగా చూపింపబడ్డది.

౬. ప్రేమకలిగినవెంటనే రెండును సంప్రతించుకొని విచ్చలవిడిగా తిరుగుతాయి. తనకంటె తెగబలిసిననల్లముండను కౌగలించుకోటానికి మగపురుగుపడేఅవస్థ జాలి పుట్టిస్తుంది.

చూరులకిందా స్థావరం యేర్పరుచుకొంటుంది.

దీనికాటును తప్పించుకోటానికి, దీన్ని సంహరించడానికి రెండుమార్గాలు పాశ్చాత్యులు అవలంబిస్తున్నారు: మొదటిది శుభ్రతగా తేనె యిళ్ళని బాగా చెయ్యడం. మూలల్లో బూజులూ పెంకూ అవీ దులిపి సున్నం కొట్టించడం. రెండోది: వీటికిగర్భశత్రువులైన ఒకజాతి ఈగల్ని ప్రత్యేకంగా పెంచడం. ఈ 'నల్లముండ', దాని గర్భశత్రువు ఏలా పుట్టి పెరుగుతవో వివరంగా ఈ క్రింది చిత్రాలవల్ల తెలుసుకోవచ్చును.]



౬. క్షేమసంచారం పూర్తయాక గ్రుడ్లు పెట్టడంకోసం ఆడపురుగు తాను దారంవడికి దాంతో ఒక సంచీ అల్లుకుంది. దాంట్లో ముద్ద ముద్దలుగా గ్రుడ్లు పెడుతుంది.



౭. తరవాత సంచిని వదులుచేస్తుంది. గ్రుడ్లు క్రిందకిజారి, ముద్దగావున్నవల్లా తడిఆరిపోయి వేటికవి విడిపోతాయి



౮. తల్లిపురుగు తరవాత ఉల్లిపొరలాంటి బూజుపొరలు సుమారు రెండువేలవరకు దానిమీద అతుకుతుంది. తరవాత విశ్రాంతి తీసుకుంటుంది. ఒక్క ఆడపురుగు ఋతువుకి యిలాంటి గ్రుడ్లసంచులను ఐదింటిని తయారుచేస్తుంది.



౯. (ఆ) నల్లముండ గ్రుడ్లసంచులను తయారు చేసే విధము.



౧౦. ఈ సంచిలో సుమారు ౨౦౦ మొదలు ౪౦౦ వరకు గ్రుడ్లుంటాయి.



౧౧. గాలి కొంచెం వేడిగావుంటే సంచిలో గ్రుడ్లు ఉబికి పెద్దవై త్వరలోనే చిట్లడానికి మొదలు పెడుతవి.



౧౨. అన్ని గ్రుడ్లు ఒక్కసారే పగిలి పిల్లలు బయటపడతాయి. అప్పుడవి మరి ఏరంగూ లేక చాలా తెల్లగా వుంటాయి.



౧౩. శీతోష్ణస్థితినిబట్టి రెండుమొదలు ఆరువారాల్లో సంచిలో పిల్లలు ఎదుగుతూ, కదలుతూ, తల్లిపాలికి కస్తూవుంటాయి.



౧౪. ఇప్పుడివి బాగా ఎదిగి, విషంతో నిండినశరీరాల్తో సంచీనుంచి బయటికి పోతాయి. ఇలాంటప్పుడే మనుష్యులు వీటిని చంపేవుపాయం చూడాలి.



౧౫. 'నల్లముండ'కి గర్భశత్రువైన యీ చిన్నయీగ దాని పిల్లలని బతకనివ్వదు.



౧౬. ఈయీగ గ్రుడ్లతోనిండివున్న నల్లముండసంచిమీద వాలి దానిమీద తను గ్రుడ్లుపెట్టడం ఆరంభిస్తుంది. అందుకుగాను ముందుగా అది, తనగ్రుడ్లని కాపాడటంకోసం జాగ్రత్తగా వుండే తల్లిని బాగా మోసపుచ్చాలి.



౧౭. మామూలుగా మనయిండ్లల్లో ఉండే యీగలో నాలుగోవంతు వుంటుంది ఈ చిన్న యీగ శరీరం. అది నల్లముండ్ల గుడ్ల సంచిమీద తనూ గుడ్లు పెడుతుంది.



౧౮. రెండుమూడు రోజుల్లో ఆ యీగ గుడ్లుపగిలి, బయటికి వచ్చే చిన్నయీగ సాలెపురుగు గుడ్లసంచీలోకి కన్నంచేసుకొని ప్రవేశిస్తుంది.



౧౯. ఈగపిల్ల సంచిలోకిపోయి మెరిసే సాలెపురుగు గుడ్లని మెక్కడం మొదలుపెడుతుంది. లోపలజరిగే తంత్రం తెలీక బైట నల్లముండ గస్తీ కాస్తోనే వుంటుంది.



౨౦. లోపలవున్న గుడ్లని తినడంతోటే, యిరవైనాలుగు గంటల్లో— ఈగపిల్లలు రెట్టింపుగా యెదుగుతాయి. నల్లముండ గుడ్లు మాయమైపోతోంటాయి.



౨౧. నలభైఎనిమిది గంటల్లో గుడ్లన్నీ తినేసియీగపిల్లలు బాగావుంటాయి. సంచిలో పీచులాంటి పదార్థంతప్ప గుడ్లేమీ మిగలవు.



౨౨. ఈ పీచులాంటిపదార్థం సహాయంవల్ల ఈగపిల్లలు బాల్యంలో మొదటి అవస్థదాటి రెండో మెట్టెక్కుతాయి. బైట నల్లముండయింకా కాపలా కాస్తోనేవుంటుంది.

ముండ' వంశాన్ని నాశనంచెయ్యడానికి బయలుదేరతాయి. నల్ల ముండకాటంటే మనిషికియెంతభయమో, గ్రుడ్లదగ్గిర యీ యీగని చూడగానే నల్లముండకి అంతభయం.



౨౩. చిన్నవిగావున్న యీగపిల్లలు నల్ల ముండగ్రుడ్లని తినడంతోటే పొట్టి వయి దిట్టంగా బలుస్తాయి. అంతవరకు తెల్లగావుండేవాటి శరీరంరంగు గోధుమ వర్ణంగా మారుతుంది. కొన్నివారాల్లో యీమార్పుపూర్తయి, ఈగరూపంతో బయటికివొచ్చి మళ్ళీ ఆపిల్లలుకూడా నల్ల



౨౪. ఈజాతియీగలు ప్రపంచకంలో బహుకొద్ది. నూటికియీ భైకీ ఒక్కటిమాత్రమే నల్లముండ సంచుల్ని నాశనంచెయ్యడానికి పూనుకుంటుంది. ఒకసారిపూనుకుంటే ఆ జన్మాంతమూ అలా నాశనంచేస్తూనే వుంటుంది. నల్లముండకాటునీ, దానివిషాన్నీ గురించి భయపడేమనిషికి యివి కొంత ఉపకారం చేస్తున్నాయి.

P. Sc.

---

## పండ్లలోను, కూరగాయలలోనుగల దోషములను కనుగొనుటకు ఎక్సరే యంత్రము



గ్రుడ్లలోని దోషములను తెలిసికొనునట్లే పండ్లు, కూరగాయలు మొదలగువానిలోని దోషములను తెలిసికొనుటకు మిన్నెసోటా యూనివర్సిటీలో ఒక ఎక్సరే యంత్రము తయారుచేయబడినది. యంత్రమునుండి కిరణములు ప్రసరించుమార్గమున పండునుగాని, కాయనుగాని, గడ్డనుగాని ఉంచి పక్కను చేతితో పట్టుకొనిన తెరపయిని పడు నీడను చూచినయెడల వానిలోపలి పురుగులు మొదలయినదోషములు స్పష్టముగా కనబడును. వానిని చెట్లనుండియు, తీగెలనుండియు కోయకుండనే పరీక్షించుటకును ఈ యంత్రము పనికివచ్చును.

---

## భూగర్భమునందలి మురికినీటికాలువలలో ప్రయాణముచేయుటకు క్రొత్తమాదిరిబోటు

పెద్దపట్టణములలో భూగర్భమున నిర్మింపబడు మురికినీటికాలువల స్థితిని పరీక్షించుటకయి వానియందు ప్రయాణము చేయుటకోసము క్రొత్తమాదిరి బోటు నొకదానిని లాస్ ఏంజలిస్‌లో ఒక ఇంజనీయరు తయారుచేసినాడు. దాని అడుగుభాగము చదునుగానుండును. బ్యాటరీసాయమున ఎక్కువ ప్రకాశముతో

వెలుసు 'సర్క్యులైటు', 'రేడియో సెట్టు', ఏదయినా అపాయము కలిగినపుడు బోటు మునిగిపోకుండుటకయి గుండ్రని బోలుగొట్టములు ఆబోటులో నుండును.



మరికొలువరు ర్వాసనవలన ప్రాణాపాయము కలుగకుండుటకయి ఇంజనీయరు ముఖమునకు తొడుగు తగిలించుకొనును ఈబోటులో ఏకాయెకీని ఆరుమైళ్లు ప్రయాణము చేయవచ్చునట.

---

### భూగర్భవివరములలో విషవాయు పరీక్ష

భూగర్భములో తాపిన 'కేబిల్సు' మొదలయిన వాటిని మరమ్మతుచేయుటకయి అక్కడక్కడ భూగర్భమునగల వివరములలో ప్రవేశించుటకు పూర్వము వానియందు ప్రాణాపాయకరమగు విష వాయువులు (Carbon monoxide Etc.) ఎంతెంత పరిమాణమున నున్నవో తెలిసికొనుటకుగాను ఒకానొక సాధన మపయోగింపబడుచున్నది. ఒకగాజుగొట్టమును రాసాయనిక మిశ్రణముతో నింపి దానిని దూదిలోపెట్టి గాజువలె స్వచ్ఛమయిన కవరులోనుంచి, చితుకగొట్టి గోతిలోనికి దానిని దింపి పదినిముషము లుంచవలెను. గోతిలో విషవాయువు లున్నవాయెనా, రాసాయనిక ద్రవ్యములనుండి నల్లని పొడి దూదియందు రాలును. లోపలినుండి గాజుగొట్టము మీదికి దీసి, దూదిమీద కానుపించురంగును విషవాయువుయొక్క వివిధ పరిమాణములను తెలుపు రంగుల చార్టుతో పోల్చిచూచినయెడల లోపలనున్న విషవాయువు పరిమాణము తెలియగలదు. శీతకాలమున 'ఎలెక్ట్రిక్ హీటరు' తో దీనిని కనుగొనవచ్చును. 'సేఫ్టీ లాంపు'ను ఇందు కపయుక్తమగును. చిత్రమున రాసాయనికమిశ్రణము గల గాజుగొట్టములు, రంగులచార్టు, ఎలెక్ట్రిక్ హీటరు, సేఫ్టీలాంపు ఉపయోగించుట కానవగును.



---

### పెద్ద ఫోటో



చిన్న నెగెటివు ముక్కనుండి ఒక్కయెత్తున పెద్దదిగా చేయబడిన ఫోటో. దీని నొకపేరుగన్న ఫోటోగ్రాఫరు (చిత్రమునన్నయతడు) తయారుచేసి ప్రదర్శింప పంపినాడు. అడవిమృగములమందచిత్ర మిది. ఇందు సవరణ లేవియు లేవు. దీని పొడవు ౧౧ అడుగులకును, వెడల్పు నలువది అంగుళములకును మించియుండును. నెగెటివుముక్క ౧౼ అం. పొడవు ⅜ అం. వెడలుపుగలది. అంత చిన్న నెగెటివు ముక్కనుండి యింత పెద్ద ఫోటోను ఇంతవరకు ప్రపంచమున నెవ్వరును తయారుచేయలేదు.

---

### గుండ్రని చెరసాలకు ఒక్కడే కాపుదారి



చుట్టును నాలుగంతస్తులలో నాలుగువరుస గదులు గలిగి గుండ్రనగా కట్టబడిన చెరసాల. నడుమ పెద్దఆవరణ. దానిలో నట్టనడుమను ఒక కట్టడము. దానిలో కాపలా వాడుండును. అన్నివైపుల గదులన్నింటిలోకి అడ్డు లేకుండ అక్కడనుండియే వాడు చూడగలడు. అక్కడ నుండియే ఎలెక్ట్రిక్కు మీటను నొక్కి అన్ని గదుల లోను దీపములను వెలుగజేయును, ఆర్పివేయును, అన్ని గదులకు తాళమువేయను, తీయను సాధ్యమగును.

---

### ఫిలిములమీది పుస్తకములవలన గ్రంథాలయములలో చోటునకు కూడుదల

చిత్రమునందలి యంత్రము వాడుకకు వచ్చిన యెడల ముందుముందు పుస్తకములు, పత్రికలు మొ. వానికి ఫిలిములు తయారుచేయించి యుంచుకొన వచ్చును. ఒకనకలులోని అచ్చుపుటల నన్నిటిని కాలి పోకుండ చిరకాలము మనియుండు కొలది అడుగుల పొడవు గల ఫిలిముమీద కెక్కించవచ్చును. ఈ ఫిలిముపుస్తకమును చిత్రమునందలి యంత్రమున నెక్కించి, అందుగల తెరమీద, అసలు పుస్తకము సైజున ఛాయపడునట్లు చేయవచ్చును. అక్షరములు స్పష్టముగా కనుపడును. దానికి మామూలు పగటివెలుగు చాలును. ప్రక్కనున్న మరను త్రిప్పుచున్నయెడల పేజీలొకటివెనుకనొకటిగ తెరమీద కనుపించుచుండును.

ఇట్లు చేయుటవలన గ్రంథాలయములయం దెంతయో చోటుకలిసివచ్చును. న్యూయార్కు పబ్లిక్ లైబ్రరీలలో పెద్దదానిలోనందు పుస్తకములన్నియుఫిలిములుగ తయా



రుచేసినయెడల, ఒక్క చిన్నగదిలో నిముడగలవు. వేయి అడుగుల ఫిలిమున నూరుపుస్తకములలోవిషయ మిముడగలదు.

---

### రోడ్లపయి బండ్లనాపు ఏర్పాటు



కాపులేని రైల్వేగేట్లకడ ప్రమాదములు జరుగ కుండ బండ్లనాపుటకయి రోడ్లమీద ఒకక్రొత్తఏర్పాటు చేయబడినది. గేటుదగ్గరకు ట్రెయిను చేరవచ్చునప్పటికి రోడ్డుమీద ఒకగాడిలో అణగియుండిన లోహపురేకులు ఇంచుమించు తొమ్మిది అంగుళముల ఎత్తునకు మీదికి లేచి ట్రెయిను గేటును దాటిపోవువరకు అట్లే యుం డును. అడ్డుగావచ్చు కారులన్నియు ఆరేకులవద్దకువచ్చి ఆగిపోవలసినదే. వానికి ఎలెక్ట్రిక్ దీపములు, వెలుగును విరివిగాచిమ్ము ఇతర పరికరములు అమర్చబడియున్నవి. ట్రెయిను గేటును దాటినతోడనే ఈరేకులు నేలమట్టమునకు సరిగా దిగిపోవును.

P. Sc

---



సర్ వేపా రామేశం పంతులుగారు

(శ్రీ చావలి నాగేశ్వరరావుగారు తయారుచేసిన చిత్రము)

తిరువారూరు, తంజావూరుజిల్లా త్యాగరాజస్వామి దేవాలయ బహిః ప్రాకారమునందు గలశిల్పము. పండ్రెండవ శతాబ్దం నాటిది. మనునీతి చోళుని ధర్మ పరిపాలనాన్ని శివుడు పరీక్షింప తలచి గో రూపాన్ని ధరించాడట. యముడు దూడ అయినాడట. బాలుడయిన రాజపుత్రుడు తోలుతూవుంచిన రథముక్రింద ఆదూడ పడింది. ఆవు దుఃఖిస్తూ, ఆగ్రహంతో రాజప్రాసాదందగ్గరకు పోయి అక్కడ వుండే ధర్మఘంటను కొమ్ములతో





మ్రోగించింది. అప్పుడు న్యాయసభను కూర్చి రాజు న్యాయమును చెప్పగోరాడు. దూడ మృతికి కారకుడయిన రాజపుత్రుని ఆ రథం చక్రంక్రింద త్రోసి చంపుటయే ఉచిత దండమని నిర్ణయింపబడింది. ఆరాజు, ఏకమాత్ర పుత్రుడనియైన శంకింపక అట్లే చేసెను. శివుడప్పు డాతని ధర్మబుద్ధికి మెచ్చుకొని, దూడను, రాజకుమారుని మరల బ్రతికించాడు. ఇది గాథ. రథము, రాజకుమారుడు రథముక్రింద పడియుండుట యిందు కానవగును.

# నూతన భారతరాజ్యాంగ ప్రణాళిక

## రాజకీయార్థిక ఫలితములు

గో. వెం. కృష్ణారావు

## ౨

కేంద్ర ప్రభుత్వమందును, రాష్ట్రప్రభుత్వములందును హస్తగతముచేసికొన్న యధికారములు చాలక కొంబోలు వర్తకవిషయములందుకూడ ప్రత్యేక నియమములను కొన్నిటిని నూతన రాజ్యాంగ ప్రణాళికలో ఆంగ్లప్రభుత్వమువారు చేర్చిరి. నూతనరాజ్యాంగమందు శాసనసభల అధికారము లనేకములు వర్తకవిషయములందు సంకుచితపరుపబడెను. ౧౦౮వ సెక్షనులో ౧ యఫ్. ౧ జి. సబు సెక్షనులు ఎక్కువ ముఖ్యమయినవి.

౧ యఫ్. సబుసెక్షనుప్రకారము "గవర్నరు జనరలు" తన యభిమతము ననుసరించి ముందుగా అనుమతినిచ్చినతప్ప "బ్రిటిషు ఇండియాలో నివసింపని వ్యక్తులకు, నివసించువ్యక్తులకు ఆదాయపుపన్ను విధించుటలో ఎట్టి విచక్షణజేయగూడదనియు, బ్రిటిషు యిండియాలో రిజిష్టరుకాని కంపెనీలకు, రిజిష్టరయిన కంపెనీలకు పన్నువిధించుటలో యెట్టి విచక్షణచేయగూడదనియు" స్పష్టపరుపబడెను. ఈ నియమమువలన సంరక్షణ పద్ధతిని భారతీయు లవలంబింపవలయుననిన కొన్ని ఆటంకములేర్పడును. ౧౯-౨౧ వ సం॥ మందు ఫిస్కలు కమీషనువారు ప్రకటించిన నివేదికసూత్రములను త్రోసిరాజనుటకు యీ నియమము సహకారియగును.

మనదేశీయులు యేర్పాటుచేయు పరిశ్రమలను పోషించి, దేశీయులకే పనిపాటలు కల్పించుటకు మార్గములమాపుచు, తయారగు వస్తువులను దేశీయులేకొని పరిశ్రమాభివృద్ధికి తోడ్పడుట సంరక్షణ విధానపు మూలసూత్రము. కాని విదేశీయులు తమదేశములలో కంపెనీలు యేర్పాటుచేసికొని, భారతదేశమందు ఫ్యాక్టరీలస్థాపించి, వర్తకము సాగించినచో సంరక్షణ విధానముక్రింద వారి కన్ని లాభములను మనదేశమందు చేకూర్చుటకు ౧౦౮ వ సెక్షను తోడ్పడుచున్నది.

సంరక్షణమంటే ఉత్పత్తిదారుని ప్రోత్సహించుటకు కొనుగోలుదారుడు యిచ్చుపన్ను యని చెప్పవలెను. కాని కొనుగోలుదారులు ఉత్పత్తిదారులు యేదేశమందయిన పరస్పర సహకారము నొనర్చుకొనువారగాన సంరక్షణపద్ధతి లాభకరమును, న్యాయబద్ధమునై యున్నది. అయితే విదేశీయుడు మనదేశమందు తయారగు వస్తువులనుకొనడు. మనదేశమందొకయుత్పత్తిదారునిగ ఉండి, సంరక్షణ పద్ధతివలన కలుగులాభములు యెట్టిఖర్చులేకుండ అనుభవించును. అందుచేత స్వదేశ ఉత్పత్తిదారునిపై విధించుపన్నుకన్న హెచ్చుపన్ను విదేశ ఉత్పత్తిదారునిపై విధించుటలో అన్యాయమేమియు లేదు. ఎందుచేతననిన కొనుగోలుదారునిగా మన యుత్పత్తిదారుడే సంరక్షణవిధానముక్రింద కొంత పన్ను చెల్లించును. సబుసెక్షను ౧ జి. మూలమున విదేశ ఉత్పత్తిదారునికే స్వదేశీయునికన్న హెచ్చు సౌకర్యములు చేకూరును. ఆంగ్లప్రభుత్వమువారు సంరక్షణవిధానమును యీ సెక్షను సహాయముతో నిరుపయోగముచేసిరని చెప్పకతప్పదు.

భారతభీమా, బ్యాంకింగు వ్యవహారములను మనము పోషించుకొనవలయుననిన విదేశభీమా, బ్యాంకింగు కంపెనీలపై హెచ్చుపన్ను విధింపవలయును. కాని నూతనప్రణాళిక మన కట్టియధికారమిచ్చుటలేదు.

౧౦౮ వ సెక్షను ౧ వ జి సబుసెక్షనుప్రకారము "యునైటెడ్ కింగ్‌డమ్‌లో పన్నుయిచ్చిగాని, పన్నువిధించుటకు వీలున్నగాని ఆదాయముపై పన్నును

భారత సమాహారమునందు లేకుండ చేసినయెడల, అట్టి నిర్ణయము రద్దుపరచుట కేదైన బిల్లుగాని, సవరణగాని గవర్నరుజనరలు అనుమతి ముందుగా బడయకుండ సమాహార శాసనసభలు చేయుటకు వీలులే”దని నిశ్చ యింపబడెను.

ఈ నిర్ణయము అంతర్జాతీయ ధర్మములకు వ్యతి రేకముగనున్నది.

ఆదాయముపై పన్నును కంపెనీస్థాపించిన దేశ మందు, వర్తకముసల్పుదేశమందు రెండుమారులు విధిం చుట అక్రమమని తలంచి, ఒకచోట ఆదాయపు పన్ను వసూలుచేసిన రెండవస్థలమందు ఆదాయపు పన్నువిధిం పక, వసూలుచేసిన ఆదాయపుపన్నును రెండుదేశముల ప్రభుత్వములు పంచుకొనుటకు అంతర్జాతీయముగ కొన్ని యేర్పాటులు కలవు. ఆంగ్లసామ్రాజ్యమందు కూడ ఆంగ్ల ప్రభుత్వమువారు డొమినియను ప్రభుత్వ ములతో అట్టి యేర్పాట్లు చేసికొనిరి. కాని భారతదేశ ముతో అట్టి యేర్పాటుచేసికొనక నూతన రాజ్యాంగ మందు దేశమును కొల్లగొట్టుటకు ౧౧౫ వ సెక్షను సృష్టించిరి. ఆంగ్లదేశమందలి బాండుహోల్డరు, ఫింఛ నుదారుడు, అధికారి, ధనాఢ్యుడు, వర్తకుడు భారత దేశమునుండి పౌనునాణెము రూపమున ధనము సంపా దించి, ఆంగ్లప్రభుత్వమునకు ఆదాయపుపన్ను చెల్లించు చున్నారు. ఈవిధముగ మనదేశమునుండి సాలుకు నాల్గు కోట్ల రూప్యములు ఆంగ్లదేశమునకు కనబడకుండ పోవు చున్నవి. ఈపద్ధతిని రూపుమాపినయెడల చాలధనము మనదేశమందే యుండుటకు అవకాశమున్నది. ఇప్పుడు ప్రజలు మోయుచున్న పన్నులభారముకూడ తగ్గింప వచ్చును.

భారతదేశమందు ఆంగ్లపింఛను దారులయొక్క యు, వర్తకులయొక్కయు ఆదాయమువలన మనకు గొప్పనష్టము కల్గుచున్నది. ప్రభుత్వము ప్రజల కొన రించు సేవకు పన్నుయిచ్చుకొనుట ప్రతిఫలముకదా! కాని మనదేశములో ఆంగ్ల వర్తకులు యెట్టి పన్ను లివ్వకుండ ప్రభుత్వము మూలమున లాభములు పొందు టకు యత్నించుట ధర్మమా, న్యాయమా? వారి యత్న ములకు నూతన రాజ్యాంగము దోహదమొసగుచున్నది.

ఆర్థికదృష్టితో పరిశీలించిన నూతన ప్రణాళికలో అయిదవ భాగమందలి మూడవ అధ్యాయము చాల ప్రాముఖ్యమైనదని చెప్పవలయును. జాతివివక్షత లేకుండ భారతదేశమందు వర్తకవ్యవహారములను జరుపుకొను టకు కొన్ని నియమములను ఈ యధ్యాయములో చేర్చిరి.

౧౧౧ వ సెక్షను ప్రకారము ఎట్టి నిరోధము లేకుండ ఆంగ్లేయులు భారతదేశమునకు వలస రావచ్చును. ఆ సెక్షను ననుసరించియే మనదేశమందు ఆంగ్లేయులు ఎట్టి ఆటంకములేకుండ ఆస్తిసంపాదించు కొనవచ్చు; ఉంచుకొనవచ్చు, అమ్మవచ్చు; ప్రభుత్వ వర్గములో అధికారిగ యుండవచ్చు; ఏదైన యుద్యో గముగాని, వర్తకముగాని, పనిగాని స్వేచ్ఛగా చేసికొనవచ్చు.

ఈ సెక్షనును యేవిధముగ మున్ముందు ఆంగ్ల ప్రభుత్వమువారు వ్యాఖ్యానము చేసెదరో చెప్పలేము. దీనిమూలమున భారతరాజ్యాంగములో భారతీయులే అధికసంఖ్యాకులుగ ఉద్యోగములందుండవలెనను నియ మమునకు ఆటంకము కల్పింపవచ్చును. ఏదేశమందైన ఏదైన యుద్యోగముకాని, వర్తకముగాని, పనిగాని యేవ్యక్తియైన స్వేచ్ఛగా చేసికొనవచ్చునను నియమము ఆదేశమందలి దేశీయులకే యనువర్తించునుగాని అన్యు లకు వర్తింపదు. మనదేశీయులే యుద్యోగము లెక్కువ యనుభవింపవలయునని మనము గావించు ప్రయత్నము లకు ఈసెక్షను తోడ్పడదు.

మన ఆర్థికస్థితిని బాగుపరచుకొనుటకు ఆంగ్ల వర్తకు డిప్పు డనుభవించులాభములను మన ముపసంహ రించుటకు ౧౧౧ వ సెక్షను అడ్డుపడును. భీమా, బ్యాంకింగు, విదేశమారకము, విదేశవర్తకము, కోస్తా వ్యాపారము, నౌకావ్యాపారము, ప్రజాహితసంస్థ లందు ఉద్యోగములు - వీనినన్నిటిని ఆంగ్లేయుల భారతదేశమునుండు ప్రత్యేకించుటకు యీ సెక్షను

సహాయభూతమగుచున్నది. అంతేకాకుండ భారత సంస్థలపై ఆంగ్లేయు లధికారము చలాయించుటకు అవకాశముకూడ కల్పింపబడెను. కొన్ని సంవత్సరముల క్రితము మనదేశమందు జాయింటుస్టాకు కంపెనీగా నెలకొల్పబడిన అలహాబాదు బ్యాంకును యింగ్లండులో నిర్మింపబడిన పి. అండు ఓ. బ్యాంకింగు కార్పొరేషను వారుకొనివేసిరి ఇట్టిగతేమనదేశీయసంస్థలకు మున్ముందు పట్టును. అప్పుడు మనచిటికినవ్రేలునైన యెత్తి యిట్టి అక్రమములు జరుగకుండ ప్రతిఘటించుటకు మనకు సత్తువయుండదు.

ఈ సెక్షను ప్రయోగించి మన సంరక్షణవిధానము భగ్నపరుపవచ్చును. ఏదైన పరిశ్రమను ప్రభుత్వము వారు సంరక్షణవిధానముక్రింద పోషించుటకు నిశ్చయించినపుడు విదేశీయులు మన దేశమందే యంత్రాలయముల నిర్మించి, సంరక్షణమూలమునకల్గు లాభముల బొంది, మన పరిశ్రమలనే రూపుమాపుటకు ప్రయత్నించిరి. ఇది మనపూర్వానుభవము; ఇట్టి దుష్ప్రయత్నములను విదేశీయులు చేయకుండ నిరోధించుటకు యీ సెక్షను ఆటంకదాయకమగును.

అన్యదేశములందు భారతీయులపై యేమైన నిరోధములున్నయెడల, భారతదేశమందుకూడ విదేశీయులపై అట్టి నిరోధము కల్పింపవచ్చునని యీ సెక్షను తెల్పుచున్నదనియు, అందుచే మనము అనుమానింపవలసిన అవసరములేదనియు ప్రభుత్వమువారు వాదింపవచ్చు. కాని యీ వాదన యెవరిని మోసగింపజాలదు. ఆంగ్లదేశమందేదైన యుద్యోగముకాని, వర్తకముకాని, పనిగాని చేయు భారతీయులసంఖ్య అత్యల్పము. అందుచే వారిపై యెట్టినిరోధములు నెలకొల్పవలసిన ఆవశ్యకత లేదు. అదిగాక ఆంగ్లదేశమందు ఆర్థికముగ ఆచరణయందున్న నియమావళి పరిశీలించిన యే భారతీయుడును యెట్టిపని చేయజాలడు, యే వర్తకమునైన కొనసాగించుట అసంభవము. కాన పరస్పరముగ ప్రతిబంధకము లేర్పరచుకొనవచ్చునను సూత్రము అర్థరహితమయినది.

అన్ని సెక్షనులలోకంటె ౧౧౩ వ సెక్షను యెక్కువ అక్రమమయినదని చెప్పవలె. యునైటెడ్ కింగ్‌డమ్‌లో నెలకొల్పబడిన యేకంపెనీకిగాని, ఆకంపెనీని పరిపాలించు అధికారవర్గమునకుగాని, వాటాదారులకుగాని, ఆఫీసర్లకుగాని, యేజంట్లకుగాని, తుదకు నౌకర్లకుగాని మనకంపెనీశాసనము అనువర్తింపదని యీ సెక్షనులో స్పష్టపరచిరి. యునైటెడ్‌కింగ్‌డమ్ నందలి కంపెనీలు మనదేశమందు వ్యాపారము సల్పునపుడు, ఆకంపెనీలను మనదేశమందు రిజిష్టరుచేసికొనవలెననిగాని, లేక వాని ప్రధానకార్యాలయములను మనదేశమందే యేర్పాటుచేయవలెననిగాని, లేక వానిమూలధనమును రూపాయనాణెములో అంచనావేయవలెననిగాని నిర్బంధమును సమాహారశాసనసభలు చేయుటకు వీలులేదు. ఇందువలన మనకపారమగు ఆర్థికనష్టము సంభవించును. విదేశకంపెనీలు మనదేశమందు వ్యాపారము సల్పునపుడు ఆ కంపెనీలతో వ్యాపారము గావించు భారతీయులకు కంపెనీల ఆర్థిక సౌష్ఠవము తెలియకుండుటయేగాక, కంపెనీలు దివాలాతీసినచో వానికి మిగిలిన ఆస్తులపై హక్కు విదేశీయులకే ముందుగ సంక్రమించును; భారతీయులకేదైన మిగిలిన యిచ్చెదరు: లేకున్న నష్టముకలుగును. విదేశవర్తకసంస్థలమూలమున మనకుకల్గు కీడును సెంట్రలుబ్యాంకింగువిచారణ సంఘసభ్యులుగనుండిన మహా సుబేదార్ గారు తమమైనారిటీ నివేదికలో స్పష్టపరచిరి. మర్కెంటైల్ బ్యాంకు ఆఫ్ యిండియా అధ్యక్షులగు బ్యూమంటు పౌస్‌గారు "మనదేశమునుండి ధనము యెగుమతియగుటకు ఆంగ్లబ్యాంకులే కారణభూతము"ని యెలుగెత్తి చాటిరి. ఆంగ్లబ్యాంకులలో యెక్కువ యనుభవముకల భారతీయులను ఉద్యోగులుగ నియమింపవలయునని నిర్బంధించుటకైన యీ సెక్షను తోడ్పడదు. వేయేల! ఈ సెక్షనువలన భారతదేశమందు ఆంగ్లకంపెనీలు ఆంగ్లప్రభుత్వమువలె స్వతంత్రములగు సంస్థలుగ తయారగును. గవర్నరుజనరలుకున్న రాజకీయాధికారములకన్నను యీ ఆర్థికసామ్రాజ్యతత్వమే బహు భీకరమైనదని చెప్పవలె. దీనిమూలముననే మన

దేశమునుండి ఇంగ్లండుకు ధనప్రవాహము నిరంతరముగ, నిరాటంకముగ పోవుటకు మార్గ మేర్పడుచున్నది.

భారతకంపెనీలకిచ్చు సౌకర్యములనే యెట్టి విచక్షణలేకుండ ఆంగ్ల కంపెనీల కివ్వవలయునని యేర్పాటు చేసిరి (౧౧౩ వ సెక్షను ౨ వ సబుసెక్షను). భారతదేశ మేల ఆంగ్లకంపెనీలకు ప్రోత్సాహమివ్వ వలయునో? ప్రోత్సాహమిచ్చుటవలన మనకుకలుగు లాభము మనపరిశ్రమల నాశనమేకదా! భారతదేశపు ఉత్పత్తిదారులపై తక్కువపన్ను విధించుటవలన భారతదేశీయులందరు సామాన్యముగ యెక్కువపన్ను చెల్లింపవలయును. కాని యీ సబుసెక్షనువలన ఆంగ్ల కంపెనీలుచెల్లించు తక్కువపన్నుకుగూడ భారతీయులే యెక్కువపన్ను చెల్లింపవలయు నను నిర్బంధము యేర్పడుచున్నది. ఇది ఘోరమగు అన్యాయము, అక్రమము.

కోస్తావ్యాపారము భారతీయులకు సంక్రమింప కుండ ౧౧౪ వ సెక్షను ప్రయోగించిరి. కోస్తావ్యాపారమందున్న నౌకను గురించిగాని, నౌకాధిపతి, ఆఫీసర్లు, కళాసులు, పాసెంజర్లు, సరకులుగురించిగాని మన నౌకాపరిశ్రమాభివృద్ధి కనుగుణ్యముగ యెట్టిశాసనములు గావించుటకు వీలులేదు! ఆంగ్లదేశీయులు భారతనౌకా పరిశ్రమయెడల విచక్షణజూపినచో, భారతీయులు ఆంగ్లనౌకా పరిశ్రమయెడల విచక్షణ జూపవచ్చునట! ఆంగ్లదేశమందు కోస్తావ్యాపారముగావించు భారతనౌక లేమైనయున్నవా? ఆంగ్లదేశపు కోస్తావ్యాపారము శాసనముల మూలమున ఆంగ్లేయులకే ప్రత్యేకింపబడకపోయి నను కార్యరంగమందు అట్టి ఫలమే కల్గుచున్నది. నావిగేషను ఆక్టుల మూలమున ఆంగ్లనౌకా పరిశ్రమాభివృద్ధికై ఆంగ్లేయులు పాటుపడలేదా? కాని యీ ప్రశ్నలవలన ఫలమేమున్నది? ఇక మనము కోస్తావ్యాపారమునకు హస్తోదకమివ్వవచ్చు.

భారతకంపెనీల కిచ్చు గ్రాంటులను, ధనసహాయమును, భారతదేశమందు వర్తకముచేయుచున్న బ్రిటిషు కంపెనీలకు కూడ యివ్వవలయునని ౧౧౬ వ సెక్షను సూచించుచున్నది. అంటే మన పరిశ్రమాభివృద్ధికి కృషి సల్పినయెడల, మనపరిశ్రమల గొంతుకోయుటకు సంసిద్ధులగు విదేశీయులకుకూడ మనము సహాయముచేయవలెను.

ఇన్ని సౌకర్యములు ఆర్థికముగ ఆంగ్లవర్తకునికి నూతన రాజ్యాంగమందు యేర్పరచి, ఇంగ్లండు భారతదేశములు వర్తకపుటొడంబడిక చేసుకొన్నచో ఆర్డర్, యిన్ కౌన్సిలుద్వారా యీ అధ్యాయమును కార్యరూపము దాల్చకుండునట్లు చేయవచ్చునను నియమమును ౧౧౮ వ సెక్షనులో పొందుపరచిరి. ఈ నియమమువలన ప్రయోజనమేమి? భారత పరిశ్రమాభివృద్ధి ఆంగ్లదేశార్థికాభివృద్ధికి విషతుల్యము. రెండుదేశములకు ఆర్థికముగ సఖ్యమగు ఒడంబడిక జరుగుట అసంభవము. ఆంగ్లేయు డెప్పుడును శాసనము ప్రకారము తనకువచ్చు లాభమును పోగొట్టుకొనడు. : అంతకు తక్కువలాభములను ఒడంబడికద్వారా పొందుట కొప్పుకొనడు. ఇక యీ సెక్షను కన్నీళ్లు తుడుచుటకు ప్రణాళికలో చేర్చిరా?

ప్రణాళికలో ఏడవభాగమందలి ప్రథమాధ్యాయము రాజ్యాదాయమునకు సంబంధించినది. దాయాధికారపన్నులు, స్టాంపుపన్నులు, రవాణారుసుములు, కేవుపన్నులు, రహదారీపన్నులు- వీనినన్నిటిని సమాహార ప్రభుత్వమువారు విధించి, వసూలుచేసి, వచ్చిన పైకమునురాష్ట్రములకు పంచిపెట్టుటకు యేర్పాట్లుచేసిరి. పై చేర్కొనిన పన్నులపైనను, ఆదాయపు పన్నుపైనను ముజరావనూళ్లనుకూడ సమాహారప్రభుత్వమువారువిధించి అట్లు సముపార్జించినధనము తామేవినియోగించుకొనవచ్చును. ఉప్పుపన్ను, ఎక్సైజుపన్ను, యెగుమతిపన్నులు సమాహారప్రభుత్వమువారేవిధించివసూలుచేసెదరు: సమాహారశాసనసభలునిర్దేశించినప్రకారమాధనమును రాష్ట్రప్రభుత్వములకు పంచిపెట్టెదరు. రాష్ట్రములు తమ యభివృద్ధికైసూచించు పన్నులవిధానమును గవర్నరుజనరలు అనుమతి ముందుగా పొందనిది అమలులో పెట్టుటకువీలులేదు. మొత్తము మీద యీభాగమందుకూడ గవర్నరు జనరలు యెంతైన నష్టము మనకు గల్గజేయవచ్చు. రాజకీయముగ సంఘవిభేదములు కల్పించుటకవకాశమున్నట్లే ఆర్థికముగ రాష్ట్రవిభేదములు కల్పించుటకు యెత్తులువేయబడెను.

౧౫౨ వ సెక్షను ప్రకారము గవర్నరుజనరలు తన యభిమతము ననుసరించి రిజర్వుబ్యాంకు గవర్నరు, డిప్యూటీగవర్నరులను నియమింపవచ్చు, తొలగింపవచ్చు; ఆ బ్యాంకు కేంద్ర డైరెక్టర్లబోర్డును త్రోసిరా జవచ్చు; తుదకు బ్యాంకునే అంతరింపజేయవచ్చు. ౧౫౩ వ సెక్షను ననుసరించి సమాహారమందు చెలామణి యగు నాణెములగాని, కరెన్సీనిగాని, రిజర్వుబ్యాంకు పరిపాలనలోగాని యెట్టిమార్పులనైన చేయుబిల్లును, లేక సవరణగాని గవర్నరుజనరలు అనుమతి ముందుగా పొందనిది సమాహార శాసనసభలలో ప్రతిపాదించుటకు వీలులేదు. ఈ రెండు సెక్షనుల అంతరార్థ మేమనిన భారతదేశీయుల కొనుగోలు శక్తిని గవర్నరు జనరలు నిర్ణయించును. అంటే యీ అధికారము ద్వారా భారతదేశార్థికాభివృద్ధికి నిరోధములను కనుబడని యెత్తులువేసి కల్పింపవచ్చును. కొనుగోలుశక్తి నిర్ణయము తమచేతియం దుంచుకొనుటచేతనే ౧౯౩౩వ సంవత్సరమునుండి నేటివరకు భారతదేశమునుండి బంగారమును గంగాప్రవాహమువలె విదేశములకు పారునట్లు భారత ప్రభుత్వమువారు చేయగల్గిరి. ఆంగ్ల వర్తకాభివృద్ధికి తోడ్పడుటయే గవర్నరుజనరలు విధ్యుక్తధర్మముకదా!

ప్రభుత్వవిధానము సాగించుటకు కావలసిన ధనమును అప్పురూపేణ సంపాదించు అధికారమును సెక్రటరీ ఆఫ్ స్టేటుకు మాంటేగూ సంస్కరణలక్రింద యివ్వబడెను. ఇప్పుడీ యధికారము సమాహార ప్రభుత్వమున కిచ్చిరి. గయా, లాహోరుకాంగ్రెసు సమావేశములందు కాంగ్రెసువాదులు గావించిన నిర్ణయమున కిది ప్రతిఫలముకాబోలు! కాని యీ స్వల్పసంస్కరణవలన అల్పలాభమైన కల్గదు. సమాహార రాజ్యాంగము అమలులోనికి వచ్చువరకు సెక్రటరీ ఆఫ్ స్టేటే అప్పు తీయవచ్చునని యేర్పాటుచేయబడెను.

నూతనసంస్కరణలు అమలులో పెట్టెద మను నెపముతో ఆంగ్లప్రభుత్వమువారు తమదేశమందు పనిపాటులులేని వ్యక్తులకు భారతదేశములో యుద్యోగములను కల్పించుచున్నారు. ఈ విషయమం దెవరికైన సందేహమున్నయెడల వారు ౧౬౦ వ సెక్షను పరిశీలింపవచ్చు. ఆడిటర్ జనరల్ ఆఫ్ యిండియాపదవికి ఆంగ్లేయునే నియమించెదరు. ఇండియన్ హోము అకౌంట్సును (అనగా యింగ్లండులో సెక్రిటరీ ఆఫీసులెక్కలను) పరిశీలించుటకు యింకొక ఆడిటరును నియమించెదరట! ఈలెక్కల పరిశీలనకు వేరొక ఆడిటరు యెందుకో? ఆడిటర్ జనరల్ ఆఫీసువా రాపని చేయగూడదా? మనకు కావలసినది తక్కువవ్యయమగు రాజ్యాంగము. కాని నూతనరాజ్యాంగమువలన యిప్పుడున్నదానికన్న వేయిరెట్లు అధికవ్యయమగును.

౧౭౮ వ సెక్షనులో ప్రస్తుతము ఆంగ్లప్రభుత్వమువారు భారతదేశ పరిపాలనకని చేసిన అప్పుసప్పులన్నిటిని సమాహారరాజ్యాంగమువారును, రాష్ట్రీయప్రభుత్వములును అంగీకరించి అప్పుతీర్చవలయునని స్పష్టపరచిరి. ఇంగ్లండు భారతదేశములమధ్యగల ఆర్థికసంబంధమగు విషయములను పరిశీలించి యెవ రెంత బాకీ యెవరికుందురో తేల్చుమని కాంగ్రెసువారు సూచించు కోరికకు యీ సెక్షను అడ్డంకుగా యేర్పడును. కె. టి. షాగారి మదింపుప్రకారము మనకు ౯౭౮ కోట్ల రూప్యములు నష్టముకలుగును. కాని యింత పైకము మనమివ్వవలసివచ్చినను యిచ్చివేసి స్వరాజ్యము వెంటనే పడయుట భావ్యమని యమ్. విశ్వేశ్వరయ్యగారొకమారు సూచించిరి. ఇంతలంచ మివ్వవలయునా? ఇది లాభదాయకమా? అనువిషయము చర్చించుట అనవసరము. యుక్తాయుక్త విచక్షణాజ్ఞానముగల యేవ్యక్తియైన యీసమస్యను న్యాయదృష్టితో నిష్పాక్షికముగ నవలోకించిన భారతదేశమున కెట్టి ఘోరమగు దురన్యాయము జరుగుచున్నదో గ్రహింపగలడు. ఇదివరలో సంగ్రహించిన ధన విషయము చర్చింపకపోయినను, యిప్పటికి రెండుదేశాలమధ్యగల ఆర్థికవిషయములను బరిశీలించుట అవసరము.

ప్రణాళికలో ఎనిమిదవ భాగమందు సమాహార రైల్లపరిపాలనా సంస్థను గురించి చర్చించిరి. రైల్లపరిపాలన కొక ప్రత్యేకసంస్థను యేర్పాటుచేసెదరు.

ఆసంస్థవారే రైళ్లను నడిపించు, వేయించు, పరిపాలించు అధికారములు కల్గియుండెదరు. రైళ్లను సక్రమముగా నిర్వహించుటకు ఆసంస్థవారికి అవసరమని తోచిన యెడల యేసంఘమునైన, లేక యేవ్యక్తినైనఅట్టిపనులు చేయుటకు నియమింపవచ్చును: వారితో కొన్ని యొడంబడికలు చేసికొనవచ్చు. ఈవ్యక్తులుగాని, సంఘములు గాని బ్రిటిషు రైల్వే కంపెనీలే అని వేరుగ వ్రాయనక్కర లేదు.

రైళ్ల పరిపాలనా సంస్థయందు గవర్నరు జనరలుచే నియమింపబడు సభ్యుల సంఖ్య హెచ్చుగానుండునుగాన గవర్నరు జనరలుమాటయే సాగును. అనగా, ఆంగ్లధనాఢ్యుల, వర్తకుల లాభములకొరకే భారతదేశమందు రైళ్లు నడిపింపబడునన్నమాట.

విదేశీయులకు లాభములు చేకూర్చుటకు మన రైళ్లను ఉపయోగించినయెడలమనపరిశ్రమలుఅడుగంటక మానవు. భారతదేశమందు విదేశవస్తువులను చౌకగ అమ్ముటకును, మనవస్తువులను ప్రియముగావించుటకును రైళ్ల రవాణా రుసుములు యేర్పాటుచేసి మనపరిశ్రమలకు తీరనినష్టము గల్గజేసెదరు. అదేకాక రైళ్లకు కావలసిన సామగ్రిని, యంత్రములు, యినుము, ఉక్కుసామగ్రి—అన్నిటిని విదేశములలో కొని దేశీయపరిశ్రమలకు ప్రోత్సాహమివ్వరు. ప్రతిసంవత్సరము ౩౦ కోట్ల రూప్యములు విలువగల సరకులను కేంద్రప్రభుత్వమువారు రైలుపరిశ్రమకు వినియోగించుచున్నారు. ఈ పైకమంతయు యికముందు ఆంగ్లధనాఢ్యుల ధనాగారములకు చేరును. అట్టిపని జరుగకుండ ౧౮౩ వ సెక్షనులో యేర్పాటు చేయబడెనని ప్రభుత్వపక్షీయులు వాదింపవచ్చును.

౧౮౩ వ సెక్షను యేమనిన— "ఈ ఆక్టుక్రింద ఫెడరల్ రైల్వే అథారిటీవారు తమ ధర్మనిర్వహణమందు ప్రజాసామాన్యముయొక్కయు, వ్యవసాయము, పరిశ్రమలు, వర్తకముయొక్కయు లాభములను (Interests) గుర్తించి, వ్యాపారసూత్రముల ప్రకారము నడువవలెను.

"వ్యాపార సూత్రముల"ంటే బ్రిటిషువస్తువులను కొనుట! రవాణారుసుములను బ్రిటిషువస్తువుల అమ్మకమునకు తోడ్పడునట్లు యేర్పరచుకొనుట! అదిగాక రైల్వే సంస్థవారు సమాహార ప్రభుత్వమువారి సూచనల ప్రకారము రైళ్ల పరిపాలన కొనసాగించెదరట! సమాహార ప్రభుత్వమునకు రైల్వేసంస్థకు మూలసూత్రములలో అభిప్రాయభేదములు వచ్చిన గవర్నరు జనరలు తన అభిమతము ననుసరించి వివాదము పరిష్కరించుననియు, ఆయన నిర్ణయము నెల్ల రంగీకరింపవలెననియు నిశ్చయించిరి. బ్రిటిషువారికి భారతీయులకు యేదైన విషయమందు సంఘర్షణము సంప్రాప్తించిన సామాన్యముగ గవర్నరు జనరలు తనదేశీయుల లాభములనే గుర్తించును. గవర్నరు జనరలు అధికారమునకే లోబడి రైలుసంస్థ రైళ్లపరిపాలన సాగించునని ౧౮౩వ సెక్షను ౪ వ సబు సెక్షనులో స్పష్టపరచిరి.

రైల్వేసంస్థపై సమాహార శాసనసభల కెట్టి యధికారమును లేదు. సమాహార శాసనసభలలోగాని, రాష్ట్రీయ శాసనసభలందుగాని సభ్యులుగనున్నవారును, ఒక సంవత్సరము క్రితముపై శాసనసభలలో సభ్యులుగనుండి విరమించినవారును రైల్వేసంస్థలో సభ్యులుగ నుండకూడదని నిషేధించిరి. గవర్నరు జనరలు అనుమతించినగాని సమాహార శాసనసభలు రవాణారుసుముల నిర్ధారణ చేయుటకు వీలులేదట!

ఆంగ్లధనాఢ్యునికి, ఆంగ్లనిరుద్యోగికి, ఆంగ్ల వర్తకునికి సదుపాయములు కల్పించి, వారికి లాభములు చేకూర్చుటకే సమాహారరైలుసంస్థ యేర్పరచినట్లు కన్పడును. అదేగాక ఆంగ్లవస్తువులను భారతదేశమందు చౌకగా అమ్ముటకు సులువగుమార్గములను యీసంస్థవారు అన్వేషించెదరు. ఇన్ని కట్టుదిట్టములు చేసినపుడు రైల్వే సంస్థవలన భారతదేశమునకు లాభముకల్గునని యెవరు చెప్పగలరు? ఎవరైన అట్టిపనికి సాహసించిన వాని బుద్ధిమాంద్యతను ప్రకటించుకొనుటగును.

సైనికపరిపాలన విషయములో సేనాధిపతి జీతము, అలవెన్సులు భారతీయులే యిచ్చుకొనవల

యును. భారతదేశమందుగల సైన్యములో యెక్కువ భాగము ఆంగ్ల సామ్రాజ్య రక్షణకు నిర్దేశింపబడినది. అట్టి సైనికుల ఖర్చులను భారతీయులపై రుద్దుట యెట్టి ధర్మమో తోచకున్నది. కంచుకాగడావేసి పరికించినను ఆక్టులోయెచ్చటను భారతసైన్యాధికారులలో అధిక సంఖ్యాకులను భారతీయులనేచేర్చుటకవకాశము నొసగినట్లు కన్పడదు.

అదిగాక ౨౩౮ వ సెక్షనులో "పై నుదాహరించిన విషయము లందేగాక యింక కొన్ని విషయములందుకూడ సంరక్షణకొరకగు ఖర్చులను భారతదేశమే భరింపవలయు"నని తెల్పిరి. ఇంకా కొన్నివిషయము లున్నవట. అవేమిటో? ఆంగ్లప్రభుత్వము వారు తమసామ్రాజ్యాభివృద్ధికి అన్యదేశములందు భారత సైన్య ముపయోగించిన దానికగు ఖర్చులుకూడ "యింకకొన్ని విషయములందు" చేర్చబడునా? చేరునా? ఆంగ్లసైనికోద్యోగుల అధికారముక్రింద భారతసైనికులుగల సైన్యపుసహాయముతో ఆంగ్ల ప్రభుత్వము వారును, ఆంగ్ల ధనాఢ్యులును, వర్తకులును భారతదేశమును అవిచ్ఛిన్నముగ దోచుకొనవచ్చును.

పోలీసు, సివిలు, వైద్యశాఖోద్యోగములకు సెక్రెటరీ ఆఫ్ స్టేటే నియామకములజేయును. నామకః భారతీయులు మంత్రులుగనుండి యధికారము చలాయించుచున్నను సివిలు సర్వీసువారే సంపూర్ణాధికారులని చెప్పవలయును. వారే మంత్రుల యజమానులు. భారతమంత్రులకు సివిలుసర్వీసు ఉద్యోగులను తొలగించుటకు హక్కులేదు. సివిలుసర్వీసువారికిచ్చు జీతములు, వారిపింఛనులు, సెలవు నియమములు, సామాన్య హక్కులను సెక్రెటరీ ఆఫ్ స్టేటు నిర్ణయించును.

ఏ రాష్ట్రమందైన తాత్కాలికముగ సూచించు పద్ధతిని ఆంగ్లసివిలుకార్యదర్శి ఒప్పుకొనక తనయాజ్ఞల నుల్లంఘించినయెడల అట్టియుద్యోగిని భారత మంత్రి శిక్షించుటకు వీలులేదు. ఇదియే మనకు ప్రసాదించిన రాష్ట్రీయ స్వాతంత్ర్యము. దీనిని చూచుకొనియే, మన మితవాదనాయకులు, జస్టిసుపక్షీయులు మురియుచున్నారు:

ఆంగ్లదేశమందు నివసించు ఆంగ్లోద్యోగులకిచ్చు పింఛనులపై పన్నును భారతసమాహార ప్రభుత్వము వారు విధింపకూడదు. సమాహార ఆదాయమునుండి యింగ్లండులో యుండియా ఆఫీసు కగు ధనముకూడ ఖర్చుపెట్టబడును.

౨౮౮ వ సెక్షను ననుసరించి యేడెన్ రేవును యింగ్లీషు కలోనియల్ ఆఫీసువారిపరము గావించిరి. భారతవర్తకులు యేడెన్ రేవు అభివృద్ధికై చాలకృషి సల్పిరి. అచ్చట మనవర్తకుల లాభములను సంరక్షించుటకు యే యేర్పాటును చేయలేదు. యేడెన్ రేవు పరిపాలనము బొంబాయి రాష్ట్ర ప్రభుత్వమువారుసాగించెడివారు. ఒక్కనిమిషములో దానిని ఆంగ్లేయుల పరము చేసిరి

బొంబాయి రాష్ట్రమందుగల సింధును ప్రత్యేక రాష్ట్రముగ నేర్పరచిరి. మహమ్మదీయాభిప్రాయము ననుసరించి సింధును ప్రత్యేకించితిమని ఆంగ్లప్రభుత్వమువా రెంతచెప్పినను, వారి ఆంతరంగికాలోచన యెల్లరకు సుస్పష్టమగుచున్నది.

మహమ్మదీయుల రాజకీయ సంఘాభిమానముకంటే ఆంగ్లవర్తకుల సంఘాభిమానమువలననే సింధు రాష్ట్రీయుల కెక్కువ నష్టముకల్గునని చెప్పక తప్పదు. స్వల్పధరలకు అనేకవేల యకరముల భూమిని ఆంగ్లవర్తకులు సింధురాష్ట్రములో సంపాదించిరి. వారాభూమినంతయు సాగుబడిచేసి, ఫలవంతముగావించి ప్రత్తిపంటను వేయవలయునని ఆలోచనలు సల్పుచున్నారు. ఇతర పంటలువేయు భూములపై హెచ్చుపన్ను విధించుచు, ప్రత్తిపంటవేయు భూమిపై తక్కువపన్ను విధించి, ప్రత్తిపంట యభివృద్ధిజేయ ప్రయత్నించుచున్నారు. సుక్కూరు బారేజ్ ద్వారా వచ్చునీటిని ప్రత్తిపంటవేయు వ్యవసాయదారులకు తక్కువపన్ను కిచ్చుచున్నారు. త్వరలో ఆంగ్లకంపెనీయొకటి నెలకొల్పబడుననియు, ఆ కంపెనీవారు సింధులో ఫ్యాక్టరీలు స్థాపించి ప్రత్తిపరిశ్రమాభివృద్ధికి కృషిచేసెదరనియు తెలియుచున్నది. ఆంగ్ల ధనాఢ్యుల, వర్తకుల శ్రేయస్సు

కొరకే సింధురాష్ట్రము ప్రత్యేకింపబడెనుగాని మహమ్మదీయుల రాష్ట్రాభిమానమును గౌరవించుటకుగాదు.

వీనికితోడు బర్మాను భారతదేశమునుండి విడదీసిరి. భారతదేశముతో బర్మా కలిసియున్నంతకాలము ఆదేశమందు ఆంగ్లేయుల వర్తకాభివృద్ధి కంటువడినది. బర్మాదేశపు ఖనిజసంపత్తిని దోచుకొనుటకు వీలులేక పోయెను. ఇక నిరాఘాటముగా ఆంగ్లేయులు బర్మాను కొల్లగొట్టవచ్చును. దానికి తగినటులనే నూతనరాజ్యాంగ మాదేశమందు నిర్మించిరి. బర్మాలో సమస్తాధికారములను గవర్నరుకిచ్చిరి. అచ్చట గవర్నరొక నియంత. ఆయన యిష్టానుసారమే పరిపాలనసాగును. ఆయనకు ఇండియా రబ్బరువలె సాగదీయుట కనువగు ప్రత్యేకబాధ్యతల నొసగిరి.

మనకు యింగ్లండు ప్రసాదించిన నూతన రాజ్యాంగప్రణాళిక యిట్టి రాజకీయార్థికఫలితములను చేకూర్చును. ౧౯౧౯ వ సం॥ ఆక్టుకంటెకూడ నూతన ప్రణాళిక చాల వెనుకబడియున్నదని చెప్పవలెను.

ఈ ప్రణాళికయందు ప్రజల మూలస్వత్వము లెవ్విధముగను నిర్వచింపలేదు. ఏ పౌరునినైన యెట్టి విచారణలేకుండ ఎంతకాలమైన ఖయిదులో నుంచవచ్చును.

ఈ ప్రణాళికమార్చుటకు బ్రిటిషుపార్లమెంటుకు తప్ప యెవరికిని అధికారములేదు. భారతదేశపు వర్తమానస్థితియేగాక భవితవ్యముగూడ పూర్తిగ బ్రిటిషు పార్లమెంటువారి యధీనము చేయబడెను.

దేశమందలి సైన్యమేగాక పోలీసుకూడ ఆంగ్లేయులక్రిందనేయుండును. భారతదేశమునకుగల సంబంధ బాంధవ్యములను నిర్ణయించు అధికారము ఆంగ్లేయులు తమ చేతియం దుంచుకొనిరి.

భారతదేశపు ఆదాయవ్యయములపై సంపూర్ణాధికారము ఆంగ్లేయులది. మనముచెల్లించు పన్నులనుండి ఒక దమ్మిడీనైన ఆంగ్లేయుల అనుమతిలేనిది ఖర్చుపెట్టుటకు మనకు హక్కులేదు.

నూతనప్రణాళికప్రకారము మన కధిష్ఠానదేవత గవర్నరు జనరలు. ఏచట్టమునైన ఆయన తిరస్కరింపవచ్చును. ప్రజ లేకగ్రీవముగ వలదన్నను యథేచ్ఛగ నే చట్టమునైన గవర్నరుజనరలు చేయవచ్చును.

భారతదేశమును నూతనప్రణాళిక స్వాతంత్ర్యపథమందు ఒక్క అంగుళమైన ముందుకునీసికొని పోకుండ, భారతీయులకీ దేశములో శాస్త్రరీత్యా యెట్టి అధికారములేదని నిరూపించుచున్నది. ఇట్టి గగనకుసుమములుగల ప్రణాళికను చూచుకొనియే యెల్లరును రాబోవుయెన్నికల సంరంభములో బాల్గొనుటకు త్వరపడుచున్నారు. ఎప్పటికైన యజమానిబల్లపైనుండి క్రిందపడు చిన్నముక్కలనే ఉపభోగించుటకు బానిస త్వరితపడుట సహజముకదా!



# ఎడారి యెలుకలు




ముదుసలులైన యరబ్బులు నేటికినీ, వారిప్రాణములపై విసుగు జెందినపుడు, ఊరిబయట యెడారికి పోయి వారికిసరిపోవు ఒకగుంటను త్రవ్వి, వాని తుపాకినిచేతియం దుంచుకొని, యాగుంటలో, మక్కావైపు తలమోపి పరుందురు. వారు పరుండిన పదినిముషములకే యెడారిగాలి యిసుకతో నాగుంటను పూడ్చివేయును. చీనాదేశమందు ధనవంతులు కొంతమంది వారి 'కెటాఫాల్కు'లను వారు పరలోకగతులవ్వకమును పే కట్టించి పెట్టుకొందురు. "కెటాఫాల్కు" అనగా మృతకళేబరమునుంచు భోషాణము. చీనాదేశస్థునిగొప్పవాని కెటాఫాల్కునందు చూపును. కెటాఫాల్కును బంగారముతోకూడ కట్టించుటకద్దు.

ఈజిప్టుదేశమం దుండు "పిరమిడులు" యీజిప్టునేలిన 'ఫారో'రాజుల గోరీలు. పిరమిడులు చాలా అనాదివి. 'ఫారో' రాజులు వారు బ్రతికి యుండగనే వారివారి పిరమిడును కట్టించిపెట్టుకొనిరి. ఈ పిరమిడు లారాజుల "మమ్మీ"లను దాచుట కేర్పడినవి. మృతకళేబరమును కొన్ని ద్రావకములం దుంచిన అది శిథిలముకాని 'మమ్మీ'గా తయారగును. మమ్మీలను జాగ్రత్తగా దాచిన యెన్నియుగములైననవి యట్లేయుండును.

ఈజిప్టు ఆఫ్రికాదేశమం దున్నది. ఈజిప్టుదేశమందీపిరమిడులు కైరోపట్టణమునకు సమీపముననుండు 'గీజా' యనుప్రదేశమునకు సమీపమున నున్నవి. గీజా నైలునది యెడమబడ్డుననుండు మట్టికొంప. గీజాలోనుండు ప్రతిమనుష్యుడును పిరమిడులను చూడవచ్చిన జనకోటిపై యాధారపడియుండును. ఈపిరమిడులలో రహస్యమందిరములు కలవు. అందు అపారమైనధనము, వజ్రవైడూర్యములును, వాటికధిపతియైన ఫారోరాజుల మమ్మీయును దాచబడును.

ఈ పిరమిడులలో చూడవలసినవి మూడు. వీటిలో పెద్దది ౪౮౧ అడుగులయెత్తు కలిగి ౧౩ యెకరములు ఆక్రమించుచున్నది. దీనిని "ఛియాప్సు" ఫారో కట్టించుకొనెను. ఈతడు యీజిప్టుదేశము నేలుచుండగనే తాను స్వయముగా సమీపముననుండి యీపిరమిడును కట్టించుకొనెను. రెండవపిరమిడు ౪౭౪ అడుగులయెత్తు. దీనిని 'ఖాఫ్రా' ఫారో కట్టించుకొనెను. మూడవ పిరమిడు ౨౧౮ అడుగుల యెత్తు. దీనిని "మెన్కారా" కట్టించుకొనెను.

నాల్గవపిరమిడు యిటీవల ౧౯౩౦ సంవత్సరమున బయటపడినది. ఇట్టి పిరమిడులు యీజిప్టులోని లిబియను యెడారి యిసుకలో కప్పబడి ఎన్నియున్నవో!

ఛియాప్సు కట్టించుకొనిన పిరమిడును గూర్చి తెలిసికొనవలసిన ఆశ్చర్యకరమగు విషయములు కొన్ని కలవు. ఛియాప్సు తనతల్లియగు "హెటెఫ్రెసు" యొక్క మమ్మీని, గీజాకు కడుదూరముననుండు డాషూరు అనుప్రదేశమున గోరీకట్టించి అందుంచుటయే కాక, ధనమును, విలువగల రాళ్లను అందుంచెను. లిబియను యెడారియందుండు బందిపోటుల కీసంగతి తెలిసి,

హెప్రేఫెసుగోరీని బహుల గొట్టి, యాధనమంతయు అపహరించి, హెప్రేఫెసు మమ్మీని నాశనమొనర్చిరి.

ఛియాప్సున కీసంగతి తెలిసియుండవచ్చును. తానుమరణించినప్పుడునూ తనమమ్మీ నిట్లే దొంగ లవమానింతురని యూహించి, దొంగలకసాధ్యమగు పిర మిడు నొకదానిని కట్టించుటకై నిశ్చయించెను. నిద్రాహారములుమాని, ఛియాప్సు, తనరాజ్యమందుండు ధనమంతయు వెదజల్లి, ఘనమైన పిరమిడునొకదానిని కట్టించుకొనెను.

ఈపిరమిడును గూర్చి కొంత తెలిసికొనవచ్చును. దీనిమట్టు ౧౩ ఎకరము లాక్రమించుచున్నది. ఎత్తు ౪౮౧ అడుగులు. ఈకట్టడము ౬ మిలియను టన్నుల బరువుకలదై, ౮౫,౦౦౦,౦౦౦ ఘనపుటడుగుల పరిమాణము కలదైయున్నది. ఇందుండు ఒక్కొక్క రాయి బరువు ౪౪౦,౦౦౦ పౌనులు. ఈపిరమిడును ౧౦౦,౦౦౦ మంది మనుష్యులు ౩౦ సంవత్సరములు ప్రయాసపడి కట్టిరి. నిప్పుల గ్రక్కుయెండలో నీగ్రోబానిసలు యీరాతిబండలను మలమలమాడు లిబియను యెడారి యిసుకలో, నురగలు గ్రక్కుచు యీడ్చుకొని కడు దూరమునుండి "గీజాకు" తెచ్చుచుండిరి. బానిసలు చాల నీడ్వలేనియెడల దయదాక్షిణ్యములు లేక క్రూరులచే నరకబడిరి.

ఈపిరమిడులోనికి మార్గముకలదు. ఛియాప్సు చనిపోయిన తరువాత రహస్యమార్గమును కనిపెట్టుటకు దొంగలు పెక్కు సంవత్సరములు ప్రయాసపడిరి. చివరకు మార్గము దొరికెను. ఈరహస్యమార్గము పిరమిడు మట్టునకు ౪౫ అడుగుల యెత్తున మూయబడియుండెను. ఈమార్గము ౩౫౦ అడుగులలోతునందు ఒకవిశాలమైన గదికిపోవును. ఆగదియందు దొంగలకేమియు దొరకలేదు. మరికొన్ని సంవత్సరములు ప్రయాసపడగా, దొంగలకు, ఆగదినుండిపోవు ౨౦ అడుగుల లోతుగల మరియొక మార్గము చిక్కెను. ఈమార్గముచివర గది యేమియు లేక మొండిదిగానుండెను. ఛియాప్సు పిచ్చివాడై యీమార్గములను పెట్టలేదు. దొంగలకు తనమమ్మీయును, ధనమును దొరకకుండుటకై యిట్టి టక్కరి మార్గములను పెక్కింటిని పెట్టించెను.

ఇట్టి మార్గములలో నొక్కటిమాత్రము ఛియాప్సు మమ్మీయున్న తావునకు గొనిపోవును. మరికొన్ని సంవత్సరముల కీమార్గముకూడ దొంగలకు చిక్కెను. దొంగలు ఛియాప్సు వస్తువాహనముల నపహరించుటయే కాక, ఛియాప్సు మమ్మీదేహమును బయటికీడ్చి, యెడారి యిసుకలో నొకగుంటలో త్రొక్కివేసిరి. ఇట్టి రాతికట్టడములనుకూడ దోచిన యీదొంగలను యెడారి యెలుక లనవచ్చును.



## మంగళగిరి

మంగళగిరి చాల పురాతనమైన పుణ్యక్షేత్రము. గుంటూరుకు పదమూడుమైళ్లదూరములోను, బెజవాడకు ఆరుమైళ్ల దూరములోను ఉన్నది.

ఇక్కడ నృసింహస్వామిని ధర్మరాజు దక్షిణ యాత్రకు వచ్చినపుడు ప్రతిష్ఠించినాడట. అప్పటినుంచి ఉన్న గుడి శిథిలావస్థలో నుండ శ్రీ వాసిరెడ్డి వెంకటప్పారావు బహద్దరుజమీందారు బాగు చేయించి



౧. లక్ష్మీనరసింహస్వామి దేవాలయము సింహద్వారగోపురము. వీనిశిఖరములకు బంగారునీటిపూత గలదు. చూడసుందరముగ నుండును.

ఇచట ఉన్న దేవాలయములలో నృసింహస్వామి దేవాలయము, పానకాలరాయని దేవాలయము ముఖ్యమైనవి. ఈ రెండును పూర్వకాలమున కట్టబడినవి.

ప్రాకార గోపురములు కట్టించినాడు. వారు కట్టించిన గోపురము పదకొండు అంతస్తులు కలది. పది సంవత్సరముల క్రిందట ఉత్తరదక్షిణములలో మరి రెండు గోపుర

ములను కట్టించినారు. వాటిమీద భాగవతగాథలు చిత్రితములై యున్నవి. ఇవి తూర్పుభాగపు గోపురముకన్న చాలచిన్నవి. పడమటిభాగమున తూర్పుగోపురముకన్న యెత్తయిన గోపురము కట్టుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ఫలించినట్లయిన పదునాలుగు అంతస్తుల గోపురము తయారగును. తూర్పుగోపురము కట్టునపుడు ఒక వైపున కొంకింతవాలినదట. దానిని చక్కజేయుటకు శిల్పి ఎన్నిప్రయత్నములు చేసినను సాధ్యపడలేదు. ఇక గత్యంతరము లేక ఎక్కడనుండిచూచిన వంపు స్పష్టముగా కనబడునో అచట ఒక కోనేరు త్రవ్వించి తాను కట్టుటలో ఏర్పడిన తప్పును కప్పిపుచ్చుకొన్నాడు. ఆ కోనేరును "చీకటికోనే"రని పిలుతురు.



౨. లక్ష్మీనరసింహస్వామి అలయము రథోత్సవమునాటి దృశ్యము.

పానకాల రాయనిగుడి కొండమీద ఉన్నది. గుడిని విశాలముగా కొండతొలచి కట్టినారు. లోపల ఒక భాగములో కొండకు ఆన్చి పానకాలరాయని ప్రతిష్ఠించినారు. పానకాలరాయని నోట పానకము పోసిన కొండలోనికి పోవుచుండును. ఇచ్చట పానకముపోయుటకు భక్తిగాక ప్రత్యేకకారణ మేమైన ఉన్నదాయను ప్రశ్న అచటకు పోయిచూచినవారికి పుట్టకపోదు. కొందరు కొండలో గంధకము ఉన్నదని, అది అగ్నిపర్వతముగా మారకుండ ఉండుటకై గంధకమునకు విరుద్ధమైన పానకము పోయుటకు బుద్ధిశాలియైనపూర్వీకు డెవరో పానకాలరాయని నిర్మించినాడని చెప్పుదురు. ఇందులో కొంతసత్య ముండవచ్చును. పర్వతపరిశోధన

జగిగిన గాని ఇది తెలియదు. పానకాలరాయునికి పానకము పోసినపుడు తెచ్చినదానిలో సగము లోనికి పోవును. మిగత సగము వెలుపలికి వచ్చివేయును. ఇట్లు అసట పానకాలరాయని మహత్త్వమువలన నని చెప్పుదురు. మాహాత్మ్యములో నమ్మకము లేనివారు పలువిధములైన కారణములు చెప్పుదురు. కొందరు విగ్రహములో మర ఉన్నదనెదరు. కాని బాగుగా పరికించి చూచినను మర కనపడదు. పూజారి ఏ బందెలో పాన



౩. మంగళగిరికొండమీద పానకాల రాయదేవాలయ ప్రాకారాదులు సోపానమార్గము.

కము సగమయిన తర్వాత శంఖము చాకచక్యముతో శిల క్రిందులు చేయును. వెంటనే పానకము బయటకు వచ్చును. ఇదంతయు క్షణములో జరుగును గాన ప్రేక్షకులు గమనించలేరు. పుణ్యక్షేత్రము లన్నింటికిని ఇటువంటి మహత్తులను కల్పించుట సహజము. వీటివలన జనులలో మూఢవిశ్వాసము, బుద్ధిమాంద్యము కలుగుచున్నవి.

ఫాల్గున పూర్ణిమనాడు నృసింహస్వామి కల్యాణోత్సవము జరుగును. అపుడే రథోత్సవముకూడ జరుగును. ఇది మంగళగిరిలోని ముఖ్యమైన తిరునాళ్ల. దీనిని జూచుటకు చుట్టుపట్లవారు వేలతరబడి వచ్చెదరు. వైకుంఠ ఏకాదశినాడు మరొకఉత్సవము జరుగును. అపుడుకూడ చాలమంది వచ్చెదరు.

ఇచట యాత్రికుల సౌకర్యార్థమై చాలసత్రములున్నవి. భ్రమరాంబ యనునామె చాలకాలమునుండి కష్టపడి చందాలను పోగుచేసి ఒకఅన్నసత్రమును జరుపుచున్నది.

'రమాకాంత'

---

మామిడిచెట్టు

ఒక పూళ్లో ఓరాజుండేవాడు. వాడిదగ్గ రొక చక్కని పెంపుడుచిలకుండేది అదొకనాడు స్వర్గలోకా

ని కెగిరిపోయి యెంతోవింతగా ఒక టెంకను పట్టుకొచ్చింది. దాన్ని రాజుకిచ్చి తోటలోనాటిస్తే దాన్లోనుంచి పెద్ద చెట్టొకటి మొలుస్తుందనీ, దానిపళ్లు తిన్నవాడు చావంటూఉండక యెప్పుడూ నవనవలాడుతూ యవ్వనం అనుభవిస్తాడనీ మనిషిమాటలతో చెప్పింది. రాజుకూడా అలాగే చేయించేడు. విత్తనం స్వర్గంలోది గనక యేడాది లోపుగానే మహావృక్షమైపోయింది. చెట్టుదగ్గిరి కెవ్వరూ రాకుండా తోటమాలీలు జాగ్రత్తగా కాస్తున్నారు. ఆసమయంలోనే ఆకాశంమీద ఒక డేగ పామును తన్నుకుని యెత్తుకుపోతోంది. అప్పుడాపాము విషం కక్కేసింది. ఆవిషం మొట్టమొదట పండబోయే కాయమీద పడింది. దాన్ని యెవ్వరూ కనిపెట్టలేదు. మొదటిపండు రాలగానే దాన్ని సంతోషంగా తోటమాలీలు రాజుకు సమర్పించేరు. రాజు ఆపండు మహాత్యం కనిపెడదామని ఓముసలాడిని తీసుకొచ్చి వాడిచేత తినిపించాడు. పండుమీద విషం ఉంది కాబట్టి వెంటనే నురగలు గక్కుకుంటూ ముసలాడు చచ్చిపోయేడు. రాజుకు పట్టరాని కోపంవచ్చి చిలకను పీకిపిసికి చంపేసేడు.

ఆనాటినుంచీ దానికి విషవృక్షమని నామకరణం అయిపోయింది. చెట్టుదగ్గరికి తోటమాలీలుకూడా వెళ్లడం లేదు. భయపడి రేపో యెల్లుండో చెట్టును కొట్టేద్దామనుకుంటూండగా పెద్ద అద్భుతం జరిగింది. ఆ వూళ్లోనే ఒక ముసలిదాన్ని కొడుకూ కోడలూచేరి యింట్లోంచి వెళ్లగొట్టేరు. అప్పుడాముసలిది విషం పండు తిని చచ్చిపోతానని అంటూ రాజుగారితోటలో ప్రవేశించింది. చుట్టుపట్ల ఉన్నవాళ్లంతా దీన్ని పట్టుకుందామని రాగా యేముంది? ముసలిది లేదు గాని చక్కటి పదహారేళ్ల బాలాకుమారి కనబడింది. దీన్ని చూసి ముసలాళ్ళందరూ యీ మామిడిచెట్టుపళ్లు తిని పడుచాళ్లయిపోయేరు. రాజుకు యీ సంగతి తెలిసింది. అన్యాయంగా చిలకను చంపినందుకు విచారించి తను చేసిన తెలివితక్కువ కార్యానికి తనే పొడుచుకుని చచ్చిపోయాడట.

ఈ విధంగా ఆ చెట్టు స్వర్గలోకంలోనుంచి భూమిమీద అవతరించిందనీ, అమృతంలాంటి రసం గల పళ్లనిస్తుంది కాబట్టి మనుష్యులకు అమరత్వం చేకూరుస్తుందనీ మామిడిచెట్టునుగూర్చి ఈయితిహాసము తెలియపరుస్తోంది.

మామిడాకులుకూడా చాల శుభప్రదమైనవి. అందుకే మామిడితోరణాలు యిళ్ల గుమ్మాలకు కడతారు. పందిళ్లలో వేస్తారు. మామిడాకులు కలశాలలో ఉంచుతారు. లేతగా యెర్రగా ఉన్న మామిడిచిగుళ్లను వేళ్లకు పోల్చడం కవీశ్వరులకు అలవాటయిపోయింది. వాటినే కత్తిలాగ ఉపయోగించి మన్మథుడు ప్రేమపిట్టల గొంతుకలు కోస్తాడట.

మామిడిచెట్టు ఐశ్వర్యం కలిగించడమేకాకుండా సంతానంకూడా గలిగిస్తుందని పంజాబుదేశంలోవారికి నమ్మకం ఉంది. పిల్లలుపుట్టనివాళ్లూ, సంతానంనిలవనివాళ్లూ ఆడాళ్లంతా నాలుగురోడ్లూ కలిసేచోట మామిడిచెట్టుకిందకు చేరుతారట అక్కడ పంచమహావృక్షాల ఆకులు కింపరుస్తారట. వాటిలో మామిడి ఆకులుకూడా ఉంటాయి. ఈ ఆకులమీద శ్రీరామచంద్రమూర్తివిగ్రహము ప్రతిష్ఠ చేసి దానిచుట్టూ ఆ ఆడాళ్లు బట్టలుతీసేసి కూచుంటారు. ఊరికి నాలుగు దిక్కులూ, యీశాన్యంవైపూ ఉన్న నూతుల్లోనుంచి నీళ్లుతెచ్చి ఆనీళ్లను ఒకచిల్లులకలశలోనుంచి వీళ్లమీద పడేలాగ పోస్తుందట ఒకపెద్దావిడ. ఈక్రియవల్ల వారికి సంతానం కలుగుతుందట.

కొన్నిరకాల మామిడిపళ్లు పైకి చాలా చక్కగా ఉంటాయి గాని ముక్కలు కోయగానే లోపలనుంచి చింతగింజలంతి పురుగులు రెండో మూడో బైటికి వస్తాయి. ఇవి లోపల యెలాగ ప్రవేశించాయని అందరికీ అనుమానమే. మామిడిపువ్వు లేతగా ఉన్నప్పుడు కొన్ని పురుగులు తేనె తాగడానికివచ్చి పువ్వు గర్భకోశంలో తొండముతో రంధ్రాలుపొడిచి వాటిలో గుడ్లు పెడతాయి. పువ్వు పిందెలౌతున్న కొద్దీరంధ్రాలు పూడిపోతాయి. పిందెలు కాయలౌతాయి. లోపల గుడ్లు పిల్లలౌతాయి. పండు పండేసరికి చాలా అందంగా ఒక మచ్చైనా లేకుండా ఉంటుందిగాని కాయ కోసేటప్పటికి విషయం బయటబడుతుంది.

క్రొత్తపల్లి సుబ్రహ్మణ్యం.

## అండమాను దీవులు

శ్రావణమాస భారతిలో అండమానుదీవుల విషయము చూచాయగ వ్రాయబడినది. భారతీయ నేరస్థుల కిది ద్వీపాంతరవాసశిక్ష ననుభవించు ప్రదేశము గాన దీనినిగూర్చి విపులముగా నెరుంగుట యుచితము.

వెనుక తూర్పు ఇండియా సంఘమువారి ఓడలు బంగాళాఖాతములో ప్రయాణము చేయునప్పుడు ఈప్రాంతమున దోపిడీలు జరిగెడివి. వానిని నివారించుటకు కారన్‌వాలీసు ప్రభువు కొంతమంది సైనికులను శిక్షితులను ప్రోగుచేసి ఆర్చిబాల్డుబ్లేయిర్ అనువాని నాయకత్వమున నీప్రాంతమునకు పంపెను. బ్లేయిర్ ౧౭౮౯ వ సం. సెప్టెంబరునెలలో దక్షిణ అండమాను దీవులలో తూర్పున ఒక చక్కటి ఓడరేవు గల చోట దిగి అచట ఆంగ్లేయ పతాకమును నెలకొల్పెను. నాటినుండి ఆ రేవుపట్నమాతని పేరుమీదుగనే పోర్టుబ్లేయిర్ అని పిలువబడుచున్నది. అదియే నేడు అండమానుదీవులకు రాజధాని. అచటి నీరుపడకను, దోమలు కుట్టుటచే విషజ్వరములు వచ్చియును, మొదట చాలమంది చనిపోయిరి. అందుచే నాంగ్లేయు లప్పటిలో నచట నివాస మేర్పరచుకొనలేకపోయిరి.

తరువాత ౧౮౫౭ లో జరిగిన సిపాయితిరుగుబాటుమూలమున చాలమంది ఖైదీలు కంపెనీవారి చేజిక్కిరి. వారిని శిక్షించుటకును, వారివలన లాభము పొందుటకును కానింగుప్రభువు వారినందరిని అండమానుదీవులకు పంపివేసెను. వారు పోర్టుబ్లేయిర్ పరిసరమునగల అరణ్యములను చాలవఱకు నరకి ఆప్రదేశమును వాసయోగ్యముగ చేసిరి. ఆంగ్లేయు లంతటినుండి యచట నివసింపగలిగిరి. కాని అండమాను ఆదిమనివాసులు బాధపెట్టసాగిరి. ఆంగ్లేయులు వానినన్నిటిని సహించి "అండమాను సేవాగృహములు" అను ఒకసంస్థను స్థాపించి ఉచితముగ వారికి వసతుల నొసగిరి. తినుబండారములను పంచిపెట్టిరి. క్రమముగ వారిస్నేహము కుదిరినది. తరువాత వారు ఆంగ్లేయులకు లోబడిరి.

నాటినుండి నేటివఱకు ద్వీపాంతరవాసశిక్ష ననుభవించుటకు భారతీయనేరస్థు లిచటికే పంపబడుచుండిరి. ౧౯౦౧ వ సం.న ఇచట ౧౧,౯౭౮ గురు శిక్షితులు గలరు. రానురాను శిక్షితులసంఖ్య తగ్గుచున్నది ద్వీపాంతరవాసశిక్ష ననుభవించుటకు శిక్షితుల నిచటకు పంపక యెచ్చటి నేరస్థుల కచ్చటనే ద్వీపాంతరవాసశిక్ష విధింపబడుటయే దీనికి కారణము. ఇతరదేశ ద్వీపాంతరవాసప్రదేశములకంటె నిచట సదుపాయములు తక్కువ. ఈదీవులన్నిటికిని కలిపి నాలుగువైద్యశాలలకంటె ఎక్కువలేవు ఒక్కొక్క శిక్షితునిపట్ల ప్రభుత్వమువారికి సాలీనా ౬ పౌ. మాత్రమే వ్యయమగుచున్నవి. విడుదలకాబడిన శిక్షితులు స్వగ్రామములనుండి ఆలుబిడ్డలను తెచ్చుకొని ఆదీవులలోనే నివాస మేర్పరచుకొనుటకు మాత్రము సావకాశము లున్నవి. వీరి బాలురకు ప్రాథమికవిద్య తప్పక నేర్పబడును.

ఆంగ్లేయుల కీ వలసరాజ్యము చాల ఉపయోగకరము. ఇచట అరణ్యములు తెంపులేకుండ గలవు. కావున కలప యెక్కువగ దొరకును. అదియుకాక, హిందూమహాసముద్రమునకును, బంగాళాఖాతమునకును ఒకరకముగ నిది మధ్యమున్నది. అందుచే ఆయా సముద్రములలో తుపానులు ఏయేదిక్కునకు వీచుచున్నవో యిచటినుండి సులువుగ తెలుసుకొనవచ్చును. ౧౮౬౯ లో పోర్టుబ్లెయిర్‌వద్ద నొక యంత్రము స్థాపింపబడినది. ఏయే సమయములలో ఏయేవైపు తుపానుపట్టినది యిచటినుండి యితర ఓడరేవులకు తెలుపబడుచుండును.

అండమానుదీవులు దరిదాపు ౨౦౪ గలవు. వీని మొత్తము విస్తీర్ణము ౨,౫౦౦ చ. మైళ్లు. వీని తీరరేఖ చీలియున్నది. అందుచే ఓడరేవులకు అనుకూలము. ఇందెన్నో ఓడరేవులు గలవు. వానిలో పోర్టుబ్లెయిర్, పోర్టుకారన్‌వాలీసు, పోర్టుసొందు ముఖ్యమైనవి.

ప్రాచీనకాలమునుండి యీదీవులలో నివసించు ఆదిమనివాసులు సంకరములేని అనార్యులు. ఆనాటి కానాడు వీరు క్షీణించిపోవుచున్నారు. వీరిలో పురుషులు ౪ అ. ౧౦ ౩అం.కు, స్త్రీలు ౪అ. ౬అం. నకుమించి

రెడుగరు. స్త్రీలకంటె పురుషులే అందముగ నుందురు. ౧౮ లేక ౨౨ ఏండ్లు మగవానికిని, ౧౬ లేక ౨౦ ఏండ్లు ఆడదానికిని రానిదే, వివాహము చేసుకొనరు. పెండ్లికాని వారిలో వ్యభిచారము దోషము కాదు. వివాహితులయెడ మాత్రము అదినిషేధము. ఒక్కొక్కకుటుంబమున ముగ్గురు సంతానముకంటె నెక్కుడు కలుగుట అరుదు. వీరి సంఘమున ఏకంతువివాహములు గలవు; వివాహవిచ్ఛేదనములు లేవు. పెనిమిటిని కోల్పోయిన స్త్రీ పెండ్లి కాని మరదిని పెండ్లాడును.

స్త్రీ పురుషులందరును జుట్టును అంట కత్తిరించు కొందురు. లేకున్నను వారి జుట్టు ౨ మొ. ౫ అం. వరకు కంటె పొడుగుగ పెరగదు. ఆడువారే క్షౌరములను చేతురు.

పెద్దమనిషియైన పిల్లను తల్లిదండ్రులు కౌగలించుకొని యేడ్తురు. తరువాత ఆమె రెండు గంటలవఱకు సముద్రమున స్నానము చేయును. ౨౪ గం. వఱకు మెలుకువగ నుండును. కదలక చేతులు కట్టుకొని కాళ్లు ముడుచుకొని వేరుగా ఆకుచాపలమధ్య కూర్చొనును.

మగవానికి యౌవనము జొరపడగానే దేహము నుండి కండలను కోసి రక్తముతో సహా దహనము చేసెదరు. పుండు మానినపిదప వీపుమీదను, రొమ్ముమీదను అమ్ములతో మూడుకోతలను కోసెదరు. వీరందరును వేటయందారితేరినవారు.

వీరి సగటుఆయుర్దాయము ౨౨ ఏండ్లు. పురుషులకంటె స్త్రీలే ఎక్కువకాలము బ్రతుకుదురు. శవములను దహనము చేయక మట్టిని పూసి సమాధిచేయుదురు. ఎవరైన మరణించినపుడు దుఃఖసూచకముగ నుదుట మన్నును పూసుకొందురు.

వెనుక ౧౮౭౨ సం॥ న ౧౮ ఫిబ్రవరి ఇండియా రాజప్రతినిధియగు మేయోప్రభువు ఈ దీవులను చూచుటకు పోగా ఒక మహమ్మదీయశిక్షితుడు వారిని హత్యగావించెను. అండమానుదీవులనుగూర్చి ప్రసంగము చేయువారి కీవిషయము స్మరణకు రాకమానదు.

ఆ. సూ. మూర్తి

---

## గామా - జగదేకమల్లుడు

దండెములు, బస్కీలు చక్కని, బలిష్ఠమైన శరీరాన్ని తయారుచేస్తాయి. పాశ్చాత్యుల వ్యాయామ పద్ధతి అంతకన్నా అందమైన శరీరసౌష్ఠవాన్ని కలిగిస్తుంది. కాని అది చేసినన్నాళ్లే వుంటుంది. మనం



వ్యాయామముచెయ్యడము మానగానే, మనశరీరసౌష్ఠవం రోజురోజుకూ దిగనారుతుంది. హిందూపద్ధతి అలాగ కాదు. మెలిదిరిగినకండలు మెలిదిరిగినట్లే వుండిపోతాయి. విరుచుకుని విశాలమైనరొమ్ము అలాగే వుంటుంది. కారణాంతరాలవల్ల శరీరంలోవున్న రక్తమాంసాలు తగ్గినా ఎముకలచట్టపుతీరుమాత్రం వ్యాయామంవల్ల యేర్పడినరీతిగానే స్థిరమైపోతుంది. ఉత్సాహము ఎప్పటికీ చావదు. ముసలితనపుజాడలు ముసలితనంలోనైనా పొడగట్టవు.




శివభక్తమాహాత్మ్యమునందలి సత్యార్థాఖ్యానమున నొకరంగము
(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్ర సంగ్రహమునుండి)

ఈ విషయాలన్నీ ప్రపంచప్రఖ్యాతి గడించిన జగదేకవీరుడు గామాచరిత్రలో స్థిరపడిపోయాయి.

గామాఅసలుపేరు గులామ్ మహమ్మద్. అతని వయస్సు దాదాపు ౫౦ సంవత్సరాలు. అతడు పాటియాలామహారాజాగారి సంస్థానపుమల్లుడు. ప్రత్యేకంగా ఏదైనా పోటీలువచ్చినపుడు ఇతనికి రోజుకి ౧౦౦ రూపాయల అలవెన్సు ఇస్తారు. ఇతను మల్లయుద్ధము నేర్చుకొనేటప్పుడు తినేఆహారం సామాన్యంకాదు. వింటేనే మనగుండె పగిలిపోతుంది.

ముత్యాలసారము, ఏడుకోళ్లు, సేరుంపావు బాదంపప్పు, అయిదుసేర్లపాలు, అర్ధసేరునెయ్యి, బంగారపురేకులు, ఏలకకాయలతో వండిన మాంసమూ-ఇవీ అతనిఆహారం. అయితే రోజూకాదు. ఏదైనా మల్లయుద్ధం చెయ్యవలసివస్తేనే.

సాధారణంగా, రోజూ రెండు సేర్లన్నర రొట్టే, మాంసపుకూరా, మూడుసేర్లపాలూ నెయ్యీ, పావుసేరు బాదంపప్పూ, మజ్జిగా తింటాడు. ఆ తినేతిండిని జీర్ణించుకోడానికి ఇతను ప్రతిరోజూచేసే తాలిం ఏమిటి-ప్రొద్దున్నే ౫౦౦౦ బస్కీలు తియ్యడం, తన శిష్యులందరితోటీ కుస్తీపట్టడం, సాయంత్రం౧౫౦౦ దండేలూ, తొమ్మిదో పదో మైళ్లు పరుగెత్తడమూ ఇన్నీ చేసినా ఒళ్లుయెప్పుడూ మర్దనచేయించుకోడు. కుస్తీకి ముందుమాత్రం ఒంటినిండా నూనె రాసుకుంటాడు.

ఇంతవరకూ అతనెప్పుడూ జబ్బుపడలేదుట!

ఇతడు మొట్టమొదట గెలిచిన కుస్తీ యితనిపదవ సంవత్సరంలో. ఆజయంతో అతనికి కీర్తికాంక్ష కలిగింది. ఉత్సాహం చెలరేగింది. అలహాబాదు ప్రదర్శనశాలలో రహీమ్‌సుల్తానీతో కుస్తీపట్టి రుస్తుమిహిందీ (భారతరుస్తుం) బహుమానాన్ని పొందాడు. హుస్సేన్‌బక్షను ఓడించినప్పుడు బెంగాలుగవర్నరుగారు గామాకు వెండిగదనుయిచ్చి బహూకరించారు. లాహోరులో ఇప్పుడు మన చక్రవర్తిగారైన ఎనిమిదవఎడ్వర్డు ఎదుట హాతన్‌ఖాన్‌ను ఓడించడముతో అతనికీర్తి మిన్నుముట్టింది.

గామా భారతదేశంలోనే యింకా చాలా మంది ప్రసిద్ధుల్ని ఓడించాడు. చాలామంది గామాను ఐరోపాఖండము వెళ్లమన్నారు. అప్పటికే అతనికీర్తి ఆఖండమంతా వ్యాపించిపోయింది.

అతనితో కుస్తీపట్టడానికి ఎక్కువమంది సమ్మతించలేదు. ఫ్రాన్సులో ఎవరూ ఇతన్ని ఎదిరించలేదు. లండనులో జరుగుతూవున్న మల్లయుద్ధ ప్రదర్శనానికి వెళ్లాడు. అప్పుడే ప్రపంచమంతటినుంచీ వచ్చిన మల్లులంతా అందులో పాల్గొంటూ వున్నారు.

తనను ఓడించినవాడికి ౫౦౦ పౌనులు ఇస్తానని ప్రకటించాడు గామా. యూరపుదేశపు మల్లులంతా ఇతనికి మల్లయుద్ధమే తెలియదనీ, ముందు తక్కువవాళ్లని ఓడించి ఎక్కువవాళ్ళమీద సవాలు చెయ్యమనీ యీసడించారు.

తనతోటి ౫ నిముషాలు, చిత్తుకాకుండా కుస్తీ పట్టితేచాలు ౫౦౦ పౌనులు బహుమానమిస్తానని గామా మళ్లీ ప్రకటించాడు. చాలామంది సిద్ధమయారు. కాని ఒక్కడూ మూడునిముషాలకన్న ఎక్కువసేపు కుస్తీపట్టలేకపోయాడు.

అమెరికాదేశపు ప్రఖ్యాతమల్లవీరుడు డాక్టరు రోలరును, మొదటిసారి పదినిముషాల్లోనూ, రెండోసారి ౭ నిముషాల్లోనూ పడవేశాడు. ౨౫౦ పౌనుల పందెం గెల్చుకున్నాడు.

ఇవాన్‌పాడూబీని ఓడించి కీర్తిగడించిన జిబ్‌స్కోను గామా సవాలుచేశాడు. ఇద్దరూ కుస్తీపట్టారు. సవాలు గామా, జవాబు జిబ్‌స్కో, ఇద్దరూ మూడు గంటలసేపు పట్టారు కుస్తీ. అలసటగావుంది, విశ్రాంతి కావాలని జిబ్‌స్కో విరమించుకున్నాడు. మళ్లీవస్తానన్నాడు కాని రాలేదు. ప్రదర్శనసంఘంవారు ప్రపంచమల్లవీరుడుగా గామాను అంగీకరించి, పటకాను బహుమతిచేశారు.

గామా ఇండియాకువచ్చాడు. జిబ్‌స్కో అమెరికాకు వెళ్లాడు.

జిబ్స్కో అమెరికాలో చాలామందిని ఓడించి, కొన్ని సంవత్సరాలయాక ఇండియాకు మళ్లీవచ్చాడు. పాటియాలాలో గామాతో మళ్లీ కుస్తీపట్టాడు. కనురెప్ప పాటులో వెల్లకిలపడ్డాడు. 'అతను చాలా గొప్పవాడు; నేను చూసినవాళ్లందరికన్నా దిట్టమయినవాడు' అని గామాను ప్రశంసించాడు.

లండనులో వున్నప్పుడు, అక్కడవున్న జపాను మల్లులందర్నీ గంటలో ఓడిస్తానని గామా సవాలు చేశాడు. ఒక్కడుకూడా నేనువస్తానని తయారుకాలేదు. లండను వార్తాపత్రికలన్నీ జపానుమల్లులు పరుగెత్తి పోతూన్నట్టూ, గామా మళ్ళ నవ్వుతూ చప్పట్లుకొడుతూ నుంచున్నట్లూ బొమ్మల్ని ప్రకటించాయి

భారతదేశానికి కీర్తితెచ్చిన కవి రవీంద్రుడినీ, వేదాంతి రాధాకృష్ణునీ, దరిద్రనారాయుడు గాంధీనీ ఎంతగా మనముపూజిస్తున్నామో. యుగయుగాలనుంచీ భారతదేశపుసొత్తయిన మల్లవిద్యాప్రాశస్త్యమును నిలబెట్టి భారతదేశపు పేరునిలబెట్టిన గామాను యేడాదికి ఒక్కసారైనా తలుచుకుంటున్నామా? సందేహమే!

'చక్రవర్తి'

---

## హైందవ ప్రజాక్షయము

నేటి భారతభూమియందుగల ౩౫ కోట్ల ౩౦ లక్షల ప్రజలకు ౨౩,౯౧,౯౫,౦౦౦లకు హిందువులేకలరు. ఇంత బ్రహ్మాండమైన జనసమూహము ఆనాటికానాటికి క్షీణించుచున్నదనిన నెవ్వరును నమ్మరు; మీదుమిక్కిలి నవ్వెదరు. కాని ప్రభుత్వ ప్రకటితములగు జనాభా లెక్కలనే ఆధారముగాగొని, సవిమర్శకముగా కండ్లు విప్పి పరికించినచో ప్రస్తుతహీనస్థితి గ్రాహ్యమై ప్రతివానికిని విచారము పొడసూపకమానదు.

| | నూటికి అభివృద్ధి | |
|---|---|---|
| ౧౯౩౧ సం॥ జనాభా లెఖ్ఖ ప్రకారముగల జనులు | ౧౯౨౧॥ ౧౯౩౧॥ ౧౦ ఏండ్లలో | ౧౮౮౧॥ ౧౯౩౧॥ ౫౦ ఏండ్లలో |
| హిందువులు ౨౩,౯౧,౯౫,౦౦౦ | ౧౦.౪ | ౨౬.౮ |
| ముసల్మానులు ౭,౭౬,౭౮,౦౦౦ | ౧౩.౦ | ౫౪.౦ |
| క్రైస్తవులు ౬౨,౯౭,౦౦౦ | ౩౨.౫ | ౨౩౮.౧ |

పై పట్టికనుబట్టి ముసల్మానులవలెను, క్రైస్తవులవలెను మనవారభివృద్ధినొందక ఎట్లు క్షీణించుచుండిరో విశదమగుచున్నది. పదేండ్లనాటికి నూటికి పదుగురు చొ. మనవారభివృద్ధినొందిరని సంతసించెదమే కాని ఏబది ఏండ్లకు మనవారు నూటికి ౨౬ చొ. మాత్రమే పెరిగిరనుమాటను మరతుము. ఈ ఏబదిఏండ్ల నుండి మనవారు తోడివారితో సమముగ నభివృద్ధినొందక కృశించుచునే యుండిరి.

ఇట్టి నిరుపమాన ప్రజాక్షయము దైవకృతము కాదు, దురదృష్టప్రేరేపితము కాదు, మృత్యుసాధకములగు భయంకర మహావ్యాధిపీడనఫలితము కాదు; కాని కేవలము సాంఘికదురాచార సంజనితము. మంచిచెడ్డల విచారములేక, అవివేకులై పెక్కురుహిందువులు పెక్కుసాంఘిక దురాచారములపట్ల మూఢవిశ్వాసము గలిగి ప్రవర్తించుచు, సంఘహైన్యతకు కారణభూతులగుచుండిరి.

ప్రతిసంఘమునకును హృదయము స్త్రీ. సంఘస్థితి స్త్రీ స్థితిపై నాధారపడియుండును. పైగా స్త్రీజనాధిక్యత తత్సంఘసౌభాగ్య సూచకమనియు, పురుషజనాధిక్యత హైన్యచిహ్నమనియు, ఆధునికశాస్త్రవేత్తల సిద్ధాంతము. ఈ సిద్ధాంతమనుసరించి నిజమునకు మనసంఘ మత్యున్నతదశలో నుండవలెను. పిన్నపెద్దలమాట ప్రక్కనుంచి ప్రత్యేకముగ సంతానార్హతగలవారినే సరకుచేసి లెక్కించినచో ౫,౭౭,౭౩,౭౭౮ మందివఱకును స్త్రీలును, ౫,౧౭,౫౦,౨౬౬ మందివఱకును మాత్రమే పురుషులును మనసంఘమున గలరు. పురుషులకంటె ౩౦లక్షలవఱకు నధికముగ స్త్రీలనే కలమనసంఘము ప్రపంచకమున కాదర్శప్రాయకముగనుండవలసినది. కాని యట్లుండక ఆనాటికానాటికి నిర్జీవమై మన సంఘము కృశించిపోవుచున్నది. ౫,౭౭,౭౩,౭౭౮ మంది సంతానార్హతగల హిందూస్త్రీలలోను ౮౩,౧౩, ౭౭౩ మంది వితంతువులు సంతానవతులగుటకు

అవకాశములులేక, సంఘజనాభివృద్ధికి సాయముచేయ లేక, కృశించి నశించిపోవుచున్నారు. ఇక మిగిలిన సంతానార్హతగల హిందూస్త్రీలు సంతానార్హతగల హిందూపురుషులకంటె ౫౦ లక్షలవఱకు తగ్గిపోయిరి. దాన ననివార్యమగు చెఱుగు మనసంఘమునకు వాటిల్లు చున్నది. భగవంతునిచే సంఘసౌభాగ్యమునకై ప్రసాదింపబడిన ౬౦ లక్షలమందిస్త్రీలు దురాచారప్రేరేపిత మన సంఘముచేనిరాకరింపబడిరి. ఈతగని యుపేక్షయే మనసంఘక్షయమునకు ముఖ్యకారణము.

స్త్రీజనాధిక్యత సంఘసౌభాగ్యమున కెట్లు తోడ్పడుచున్నదో దిగువపట్టికవలన నెఱుగనగును.

| ౨౦-౫౧ ఏండ్లమధ్యనున్న ౧౦౦౦ మంది పురుషులకు | ౧౫-౪౫ ఏండ్ల మధ్యనున్న స్త్రీలు |
|---|---|
| ముసల్మానులలో | ౧,౦౨౬ కలరు |
| క్రైస్తవులలో | ౧,౦౮౦ ,, |
| హిందువులలో | ౮౯౭ ,, |
| | (వితంతువులుకాక) |

కావుననే మన సంఘముకంటె ముసల్మాను క్రైస్తవుల సంఘము లానాటికానాటి కభివృద్ధినొందు చున్నవి.

అగ్నికి వాయువుతోడు; వితంతువివాహముల లేమికి బాల్యవివాహముల ఉనికి తోడు. ఇక సంఘమంతయు పరశురామప్రీతి. ఈ బాల్యవివాహములు మన సంఘమునకు చేయుచున్న మహోపకారము నీ దిగువ పట్టిక తెలుపును.

| వితంతువుల వయస్సు, సం॥ | ౧౯౨౧ | ౧౯౩౧ | నూటికి అభివృద్ధి |
|---|---|---|---|
| ౦-౧ | ౫౯౭ | ౧,౦౮౧ | ౮౧ |
| ౧-౨ | ౪౯౪ | ౧,౩౪౨ | ౧౭౨ |
| ౨-౩ | ౧,౨౫౭ | ౨,౬౯౫ | ౧౧౪ |
| ౩-౪ | ౨,౮౩౭ | ౭,౦౭౮ | ౧౫౦ |
| ౪-౫ | ౬,౭౦౭ | ౧౧,౪౭౧ | ౭౧ |

ఈరీతి నింకను అనేకమంది అభివృద్ధిపొందుచు న్నారు. వీరు భావిహైందవ స్త్రీ సంఘములో న్యగ్రస్థానము నాక్రమింపకుందురా? సంతానార్హతగల వయస్సు వచ్చినను, అవకాశశూన్యలై, సంఘ జనాభివృద్ధికి సాయముచేయ నోచుకొనక, పరితాపము నొందుచూ, వీరంతయూ నశించిపోవలసినదేగదా! ఇది భర్తృ వియోగినుల ప్రారబ్ధము. ఇక బాలికా, భార్యలస్థితి నరసిన మరీ ఘోరము. భారతీయవైద్యశాఖకు డైరెక్టరు జనరలగు సర్ జాన్ మేగాగారి ప్రకటన ప్రకారము మన దేశమున ప్రతి ౧,౦౦౦ మంది భార్యలుగానున్న బాలికలకును ౧౦౦ మంది గర్భభారమును వహింపలేక ప్రసవవేదనను సహింపలేక మరిణించిరి. అంతే కాక ప్రతి ఏటా ౨౦,౦౦,౦౦౦ మంది ప్రసవించి మరణించుచుండిరి.

ఇట్టి దుస్థితిలోనున్న మన సంఘమున కచిరకాలముననే ముక్తిగలుగుట అసంభవము. కావున హైందవ సంఘ శ్రేయోభిలాషు లందరును ఇకనైనను తీవ్రమైన దీక్షనుపూని బాల్యవివాహములనుమాపుమాపుచు, వితంతు వివాహములను ప్రోత్సహించుచు, క్షీణించుచున్న నిజ సంఘమును పునరుజ్జీవింపజేయుటకు ప్రయత్నింపవలెను.

ఆ. సూ. మూర్తి

---

## చిన్న కథ

[మొన్న ౨౮-౬ ౧౯౩౬ నాడు హైదరాబాదు నంబలి శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమున, 'అఖిలాంధ్ర కథకుల సమ్మేళనము' చక్కగా జరిగినది. నేటి కొలదిమంది మంచి కథకులలో పగ్గుపడిన శ్రీ నందగిరి వెంకటరావు (బి, ఏ., యల్ యల్. బి) గారు ఆ సమ్మేళనమునకు అధ్యక్షత వహించినారు. వారు తమ అధ్యక్షోపన్యాసమున చిన్న కథయొక్క విశిష్టతను, అంగాలను, వాని లక్షణాలను సోదాహరణముగా వివరించినారు. వారి ఉపన్యాసము కథలు వ్రాయుటకయి ఎంతయో యుబలాటపడు నీనాటి ఆంధ్రయువకులకు మార్గదర్శకము కాగలదు. కథాలక్షణమును తెలుపు పట్టులు దానినుండి యీక్రింద సంగ్రహింపబడినవి. కథలు వ్రాయువారు వెంకటరావుగారు వివరించిన సూత్రా

లతోపాటు కథారచనము నోటితోచెప్పి వినిపించు చున్నట్లుండవలయు నను విషయమును మనసున నుంచు కొనవలెను. ఈయర్థము దాని పేరువలననే స్పష్టమగు చున్నది. అట్లుండిననే కథ యింపుగా నుండును. అంతే కాదు; ఎల్లరకును సుబోధముగా నుండును. ఎన్ని యితర లక్షణము లమరియున్నను, ఈ లక్షణము పట్టక పోయినయెడల కథకు రంజకత్వము కలుగదు. తెలుగులో వెలువడుచున్న మంచికథ లనబడువానిలో నీలక్షణ మమరియుండునవి చాలతక్కువ. కావున నీ లక్షణము నకు ఎక్కువ ప్రాముఖ్యము నిచ్చు టవసరము. సం. భా.]

చిన్నకథఅంటే క్లుప్తీకరించిన నవలకాదు. నవల లోని ఒకప్రకరణంకూడా కాదు. నిజానికి వొకవిధంగా నవలకీ, చిన్నకథకీ సంబంధమేలేదు. నవల వొక పూర్తిజీవితంలాంటిది. చిన్నకథ జీవితంలోని వొకఘట్టం. కథలో వుండాల్సింది వొకటే అంశం. ఎన్ని సంగతిసందర్భాలు సృష్టించినా అన్నీ ఆముఖ్యమైన అంశంకింద ఆధారపడాల్సినవే. కాని ఆవొక్క అంశమే, ఆవొక్క ఘట్టమే జీవితానికంతకూ మెరుగు పెట్టేలాగు వుండాలి. తక్కిన కథంతా ఆ అంశానికి రంగుతెచ్చేట్టు అల్లుకోవాలి. ముఖ్యకథకు సంబంధించని విషయంకానీ, చివరకి వొకమాట కానీ చిన్నకథలో వుండకూడదు. ఆ ముఖ్యాంశానికి లోటు కలుగకుండా తీసివేయటానికివీలున్న వొకశబ్దంకూడా కథలోవుంటే తీసిపారేయాలి. కథా వస్తువును నిర్ణయించటం, కథ అల్లటం, పాత్రల్ని రప్పించటం, సంభావణ సృష్టించటం మొదలైన సామగ్రిని టెక్నిక్కు అంటారు.

*     *     *     *

కథ ఆరంభించటానికి ముందు కథావస్తువు (థీం) యేర్పరచుకోవాలి. అంటే దేన్నిగురించి కథరాయటం? వస్తువు యెట్లావొస్తుందని చాలమందికి ప్రశ్న. అది అంత చోద్యమైందికాదు. కావాలని మనసులో వుంటే సరి, వూరికేనే వస్తుంది. సాధారణంగా మనం వీధివెంట వెడ్తూంటే మనకు తెలీకుండానే వొక కథావస్తువు మనబుర్రలోకి వస్తుంది.

*     *     *     *

ఈలా పరిశీలించిచూస్తే చిన్న కథకీవస్తువు, కథ రెండూ ముఖ్యాంగా లనితేలింది. కాని యీ రెంటిలో కథకే యెక్కువప్రాముఖ్యత యివ్వాలి.వస్తువు ఆట్టే గొప్పదికాకున్నా కథని నైపుణ్యంతో అల్లితే ఆచిన్నకథ మనోహరంగా వుండితీర్తుంది. అట్లాకాక వస్తువుకి యెక్కువ ప్రాముఖ్యత యిచ్చి కథవిషయంలో అశ్రద్ధచేస్తే అదో చిన్నకథకాక ధర్మోపన్యాసంగా తేల్తుంది. యివ్వాళ్లరేపు హరిజన సమస్య, స్త్రీవిద్య, స్వదేశీఉద్యమం, స్త్రీలఆర్థిక సమస్య యిటువంటి వస్తువులతో వస్తోవున్న కథల్తోవస్తువుకు దగినకథ లేకపోబట్టే అవి మనల్ని విసిగిస్తాయి, కేవలం ఉపదేశకమైనవి అని అవలపడేస్తాం. వ్యాసాలు రాస్తే చదవరని చిన్నకథయెడం దభిమానమున్న జనసామాన్యాన్ని మోసగించడానికి పన్నినపన్నాగం; చంటిపిల్లవాడు మందుతాగకపోతే చక్కెరలో మందుకలిపి మందుకాదు చక్కెర అని బుజ్జగించి తాగించినట్లు. అట్లాకలిపితే పసివాడు చక్కెరలో మందు కలిపారని తెలిసికోకుండావుండాలి. కాస్త అశ్రద్ధగా కలపడం వల్ల వొక్కసారి తెలిసికోగలిగాడా వాడూ మందు యెట్లాగూ తాగడు.చక్కెర అంటేగూడ నిరసించడం ఆరంభిస్తాడు. ఇట్లాంటి మేళనంవల్ల కళకి అపకారం జరుగుతుంది. దీనినే కళని వ్యభిచరింపజేయటం అంటారు. కాబట్టి కొత్తగా రాసేవాళ్లు కథావస్తువుకి యెక్కువ ప్రాముఖ్యంయివ్వక కథలనే మంచివాటిని అల్లుకోవాలి.

*     *     *     *

ఎంతమంచిదైనా యెప్పుడూ వొక్కటే అయితే విసుగేస్తుంది. కొత్తకోరటం మానవనైజం కాబట్టి కథావస్తువుని కాస్త మారుస్తూవుండాలి. అట్లా అంటే చిన్నకథల్లోంచి స్త్రీపురుష ప్రేమగాథల్ని తరిమేయ మనటంలేదు. దాన్ని వీలున్నట్టల్లా యెప్పటికప్పుడు కొత్తరూపంలో పెట్టాలి. కాని చిన్నకథల్లోంచి ప్రణయాన్ని నెట్టేశామా యీకథలుగూడా దేవతార్చనల్లోకి యెక్కుతాయి. మన వాఙ్మయంలో అపరాధ పరిశోధక చిన్నకథలు ఆట్టేలేవు. వీటిని

యెంతో తేలికగా అల్లవొచ్చు. జనసామాన్యాన్ని బాగా ఆకర్షిస్తాయి. అయితే చదువుకున్న వాళ్లనిగూడ ఆకర్షించాలంటే దీంట్లో ప్రణయగాథగూడ మేళవించాలి. ఎడ్గారువాలేసు అట్లాగే చేస్తాడు. అపరాధ పరిశోధక కథలేకాక సాహసకృత్యాల కథలుగూడ మన వాఙ్మయంలో లేవు. పెద్దపులులు మొదలైన అడివిజంతువులని వేటాడడానికి వెళ్లడం, అక్కడేదో తటస్థపడటం వస్తువుగా తీసికోవచ్చు. ఈకథావస్తువుతో కథఅల్లితే చాలకొత్తదనం వస్తుంది. ఇంపు పుడ్తుంది. కథకులకి ఒక ఆదర్శం యెపుడూ యెదురుగా వుండాలి. అది ప్రజాభిరుచి. దీన్ని యెప్పుడూ మరవకూడదు. అయితే ఒకటి రెండు అట్టికథలు కథయేమాత్రం లేకుండా కూడా ప్రసిద్ధికివచ్చినవి వున్నాయి. చాలయింపుగా వుంటాయి. వాటిలో దృశ్యాలవర్ణనమాత్రం వుంటుంది. ఆవర్ణనే భావంధ్వనించేమాటలతో వర్ణిస్తారు. ఇట్లాంటివాటిని చిన్నకథ అనటంకన్న కవిత్వం అనటం యెక్కువ సమంజసం.

* * * *

ఈకథావస్తువుని చర్చించే అప్పుడు 'క్లైమాక్సు'ని గురించి కొంచెం గమనించాలి. అంటే ధనుస్సుయొక్క నారిని మెల్లమెల్లగా బలంకొద్దీ లాగి వొక్కసారిగా వదలటం, వుయ్యాల్ని వొహవేపుసాధ్యమైనంత వరకులాగి వొక్కసారిగా విడచిపెట్టడం, మనిషి ఉద్రేకాన్ని క్రమంగా రేకెత్తించి వొక్కసారిగా తృప్తి నివ్వటం చిన్నకథలోయీ 'క్లైమాక్సు' చివరభాగంలో వుండాలి. 'క్లైమాక్సు' తర్వాత కథ ఆగిపోవాలి. ఏమాత్రం ముందుకి జరుగకూడదు.... చిన్నకథలో కథ యెంత ముఖ్యమో, క్లైమాక్సుగూడ అంతేముఖ్యము.

కథ తర్వాత పాత్రపోషణ గమనించదగిన అంశం. చిన్నకథలో సాధ్యమైనంతవరకు తక్కువ పాత్రలని సృష్టించాలి. ఎందుకంటె వాళ్లపరిచయం చివరవరకూ కాపాడుకోలేక పాఠకుడు కంగారుపడతాడు. కథచదివే అప్పుడు యేమాత్రమైనా ఆయాసం కలిగింస్తా, ఆకథంతా వ్యర్థమౌతుంది. వొహచిన్న కథలో మూడుపాత్రలుండటం సాధారణం. అట్లా అని కథాభాగానికి లోటు కలిగించకూడదు. పాత్రల యొక్క స్వభావం చెప్పడం రెండు తరహాలు. వొహటి వర్ణించడం. 'ఆమె మిక్కిలి దయార్ద్ర హృదయ. ఏచిన్న జంతువునైనా బాధతో చూస్తే ఆమెహృదయం దహించుకొపోతుంది' ఇట్లాంటిది రెండో పద్ధతి సూచించటం. ఆస్వభావాన్నే కథాసందర్భంలో యీలా సూచించవొచ్చు. 'ఆ అబ్బాయిచేతిలో వున్న బెత్తంతో కుక్కను కొట్టాడు. అది కెవ్వుమనటంతోటే ఆమె పరుగెత్తుకోవచ్చి కుక్కను యెత్తుకుంది.' ఈ రెండుపద్ధతుల్లో తరువాతి పద్ధతే శ్రేష్ఠమైంది. మన జీవితంలో చూడండి, వొహవ్యక్తిని గురించి యింకొకరు చెప్పినమాటలు వినడంకన్న మనమే ఆ వ్యక్తినిచూసి, ఆతని నడవడినిచూసి, ఆతని స్వభావం నిర్ణయించుకోవటం సహజంగా వుత్తమంగా భావిస్తాం. కాబట్టి సూచనపద్ధతే కథకులు అవలంబించాలి. అయితే పాత్రల యొక్క శరీరాకృతిని చెప్పేటప్పుడు సూచనపద్ధతిని ఉపయోగించటం అంతగా తృప్తికరంగా వుండదు. అందుచేత వర్ణించవచ్చునుకాని ఆ వర్ణనకూడా సహజంగా వుండాలి.

* * * *

వర్ణనని చదువుతోవుంటే పాఠకుడు ఆ స్త్రీని చూస్తోవుండాలి. కథ చదువుతున్నాననే విషయమే మరచి, అంటే అంత సహజంగా వుండాలి. 'ఆమె కొంచెం పొట్టిది. కొంచెంగూని. ఎడమకన్ను కొంచెం చిన్నది. మాట్లాడినప్పుడు మూతి కొంచెం కుడివేపు తిరుగుతుంది.' ఈలా పాత్రోచితంగా వర్ణించటం మంచిపద్ధతి.

పాత్రలనుగురించే కాక కథారంగాన్ని గూడ వర్ణించాల్సివస్తుంది. అప్పుడు కథకుడు అక్కడి పాత్రలతో తాను ప్రవేశించి ఆరంగాన్ని చూస్తో వున్నది వున్నట్లు వర్ణించాలి. వొహవ్యక్తి వొహగదిలోకి ప్రవేశించా డనుకోండి. ప్రవేశించటంతోటే ఆగదిలో వున్న ముఖ్యమైనవస్తువులు ఆతనిదృష్టిని ఆకర్షించడం సహజం. వాటినే ఆతనుచూసే పద్ధతినిబట్టి వొహటితర్వాత వొహటి వర్ణించాలి. అంతేకాని పెట్టెల్లోవున్న వాటనీ, అల్మారాలో వున్నవాటినీ వర్ణించకూడదు. అట్లాగే

వర్ణించేప్పుడు క్రమంగా వర్ణించాలి. కాని నాలుగు వస్తువుల్ని వర్ణించినతర్వాత మళ్లీ మొదటిదానిదగ్గిరికి వెళ్లగూడదు.

* * * *

పాత్రల్ని సంభాషణలోకి దింపినప్పుడుకూడా కథకుడు ప్రతిపాత్రలో లీనమై అడుగడుక్కీ యిది సహజమా, కాదా అని ప్రశ్నించుకోవాలి. ఎంతో జాగ్రత్త తీసికోంటేతప్ప సంభాషణల్లో అవకతవకలు పడుతాయి. పాత్రలు మాట్లాడే భాషకూడా పాఠకుడికి అర్థమయ్యేటట్టువుండి, సాధ్యమైనంతవరకూ ఆపాత్రకి ఔచిత్యం కలుగజేయాలి. ఈసంభాషణలు దీర్ఘంగావుండకూడదు. కొందరు కేవల సంభాషణలతోనే ౧౫-౨౦ పేజీల కథరాస్తారు. ఇట్లాంటిది విసుగ్గావుంటుంది. కాస్తచదివింతర్వాత యెవరంటోవున్నదికూడా తెలియదు. కథాసందర్భంలో వర్ణించాల్సివచ్చిన చెట్టూ చేమల్నికూడా 'అదుగో నిండాపూసిన ఆమామిడిగున్న మీద కోయిల కూచుంది చూశావా?' అని పాత్రలనోటితో వర్ణింపచేస్తారు. అట్లాంటికథ—అది కథాకాదూ, నాటకంకాదూ, ఏమీకాదూ. అయితే కథయేమీ లేనప్పుడు సంభాషణపద్ధతిలో వ్రాయటంబాగుంది.

* * * *

కథలకు భాష ముఖ్యమైన అంగం. అది చాల సాఫుగా మృదువుగా వుండాలి. ఏమాటైనా వాడే అప్పుడు అది వీలైనంతమట్టుకు పాఠకులకు బాగాతెలుస్తుందా లేదా అని ప్రశ్నించుకోవాలి. దానికన్న యెక్కువగా వాడుకలో వున్నశబ్దం అదే అర్థం యిచ్చేది యింకేదైనా వుంటే దాన్ని వాడాలి. తాము బాగను కొన్నసంస్కృత సమాసాలూ, శబ్దజాలమూ కథలో గుప్పివిడిస్తే బాగుంటుందని కొందరి అభిప్రాయం. అట్లాంటి సమాసాలూ, శబ్దాలూ వాడటానికే కథ అంటూ వొహటి వ్రాస్తారు. ఇది చాలపొరబాటు. కథలోని సారస్యమే పోతుంది. చదివే అప్పుడు పాఠకుడు ఆ ఘట్టాన్నంతా స్వయంగా అనుభవిస్తూ వున్నట్టు భావన చేయాలి కాని యెక్కడా కూడా తాను చదువుతోన్నది వొహకల్పిత కథ అని జ్ఞాపకంరాకూడదు. ఇదే చిన్నకథకుల లక్ష్యం. ఈ విషయం కథకులెప్పుడూ మరవకూడదు. భాష కృతకమైనదిగాక వాడుకభాష గావాలని యిప్పుడు వేరుగా చెప్పాల్సిన అవసరంలేదు. అయితే అచ్చం మనము వాడుకునేఅట్టి కుదింపులతో రాస్తే పాఠకుడు సాఫుగా చదువుకోలేడు. పాఠకునికి చీకాకు కలుగకుండా చేయడమే కథకుని ఆదర్శం కాబట్టి యిట్లాంటి కుదింపులు విడకీసి రాయటమే వుత్తమమైన పద్ధతి.

* * * *

భాషేకాక శైలి అంటో కూడా వొహటివుంటుంది. అంటే రచనాపద్ధతి. తాను చెప్పదలచుకొన్నభావాన్ని సూటిగా చెప్పటం కథకుడు యెట్లా వూహిస్తాడో అట్లాగే కొద్దిపాటి మాటలతో పాఠకుడి దృష్టికి ఆనాలి. ఆతని హృదయాన్ని కదల్చాలి.

* * * *

చిన్నకథకి అవుసరమైన ముఖ్యాంగాల్ని వొహటి తర్వాత వొహటి పరిశీలించాము. అంటే కథావస్తువూ, కథాక్రమమూ, క్లయిమాక్సు, పాత్రలు, సంభాషణ, శైలి. యివి చిన్నకథ అంగాలు వీటన్నిటిలో కథాభాగం చిన్నకథకు ఆయువుపట్టని మళ్లీ చెప్ప సాహసిస్తాను. కథ పాఠకులని కదలనీయకుండా వుంటే తక్కినయెన్ని లోపాలున్నా కమ్ముకోపోతాయి. పైన సూచించిన చిన్నకథయొక్క అంగాలని కాస్త దృష్టిలో వుంచుకొని పేరుపడసిన కథకుల రచనల్ని కొన్నింటిని చదివితే కథారచన బాగా పట్టుపడుతుంది. భాషలో కుదింపులు మొదలైనవాటిలో, శైలిలో తొలుత కాస్త లోపాలు అవుపడ్డా నాలుగైదు కథలు రాయటంతోటే సాఫైపోతాయి.

కథారచనకోసం కూచోకపూర్వం ఆచిన్నకథని సాంతంగా మనసులో తయారుచేసుకోవాలి. అట్లా సిద్ధంచేసుకొన్నతర్వాత కూర్చుంటే కలం వేగంగా నడుస్తుంది. చిన్నకథనురాస్తేఅప్పుడు వొక్కరోజే దాన్ని ముగించివేయడం ఆదర్శంగా పెట్టుకోవాలి. ఎందుకూ అంటే కథకుడు తాను రచించేకథ వాతావరణంలో ప్రవేశించాక మధ్యనే బయటకి వచ్చేస్తే మళ్లీ

అదే వాతావరణం కల్పించుకోవటం కష్టమవుతుంది. అందువల్ల పాత్రలని చక్కగా నడిపించడంలో లోపం కలుగుతుంది.

* * * *

విదేశాల్లో సుప్రసిద్ధులైనవాళ్ల ఉత్తమ కథలను చదివినప్పుడు అట్లాటికథలు మనభాషలో లేక పోయెనే అనిపిస్తుంది. ఇట్లా అనిపించినప్పుడే ఆకథలని మనభాషలోకి తర్జుమాచేయడమో, లేక నాటి ననుకరించి కొత్తవాటిని రాయటమో తటస్థిస్తుంది. ఇప్పుడు చాలమంది యితరులు రాసిన కథలని వున్నదున్నట్లు తెనుగుచేసో, లేక అక్కడక్కడ మార్పులుచేసి తెనుగులోరాసో తమపేరుతో ప్రకటించుకోటం జరుగుతోంది. దీన్నే గ్రంథచౌర్యంఅంటారు. ఇది మోసమనిపించుకుంటుంది. భాషాంతరీకరణం చేసినప్పుడుకాని, అనుకరించినప్పుడుకాని ఆవిషయం తెలుపుతో ఆ కథకుడిపేరు యివ్వటం విధి. ఇతర వాఙ్మయాల్లోని కథలని తెనుగులోకి దిగుమతిచేయటం యెంతోఅవసరం. రష్యన్, ఫ్రెంచి, జపాన్ మొదలైన దేశాల సుప్రసిద్ధ కథలని వేరు వేరు సంపుటాలుగా మనభాషలో ప్రకటిస్తే మనకథావాఙ్మయం యెంతో వృద్ధిపొందుతుంది. అయితే కాపీరైటు విషయంలో జంకుతారు చాలమంది. యితరదేశాల్లో ప్రకటింపబడ్డ కథలని యథేచ్ఛగా మనం తర్జుమా చేసుకొని ప్రకటించుకోవచ్చును. ఇతర దేశాల్లోని కాపీరైటు మనదేశంలో ఆటంకపరచదు న్యాయశాస్త్రం ప్రకారం అయితే నీతినీ, మర్యాదనీ గమనించి ఆయా కథకుల పేళ్లు నివ్వకతప్పదు.

---

## స్త్రీ పురుషుడి భావాలను....బ్రాడుకాస్టు చేసే యంత్రము

[శ్రీ వెంకట్రావుగారు పై యధ్యక్షోపన్యాసము నందే చివర అప్రసక్తముగా స్త్రీలనుగురించి యీ క్రింద నుదహరించిన కొన్ని మాటలను చెప్పినారు. ఉపన్యాసవస్తువు కథావిషయము: కథలను రచించు విషయమున పాటించవలసిన సూత్రములు స్త్రీలకును, పురుషులకును సమానములే. వానిని సరిగా పాటింప చేతగానివారు ఉభయుల రచనములు పరికిమాలినవే యగును. కాబట్టి కథారచనము విషయమున ఇట్లు స్త్రీల అశక్తతను ప్రత్యేకముగా ప్రకటించవలసిన యావశ్యకత లేదు. కథకులమని యుబ్బి తబ్బిబ్బులగుచున్న పురుషులలో ననేకులు కథలువ్రాయ నశక్తులనబడు కొలదిమంది స్త్రీలకంటె నధములుగ నున్నారు. నకళ్లు తయారుచేయుటయందును పురుషులే సిద్ధహస్తులు. వాస్తవమునకు కథలు కల్పించుట యందును చెప్పుటయందును స్త్రీలకుగల నేర్పు పురుషులకు లేదనవలెను.

స్త్రీల యీనాటి-కాదు, ఏనాటి- అశక్తతకు ఆదినుండియు కారణభూతులయిన వారు పురుషులే. వారి స్వార్థపరత స్త్రీలశక్తిని రూపుమాపివేసినది. స్త్రీలకు సంస్కారమును పడయుటకు తగిన అవకాశములను కల్పించుట కేనాటి పురుషులకును గిట్టుటలేదు. ఇక స్త్రీలశక్తులు కాకపోవుటెట్లు? అన్నింటను అశక్తులే. పురుషులు స్వయంకృతాపరాధమును కప్పిపుచ్చుకొనుటకయి స్త్రీల యశక్తతను తరచు ప్రకటించుట కలవాటుపడిపోయినారు.

స్త్రీల కందువలన సంస్కారము లేకపోవచ్చును కాని సాహసము లేదనుట పొరపాటు. అసలు స్త్రీలలో సహజముగా నిండియున్న శక్తి సాహసమే. అది కేవలము మానసికము. దాని పరిమితిని గుర్తించిన పురుషుడు ఇంకను పుట్టలేదు, గుర్తించితినని ఎవ్వడేనినన నది ప్రగల్భవచనము. వారి యాసాహసము సంస్కారము లేమిని కొంత కొరవడినదగును. కాని స్త్రీల ఈస్థితికి కారకులయిన పురుషులు, యథార్థకథనమును పేరున స్త్రీల నవహేళనము పాలుచేయుట సాహస మనక తప్పదు. సం. భా.]

స్త్రీ మనదేశంలోని మారుపల్లెల్లో వుంటనీ, న్యూయార్కులో నింగినంటే సౌధాగ్రభాగాలపైగా యెగిరిపోతో వుండనీ ఆమె స్త్రీయే. ఆమె యెప్పుడూ పురుషుడి భావాలని మృదుమధురంగా బ్రాడుకాస్టుచేసే యంత్రం. స్త్రీ అనే శబ్దానికి నాకుస్ఫురించే అర్థం

అంతే. నేనిల్లా అనటం యీఇరవై యో శతాబ్దపు 'షివల్రీ'కి లోపం అని తెలుసు. కాని సత్యాన్ని గౌరవించేవాళ్లంతా నన్ను మన్నిస్తారు. స్త్రీల భావాలలో, ఆలోచనలలో, తలంపులలో ధైర్యసాహసాలకోసం వెతికి వెతికి విసుగడంచాత యింత కఠినంగా అనాల్సివచ్చింది. పాశ్చాత్య స్త్రీల ధైర్యసాహసాల గురించి పురుషులు అనేక పుస్తకాలు వ్రాశారు. కాని అవి కేవలం ఆమెని పొగడిపోసి తనకి ప్రసన్నురాలిని చేసికోవటానికి తప్ప వేరుకాదు. ప్రపంచంలో సంఘాన్ని తారుమారుచేసిన వాళ్లలో స్త్రీ లెందరో ఆలోచించండి. పుస్తకాలు వ్రాసేవాళ్లలోకూడ యెప్పుడూ వరవళ్లుదిద్దడం తప్ప స్వతంత్రంగా నూతన భావాల్ని మెరిపించినవాళ్లెంత మంది? ఏ స్త్రీయైనా వున్నమతాన్ని మార్చి కొత్త మతం యిచ్చిందా? ఇంతెందుకు? స్త్రీ తను దాస్యంలో వున్నాననికూడా పురుషుడు చెప్పేవరకు తెలిసికోలేదు. వాఙ్మయంలో మాత్రం స్త్రీ స్త్రీగాక యేమవుతుంది మరి? ఏదో పురుషుడు బాగున్నవన్న పది చదవటం, ఆపదింట్లో వోహానికి నకలు తయారుచేయటం. యెప్పటికీ యింతే. అందుకనే స్త్రీలు రాసేవి చదవాలంటే పెద్దబాధ. జీతంలేని కొలువు. పరదేశంవాళ్లు రాసిన అందమైన కథల్లోకూడా కలకాలం వుండి పోయే కథ స్త్రీరాసింది వోహటీ లేదు. ఎందుకంటే మంచి కథకుడు కావాలంటే ప్రపంచంలో వున్న యెటువంటి అభిప్రాయానికైనా యెదురు తిరగటానికి సాహసం కావాలి ఇహ స్త్రీలకటువంటి గుండె నిబ్బరమే అపురూపవస్తువుగా పురుషుడు దాచిపెట్టుకునే ఆంధ్ర నారీమణుల గురించా? ఏంచెప్పాలి! గృహలక్ష్మిలో తరుచుగానూ, భారతిలో అప్పుడప్పుడూ వీళ్లువ్రాసే కథలు వస్తూవున్నాయి. సరే రోజూ పత్రికలలో వచ్చే ధర్మోపన్యాసాలని వస్తువుగా తీసికొన్న కాస్తయినా కథను కల్పించడానికి నారీమణులు ప్రయత్నించాలని మనవి. అయినప్పటికీ అప్పుడప్పుడూ కొందరి కథకురాండ్ర రచనలు ఆశాజనకంగా కనిపిస్తోవున్నాయి.

---

## స్త్రీ విద్యాభివృద్ధి

## స్త్రీ పురుషసమాన స్వాతంత్ర్యము

[మొన్నటి (౨౯-౮-౩౮) మద్రాసు విశ్వవిద్యాలయ పట్ట ప్రదాన సభలో మహామహోపాధ్యాయ, విద్యావాచస్పతి, యస్. కుప్పుస్వామిశాస్త్రి (యం.ఏ.) గారు స్నాతక హితోపన్యాసము నిచ్చినారు. అందు వారు పేర్కొనిన వివిధ విషయములలో 'స్త్రీవిద్యాభివృద్ధి, స్త్రీపురుష సమాన స్వాతంత్ర్యము'ను గూర్చి చెప్పినమాటలు గమనింపదగినవి. వానిలో కేవలము విశ్వాస బలముపయి నాధారపడిన యొకటి రెండంశములు తప్ప తక్కినవి విశ్వమానవ కళ్యాణమున కీకాలమున మిక్కిలిగా పాటింపవలసినవి. దేశకాలములను, అభిరుచులను అనుసరించి కలుగు మార్పులయినను విశ్వమానవ కల్యాణ సంధాయకములు కావలయును గాని, తద్విపరీతములు కాగూడదని తజ్ఞులగువారు గ్రహింపక పోరు. సం. భా.]

స్త్రీలు విద్యావంతురాండ్రయి, స్వతంత్రముగా ఉద్యోగములు చేసి ధనమును ఆర్జింపగల్గుదురు. అట్టి ఆర్థిక స్వాతంత్ర్యము వారికి యీ వైదుష్యము వల్ల లభించినది. వారు పురుషులతో సమాన ప్రపత్తిని కలవారై యుండగలరు. పురుషులవలె ఆట పాటలయందును స్వేచ్ఛగా ప్రవర్తించుటకు సరిసమానమై సమర్థురాండ్రు అగుచున్నారు. సంఘములలోను, సంసారములలోను పురుషుల కొకవిధమగు నీతినియమములును, స్త్రీలకు మరొకవిధమగు నీతినియమములును ఎందుచేత పరస్పరవిరుద్ధముగా నుండవలె నని విద్యావంతురాండ్రయిన స్త్రీలు ధిక్కరింపనేర్తురు.

ఈ స్త్రీ పురుష స్వాతంత్ర్యవిషయము చాలా సునిశితమైన విషయము. స్త్రీలకు శ్రేయస్కరములైన విషయములలో వారి కెక్కువ స్వేచ్ఛనొసంగుటయును, అనర్థకరమైన విషయములలో పురుషులకు స్త్రీలపైగల అధికార స్వాతంత్ర్యములను తగ్గించుటయును, స్త్రీ పురుష సమాన ప్రతిపత్తిని కల్పించుటకు సవ్యమైన మార్గముగా నుండును.— భారతదేశముయొక్క పూర్వ

విజ్ఞాన సంస్కారము ననుసరించి చూచిన యెడల, కుటుంబజీవితమే సంఘజీవితమునకు ప్రాతిపదిక. సంసారజీవితమునకు వివాహ ధర్మమే పరమపవిత్రమైన మూలబీజము కనుక, యీ పవిత్రార్య గృహస్థధర్మములను విద్యావంతురాండ్రయిన యువతులు మరచియుండుట గాని, నిర్లక్ష్యము చేయుటగాని తటస్థించేయెడల, అది భారతదేశమునకు అరిష్టమే యగును. గృహిణి యనగా ఇంటికిరాణి. కాబట్టి మన దేశములోచేరు విశ్వవిద్యాలయము నందు విద్యావంతురాండ్రగు స్త్రీలందరును పాశ్చాత్య గృహస్థధర్మములయందు లీనము కాకుండ భారతశాస్త్రసమ్మతమైన గృహస్థ ధర్మములనే, పెంపొందింప గోరెదను. విద్యా సంస్కారము వల్ల రామచంద్రుడు, నలుడు, మున్నగు మహావీరులు పురుషులలో సులభముగా ఆవిష్కరించునట్లు చేయవచ్చును. కాని విద్యావంతురాండ్రయిన యువతులు ఆధునిక పరిస్థితులలో స్వేచ్ఛ స్వాతంత్ర్యము కలిగినప్పుడు సీత, దమయంతి, మైత్రేయి వలె సుగుణశీలము గలిగి ధర్మపత్నులై గృహిణులయందుండవలె జ్ఞానవతులు తయారగుట కష్టసాధ్యముగా కన్పించు చున్నది. విద్యావంతురాండ్రయిన వీరివల్లనే దేశములోని స్త్రీలందరును విద్యాభివృద్ధి నెరుగవలసి యున్నది. గృహస్థ ధర్మమును గృహనిర్వహణ బాధ్యతలును స్త్రీకి భగవన్నిర్ణయ ప్రకారమే ఏర్పడియున్నది. అట్టిగార్హస్థ్య ధర్మముల యెడలగాని, కుటుంబపోషణము నందుగాని, పిల్లలతల్లి యగుటకు గాని, స్త్రీల కనిష్టముగాని, విముఖత్వము గాని కలుగకూడదు. అర్ధనారీశ్వర స్వరూపములో పార్వతీ పరమేశ్వరు లేప్రకారముగా లీనమైయున్నారో గ్రహించినయెడల, స్త్రీపురుషుల భిన్నతత్వములు ఏప్రకారముగా సంసారయాత్రకు లీనముకావలెనో బోధపడును. హృదయమార్దవ సౌకుమార్యములకును వీర్యశౌర్యములకును సమన్వయ మెట్లుండునో గ్రహించవలెనంటే, రసాత్మకమైన కళాభిరుచికిని, తర్కవాదబద్ధమైన శాస్త్రమునకును సమన్వయమెట్టిదో గ్రహించవలెనంటే, ఆత్మసమర్పణము నకును ఆత్మవశీకరణము నకును సామరస్యమెట్లుండవలెనో గ్రహించవలెనంటే, సతీపతుల సాహచర్యముగాని, అవినాభావ సంబంధము ఎట్లుండవలెనో గ్రహించవలెనంటే అర్ధనారీశ్వర మూర్తినే ఉపాసింపవలెను. దానిసాంకేతిక పరమార్థమునే అవగాహనము చేసికోవలెను. మాతృత్వము స్త్రీధర్మము. పితృత్వము పురుషధర్మము బిడ్డలతల్లియై యింటికి యిల్లాలై వివేకపరురాలై విశుద్ధగుణశీలముతో ప్రవర్తింప నేర్చుట స్త్రీధర్మమైయున్నది. స్త్రీలట్టిసంసార ధర్మములను నిర్వహింపగల నేర్పరులగుటకు కావలసిన విద్యావికాసము ఉండవలెను. స్త్రీవిద్యావిధానము తదనుగుణముగా నుండవలెను. స్త్రీవిద్యా విధానమెట్లుండవలెనో ఆనీబీసెంటమ్మ మున్నొకసారి ముత్యముల వంటి మాటలలో యుక్తసరిగా చెప్పియుండెను.

"తెలుగుగాని, అరవముగాని మరే మాతృభాషగాని చక్కగా నేర్చియుండవలెను. అట్టి మాతృభాషయందు మంచి సాహిత్యజ్ఞానమును పొంది స్వయముగా స్వభాషలో మంచికావ్యముగాని, గద్యరచనగాని చేయగల నేర్పును గడింపవలెను. తన భర్తయును, తన అన్నదమ్ములును ఆంగ్లవిద్యాధికులగుటచేత వారితో తాను సమానముగా విషయములను గ్రహించి సంప్రతించుటకు సమర్థురాలు కావలెను. కనుక ఇంగ్లీషులో వ్యావహారిక భాషాజ్ఞానమునైనను కలిసి యుండవలెను, ప్రాపంచిక పరివర్తనములన్నియు ఆంగ్లభాషయందే వెలువడుచున్నవి. గనుకను లౌక్యరంగమందు ఆంగ్లభాషకే ప్రాధాన్యముకలదు. గనుకను ఆమె ఇంగ్లీషులో చదువను వ్రాయను నేర్చియుండవలెను. ఆమె తన బిడ్డలను పోషింపగల్గుటకును కొలదిగా వైద్యవిషయములను నేర్చి ఇంటిని శుచిగా శుభ్రముగా నుంచగల్గుటకై ఆరోగ్య మార్గములను గ్రహించియుండవలెను. మనోరంజకమైన మంచివ్యాపక మొకటియుండవలెను. గనుక సంగీతముగాని కుట్టుపనిగాని, చిత్రలేఖనముగాని, ఏదయిన నొక కళయందు అభిరుచిగలిగి ఆవిషయమునందాశక్తి ప్రావీణ్యపవలెను. మనదేశముయొక్క పూర్వవిజ్ఞాన సంస్కారప్రభావమంతయును సంస్కృత గ్రంథములలో ఇమిడియున్నది. గనుక, సంస్కృత కావ్యములను చదవనేర్చి సాహిత్యజ్ఞానమును సంపాదింపవలెను. చిత్తశాంతి

కరమైన భగవద్భక్తిని అలవరుచుటకై మతవిషయకమైన విద్యాబోధ చాలా అగత్యమని వేరుగా వచింపబనిలేదు. ఇట్టి విద్యావసరములనుగుర్తించిన విద్యావిధానమే యీ దేశపు స్త్రీలకు సర్వసామాన్యముగా కావలసినదై యున్నది. తొల్లింటి భారత నారీమణుల సుగుణశీల సంపద నేటికిని మన స్త్రీలలో నిలిచియున్నది. కాని, తొల్లింటి భారత నారీమణుల విజ్ఞానవివేకసంపద తిరిగి నేటి భారతదేశ స్త్రీలకు లభింపజేయవలెను. అట్టిచో గృహమునకు గృహిణి రాణియై రాణించును.

---

## తాటిచెట్టు : అన్నపురాశి

తాటిచెట్టు నిజముగా అన్నపురాశి; మనుజులకు, పశువులకు, పక్షులకు కన్నతల్లి అది అన్నపూర్ణ. దాని పండును పరిశోధనచేయించితిని. ఆపండురసములో నూటికి ౬౭ వంతున నీరుగలదు. కొంతపీచుగలదు. మిగిలినది సుమారు ౩౦ శతాంశములు చక్కని ఆహార మాంసకృత్తులు, మధువు, పిండిపదార్థము, భాస్వరము మొదలగు ఖనిజములు గలవు. ఒక్కపండు సామాన్యముగా వీశెడు తూగును. అందులో కనీసము శేరు ౧ ఆహారముకలదు. ఒక్కొక్క ఏడు ఒక్కచెట్టు కనీసము ౨౦౦ పండ్లనిచ్చును. ఈ పండ్లలో ౨ రైల్వే మణుగుల ఆహారమువచ్చును. చిన్నబస్తా బియ్యమునకు సరిపోవును. అనగా ౭, ౮ రూపాయల విలువగల ఆహారపదార్థముకలదు. ఈపండ్లరసము మనుజులు తినక పశువులకు పెట్టినయెడల ౨, ౩ రూపాయల విలువగల చిట్టుతవుడుకు సరిపోవును. పాడిగొడ్లయినచో పాలు, వెన్నలో కలిసివచ్చును. ఇతరగొడ్లకు అంత కిమ్మతుగల బలమునిచ్చును.

ఆఋతువులోనే వాడుకొనక ఈ పండ్ల రసమును నిల్వచేయవచ్చును. తాటిచాప మామూలుపద్ధతి. అది ఆరుటకు ఎండ కావలెను. వాన కురియుచో అది సాగదు. పశువులకై నిల్వబెట్టదలచువారు చిట్టుతవుడుతోగలిపి గాలికి ఇంట్లో ఆరబెట్టి, గంపలో నిల్వచేయనగును. మనుజులకై నిల్వచేయదలచినవారు గోధుమపిండితో, సజ్జపిండితో, వరిపిండితో బిస్కట్లు, రొట్టెలు, అప్పడాలు, పూరీలు, బజ్జీలు చేయవచ్చును. నేతిలో, నూనెలో వండవచ్చును. గోధుమపిండి, పేశము కొంచెము సోడా కొద్దిగాఆరెపువ్వు కలిపి ముద్దచేసి మర్దన చేసి, పొరలరొట్టెగాచేసి, ఇసుకమీదగాని, మామూలు పెనముమీదగాని బిస్కట్లు చేయవచ్చును. ఈబిస్కట్లు పుష్టినిచ్చును. జీర్ణకారి. ఈ పండురసములో శనగలు నానపోసి నిల్వచేయవచ్చును. ఒక్కొక పండకు మూడు విత్తనాలు ఉండును. మూటిని పాతిరవేసిన, మూడు తేగలువచ్చును. మూడుతేగలు కాని. కానితేగలకల్ల 3 రూపాయలు ఆదా వచ్చును. ఈ తేగలు కాల్చి తిన వచ్చును. లేదా, తరిగి ఎండబెట్టి పొడిగొట్టి జల్లించి ఆరెపువ్వుతో కలిపి నిల్వచేయవచ్చును. ఈ పిండి జావ కాచి, ఉప్పుమజ్జిగలో కలిపి పుచ్చుకొనవచ్చును. వేసంగిలో మేహశాంతిచేయును. విరోచనకారి. తేగతీసిన పిమ్మట బుర్రలో గుజ్జు మిగులును. కొబ్బరికాయలో కొబ్బరి పూర్ణమవుడు ఎట్టి రుచిగలదో అట్టిరుచి ఆ గుజ్జులో కలదు. కొందరు ముంజలనే వాడుదురు. ముంజనీరును మేహశాంతియే పూర్తి వాడినవారికి పండు దొరకదు. ముంజ వాడితే ముప్పిరిగొన్నతిండి మాయమగును. ఈ తాటిచెట్టు అక్టోబరు మొదలు మే నెల ఆఖరుదాక ఎనిమిదినెలలలో కల్లు నిచ్చును. దానిని బెల్లముగా, కలకండగా, పంచదారగా మార్చవచ్చును. అన్నిఖర్చులుపోను 3 రూపాయ, ఖరీదుగల బెల్లము వచ్చును. ఈ తీయకల్లు పోతుతాళ్లనుంచిగూడ వచ్చును. తాటిబెల్లం, కలకండ మిక్కిలి మంచి మందులు. బాలింతరాళ్లకు వాడు తాటిబెల్లం వీశె ౧ కి రూపాయి వరకు ఖరీదు గలదు.

తాటిపండ్లలోని పీచువగయిరాలు భూమికి ఎరువు. తాటిబుర్ర మంచిసెగ నిచ్చును. తాటిఆకు, కమ్మ, గులక, చట్లు, నార, ఈనెలు, పీచు ఇతర త్రాడబ్బు ఇచ్చును; వినియోగపడును.

౧౧, ౧౨ రూపాయలు విలువగల ఆహారము నిచ్చెడి తాటిచెట్టు కల్పతరువుగాదే? దానిని దుర్వినియోగముచేసి త్రాగి, మత్తెక్కి, పడిపోవుట దురదృష్టము, పాపము.

తాటి ఆహారమును బీదలేగాక, ధనికులును వాడవచ్చును. ఖరీదు లేదని గర్హించ నక్కరలేదు. అందులోనున్న గుణగణములను ప్రభుత్వము పరిశోధనచేయించవచ్చును. మంచి సువాసన కోరువారు ఏలకపొడి, పచ్చకర్పూరము కలపవచ్చును. పర్రభూములలో, పరపోషణలేక పెరిగి, ప్రాధేయపడకపోయినను తలమైన ఆహారము ఒసంగి ప్రతిఫలము గోరక, ప్రబలముండెడి యీ తాటిచెట్టు సర్వులకును మార్గదర్శకమై యున్నది.

గొల్లపూడి సీతారామశాస్త్రి

---




డాక్టరు జె. టి. సండర్లెండు భారతదేశ బంధువు.

ఇతడు అమెరికా దేశము వాడు. భారత దేశముపట్ల, భారతీయులపట్ల మిక్కిలి అభిమానముగలవాడు. ఇతడు రచియించిన ఇండియా ఇన్ బాండేజ్ (India In Bondage) అను గ్రంథము ఇండియా ప్రభుత్వముచే నిషేధింపబడినది. భారత దేశముపట్ల విశేషముగ అభిమానాదరములు గల ఈతడు కీర్తిశేషుడగుటకు భారతదేశము దురపిల్లక మానదు.

---

"క్షీణించిపోతున్న జనసంఖ్య : ఒకహెచ్చరిక"

ఈ పేరుతో "ది ఇన్క్వైరర్" అనే లండను పత్రిక ప్రచురించిన వ్యాసంలో ఈ క్రిందివృత్తాంత మున్నది:

"యూరపునందుగల దేశాలలో దాదాపు ప్రతి దేశంలోనూ జననసంఖ్య క్షీణిస్తూ ఉంది. ఇందువల్ల శ్వేతజాతులకు అపాయం అధికమవుతూవున్నది. పైగా జనసంఖ్యలను వయస్సులనుబట్టి అమితంగా విభజించి ఉండటంవల్ల వాస్తవస్థితి తెలియటంలేదు. అనేక పాశ్చాత్యదేశాలలోని పరిస్థితులు గమనించగా తేలుతున్న దేమంటే స్థూలదృష్టికి మరణసంఖ్యకంటె జనన సంఖ్య అధికంగా ఉన్నట్టు కనిపించినప్పటికీ, ఆయా దేశాల జనసంఖ్య చిరకాలం ఇప్పుడున్నట్టే ఉండిపోవటానికైనా ప్రస్తుతపు జననసంఖ్య ఎంతమాత్రమూ సరిపోదు. యూరపులో ఆగ్నేయమూలనుండి వాయవ్యమూలకు జననసంఖ్య క్రమంగా తగ్గుతూఉంది. బ్రిటను స్కాట్లండ్ నేటియా దేశాలు మరీ అధమస్థితిలో ఉన్నై".

శ్వేతజాతులు చిరస్థాయిగా ప్రపంచంమీద మనటానికి ఆటంకంగా ఉన్న ఈ పరిస్థితులకు ముఖ్యకారణం జన్మనిగ్రహపరికరాల ఉపయోగమే.

ఆ వ్యాసమందలి తుదివాక్యం

"జననసంఖ్య అభివృద్ధి చేసుకోవాలని మొట్టమొదట ఆదుర్దాపడటం ప్రారంభించిన జర్మనీ దేశంలో జనసంఖ్యకు ఎటువంటి అపాయమూ రాకుండా ఉండగలందులకు వంశపారంపర్యంగా ఆరోగ్యవంతములై ఉంటున్న కుటుంబాలకు ఆధిక్యతా, ప్రోత్సాహమూ ఇవ్వబడుతున్నై.

"రష్యాలో జనసంఖ్య తక్కువగాలేదు. క్షీణించటమూ లేదు. ఎక్కువగానేవుంది. అయినా సోవియటువారు అంతతో తృప్తిపొందక ఆదేశపుజనసంఖ్య అమితంగా పెంపుఅయ్యేటందుకు తగినఏర్పాట్లు చేసుకుంటూఉన్నారు.

"రష్యాలో ఒకచట్టం ఏర్పాటయింది. దాన్ని అనుసరించి ఏడుగురుబిడ్డలతల్లికి సాలుకు ౨,౦౦౦ రూ

చొప్పున అయిదుసంవత్సరాలవరకూ ఇస్తారు. ఆపైన పుట్టిన ప్రతిబిడ్డకూ అలాగే ఇస్తారు. పదకొండవ కాన్పు కన్నతల్లికి ౫,౦౦౦ రూబుల్సుఇచ్చి సాలుకు ౩,౦౦౦ రూబ్బులుచొప్పున నాలుగుసంవత్సరముల వరకూ ఇస్తారు. ఆపైనపుట్టిన ప్రతిబిడ్డకూ అట్లాగే యిస్తారు. ౧౯౭౫ సంవత్సరం వచ్చేసరికి రష్యాజన సంఖ్య ౩౦ కోట్లు చెయ్యవలెననేఅభిప్రాయం సోవియటువారికి కలదని గవర్నమెంటు ప్లానింగుకమిషను యొక్క అధ్యక్షుడు చెబుతున్నాడు."

౧౯౩౩ జనవరి ౧-వ తేదీనాడు సోవియటు రష్యాజనసంఖ్య ౧౬,౫౭,౪౮,౦౦౦ అయినట్టు అంచనా వేయబడింది.

ఈ వివిధపాశ్చాత్యదేశముల పరిస్థితులనుంచి భారతదేశం, పాఠంగ్రహించి జాగ్రత్తపడవలసిఉంది.

(రూబులు = రూపాయి పావలా రమారమి)

---

## బ్రిటిషు ఇండియాలో విద్యకోసం ఖర్చు

భారతదేశంలో విద్యనుగూర్చిన ౧౯౩౩-౩౪ సంవత్సరం తాలూకు ఇండియాప్రభుత్వ నివేదిక ఈ ౧౯౩౬ వ సంవత్సరంలో వెలువడింది. ౧౯౩౩ సం॥ ఏప్రిల్ ౨ వ తేది మొదలు ౧౯౩౪ సం॥ మార్చి ౩౧ వ తేదివరకు అయ్యే సంవత్సరకాలంలో విషయాలను ఇది వివరిస్తుంది. ౧౯౩౪-౩౫, ౧౯౩౫-౩౬ సంవత్సరాల నివేదికలు యింకా రావలసివుంది. కాని ప్రపంచంలో అన్ని ఇతరదేశాల్లో వాయువిమానాలమీద పోతూఉన్నా ఇండియాలో, అతిసమర్థులయిన ప్రభుత్వాధికారులున్నాకూడా, ఇంకా ఎడ్లబండ్లే గతిగా వుంది. కాబట్టి ప్రకృతంలో రెండేండ్లనాటి నివేదికే మనకు సరి కొత్తది. దాన్నే మనం పరిశీలించవలసింది ఇప్పుడు.

ఈ నివేదికలో

"వ్యయం తగ్గించవలసిన అవసరం క్రమంగా తీరిపోతూవుంది కాబట్టి ఇదివరలో మొత్తంవ్యయంలో చేసిన తగ్గింపు చాలావరకు హెచ్చించి యిప్పుడు కూడ దీయబడింది."

అని వుంది

వ్యయంలో హెచ్చింపుచేసినమాట 'నిజమే. కాని ఒకరహస్యంమాత్రం మరుగుపడిపోయింది. నివేదికలో ౬-వ పట్టికవల్ల

| | |
|---|---|
| ౧౯౩౪ లో | ౧౧,౪౭,౦౨,౧౫౦ |
| ౧౯౩౩ లో | ౧౧,౩౫,౫౦,౭౯౮ |
| ౧౯౩౧ లో | ౧౨,౪౬,౦౦,౪౮౧ |
| ౧౯౩౨ లో | ౧౩,౬౦,౯౭,౧౧౬ |
| ౧౯౩౦ లో | ౧౩,౨౫.౩౮,౦౪౪ |
| ౧౯౨౯ లో | ౧౩,౧౮.౧౦,౧౪౫ |

రూపాయలకు విద్యకోసం ప్రభుత్వం వ్యయం చేసినట్లు తెలుస్తూంది.

దీన్నిబట్టి 'చాలావరకు హెచ్చించి'కూడా విద్యకోసం ప్రభుత్వం ౧౯౩౪ లో వెచ్చించిన మొత్తం ౧౯౩౧, ౧౯౩౦, ౧౯౨౯ సంవత్సరాలలో వెచ్చించినదానికంటె చాలాతక్కువని స్పష్టమవుతూవుంది. ఈ హెచ్చింపు ఒక ౧౯౩౩వ సంవత్సరం వ్యయంకంటె మాత్రమే; తక్కిన నాలుగు సంవత్సరాలకంటే కాదు

బర్మాతోసహా బ్రిటిషుఇండియాలో వుండే ౨౭,౧౫,౨౬,౯౩౩ ప్రజలయొక్క విద్యాభివృద్ధికోసం ప్రభుత్వం రు. ౧౧,౪౭,౦౨,౧౫౦ వెచ్చించింది. అంటే మనదేశంలో మనిషి ఒక్కింటికి ప్రారంభ విద్య మొదలు కళాశాలవిద్యవరకు అన్నితరగతుల విద్యకోసమని రు ౦-౬-౯ వెచ్చించి దన్నమాట.

దేనితోనయినా పోల్చిచూస్తే ఈమొత్తం ఎంత కొంచెమో తేలిపోతుంది.

లండను కౌంటీకౌన్సిలు జనసంఖ్య ౪౩,౯౫,౮౨౫. ఈ కౌంటీవారి విద్యకోసం ౧౯౩౫-౩౬ సంవత్సరానికి వ్యయం ౧,౨౪,౦౨,౯౪౩ పౌనులు (రూ. ౧౬,౫౩, ౭౨,౫౭౩) కావాలని అంచనావేయబడింది.

అందువల్ల ౨౭,౧౫,౨౬,౯౩౩ జనసంఖ్యగల భారతదేశంలో విద్యకు ఇండియాప్రభుత్వం వెచ్చించే సొమ్ముకంటే ఎంతో ఎక్కువసొమ్మును ౪౩,౯౫,

౭౨౫ జనసంఖ్యగల దేశంలో విద్యకు లండను కౌంటీ కౌన్సిలు వెచ్చిస్తుందన్నమాట.

ఇండియా బీదదేశం; అందుచేత ప్రభుత్వం అక్కడి ప్రజల చదువుకోసమని ఎక్కువగా- డబ్బుగల లండను కౌంటీకౌన్సిలు వెచ్చించినంత ఉదారంగా- వెచ్చించడానికి వీలుపడదనవచ్చును.

అయితే బీద ఇండియా పెద్దఉద్యోగులకు (చాలవరకు విదేశీయులే) ప్రపంచంలో సంపన్నదేశాల్లో ఆ తరగతి ఉద్యోగులకు ఇచ్చేజీతాలకంటే ఎంతో ఎక్కువజీతాలు ఇచ్చుకోవలసివచ్చింది. ఇలాటి విపరీతపు జీతాలు ఏర్పాటుచేసేటప్పుడు ఇండియా బీదరికం ఎందుకు మనస్సుకు తట్టను? ఇండియా ఆదాయంలో నుండి ఈ పెద్దపెద్దజీతాలూ, సైనికవ్యయమూ, తగ్గించినట్లయితే, విద్యకోసం ఎంతో ఎక్కువగా వెచ్చించవచ్చును. తప్పకుండా. మహదైశ్వర్యవంతాలయిన పాశ్చాత్యదేశాలమాటయెందుకు? జపానుదేశంలోకూడా జీతాలు ఇండియాలోకంటె చాలతక్కువ. జపాను ప్రధానమంత్రి జీతము నెలకు ౫౦౦ ఎన్నులు (ఇంచుమించు రు. ౬౧౬).

ఇండియా దరిద్రదేశం ఎప్పుడూకాదు. నాగరకదేశాలవారిని త్వరగా సంపన్నులు కావడానికి ఆకర్షించింది ఇండియాసంపదే.

లండను విద్యావ్యయాన్ని ఇండియా విద్యావ్యయంతో పోల్చినప్పుడు క్లయివుదినాల్లో ముర్షిదాబాదు లండనంత పట్టణమని చెప్పడం పొరపాటుకాదు. అక్కడ ధనవంతులు లండనులోకంటే అధికంగా ఉండిరి. వారు లండనుధనవంతులకంటే అధికధనవంతులుగానూ ఉండిరి ఇంతే తేడా.

(సెప్టెంబరు మా. రి.)

---

## 'ఇండియాలో విశ్వవిద్యాలయాలూ, వాటిలో చదువు విద్యార్థిబృందమూ అత్యధికంకాదు

పైనపేర్కొన్న నివేదికలోనే "భారతీయ విశ్వవిద్యాలయాలు క్రిక్కిరిసిపోతూ ఉన్నవి." అని ఒక అసత్యమైనవ్రాత కనుపడుతూవుంది. వాస్తవానికి జనసంఖ్య అధికంగావుండే ఇండియావంటి ఒకపెద్ద దేశానికి అక్కడవుండే విశ్వవిద్యాలయాల సంఖ్యకాని, వాటిలో చదివే విద్యార్థులసంఖ్యకాని చాలతక్కువ.

౪౫ మిలియనుల జనసంఖ్యగల గ్రేటుబ్రిటనులో విశ్వవిద్యాలయాలు ఇంగ్లాండులో ౧౧, స్కాట్లెండులో ౪, వేల్సులో ౧ వున్నవి. ౧౯౩౬ సం|| స్టేట్స్మెను ఇయరుబుక్కునుబట్టి యీ ౧౬ విశ్వవిద్యాలయాలలోను చదివే విద్యార్థులసంఖ్య ౫౩,౯౯౫. పై నివేదికలో ఇండియాలో కళాశాలల తరగతులలో చదివే విద్యార్థులందరూకూడా విశ్వవిద్యాలయ విద్యార్థులుగా లెక్కింపబడ్డారు. అలాగయితే గ్రేటుబ్రిటనులో వుండే ఎగ్జిటరు, నాటింగ్హామ్, సౌతు ఆంప్టను, లీస్టరు, హల్లు విశ్వవిద్యాలయ కళాశాలలలో చదివేవాళ్లనుకూడ అక్కడి విశ్వవిద్యాలయ విద్యార్థుల లెక్కలోకి తీసుకోవలసివస్తుంది. అట్లాటివాళ్ల మొత్తం ౪,౬౩౧. అంతా గ్రేటుబ్రిటనులో విశ్వవిద్యాలయ విద్యార్థుల సంఖ్య ౫౯,౬౨౬ అవుతుంది.

౪౫ మిలియనుల జనసంఖ్యనుబట్టి గ్రేటుబ్రిటనును ౫౧ మిలియనుల జనసంఖ్యగల బెంగాలుతోను, ౩౯ మిలియనుల జనసంఖ్యగల 'ఆగ్రా-ఔదు' తోను పోల్చి చూడవచ్చును. ప్రకృతం బెంగాలులోవుండే రెండువిశ్వవిద్యాలయాలలో ౩౦,౮౦౦మందీ, 'ఆగ్రా-ఔదు'లోవుండే ౫ విశ్వవిద్యాలయాలలో ౧౨,౦౧౯ మందీ విశ్వవిద్యాలయ విద్యార్థులనబడేవాళ్లు వున్నారు. దీన్నిబట్టిచూస్తే, గ్రేటుబ్రిటను లెక్కప్రకారము ఈ రెండు రాష్ట్రములలోను ఇంకా ఎన్నో విశ్వవిద్యాలయాలకూ, ఎందరో విశ్వవిద్యాలయ విద్యార్థులకూ అవకాశం వుందని స్పష్టమవుతూంది.

* * * * *

ఇండియాలో టోకున బర్మాతోసహా, జనసంఖ్య ౩౫౩ మిలియనులు; విశ్వవిద్యాలయాలు ౧౮; వాటిలో చదివే విద్యార్థులసంఖ్య ౧౧౩,౩౭౭. ఇండియాలో గ్రేటుబ్రిటను లెక్కప్రకారంగా అయితే, విశ్వవిద్యాలయ విద్యార్థులసంఖ్య ఇంచుమించు ౪౬౦,౦౦౦ గా

వుండును కాని ఇప్పుడున్నంత (౧౧౩,౩౫౮)గా ఉండేది కాదు.

గ్రేటుబ్రిటనులో సామాన్య సాహిత్యాదుల నభ్యసించే ౫౮,౬౨౬ మంది విశ్వవిద్యాలయ విద్యార్థులుకాక సాంకేతిక, శిల్పాదివిద్యల నభ్యసించేవారు వేలకొలదిమంది కలరనే విషయం మనం మరవకూడదు. కాబట్టి సామాన్యసాహిత్యాదివిద్యలు గ్రేటుబ్రిటనులో ఏమంత అధికంగా లేదు. ఇండియాలో, అలాగు కాకుండా, శాస్త్రవిద్య చాలతక్కువ. ఆ ఉన్నదవ్వంతయినా అనుభవజ్ఞానశూన్యమయింది. ఇంకా అంతకంటె ఉన్నత సాంకేతికవిద్యలు, శిల్పాదులు, వాటిలో తర్ఫీదున్నూ..అంటే ఈసాంకేతికశిల్పాదివిద్యలలో ప్రారంభవిద్యయినా కావలసినంత ఉ దని కాదు. కాబట్టి ఇండియాలో కావలసింది కళాశాలల, విశ్వవిద్యాలయముల విద్యను తగ్గించడంకాదు; చక్కని సాంకేతిక, శిల్పాదివిద్య చాలా ఎక్కువగా చేయుడమే.

విశ్వవిద్యాలయాలకు సంబంధించిన శాస్త్రాది విద్యలుకూడ చక్కని ప్రయోగశాలల పెక్కింటిని నెలకొలిపి ఎక్కువ అనుభవయోగ్యం అయేటట్టు చేయాలి.

(సెప్టెంబరు. మా. రి.)

## బ్రిటిషు సామ్రాజ్యంలో ఇండియనులదే మెజారటీ

బ్రిటీషు సామ్రాజ్యం మొత్తం జనసంఖ్య ౪౯౪,౬౬౦,౫౦౦. అందులో—

| | |
|---|---|
| యూరపులో | ౪౮,౦౦౦,౦౦౦ |
| ఏషియాలో | ౩౬౭,౦౦౦,౦౦౦ |
| ఆఫ్రికాలో | ౬౦,౦౦౦,౦౦౦ |
| ఉత్తర అమెరికాలో | ౧౦,౪౦౦,౦౦౦ |
| మధ్య-అమెరికాలో | ౫౦,౦౦౦ |
| వెస్టిండియనులో | ౨,౦౦౦,౦౦౦ |
| దక్షిణ-అమెరికాలో | ౩౯౦,౦౦౦ |
| ఓషియానాలో | ౭,౦౦౦,౦౦౦ |

ఉన్నారు. వీరిలో

| | |
|---|---|
| హిందువులు | ౨౪౦,౦౦౦,౦౦౦ |
| మహమ్మదీయులు | ౧౦౦,౦౦౦,౦౦౦ |
| క్రైస్తవులు | ౮౦,౦౦౦,౦౦౦ |
| బౌద్ధులు | ౧౨,౦౦౦,౦౦౦ |
| ఆత్మవాదులు | ౧౯,౦౧౦,౦౦౦ |
| సిక్కులు, జైనులు, పార్సీలు | ౪,౦౦౦,౦౦౧ |
| జ్యూలు | ౬౫౦,౦౦౦ |

తక్కినవారు ఇతర మతాలవారు.

ఈ ౪౯౪ మిలియనుల జనులలో ౩౫౦ మిలియనుల కెక్కువమంది ఇండియాలో ఉండేవారే. కాబట్టి బ్రిటిషుసామ్రాజ్యంలో ఇండియనులే మెజారటీవర్గంవారు. అయితే వారు పరాధీనులు. ఇంగ్లండు, స్కాట్లెండు, వేల్సులలో వుండే ౪౫ మిలియనుల జనులు పాలకజాతివారు. వీరు మైనారిటీవర్గంవారయినా వీరికి ఏలాటి 'సంరక్షణములు' కాని 'పలుకుబడి' కాని అక్కరలేదు. వీరు స్వతంత్రులుగా ప్రత్యేకజాతిగా ఉండడానికి కారణాలయిన వీ బాహుబలమూ, బుద్ధిబలమూ, ఐకమత్యబలమూ, స్వాతంత్ర్యప్రీతీ ఇవేవారికి చాలినంత సంరక్షణలు. ఈకారణాలచేతనే ప్రపంచజాతులన్నిటిలో గౌరవమూ, పలుకుబడీ వారికి ఏర్పడింది.

కేవలం సంఖ్య అధికం అయినంతమాత్రాన ప్రయోజనం ఏమీ లేదు. చీనావారు సంఖ్యలో జపానువారికంటే ఎంతో అధికంగాఉన్నారు. కాని వారంత బలవంతులు మాత్రం కారు. సంఖ్యాబాహుళ్యం ప్రధానమే అయితే ఇండియనులకు పరాధీనులు కావలసినగతి పట్టే ఉండదు.

౩౫౦ మిలియనుల జనులుండే ఇండియాలో, కొత్త ఇండియాగవర్న మెంటు ఆక్టునుబట్టి హిందువులూ, ఇతరులూ కలిసిన సామాన్య నియోజకవర్గాలవారిసంఖ్య ౨౫౩,౬౧౬,౦౫౧. కాబట్టి బ్రిటిషుసామ్రాజ్యంలో సామాన్యనియోజకవర్గాలవారే సామ్రాజ్యం మొత్తంలో తక్కిన వర్గాలవారందరికంటేకూడ అధికసంఖ్యాకులు కావడంచేత బ్రిటిషుసామ్రాజ్యంలో మెజారిటీవర్గంవారవుతారు. వరిలో ౨౩౯,౧౯౫,౧౪౦ సంఖ్యగల హిందువులే యే యితరప్రత్యేకవర్గంకంటేకూడా పెద్ద వర్గంవారవుతారు.

కాని, ఇండియనులు, హిందువులతో సహా, స్వతంత్రులుకారు. వారు ఎన్నో శాఖలుగా చీలిపోయినారు; వారిది స్వాతంత్ర్యం వాంఛించే స్వభావం కాదు. వారిలో చాలమందికి చదువు రాదు. కొంచెం మంది చదువుకొన్నవారిలో కూడ శాస్త్రజ్ఞానమూ, నవీన పారిశ్రామిక జ్ఞానమూ ఉన్నవారు మిక్కిలి తక్కువ. వాళ్లల్లో అయినా యంత్రనిర్మాణ, ఉపయోగాదుల జ్ఞానంకలవారు ఎంతో కొందిలేరు. ఈలాటివారి సంఖ్య ఎంత ఎక్కువైతే ఏం లెక్కకువస్తుంది?

(సెప్టంబరు మా. రి.)

— —



అల్పాయువు వెంకటేశ్వరులు

ఆదివారం (౨౦-౯-౧౯౩౬) రాత్రి యెనిమిది గంటలకు పిడుగులాగ వచ్చి దూకింది మా వెంకటేశ్వర్ల దుర్మరణవార్త. పెత్తతండ్రి సముద్రంలో యీదబోయి చనిపోయినాడు. గుండెబద్దలయింది దుఃఖంపొంగి ముక్తకంఠంగా పొర్లిపోయింది......ఇన్నాళ్లయినా ఇంకా ఆగకుండావుంది ఆదుఃఖం.

సంవత్సరన్నర కిందట చికిత్సకోసం చెన్నపట్టణం వచ్చినతండ్రికి శుశ్రూష చేయడానికని ఆయనతో కూడా వచ్చాడు. ఆతండ్రి యింతకాలమూ బాధపడి యిపుడిపుడే కోలుకుంటూ వున్నాడు. ఇంతలో ఈవిధంగా కడుపుదుఃఖం సంప్రాప్తమయింది ఆతండ్రికి. కన్నకొడుకేకాదు; చేతి కెదిగినవాడు; చెప్పుచేతలలో మెలిగేవాడు; గద్ద తన్నుకొనిపోయినట్లు కంటికి కనపడకుండా మాయమయిపోయినాడు. తలిదండ్రుల దుఃఖానికి మితియెక్కడిది? మేరయెక్కడిది?

వెంకటేశ్వరులు ౧౮ ఏండ్లవాడు. పొంగుతూవున్న ప్రాయం. గుమ్మడిపండురంగుతో గట్టిగా దిట్టంగా ఉన్న శరీరమూ; బాదంపండ్లలాంటి కండ్లూ; ఎత్తయినముక్కూ; చురుకయినచూపూ; కన్నుతనిసిపోయేది ఆరూపం. ఓర్పూ, వినయమూ, విధేయతా తెలివితేటలూ, కార్యదీక్షా, పరిశీలనాసక్తీ మా వెంకటేశ్వర్లకు సహజమయినగుణాలు. కాని సాహసం చాల ఎక్కువ. ముందువెనకు ఆలోచించడం ప్రకృతికి ఎక్కడా పనికిరాదు అదే ఇలాటి పిడుగుపాటు చావుకు కారణం అయింది.

ఎనిమిదినెలలకు పూర్వం భారతి ఆఫీసుకు వచ్చాడు. ఆఫీసుగుమ్మంలో నిలబడి చదువుకోడానికి ఏదయినాపుస్తకం యిమ్మని అడిగాడు. కటువుగా ప్రవర్తించాను అప్పుడు. చాలనొచ్చుకొని వుంటాడు. కాని ఓర్పుతో సహించి ఇంకా నిలుచున్నాడు. మర్నాడు రమ్మంటే వచ్చాడు. కోరిక తీర్చుకున్నాడు తర్వాత కొన్నాళ్లకు వాళ్లన్నగంట మళ్లా వచ్చాడు. క్రమంగా వానిగుణగణాలు నచ్చడమూ, తరుచు వస్తూ వుండడమూ అయింది. కేవలం నాలుగైదు నెలలనుండి ప్రతిదినమూ తానూ ఒక ఉద్యోగిలాగా వస్తూ భారతీ కార్యాలు చక్కపెడుతూ వుండేవాడు. కుడిభుజంలా అన్నికార్యాల్లో తోడుపడేవాడు. తానూ ఎన్నో విషయాలు నేర్చుకొంటూ వుండేవాడు. అనుబంధం అధికం అయ్యేకొద్దీ ఆత్మీయత పరస్పరమూ ప్రబలింది. ఏనాడైనా ఏకారణంచేతనైనా వెంకటేశ్వర్లు రాకపోతే ఏమీ తోచేదికాదు.

తండ్రి అనారోగ్యంవల్ల అయినోఘారంతో ప్రకృతం చదువు ఆగింది. కాని దాన్నిమించిన సంస్కారం ఏర్పడింది వెంకటేశ్వర్లకు.

వెంకటేశ్వర్లు కళావినోది. సినీమాకళ స్టడీ చేయడం పనిగా పెట్టుకున్నాడు. తన అల్పమాత్ర జీవితంలో సుమారు ౧౫౦౦ వివిధ ప్రదర్శనాలు సవిమర్శంగా చూచాడు. స్వదేశ విదేశచిత్రాలకు సంబంధించిన నటీనటులనుగూర్చి, వారి నటనశక్తినిగూర్చి, సినీమాకళ అభివృద్ధిని గూర్చిన ఇతర విషయాలను గూర్చి చాలా తెలుసుకొన్నాడు. 'కళావినోది' పేరున తన భావాలను భారతిలోను, ఇతర పత్రికలలోనూ ప్రకటించడం మొదలుపెట్టాడు. వాటినిబట్టి ముందు ముందూ ఎంతో కాగలవాడవుతాడన్న భావం గట్టిగా ఏర్పడింది. ఊహాలు, భావాలు వివరిస్తూఉంటే 'ఎంత పరిశీలన దృష్టిగల వాడబ్బా' అని ఆశ్చర్యంకలిగేది. వ్రాతలో కూడా సౌలభ్యమూ, మార్దవమూ ఏర్పడింది.

ఎన్నో ఊహాలు, ఎన్నో సంకల్పాలు వెంకటేశ్వర్లకు. ఎంతోకాలం బ్రతికి, ఎన్నో ఘనకార్యాలు చేసి, పేరూ ప్రతిష్ఠలు పొందుతాడని అనుకున్నాము. ఆలోచనలేకుండా కోరి కొనితెచ్చుకొన్నాడు క్షణంలో చావును. ఆశలన్నీ అంతరించి పోయినవి.

శనివారం పొద్దున భారతిఆఫీసుకు వచ్చాడు వెంకటేశ్వర్లు. కొంతసేపు పనిచూచుకున్న తర్వాత 'ఇంక నన్ను మీరు సోమవారంనాడే చూడడం' అని చెప్పి యింటికిపోయినాడు. అదే వెంకటేశ్వర్లు నాతో మాట్లాడిన చివరిమాట. ఆదివారంనాడు సాయంత్రం ఆరుగంటలకు అడగారిపోయినాడు. సోమవారంనాడు పొద్దున చూడడం వెంకటేశ్వర్ల శవాన్నే. అదే చివరిచూపు అయింది. అబ్బా! ఎంతఘోరము!

ఇట్లా మా వెంకటేశ్వర్లు ప్రపంచంలో లేకుండా పోయినాడు. కాని తన్ను ప్రేమించినవారి అంతరంగాల్లో లేకుండా పోగలడా ఎన్నటికిగాని!

గన్నవరపు సుబ్బరామయ్య

---



కీ. శే. తుర్లపాటి అంజనేయులు
ఆంధ్రనటకులు




## భారతీయ సంయుక్త రాజ్యాంగం

ఈ గ్రంథం యీసంవత్సరారంభమున వెలువడింది. కర్త కె. వి. పున్నయ్య, ఎం. ఏ. (ఆనర్సు). వీరు విద్యార్థిసంఘమునకు క్రొత్తకారు. చరిత్రను గూర్చియు, రాజనీతిని గూర్చియు, అర్థశాస్త్రమును గూర్చియు వీరు ఆంధ్రవిశ్వ విద్యాలయ కేంద్రస్థానమగు వాల్తేరున వుపన్యాసకులు. ఈ గ్రంథమును ఆంగ్లమున వ్రాసినారు. గురుభక్తి పూర్వకముగ పూజనీయులగు ప్రొఫెసరు ఎం. వెంకటరంగయ్య గారికి గ్రంథమును అంకిత మిచ్చినారు. గ్రంథం చెన్నపురిలో హాక్సలీ ప్రెస్‌లో ముద్రింపబడి, బి. జి. పాల్ అండుకంపెనీవారిచే ప్రచురింపబడింది. ఇందు ౨౨౮ పుటలుగలవు. వెల రూ. 3-౮-౦.

గ్రంథారంభమున వీరు తెలిపిన విషయములు మూడు. భావిభారతరాజ్యాంగ వ్యవస్థనుగూర్చి వ్రాయుట లేదనుటదే మొదటివిషయం. సంయుక్త రాజ్యాంగ విధానలక్షణములే వ్రాయబూనుట రెండవవిషయం. రాజకీయమును గూర్చి విపులముగ తెలియగోరువారు శ్రీ వెంకటరంగయ్యగారు యిటీవల "పాలనలో సంయుక్తవిధానం పాలు" అని వ్రాసిన గ్రంథమును చూడుడనుటే మూడవవిషయం. గ్రంథాంతమున సుప్రసిద్ధములగు గ్రంథములను, కమిటీరిపోర్టులను, కమిషన్ రిపోర్టులను, వివిధపక్ష సమావేశ త్రయమును పేర్కొన్నారు.

వీరు గ్రంథమును మూడు ఖండములు చేసినారు.

మొదటిభాగమున సంయుక్తరాజ్యాంగ విధానమును నెలకొల్పుటకు చరిత్రాత్మకమగు కారణములను తెలిపినారు. నూతనరాజ్యాంగ నిర్మాణ విధానమునకు పాలకపాలితుల ప్రయత్నములు చూపినారు. ఏకోద్దేశముతో వివిధ పక్షసభలో రాజ్యాంగ నిర్మాణవేత్తలు గుమిగూడుట వివరించినారు. బ్రిటిష్‌ఇండియా ప్రజలకు సంయుక్తరాష్ట్రపాలన మేలొసగునా, కీడొసగునా యనెడి ప్రశ్న కుత్తరువొసగినారు. హిందూ సంస్థానాధీశులు సంయుక్తరాష్ట్రపాలనకు చేతులొగ్గుట భారతీయ స్వాతంత్ర్యమునకు ఆటంకము కలిగించునా యనెడి విషయమును చర్చించినారు. రాజకీయములో రాష్ట్ర స్వపరిపాలనకు వెనుక సంయుక్తరాష్ట్ర విధానమున కెగబకుట సమంజసమనినారు.

ద్వితీయఖండమున సంయుక్తరాష్ట్రపాలనాధికారము నిర్వచించినారు. ప్రభుత్వాధికారములను విభజించినారు. కేంద్రప్రభుత్వాధికార నిరూపణయు, రాష్ట్రప్రభుత్వాధికారనిర్ణయమును చేసినారు. కేంద్ర రాష్ట్రప్రభుత్వములకు గల పరస్పర సంబంధములను వ్రాసినారు.

మూడవ భాగమున వీరు ముఖ్యముగ సంయుక్త రాష్ట్రపరిపాలన లక్షణములను, గుణములను పేర్కొన్నారు. కేంద్రప్రభుత్వమేర్పడినపుడు శాసననిర్మాణపు తీరు, కార్యనిర్వాహక వర్గపుపనులు, న్యాయపరిపాలనాధికారక్రమము క్లుప్తముగ తెలిపినారు.

వీరు కడపటి అధ్యాయమున గతమును చింతించి, భావి పరిణామమును అవలోకించినారు. వివిధపక్షసభకు నాలుగు మూలలనుండి నియుక్తులు వెళ్లినారు; నాలుగు తెరవుల వాదముల గావించినారు. హోరుగారు చేపట్టినది బ్రిటిష్ నిరంకుశ సామ్రాజ్యవాదం; హైదరీగారు తలపెట్టినది హిందూసంస్థానాధీశుల నిరంకుశాధికారవాదం; షఫీగారు తెచ్చిపెట్టినది తీవ్ర మహమ్మదీయ పక్షవాదం; సప్రూగారు సంస్తవము గావించినది ప్రజాప్రభుత్వవాదం. ఇట్టి సందర్భములలో సంయుక్తరాష్ట్రపరిపాలన అనివార్యమయ్యెనన్నారు. సంయుక్తరాష్ట్రపాలన వుత్తమవిధానముగాదు. ప్రతిరాష్ట్రముయొక్క విస్తీర్ణము వేరు, ఆహారములు వేరు, భాష వేరు,

ఆచారములువేరు, సాంప్రదాయములువేరు, నాగరికత వేరు. అట్టిచో వివిధ రాష్ట్రములను కేంద్రప్రభుత్వాధికారమునకు లోబరచుట న్యాయమా? కాదు. రాష్ట్రాభివృద్ధికి యిది శ్రేయస్కరము కాదన్నారు. సంయుక్త రాజ్యాంగమున కేంద్రప్రభుత్వాధికారము పెక్కు పెరుగును. రాష్ట్రపాలకులగు గవర్నరులకు, గవర్నరుజనరలునకు ప్రత్యేకాధికారము లున్నంతవరకు రాష్ట్రస్వాతంత్ర్యము రాణింపజాలదు. సంయుక్తరాష్ట్రపాలన భావికల్యాణమునొసగుగాత యని గ్రంథకర్త కోరిక.

ఈ గ్రంథము ప్రజాసామాన్యమునకు ఆదరణీయము. చక్కని బోధక గ్రంథం. పండితులు దీనిని బాధకమని కసరి కొట్టక పోషింతురుగాక!

ఏలేశ్వరపు కృష్ణమూర్తి

---

## దేశీయ పరిశ్రమలు

గ్రంథకర్త:—పెండెం వెంకట్రాములు

పైశీర్షికతో నీగ్రంథము గ్రంథకర్తచే తమ పారిశ్రామికగ్రంథమాలకు ద్వితీయకుసుమముగ ప్రకటింపబడినది. నాయకమణియైన డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారీగ్రంథమునకు పరిచయవాక్యములను వ్రాసి గ్రంథకర్తయొక్క ప్రయత్నము నశ్లాఘించిరి.

గ్రంథస్థవిషయములు భారతీయుల యొక్క ప్రాక్తనకళావైభవము భారతరామాయణాది కాలములు మొదలు మహమ్మదీయయుగ మంతరించి ఆంగ్లేయుల రాకపర్యంత మెట్లు మహోన్నతస్థితియం దుండెనో కూలంకషముగ నెరుకపరచుచున్నవి. ఈ గ్రంథమును రచించుటయందు గ్రంథకర్త అనేకగ్రంథముల పరిశీలించియు, అనేకప్రదేశముల దర్శించియు విశేషశ్రమకు పాల్పడినట్లు తోచుచున్నది. అధీనత తప్పినమనదేశీయుల కీసమయమున నిట్టివిషయములగూర్చిన యుద్బోధయొక్క యావశ్యకత యెంతేనిగలదు. సమస్తవిధ పరిశ్రమలగూర్చి గ్రంథము విస్తరించుచున్నది. ఏయొక్క పరిశ్రమగూడ గ్రంథకర్తయొక్క స్మృతిపథమునుండి జారిపోలేదు. నేతపరిశ్రమ, రంగులు మొదలైనగాంధిగారి ప్రణాళికకు సంబంధించిన విషయములగూర్చి ఉపయోగకరములగు ననేకాంశముల నిచ్చిరి. అయితే,

మన పూర్వౌన్నత్యమునుగూర్చి మన నీనాడు ఆత్మశ్లాఘయమునందు, గ్రంథములందు చూచి సంతసించి ఆవైభవమును స్మరించుకుని ఒకకన్నీటిబొట్టు విడవవలసినదేనా! ఏదేనిగత్యంతరము చేరువలో కలదా? ఈనాడు ప్రపంచమంతయు తారుమారుస్థితిలో నున్నది. ఎక్కడచూచినను ప్రతిచిన్నియంశమునను బ్రహ్మాండమగుపోటీ. పరిశ్రమములవిషయములో చేతిపరిశ్రమములకు, యంత్రపరిశ్రమములకు యెడతెగనిసంఘర్షణ. ఈపోటీ నంతరింపజేయుటెట్లు, పునరుద్ధరణప్రయత్నములు సాధ్యపడునా, సాధ్యపడిన సాగునా, పునరుద్ధరణమునకు కావలసినధనసహాయమునకు పూనదగినవా రెవ్వరు? మున్నగుముఖ్యాంశముల జోలికి పోక గ్రంథకర్త చాలవరకు ప్రాచీనౌన్నత్యమునుగూర్చియే వ్రాసిరి వెంకట్రాములుగారు పైవిషయములగూడ నించుక తరచియున్నట్లైన గ్రంథమునకు కొంతప్రయోజనము సిద్ధించియుండెడిది.

డాక్టరు పట్టాభిగారుదాహరించినట్లు దేశీయపరిశ్రమలయెడ మున్ముందు ప్రజలలో విశ్వాసము గల్పింపవలెను. పిమ్మట నేతిపనులు చేసికొని జీవించెడువారికి తగినంత ధనసహాయమొనర్చి జాస్తిసరుకు తయారగునట్లొనర్చి, ఆసరుకు విడుదలకు తగినయేర్పాట్లు చూడవలెను. ఇది మహత్తరకార్యమే. ఇట్టి పునర్నిర్మాణ ప్రయత్నమునకు మన సహకార సంఘములు, బ్యాంకులు యిన్సూరెన్సు కంపెనీలు, యితర ధనికులు యెంతేని సహాయ మొనర్పవచ్చును. వీరందరు దీక్షతో ప్రయత్నించిన మన పరిశ్రమలు తప్పక పునరుద్ధరింపబడగలవు. గ్రంథకర్త యీవిషయమునకు సంబంధించి రవంతగూడ ఉపదేశింపలేదు. దేశీయపరిశ్రమలను నీగ్రంథమునకు "భారతౌన్నత్యము" అని పేరిడిన సరిగనుండెడిది. పారిశ్రామిక గ్రంథములవా రింకను ఉపయోగకరమగు గ్రంథముల రచించి భారతీయోద్ధరణకు సౌకర్యముల సమకూర్తురని విశ్వాసము. ఈగ్రంథముయొక్క శైలి సుబోధకముగ నున్నది.

వెలప్రతి ౧కి రు౧-౮-౦. వేఁయువారు పెండెం వెంకట్రాములు, సంపాదకులు, పారిశ్రామిక గ్రంథ మాల, పేరాల, చీరాలపోష్టు, గుంటూరుజిల్లా అని వ్రాసికొనవలెను.

వ. కు.

---

## జీవిత సమస్య

గ్రంథకర్త్రి: తాడి నాగమ్మ,

ప్రకాశకులు: ఇంపీరియల్ ప్రెస్,

మెయిన్‌రోడ్, కాకినాడ.

వెల ౦-౪-౦.

ఇది మూడుకథలు, మూడువ్యాసములు గల సంపుటి. కథలు-ఇకెక్కడిజయము, ఒకముద్దు, సంనిగ్ధము అనునవి. వ్యాసములు-ప్రపంచఘోష- మానవవిప్లవము, స్త్రీలకన్నీరు, రైలుస్టేషనులో గడబడలు అనునవి. రైలుస్టేషనులోని గడబడలు అను వ్యాసమమాత్రము శ్రీ తాడి నాగమ్మగారి అన్నగారు వ్రాసినదట.

కథలలోను,వ్యాసములలోను భాష గ్రాంథికము; గబగబ పరుగెత్తునట్లుండి చదువుటకింపుగానున్నది. పుస్తకమునకిచ్చిన నామమే ప్రతికథలోను ధ్వనించుచున్నది. సందిగ్ధము అను కథ ఉత్తమతరగతికి చెందినది. ఇకెక్కడిజయము అను కథలో పరిణామము అతిశయోక్తిలోనున్నను, భారతదేశ సంస్థానాధీశుల దుబారా ఖర్చులు, వారి అవస్థలుమాత్రము స్వాభావికముగా వర్ణింపబడినవి. ఒకముద్దు అనునది నీతికథ.

ఇక వ్యాసములు—ప్రపంచఘోష ప్రపంచ ఘోషను బయలుపెట్టుచున్నది. స్త్రీలకన్నీరు పురుషకవులు వర్ణించిన స్త్రీ స్వభావమును అతిశయోక్తిగా చూపుచు, పురుషస్వభావమునుగూర్చినచర్చ. రైలుస్టేషనులోని గడబడలు మానవసంఘపు ప్రస్తుత జీవిత నిరూపణము.

తప్పొప్పుల పట్టికలో చేర్చని తప్పులుకూడ ఎక్కువగానున్నవి. పుస్తకమువెల్య మధికమని తోచుచున్నది.

క. స.

---

## కోపదారి మొగుడు - సాంఘిక నాటకము

రచయిత: శేకుమళ్ల కామేశ్వరరావు

ప్రకాశకులు: శేకుమళ్ల విశ్వనాథం

వెల ౦-౮-౦

ఇది అయిదంకాల సాంఘికనాటకం. స్వాభావికంగా కోపిష్ఠులైన భర్తలు భార్యల్ని పెట్టే బాధలు కండ్లకు కట్టేట్టుగా వున్నాయి యీపుస్తకంలో. నాలుగంకాలవరకూ కథ చాలా బాగావచ్చింది. అయిదో అంకంమాత్రం పూర్వకథకు తగినపరిణామాన్ని ఇవ్వడం లేదు. మొదటి భార్యను తను పెట్టిన బాధలన్నీ రెండో భార్యచేతులలో అనుభవించాలి భర్త. ప్రథమభార్య మరణంతోనే పరిస్థితులను సమన్వయంచేసుకుని సంస్కారిగా పరివర్తనచెందేటంత ఇంగితజ్ఞానమున్నట్లయితే కథానాయకుడు మొదట్లోకూడా కొంచెమేనా ఆలోచన చూపించడూ తన చేతల్లో?

సాంసారిక స్త్రీపురుషులు మామూలుగా చర్చించేవిషయాలూ, మాట్లాడే మాటలూ చదువుతూవుంటే పాఠకుడికి తానుకూడా కథలో ఒకపాత్ర అయిపోయినట్టు తోస్తుంది.

ప్రస్తుత పాఠకులకు అందుబాటులో వుండేటట్టు పుస్తకాన్ని చాలాతక్కువ మూల్యానికే ప్రకటించిన ప్రకాశకులు అభినందనపాత్రులు.

క. స.

---

## వివాహ తత్త్వము

గ్రంథకర్త: శ్రీ బంకుపల్లె మల్లయ్యశాస్త్రి

క్రౌను ౧౬౦ పుటలు. చక్కని అచ్చు; మంచి కాగితము. వెల తెలియదు. శ్రీ మల్లయ్యశాస్త్రులుగారు సుప్రసిద్ధ పండితులు. కడచిన యేడెనిమిదేండ్లనుండి ధర్మశాస్త్రములం దగాధపరిశ్రమచేసి 'శారదా వివాహ శాసనము శాస్త్రసిద్ధము' 'స్త్రీ పునర్వివాహము ఆచరణీయము' అను తమ సిద్ధాంతములను సభాముఖమున వెల్లడించి ఆంధ్రదేశమున ప్రచారమొనరించినారు. వారి వాదములు చాలవరకు జనామోదమునకు పాత్రము

లయినవి. వీరుపన్యాసము లిచ్చుటతోనే తృప్తిపొందక స్త్రీ పునర్వివాహములను జరిగించి పలువురు విద్యాధికులకు మార్గదర్శకు లయినారు. వారి అమూల్య పరిశోధనముల ఫలితమే ఈ 'వివాహతత్త్వము', అష్టాదశ భాగాత్మకము.

ఇందలి మొదటి పదునేడధ్యాయములలోను యువతీ వివాహము సమర్థింపబడి దానిని నిరసించువారి వాదములు ఖండింపబడినవి. అందలి ప్రతిభాగమునను 'శారదా వివాహ శాసనము శాస్త్రసిద్ధము' అను నంశమునే ప్రతిపాదించుచున్నది. పదునెనిమిదవ భాగమున అక్షతస్త్రీపునర్వివాహము సమర్థింపబడినది.

శ్రీ శాస్త్రులవారు విమర్శకదృష్టితో ధర్మశాస్త్రముల నన్నింటిని పరిశోధించి సామాన్యముగ పండితులు కూడ నెఱుగని విశేషముల ననేకములను సల్లడించినారు. అట్టిచోటుల వారు చూపిన బుద్ధికుశలత ప్రశంసింపదగినది. వివాహతత్త్వము ఇందు లెస్సగ నిరూపింపబడినది.

ధర్మశాస్త్రము లనునవి తత్తద్దేశకాలానుగుణముగ నిబంధింపబడినవి. వాని కన్నిటికిని ఏకవాక్యత కుదురుట దుర్ఘటము. ఆ ప్రయత్నమునకు ఫలము తక్కువ. కొన్ని స్మృతులలో ధర్మమగునది మరికొన్నిటిలో అధర్మము. మన ప్రాచీన వాఙ్మయము వివిధములగు వ్యాఖ్యానములు బయలువెడలుటకు అవకాశము కలిగించునది. మతకర్తలు మొదలగువారు ఒకేమూలమునకు వేర్వేరు అర్థములను కల్పించుట సర్వవిదితము. కొన్నియెడల పరస్పర విరుద్ధములగు అభిప్రాయములకును ఒకే మూలము ఆధారమగుచుండును. ఇట్టి విషమ పరిస్థితులు ధర్మశాస్త్రములయందును తటస్థించుచున్నవి. కొన్నియెడల యువతీ వివాహాది సమర్థములగు వచనములే తన్మత ప్రతిపక్షులకును ఆధారములగుచున్నవి. కావున ప్రమాణములు కావలసివచ్చినచో ఉభయపక్షములవారికిని అసంఖ్యాకములు లభించును.

ఇపుడు శాస్త్రములతో పనిలేదు. యువతీవివాహమే కర్తవ్యమని ప్రభుత్వమువారి శాసనము. తద్వ్యతిరిక్తులు శిక్షాపాత్రులు. అట్టిచో ఈ ప్రమాణ విచారణకు తగిన ప్రతిఫలములేదు. అయినను "ప్రపంచపరిణామమునందు వివాహధర్మ పరిణామజ్ఞానము సందేహనివృత్తికిని కార్యాచరణమునకును సాధనము." కాన శ్రీ శాస్త్రిగారి ప్రయత్నము ప్రశంసనీయము.

శ్రీ శాస్త్రులుగారు 'ఉద్వాహము వేరు; వివాహము వేఱు. ఇవి వేరువేరు కాలములందుకూడా చేయవచ్చును.' అని చాలవఱకు చర్చించినారు. ఉద్వాహమనగా దానమాత్రమని, వివాహమనగా గర్భాధానాంతకర్మకలాపమని వారి ఆశయమైనట్లు తోచుచున్నది. తమ మతమును సమర్థించుటకు శ్రీ శాస్త్రులుగారు చాలస్మృతులకు అర్థములను మార్చి చెప్పినారు. అట్లు చేసి స్మృతులకు వారు ఏకవాక్యత కలిగించితిమని అనుకొన్నను ఆచారమున మాత్రము పయి ఉద్వాహ, వివాహములు వేర్వేరుకాలములలో జరుగుచుండినట్లు తోచదు.

బ్రాహ్మాద్యష్టవిధ వివాహములును వివాహసంస్కారములు కాని వివాహములు కావని, గాంధర్వమున "భార్యాభర్తలు సంభోగించినను అంతటితో వివాహసిద్ధి లేదు; పాణిగ్రహణాది సమావేశనాంతము అయితీరవలె, లేకుంటే భార్య కానేరదు; భర్తగోత్రము రాదు; ఆ సంతానము దుష్టమున్న అగును." అని శ్రీ శాస్త్రులుగారు వ్రాసిరి. కాని మన ప్రాచీనవాఙ్మయమునుబట్టి చూచినను గాంధర్వవివాహము చేసికొన్న భార్యాభర్తలు తిరిగి పెళ్లితంతు జరిపినట్లు కనబడదు. ఇట్టిచో దుష్యంతపుత్రుడు భరతుడు దుష్టసంతానమే కావలసివచ్చును.

కొన్నియెడల శ్రీశాస్త్రులుగారు తమ మతమునకనుకూలముగ స్మృతుల మూలములను మార్చిరి. మచ్చునకు రెండుదాహృతులు.—

౧. వీరు మనుస్మృతిలోదని ఒక శ్లోకమును క్రిందిరీతి నిచ్చినారు.—

'ఉత్కృష్టాయాభిరూపాయ
వరాయ సదృశాయ చ,

అప్రాప్తసమయాం తస్మై
కన్యాం దద్యా ద్విచక్షణః'

ఇందు 'వివాహ ప్రయోజక వ్యాపారము (దానము) చేయవలెనన్న యర్థమే యున్నదని,' 'కనుక ఉద్వాహవివాహములకు వ్యవధానముకూడా శాస్త్రసమ్మతమే' అని వ్రాసినారు

మనుస్మృతిలోని మూలమమాత్ర మీ క్రింది రీతి నున్నది —

'ఉత్కృష్టాయాభిరూపాయ
వరాయ సదృశాయ చ,
అప్రాప్తామపి తాం తస్మై
కన్యాం దద్యా ద్యథావిధి.'

దీనిపయి కుల్లూకభట్టు వ్యాఖ్య—

'కులాచారాదిభి రుత్కృష్టాయ సురూపాయ సమానజాతీయాయ వరా యాప్రాప్తకాలామపి 'వివాహయే ద్విష్టవర్షామేవం ధర్మో న హీయతే' ఇతి దక్ష స్మరణాత్. తస్మాదపి కాలాత్ప్రాగపి కన్యాం బ్రాహ్మ వివాహవిధినా దద్యాత్.'

పయి మూల, వ్యాఖ్యానములనుబట్టి యిందు దానమాత్రము కాక వివాహముకూడ చెప్పబడుట స్పష్టము.

౨. మనుస్మృతిలోనిదని శ్రీశాస్త్రిలుగా రిచ్చిన పాఠము—

'త్రింశద్వర్షో వహేత్కన్యాం
రమ్యాం ద్వాదశవార్షికీమ్,

మనుస్మృతిలోని పాఠము—

'త్రింశద్వర్షోద్వహేత్కన్యాం
హృద్యాం ద్వాదశవార్షికీమ్'

'ఉద్వహే'త్తను పాఠముకంటె 'వహే'త్తను పాఠము, 'హృద్యా'మను పాఠముకంటె 'రమ్యా' మను పాఠమును శ్రీశాస్త్రిలుగారి వాదమున కనుగుణములు.

శ్రీశాస్త్రిలుగారు చాల స్మృతివాక్యములకు తమ మతమున కనుగుణములగు నర్థములనుకల్పించి చెప్పిరి. అట్టివానికి వేఱొకరీతిని అర్థములను చెప్పుటకును అవకాశము లున్నవి. కావున అట్టి సందిగ్ధార్థముల కవకాశము లేని వాక్యములనే ప్రమాణముగ నిచ్చుట యుచితము.

మొత్తముపయి ఇందు వివాహముతత్త్వము చాల వఱకు నిరూపింపబడినది. ఆంధ్రులందరును తప్పకచదువ వలసిన గ్రంథ మిది.

బు. వేం. ర.

---

కాదంబరీకల్యాణమ్

సంస్కృత నాటకము; నరసింహకవి రచితము; సంపాదకులు వ్యాకరణశిరోమణి శ్రీ వి. కృష్ణమాచార్యులు, ప్రధానపండితులు, ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, మద్రాసు; క్రౌను ౨౩౬ పుటలు; చక్కని యచ్చు; వెల రెండు రూపాయలు; ప్రకాశకులు ఎడ్యుకేషనల్ పబ్లిషింగ్ కంపెనీ, ౧౨ సెకెండులైను బీచి, మదరాసు.

బాణ, భూషణభట్టులు సంస్కృతమున రచించిన 'కాదంబరి' యను గద్యకావ్యము దీనికి మూలము. దీనిని రచించిన నరసింహకవి గంగాధరుని తనయుఁడు. సౌగంధికాపహరణకర్త యగు విశ్వనాథుని తమ్ముఁడు. విశ్వనాథుఁడు సౌగంధికాపహరణమున తాను ప్రతాపరుద్రదేవుని సభాసదుఁడైనట్లును, అగస్త్యకవికి మేనల్లుఁడైనట్లును చెప్పియున్నాఁడు. విశ్వనాథుని శిష్యురాలు గంగాదేవి తన మధురావిజయము (కంపరాయచరితము)న కవినమస్కరణ సందర్భమున వరుసగ అగస్త్యకవిని, గంగాధరుని, విశ్వనాథుని పేర్కొనినది. కావున ప్రమాణసహితములగు ప్రతికూలాభిప్రాయములు వెలువడువఱకును సౌగంధికాపహరణకర్తయు, నృసింహకవి యన్నయు అభిన్నులే యనుకొనుట ఉచితము.

ప్రతాపరుద్రుని కాలము క్రీ. శ. ౧౨౯౨—౧౩౨౬ అని శాసనములవలన నిశ్చితము. నరసింహకవి

౧౪వ శతాబ్దపు వాఁడని నిశ్చయింపవచ్చును. కాదంబరీ పరిణయమునందలి పద్యములు కొన్ని పెదకోమటి వేమభూపాలుఁడు రచించిన "సాహిత్యచింతామణి" యం దుదాహరింపఁబడినవి. అతని కాలము క్రీ. శ. ౧౪౦౨–౧౪౨౩ అని నిశ్చితము. దీనింబట్టి చూచినను నరసింహకవి ౧౪వ శతాబ్దములోనివాఁ డనియే చెప్పవలెను. పయియంశము లుపోద్ఘాతమునందే యున్నవి.

కాదంబరీకథ చాల క్లిష్టమైనది. అది నాటకరూపముగ వ్రాయుట కష్టసాధ్యము. కాని కథ నాటకరూపమును పొందినచో అందఱకును సులభగ్రాహ్యము. అట్లొనరించిన కవి ప్రయత్నము ప్రశంసనీయము.

నాటకములో కథ శ్వేతకేతుమహర్షి యాజ్ఞ ననుసరించి కపింజలుఁడు ఇంద్రాయుధ మను నశ్వమున ప్రవేశించి చంద్రాంశసంభూతుఁడగు చంద్రాపీడుని కింపురుషదేశమునకు తీసికొని రా సన్నద్ధుఁ డగుటతో ప్రారంభమగును.

దానికి పూర్వపుకథ యిది

భారతదేశపురాజు తారాపీడునకు విలాసవతి యందు లేక లేక చంద్రాపీడుఁడను పుత్రుఁడు చంద్రాంశసంభూతుఁడు కలిగెను. ఆతని మంత్రియగు శుకనాసునకును ఆ ముహూర్తముననే వైశంపాయనుఁడను పుత్రుఁడు కలిగెను. రాజ, మంత్రిపుత్రు లత్యంత మిత్రములు. విద్యపూర్తిచేసి వీరు గురుజనాజ్ఞను దిగ్విజయమునకు బయలువెడలిరి. దేశములను జయించుచు వీరు కింపురుషదేశమును సమీపించిరి.

ఈ చంద్రాపీడుఁడే కథానాయకుఁడు

లక్ష్మీకి, శ్వేతకేతువులకు పుండరీకుఁడను పుత్రుఁడు కలిగెను. కపింజలుఁడా పుండరీకునికి మిత్రుఁడు. వీరిరువురును తపోనిష్ఠయం దుండఁగా గౌరీ, హంసుల పుత్రికయు, అప్సరఃకులజాతయు అగు మహాశ్వేత పుండరీకునిపయి మరులుకొనెను. పుండరీకుఁడును ఆమెపయిఁ గల మోహముననే విగతజీవుఁ డయ్యెను. మహాశ్వేత సహగమన మొనర్ప సిద్ధపడెను. పుండరీక శరీరమును కొని పోవుచున్న ఆదివ్యశరీరి యొకఁడు ఇరువురికిని పునస్సమాగమ మగునని తెల్పి మహాశ్వేతను సహగమన ప్రయత్నమునుండి మరలించెను. ఆపుండరీకుఁడే వైశంపాయనుఁడై జనించెను.

నాటకమందలి తరువాతికథ

ప్రథమాంకకథ— చంద్రాపీడుఁడు వైశంపాయనుని స్కంధావార రక్షణమున నియోగించి ఇంద్రాయుధము నధిరోహించి వేటకు బయలువెడలుట, కిన్నరమిథునము ననుసరించుచు మహాశ్వేత యున్న అచ్ఛోదసరస్సును చేరుట, మహాశ్వేత తన వృత్తాంతమును చంద్రాపీడునికి తెలుపుట, కాదంబరిచెలికత్తె తరళిక, సేవకుఁడగు కేయూరకుఁడు మహాశ్వేతను కింపురుషరాజధానికి రాఁగోరుట, మహాశ్వేత చంద్రాపీడుని కూడ తనతో రాఁగోరుట.

ద్వితీయాంకకథ— మహాశ్వేతా చంద్రాపీడులు విద్యాధరరాజధాని కేఁగుట, కాదంబరీ దర్శనము, కాదంబరీ చంద్రాపీడుల పరస్పరానురాగము.

తృతీయాంకకథ— కాదంబరీ చంద్రాపీడుల యన్యోన్యానురాగాభివృద్ధి, శేషహారమును కాదంబరి చంద్రాపీడుని కంఠమం దలంకరించుట.

చతుర్థాంకకథ— కాదంబరి విరహావస్థ, స్కంధావారమునకు పోయిన చంద్రాపీడుని కొనివచ్చుటకు మహాశ్వేత కేయూరకుని పంపుట, అతఁడు పత్రలేఖా, విదూషకులతో కూడ వచ్చుట, నాయికానాయకుల సమాగమము, గురుజనాజ్ఞ ననుసరించి చంద్రాపీడుఁడు ఉజ్జయినికి పోవఁదలఁచుట, కాదంబరికోరికపయి పత్రలేఖ యామెయొద్ద ఉంపఁబడుట.

పంచమాంకకథ— స్కంధావార రక్షణకయి నియోగింపఁబడిన వైశంపాయనుని వినోదార్థము కింపురుషులు 'మహాశ్వేతా పుండరీక' మను నాటకమును ప్రదర్శించుట, సేనాపతిపుత్రుఁడగు బలాహకుఁడు, మంత్రిపుత్రుఁడగు వైశంపాయనుఁడు దానిం జూచుట, నాటకమున మహాశ్వేతావృత్తాంత ప్రదర్శనము, వైశంపాయనుని మనోవైక్లబ్యము.

షష్ఠాంకకథ— చంద్రాపీడుని విరహము, హేమకూటము (కిన్నరరాజధాని) నుండి మరలివచ్చిన పత్రలేఖ, విదూషకుఁడు అతని నూరడించుట, కేయూరకుఁడు కాదంబరి విరహమున సంశయితజీవితయని తెల్పుట, తల్లిదండ్రుల యాజ్ఞగొని తాను వత్తుననియు, ముందుగ పత్రలేఖను తీసికొని పొమ్మనియు చంద్రాపీడుఁడు కేయూరకునితో చెప్పి వారిని పంపివేయుట, వైశంపాయనుఁడువిమనస్కుఁడై యచ్ఛోదసరస్తీరమునుండి మరలిరాకున్నాఁడని వలాహకుఁడు తారాపీడ, శుకనాసులకు తెలుపుట, గుర్వాజ్ఞగైకొని చంద్రాపీడుఁడు మిత్రుని తీసికొనివచ్చుటకు ప్రయాణమగుట.

సప్తమాంకకథ— తరళికా, వనదేవతల సంభాషణము, తనపై మోహము మాపు వైశంపాయనుని మహాశ్వేత చిలుకయగునట్లు శపించుట, చంద్రాపీడుఁడు నిశ్చేతనుఁడగుట, పత్రలేఖ ఇంద్రాయుధముతో అచ్ఛోదసరస్సు ప్రవేశించుట, ఇంద్రాయుధము కపింజలుఁడయి వచ్చి కాదంబరీ, మహాశ్వేతలకు ప్రియులతో పునస్సమాగమము కలుగునని చెప్పి వారలను అనుమరణ ప్రయత్నమునుండి మరల్చుట.

అష్టమాంకకథ— పుత్రవియోగదుఃఖమున విలాసవతీ, తారాపీడులు, శుకనాసుఁడు వనముల వసించుట, కేయూరకుఁడు రోహిణిగ మారిన పత్రలేఖ పంపిన సందేశమును తెలియఁబఱచుట, పుత్రులు జీవింతురని వారు సంతోషించుట, తారాపీడుఁడు మొ. వారు కాదంబరీని దేశమున శూద్రకమహారాజునాస్థానము చేరుట, శుకరూపమున నున్న వైశంపాయనుఁడు శూద్రకరూపమున నున్న చంద్రాపీడునికి పూర్వస్మృతిని కలిగించుట, మాతంగకన్యారూపమున నున్న లక్ష్మీదేవి తమ తమ వృత్తాంతములను తెలిపి శాపవిముక్తి నొందించుట, చంద్రాపీడ, పుండరీకులు నిజదేహములతో తమ ప్రియురాండ్రను, తల్లిదండ్రులను గౌరవించుట, కాదంబరీ, మహాశ్వేతల కల్యాణము.

పయి అంకవిభాగమును బట్టి కవి నాటక నిర్వహణమును ఎంత చక్కఁగ ఒనరించినాఁడో తేటపడఁగలదు. పంచమాంకమునందలి అంతర్నాటక కల్పనము కథావస్తువునకు ఎంతయు పోషకమయినది. ఇందు సూచింపవలసిన కథను సూచించుపట్టులను, గోప్యార్థగోపనమునను, ప్రకాశింపఁదగినదానిని ప్రకటించుటలోను కవి తన నేర్పును చక్కఁగ చిత్రించినాఁడు.

ఇతఁడు తన నాటకరచనమునకు ప్రాచీననాటకములను, అందు ముఖ్యముగ కాళిదాసుని శాకుంతలమును మేలుబంతిగ గ్రహించెనని చెప్పవలెను. మచ్చునకు కొన్ని ఉదాహృతులు—

౧. ఇందలి ప్రథమాంకమునందలి తురగవేగ వర్ణనము శాకుంతల ప్రథమాంకములోని మృగ, రథవేగ వర్ణనములకు ఛాయ. (పుట ౧౬.)

౨. దుష్యంతుఁడు చాటుననుండి శకుంతలను చూచుచున్నట్లే ఇందు చంద్రాపీడుఁడు నిభృతముగ మహాశ్వేతను నిరీక్షించినాఁడు. (పు. ౧౭)

ద్వితీయాంకము—

3. కాదంబరీ—హా ధిక్! హా ధిక్! ఇదానీమేవ తథా కృతప్రతిజ్ఞా ఏతాదృశస్య అననుభూతపూర్వస్య కస్యాపి వికారస్య విషయోఽస్మి సంవృత్తా. (పుట ౪౦.)

శకుం—కిం ను ఖల్విమం ప్రేక్ష్య తపోవనవిరోధినో వికారస్య గమనీయాస్మి సంవృత్తా. (ప్రథ)

౪. చంద్రాపీడః—నన్వియమపి మహ్యాహ్నాతపాతిశయేన నితరాం పరిశ్రాన్తా దేవీ. తథా హి—

పశ్యామృష్టలలామ ఫాలఫలకం
దృష్టి ర్దరోన్మేషిణీ,
మ్లానం కర్ణశిరీష మీషదధిక
శ్వాసాకులాః కుంతలాః,
భ్రూలాస్యం విరతప్రసంగ మభితః
స్విన్నా కపోలస్థలీ
సోత్కంపం స్తనయోశ్యగం మృగదృశః
స్రస్తా చ దోర్వల్లరీ. (పు. ౪౭)

శాకుంతలము—

రాజా—భద్రే! వృక్షసేచనాదేవ పరిశ్రాంతా మత్రభవతీం లక్షయే. తథాహ్యస్యాః—

స్రస్తాంసావతిమాత్రలోహిత తలౌ
బాహూ ఘటోత్క్షేపణా
దద్యాపి స్తనవేపథుం జనయతి
శ్వాసః ప్రమాణాధికః,
స్రస్తం కర్ణశిరీషరోధి వదనే
ఘర్మాంభసాం జాలకం
బంధే స్రంసిని చైకహస్తయమితాః
పర్యాకులా మూర్ధజాః. (ప్రథ)

౫. చతుర్థాంకము—చంద్రాపీడః—

అర్ధక్లాంత మృణాళహారవలయై
రావేష్ట్యమానైః క్షణా
దాశ్యానీభవదార్ద్రచందన రసై
రంగై రమందజ్వరైః,
అంతస్తాప మతీవ జృంభితగుణం
వ్యక్తీకరోత్యేవ మే
కామార్తా కిమసౌ న వేత్తి హృదయం
డోలాయతే కేవలమ్. (పు. ౧౦౩)

శాకుంతలము—

స్తనన్యస్తోశీరం ప్రశిథిలమృణా
ళైకవలయం
ప్రియాయాః సాబాధం
కిమపి కమనీయం వపురిదమ్,
సమస్తాపః కామం
మనసిజ నిదాఘ ప్రసరయోః

* * * *

(తృతీయోఽంకః.)

౬. చంద్రాపీడః.—(ఉపసృత్య) దేవి, అలమల మావేగేన. ఏషోఽస్మి తే సన్నిహితః, కథయ, కిం కరోమి?

కిం కీర్ణా నలకా నుదస్య కుసుమై
రుత్తంసయామి ప్రియే
ప్రస్విన్నం ముఖమారుతేన శనకైః
కిం వీజయా మ్యాననమ్,
శయ్యాపద్మరజఃకణైః శబలితం
కిం మార్జయా మ్యంగకం
స్రస్తం కిం ను సమాదధే రశనయా
వాసో నితంబాశ్రయమ్. (పు. ౧౦౮)

శాకుంతలము—

రాజా—అల మావేగేన. నన్వయ మారాధయితా జన స్తవ సమీపే వర్తతే.

కిం శీతలైః క్లమవినోదిభి
రార్ద్రవాతాన్
సంచారయామి నళినీదళ
తాలవృంతైః,
అంకే నిధాయ కరభోరు!
యథాసుఖం తే
సంవాహయామి చరణా వుత
పద్మతామ్రౌ. (తృ. అం)

ఇందలి షష్ఠాంకమున చంద్రాపీడుని విరహము, కాదంబరీ చిత్రరచనము శాకుంతల నాటక షష్ఠాంకమునందలి దుష్యంత పద్ధతికి అనుకరణము.

౭. అష్టమాంకము—(పు. ౨౧౦)

శుకనాసః.........పశ్యతు తావత్ దేవ ఏవ తస్యా అనుమత్యభావేన శరత్సమయావతారమపి కృతా స్తరాయమ్. తథాహి—

నిర్నిద్రైరపి నోద్గిరన్తి కుసుమైః
సప్తచ్ఛదాః సౌరభం
సాశంకః సవిధేఽపి పద్మసరసాం
హంసాః కలం కూజితమ్,
అంభో న స్పృశతి ప్రసాదముచితం
జాతేఽప్యగస్త్యోదయే
పాణిస్థే ఽపి నవేక్షుధన్వని దృశం
ప్రాయో న దత్తే స్మరః.

శాకుంతల షష్ఠాంకము—

కంచుకీ—న కిల శ్రుతం యువాభ్యాం యద్వాసంతికై స్తరుభిరపి దేవస్య శాసనం ప్రమాణీకృతం, తదాశ్రయిభిః పత్రిభిశ్చ. తథాహి—

చూతానాం చిరనిర్గతాపి కలికా
బధ్నాతి న స్వం రజః
సన్నద్ధం యదపి స్థితం కురవకం
తత్కోరకావస్థయా,
కంఠేషు స్ఖలితం గతేఽపి శిశిరే
పుంస్కోకిలానాం రుతం
శంకే సంహరతి స్మరోఽపి చకిత
స్తూణార్ధకృష్టం శరమ్.

కాదంబరీ నాటకమునందలి శరద్వర్ణనము పయి శాకుంతల వసంత వర్ణనమునకు ఛాయ.

౨. ఈనాటకమునందలి ద్వితీయాంకములోని (పుట. 3౭)

'పూర్ణేందుప్రతిమం ముఖం కువలయ
స్నిగ్ధాభిరామే దృశౌ
బాహూ బాలమృణాళ కోమలరుచా
కుంభానుకారౌ కుచౌ

అను పద్యభాగము శ్రీహర్షుని రత్నావళి యందలి,

'శీతాంశుర్ముఖముత్పలే తవ దృశౌ
పద్మానుకారౌ కరౌ
రంభాస్తంభయుగం తవోరుయుగళం
బాహూ మృణాళోపమౌ.'
అనుదాని కనుకరణము.

ఇట్లే ఉత్తరరామచరితాద్యనుకరణములును కలవు.

నరసింహకవి లలితపద గుంభనమునకును, కవిత్వము సొగసుడినమునకును పయి యుదాహరణములు చాలును. పయిరీతి రస విలసితములగు పద్యము లీ నాటకమునం దసంఖ్యాకము లున్నవి.

కాదంబరీకథ తెలిసికొనం దలంచువారికి బాణుని గ్రంథముకన్న ఈనాటకము అనుకూల ద్వారము; దానికంటె ఇదీ సుగమము. అది పండితమాత్ర వేద్యము.

వందలకొలంది యేండ్లు శిథిల తాళపత్రములలో అజ్ఞాతవాసముచేసిన ఈగ్రంథము ఇప్పుడు సంపాదకులయు, ప్రకాశకులయు ప్రయత్నమున వెలువడుట సంస్కృత భాషాభిమానులకు మహోపకారకము. భారతదేశమునందలి విశ్వ విద్యాలయము లన్నియు సంస్కృతవిభాగమున దీనిని ఉత్తమకక్ష్యలకు పఠనీయముగ నిర్ణయించుట ఆవశ్యకరణీయము.

బా. వేం. ర.

---

## ప్రణయవాహిని

సాహిత్యలత ౧౦ వ కుసుమము. గ్రంథకర్త: బాలసరస్వతి, శతావధాని, శ్రీపరాంకుశం వెంకట నరసింహాచార్యులు ప్రకాశకులు: కర్లపాలెం కృష్ణారావు సంపాదకులు, సాహిత్యలత; చీరాల, గుంటూరుజిల్లా. క్రౌను ౭౫ పుటలు. వెల తెలియదు.

ఇది వీచికాపంచిక విలసితమగు పద్యకావ్యము. '(కమలిని) కమల' యను ఒక అభాగ్యురాలి చరిత్ర మిందు వర్ణితము.

'రేపల్లె' లో నివసించు 'చంద్రప్ప'అను గోపునకు లేక లేక 'కమల' (కమలిని) అను కన్య కలిగినది. ఆమెకు శ్రీకృష్ణునిపయి ప్రేమ మెండు. ఆసంగతి ఆమె తలిదండ్రులకు తెలుపలేదు. వారును ఎరుగరు. కావున రాఘవప్పసుతుడు రామప్పతో ఆమెకు పెండ్లి జరిగినది. విధిలేక ఈమె అత్తవారింటికి వచ్చినది. భర్తపై ప్రేమ లేదు. ఒకనాడీమె యమునకు నీళ్లకేబోవ భర్తవెళ్లి తనపై వలపునింపుమని బ్రతిమాలెను. ఈమె తిరస్కరించెను. ఒకనాటిరాత్రి ఈమె స్వైరిణి తెలియకుండ యమునాతీరమున బృందావనమున వేణుగానలోలుడగు శ్రీకృష్ణుని చేరి యతని ప్రేమభిక్షను యాచించెను. అతడు అది తగదనియు, ఆడువారిని నమ్మరాదనియు చెప్పి నిరాకరించెను. కృష్ణునిపయి ప్రేమ యున్నను ఆమె ఆనాటితో అలిగెను, పిదప కృష్ణుడీమెప్రేమభిక్షను కోరెను. ఈమె తిరస్కరించెను. ఇంతలో అక్రూరుడు కంసుని పంపున కృష్ణుని

మధురకు తీసికొనిపోవ వచ్చెను. శ్రీకృష్ణుడు వెళ్లిపోయెను. కమల కృష్ణునికై వెతకి వేసారి విలపించెను. కథ దీనితో ముగిసినది.

పయి కథాంశమునుబట్టి ఇందు పోషింపబడినది ప్రణయముకాక దాని యాభాసమనియే స్పష్టముగ తెలియుచున్నది. ఈయంశమును కవికూడ—

'మురిపమున నాతురోత్కంఠితుండగుటగు
. గాక యాభాస మదియు శృంగారమగునె'

అని ఘోషించినాడు.

ఇందు గ్రంథారంభమునకు ముందు అవతారికలో 'వల్మీకజాతు'డు, 'కాళిదాసాది గీర్వాణకవి సమితి' ప్రస్తుతింపబడిరి. తెలుగుకవుల సంగతి లేదు. ప్రాచీన సంప్రదాయానుసారముగ కుకవినింద ఒనరింపబడినది.

'నాడు (రచనాకాలమున) తెలియకున్నను నేడు పరికింపగా నిందు ఛందో, వ్యాకరణాది దోషములు మిక్కుటముగ గనుపట్టుచున్నవి. అఖండయతులు లధికము. కాని వాటిని నేను దిద్దుబాటు కొనలేదు. దిద్దినచో నీ పొత్త మీ రూపము వీడి వేరొక్క రూపమొందుననుట నిజము.' అని గ్రంథకర్తగారి 'తొలిపలుకు' తునుక. (వ్యాకరణాది అనుకూలత గల ఆవె పదముచే భావ, కల్పనా, రసాదిదోషములను గ్రహింపవలసియుండునేమో?)

'అనివార్యములగు కారణములవలన అచ్చుతప్పులీకావ్యమున మిక్కుటమైనవి.' అని 'సంపాదకీయ' లేశము. కావున ఇందలి దోషములను సోదాహరణముగ పేరుపేరువరుసను ప్రస్తుతించుట అనావశ్యకము. ఇది దోషములన్నిటికిని ఉదాహరణము కాగలదని చెప్పిన చాలును.

ఈ గ్రంథమున కవిత అంతసరళము కాదు; పేలవము. ధారాశుద్ధి తక్కువ. ఎడనెడ సాఫుగా సాగిన పద్యములు కొన్ని కలవు. ఇందు 'చింతామణి, గయోపాఖ్యానము' నాటకములలోని భావానుకరణములు చాల కలవు.

ఇయ్యది కవిగారి 'కవితాప్రసంతికి మొట్టమొదటి తరగ'

'ఇంతకాలముగా దీనిని భద్రపరచియుంచుట గణాధిక్యతచే గాదు; ఆద్యసృష్టియను ప్రేమచేత మాత్రమే.—అది నైజమేకదా!'

'కలము పరువెత్తుపోవు మార్గమ్మెగాని, నే స్వతంత్రుడ గా నిందు నిశ్చయమ్ము' అని కవియే ఈ గ్రంథము యథార్థస్థితిని వివరించినాడు.

సంపాదకులు తమ 'సంపాదకీయము'న గ్రంథమునుగూర్చి ముచ్చటించుచు 'కర్త ఈ ప్రణయవాహినిని నూనూగుమీసాల నూత్నయౌవనములో రచించిరి. ఇప్పటి వీరి రచన లింకను ప్రౌఢముగ నుండునని చెప్పుటకు సందియము లేదు.' అని దీని న్యూనతను చెప్పకయే చెప్పియున్నారు.

దోషజుష్టమును నిట్టి గ్రంథమును పురస్కరించుకొని కవి 'అవతారిక'లో 'ప్రణయగీతామరందంబు రసికషట్పదముల దన్పునేగాని మదప్రకాండ శోధిత ఫలితపదుర్వాదిసూకరముల దనుపజాలునే, కుంతైన ధరణియందు' అని వాకొనుట అత్యంతము సాహసము.

కర్త 'వచ్చియుర'ని మాటలతో భావమందు, ఉచ్చారణయందు సర్వవిధముల నపభ్రంశములున్నను, పసినిసుగు పల్కు నపల్కులందలి జిలుగు తేనియంబోలె సహృదయులు దీని నాదరింప మరిమరి ప్రార్థించుచున్నారు.

'రసికవర్యులెల్ల రసమున్న గ్రహియింపు
డరసమైన వదలి యవల సంపు
డింతెకాని పండ్ల నిగిలింపగాబోకు
డావిధంబు మేయమాటజేసి.'

అని కవి విన్నవించుచున్నాడు.

గ్రంథకర్త విన్నవించినను విన్నవింపకున్నను, రసికులు చేయవలసిన పని అదియే! అతడు విమర్శకులను ప్రతిమాలినను, లేక తిట్టినను విమర్శనార్థము పంపబడిన గ్రంథమును నిష్పక్షపాతబుద్ధితో విమర్శించుట విమర్శకులకు కర్తవ్యము. బు. వేం. ర.

———

### కవికోకిల గ్రంథావళి

(క్రౌను ౧/౮ సైజు) సంపుటము ౧. కావ్యములు. పు. ౨౮౦. వెల రు. ౨-౦-౦, సం. ౨. ఖండకావ్యములు, పు. ౩౨౦. వెల రు. ౨-౦-౦, సం. ౩. నాటకములు, పు. ౩౪౨. వెల రు ౨-౦-౦, సం. ౪. సారస్వత వ్యాసములు, పు. ౧౮౩, వెల రు. ౦-౧౨-౦.
గ్రంథకర్త: దువ్వూరి రామిరెడ్డి

ఈ గ్రంథములు వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండు సన్సు, ఎస్ప్లనేడ్, మదరాసు వద్ద దొరకును.

---

### తెనుగుదుక్కి

క్రౌను ౧/౮ సైజు. పు. ౧౫౦. గ్రంథకర్త: ఖండవల్లి లక్ష్మీరంజనము, హైద్రాబాదు (దక్కను).

---

### ప్రణయవాహిని

క్రౌను ౧/౮ సైజు, పు. ౮౫. గ్రంథకర్త: పరాంకుశం వెంకట నరసింహాచార్యులు. ప్రకాశకులు: మేనేజరు, సాహిత్యలత కార్యాలయము, చీరాల.

---

### ఉత్తర హరిశ్చంద్రీయము (ద్విపద)

క్రౌను ౧/౮ సైజు. పు. ౨౨౬. వెల రు. ౧-౮-౦
గ్రంథకర్త: గార్లదిన్న సుబ్బారావు. గ్రంథము ఆదోనిలోని రావుశ్రీ ప్రెస్సులో దొరుకుతుంది.

---

### కులలక్ష్మి

డెమ్మీ ౧/౮, పు. ౧౫౨. వెల రు. ౦-౧౨-౦. గ్రంథకర్తలు: బత్తలపల్లె నరసింగరావు, కదిరి శ్రీనివాసాచార్యులు, కదిరి, అనంతపురం జిల్లా.

---

## భారతీయ మహిళామండలి



శ్రీమతి బోజా కోటమ్మగారు ఈమె కడపలో మొదటితరగతి బెంచిమేజస్ట్రేటుగా నియమింపబడినది.

# తేనెపూతకత్తి

కప్పగంతుల వేంకటేశ్వర్లు

రాణాప్రతాపుడు భార్యాబిడ్డలతో చిత్తూరు విడిచివచ్చినపుడు, కూడావచ్చిన స్వామిభక్తులలో సమరసింహుడు అగ్రగణ్యుడు. సమరసింహుడి పూర్వులు కూడా చిత్తూరుసామ్రాజ్యానికి విశ్వాసపాత్రులైన సేవకులూ, రాజభక్తులూను-సమరసింహుడితాత శక్తిహుడు, బేబరునెదిరించిన చిత్తూరురాణా సంగరాణాకు కుడిభుజము. సమరసింహుడితండ్రి, ఉదయసింహుడు పారిపోయినప్పుడు చిత్తూరుకోటను ప్రాణాలుపొయ్యేదాకా రక్షించి, దేశసేవకుడై వీరస్వర్గాన్ని అలంకరించాడు.

సమరసింహుడు రాణాప్రతాపుడికి నమ్మిన మిత్రుడు. వంశపారంపర్యంగా వస్తూవున్న రాజభక్తి సమరసింహుడిలో మూర్తీభవించింది. అందుచేతనే, అనేకమంది చిత్తూరుసేనానాయకులు మొగలులవద్ద లంచాలుతిని లోబడ్డా సమరసింహుడుమాత్రం తన భార్యతోటీ, పదిహేడేళ్లకొడుకు అజయుడితోటీ, రాణాతో అడవులకి వచ్చేశాడు. అడవుల్లో ఆకుఅలాలు తిని బ్రతుకుతూన్న వీళ్లను చిన్నచిన్న మొగలుసైన్యాలు వెదుకుకుంటూవస్తే, అక్బరుచక్రవర్తికి కబురేనా పోకుండా వుండేట్టుగా, రాణాకత్తి ఒరలోంచి బయటికి వచ్చే అవసరంలేకుండానే, కొద్దిపాటి రసపుత్రసైన్యంతో వాళ్లను నరికిపారేశాడు, సమరసింహుడు. చిన్నచిన్న మొగల్ సేనాపతులకు సమరసింహుడంటే బెరుకుగానేవుండేది.

అడివిలో రాణా విడిసిన స్థలాన్ని తెలుసుకొని మానసింహుడు, బిజిలీఖాను అనే సేనాపతిని రెండు వేల సైన్యాన్నిచ్చి, రాణామీదికి పంపించాడు. రాత్రివేళ కొండసందుల చాటుగా పోయి, మొగల్ సైన్యాలు రాణాని ముట్టడించాయి. అంతా కత్తులుతీసుకొని నిలబడ్డారు. రాణాకూడా తనకత్తిని తీశాడు. సమరసింహుడు, వొళ్లు తెలియకుండాపోట్లాడుతూవున్నాడు. ఎడమభుజం తెగి, నెత్తురు కాలవలుగా ప్రవహిస్తోంటే కూడా, పౌరుషం పెరిగిన ఆబోతెద్దులా పోట్లాడుతున్నాడు. అకస్మాత్తుగా వెనకనుంచి, తురక వొకడు వెన్నులోంచి కత్తిపొడిచాడు. సమరసింహుడు వెనక్కి తిరిగి, తన్నుపొడిచినవాడి తలకాయ తాటిముంజెలా కోశాడు. తరవాత పడిపొయ్యాడు.

తురకలు ఎత్తుకొనిపోతూన్న ఆడవాళ్ల కేకలు విని, రాణా పెద్దకొడుకు అమరసింహుడు వాళ్లని విడిపించడానికి పరుగెత్తాడు. రాణీవాసస్త్రీలను రాణా స్వయంగా రక్షిస్తున్నాడు, భిల్లులసాయంతో.

సగంత్రోవలో అమరసింహుణ్ణి మొగలులు చుట్టేశారు. అతను ముందుకి పోవటానికి వీలు లేకపోయింది. ఆడవాళ్లని వాళ్లు ఎత్తుకొనిపొయ్యారు.

౨

బిజిలీఖాన్, సమరసింహుడిభార్య జమ్నాబాయిని, ఆరేళ్లక్రిందట యశ్వంతపూర్‌లో పుట్టింట చూశాడు. రాణాదగ్గిరకి, షాదుషాబఖీరు తీసుకొని పోయినప్పుడు, ఆమెరూపం చూసి ఆమెలాంటి అందమైనవాళ్లు తమతురకల్లో దొరుకుతారేమోనని, అనేకమంది స్త్రీలని పరీక్షించాడు, కాని దొరకలే. నిద్రాహారాలుమాని వాకబుచేయగా, ఆమె చిత్తూరులో ఒక సేనానాయకుడిభార్య అని తేలింది.

చిత్తూరును అక్బరు ముట్టడించినప్పుడు- చిత్తూరు లోబడినతరువాత- అమితోత్సాహంతో, ఖాన్ ఆమెకోసం వెతికాడు. ఆమె కనపళ్లేదు. తురకలు పట్టుకున్న మిగతాఆడవాళ్లని పరీక్షచేశాడుకాని ఆమె వాళ్లల్లో లేదు. వాళ్లని ఆశపెట్టిఅడిగితే వాళ్లు రాణాతోపాటు, ఆమెభర్త భార్యాపిల్లలతో పారిపొయ్యాడని

చెప్పారు. ఖాన్ ఆలోచించాడు. మానసింహుడికి బోధపరిచి, ప్రతాపుణ్ణి జయిస్తానని బొంకి, సైన్యంతో బయల్దేరి రాణాని ముట్టడించాడు. తనకు కావలసింది జమ్నాబాయి. ఆమె దొరకగానే, ఆమెను ఎత్తుకొని ఢిల్లీ వచ్చాడు. ఈవిషయం తెలిసినసేవకులకి కొంచెం లంచంపెట్టి, అక్బరు కీసంగతి తెలీకుండా చేసుకున్నాడు.

నాలుగురోజులు గడిచాయి. అయిదోనాటిరాత్రి పరిచారకుల్ని పిలిచి 'ఆమె యెలావుంది' ని అడిగాడు. వాళ్లు, ఏడవటం తప్ప మరేమీ లేదనీ, అన్నంనీళ్లూ కూడా మానేసిందనీ చెప్పారు. తన కావిషయం నాలుగురోజులవరకూ చెప్పనందుకు వాళ్లని తిట్టాడు. స్వయంగా బయలుదేరాడు.

ఖరీదైనతివాసీలు పరిచినగదిలో పందిరిమంచం- మధ్యసోఫాలు- బల్లమీద అలంకారాలు- అన్నీ గజిబిజిగా పడిపోయివున్నాయి. ఒకమూల నేలమీద బోర్లాగా పడుకొని, కాలువలుకట్టే కన్నీళ్లమడుగులో మొహంపెట్టివుంది జమ్నాబాయి.

రాజపుత్రస్త్రీలు మానరక్షణకోసం యేంచేనా చేస్తారన్న కథలు అనేకం విన్నాడు ఖాన్.

పరిచారికల్ని చూసి 'ఆమెను ఎత్తి మంచంమీద పడుకోబెట్ట'మన్నాడు ఖాన్.

స్పృహలేకుండా పడుకునివున్న ఆమెను యెత్తి వాళ్లు మంచంమీద పడుకోబెట్టారు.

మొలలోవడ్డాణం తీసెయ్యమన్నాడు. ఇంకా యేమేనా సాధనాలున్నాయేమో చూడమన్నాడు.

పక్కమీదనే, ఆమెపక్కని కూర్చుని కన్నీళ్లతో చెమ్మగిలిన ఆమెబుగ్గల్ని స్పృశించబోయ్యాడు. చేతులు వణికాయి. ఆమె స్వచ్ఛమైన రాజపుత్రస్త్రీ!

పరిచారికవచ్చి పాదుషావారిదగ్గర్నుంచి కబురొచ్చిందని చెప్పింది. నిట్టూర్పు విడిచి, విసుక్కుంటూ లేచివెళ్లాడు.

"పాదుషావారు కొలువులో వున్నారు. మిమ్మల్ని తొరగారమ్మన్నా"రని భటుడొకడు చేతులు కట్టుకొని చెప్పాడు. ఆత్రంతో, ఖాన్ వాడివెంట వెళ్లాడు.

ఢిల్లీసామ్రాజ్యపున్యాయస్థానంలో, న్యాయపీఠంమీద, న్యాయప్రభువని పేరుచెందిన, న్యాయమూర్తి అక్బరుచక్రవర్తి కూర్చున్నాడు. కొంతమంది రాజకీయోద్యోగులుకూడా వున్నారు. పాదుషాకళ్లు నిప్పుల్లా మెరుస్తోంటే, ఎదుటికి వెళ్లిసలాంపెట్టి నిలుచున్నఖాన్ తత్తరపడ్డాడు.

"దుర్మార్గుడా! మొన్న రాణాప్రతాపుడిమీదికి యుద్ధానికి వెళ్ళినప్పుడు ఎత్తుకొని వచ్చిన ఆరాజపుత్రస్త్రీని ఎక్కడుంచావ్." అన్నాడు అక్బరు చాలా తీక్ష్ణంగా.

తడబడుతూ, "ప్రభువులు - చిత్తగించాలి - నేను ఏరాజపుత్రస్త్రీనీ -నేను-' అన్నాడు ఖాన్.

"చెప్పు. ఎక్కడుందామె ఇప్పుడు?"

"ఎ-వ-రు-జ-"

పాదుషా సింహాసనముమీదనుంచి లేచాడు. తక్కినవాళ్లుకూడా లేచారు.

"న్యాయముపేరట పాలింపబడే నారాజ్యంలో, నాఉద్యోగివైన నీవు, ఒకస్త్రీని దొంగతనంగా ఎత్తుకొనివచ్చి చెరబెట్టడమే కాకుండా, న్యాయస్థానంలో నాయెదుట అబద్ధంకూడా చెప్పావు. నీవాస్త్రీని తక్షణం-ఆమెతల్లిదండ్రులదగ్గిరికి పంపుటకు - ప్రభుత్వానికి వప్పగించి మరణదండనకి సిద్ధంగావుండు-"

"స-ర్కా-ర్-నిజంగా నేనామెని-యింతవరకు-ముట్టుకోనుకూడ-లేదు."

పాదుషా వినిపించుకోకుండా వెళ్లిపోయాడు.

## 3

అక్బరుచక్రవర్తికొలువులో, తర్కశాస్త్రప్రవీణుడని పేరుచెందిన రామదీక్షితుడియింట్లో, ఆమె యిష్టంవచ్చినంతవరకూవుండి తరువాత తల్లిదండ్రులదగ్గిరకి పోవటానికి, దీక్షితుడికోరికమీద జమ్న వొప్పుకొంది. సంతానంలేనిదీక్షితుడికి జమ్నమీద పుత్రికా

వాత్సల్యం కుదిరింది. ఆమె కూడా ఆదంపతులికి విధేయురాలై వుంటోంది. అక్బరుచక్రవర్తికూడా దీక్షితులి అవమానప్రేమకి సంతుష్టిచెందాడు.

* * * * *

'నౌరోజావుర్సు' పండుగలు, మొగలుచక్రవర్తుల కాలంలో (ముఖ్యంగా అక్బరుచక్రవర్తికాలంలో) చాలా వేడుకగా జరపబడేవి. కృష్ణదేవరాయలకాలంలో, దసరాపండగలకీ, అక్బరుచక్రవర్తికాలంలో నౌరోజావుర్సుకీ చాలాప్రాముఖ్యతవుండేది. దసరా, స్త్రీపురుషులనక, యిరుతెగలవారికీ సమానంగా ఉత్సాహకరమైంది. నౌరోజావుర్సు ఒక్క స్త్రీలకిమాత్రమే. ఆపండగరోజున పురుషుడనేవాడు బజార్లో అవుపడకూడదు. అంతా స్త్రీలే. అన్నిరకాలవస్తువులూ స్త్రీలే విక్రయించేవాళ్లు, స్త్రీలే కొనుక్కునేవాళ్లు.

ఆనాడు అందరిస్త్రీలకిమల్లేనే జమ్నకూడా ఉత్సవంలో పాల్గొంది. వింతైన వివిధవస్తుసముదాయాల్తో కూడిన ఆడవారి అంగళ్లని చూస్తూ బజార్లవెంట నడుస్తోంది.

ఒకఅంగడిమూల, సాముద్రికం చెప్తూన్న ముసలిమహమ్మదీయవనిత జమ్నని పిలిచింది. జమ్న అక్కడికి వెళ్లింది. నిజాలుకొన్నీ, అబద్ధాలు కొన్నీసాముద్రికం చెప్పి, "లోపల మా అక్క వుంది. నాకంటె ఆమె చాలాబాగా చెయ్యిచూస్తుంది; రండి" అని చెయ్యి పట్టుకొంది, ఆముసలిమహమ్మదీయ:వనిత. ఆచెయ్యి చెమటపట్టి చెమ్మగిలివుంది. జమ్నకి సందేహం కలిగింది. కాని 'చండశాసనుడైన అక్బరుచక్రవర్తికాలంలో స్త్రీలకు అవమానంజరుగుతుందా?' అనుకుంది. దుర్మార్గుడైన ఖానుచేతుల్లోంచి తప్పించిందిఅక్బరే కదూ! అదీ కాక, స్త్రీలపండగలో అంతఃపురస్త్రీలుకూడా పాల్గొనేటప్పుడు, మొగవాడు మోసంతలపెడితే ఏమాత్రం అనుమానం కలిగినా ప్రాణంపోదూ వాడికి!!

సందేహిస్తూనే, ఆముసల్ది చూపించిన గదిలోకి పోయింది. పెద్దహాలు. లోపల గడియవేసింది ముసలమ్మ. ఇంకోతలుపు తియ్యగానే, ఎద్దులాంటి సిద్దీవొహడు బయటికి వచ్చాడు. అరవబోయింది జమ్న. ముసల్ది నోటిమీద చెయ్యేసి, బరబరా రెండోగదిలోకి లాక్కుపోయింది. డెబ్బైయేళ్లునిండిన ఆముసలమ్మకి అంతబలం యెలావొచ్చిందో!

లోపల యిద్దరుపరిచారికలు వచ్చి, జమ్నని అరవకుండా బూరుగుపరుపువేసిన మంచంమీద పడుకోబెట్టి పట్టుకున్నారు.

మొహమ్మీదవున్న కళ్లవరకూకట్టుకున్న గుడ్డా, నెత్తిమీది ముసలిజుట్టూ, కట్టుకున్న లుంగా — విప్పి పారవేసింది ముసలమ్మ — న్యాయసార్వభౌముడు అక్బరు ప్రత్యక్షం. పరిచారికలు వెళ్లిపోయ్యారు.

విషపునవ్వు నవ్వుకుంటూ, — చక్రవర్తి గది తలుపుదగ్గిరకి వచ్చి తలుపు తియ్యబోతూవుంటే, "అక్బర్"! —

వెనక్కితిరిగి చూశాడు. తను పీకిపారేసినగడ్డం మంచంక్రింద పడివున్నాయి. దిగంబరరూపంతోవున్న ఆమెగుండెల్లోంచీ, కంఠంలోంచీ, నెత్తురు కారుతూ వుంటే, వికృతాకారంగా పడివుంది జమ్న. నిస్తబ్ధుడైనాడక్బరు.

తలుపు తీసి, బయటవుండున్న పరిచారికల్ని చూసి 'పొడుచుకొని చచ్చింది. జాగ్రత్త. బయటతెలిసిందంటే'—అన్నాడు అక్బరు. వాళ్లు ఆత్రంతో మంచందగ్గరికి పరుగెత్తారు

రెండోగుమ్మందగ్గర నిల్చున్న సిద్దీలు జాలమీద చేతులేసి మళ్లీ ఆవిషపునవ్వే నవ్వాడు అక్బరు. జమ్న సంగతి యింకెవరికీ తెలీదు.

## ౪

రెండేళ్లు గడచినతరువాత, మానసింహుడు యుద్ధాన్ని ప్రకటిస్తో, పాదుషా ఆజ్ఞమీద ప్రతాపుడికి వార్త పంపించాడు. ప్రస్తుతం రాణాస్థితి, యుద్ధాన్ని గానివ్వగదా, చిన్నకుటుంబకలహాన్ని తీర్చేట్టుగూడా లేదు. కూడుగుడ్డలు లేక, తనూ, తనఆలుబిడ్డలు —, అందరికన్న యెక్కువగా అజయుడు. ఎంతో శ్రమ

పడుతున్నారు. తనవంతు జొన్నరొట్టెల్ని రాణాసంతానానికి పంచిపెట్టి, భిల్లులతోపాటు తనూ ఆకూ అలమూ తిని తృప్తిపడేవాడు అజయుడు. ఎన్నోసార్లు రాణా, రాణీ, యిద్దరూ మందలించారు, అలా చెయ్యొద్దని. కాని వారి యెరికలేకుండానే, రాజసంతానానికి తనరొట్టెల నర్పించి ధన్యుణ్ణనుకునేవాడు అజయుడు. తల్లిదండ్రులు లేని అజయుణ్ణి రాణాకుటుంబము, వాళ్ల సంతానముకంటే యెక్కువప్రేమతో పెంచుతున్నారు. రాణావారిచిన్నబిడ్డలు సగర్, తారాబాయిలకి అజయుడంటే అమితమయిన చనవు. అజయుడెప్పుడూ వాళ్లని సంతోషపరచడానికే ప్రయత్నిస్తూండేవాడు.

ఇలాంటిస్థితిలో యుద్ధాన్ని ప్రకటిస్తూ మానసింహుడు వ్రాసినలేఖ రాణాని కొంత కలవరపెట్టింది. ఎన్నివిధాల ఆలోచించినా, మొగలుసైన్యాల్ని ఎదిరించడంగాని, వాళ్లు వస్తే స్వసంరక్షణగాని చేసే స్థితిలోలేదు.

తానెప్పుడూ ఓడిపోవడానికి ఒప్పుకోననీ, అరణ్యాల్లో కూడుగుడ్డలులేక యిబ్బందిపడుతూన్నా, తనే చిత్తూరురాజ్యానికి రాణాననీ, స్వరాజ్య సంపాదనకోసం ప్రాణాల్ని అర్పించడానికి తానెప్పుడూ సిద్ధుణ్ణేననీ, కాని పరిస్థితులు సరిగా లేకపోవటంవల్ల, వాళ్లయుద్ధాన్ని కొంతవరకు ఆపుచేయవలసిందనీ, తాను తిరిగి సమర్థత సంపాదించినప్పుడూ, తనను మాతృభూమి ఆహ్వానించినప్పుడూ వాళ్లకంటేముందు తనే యుద్ధాన్ని కోర్తాననీ — ఒకవుత్తరం వ్రాసి అక్బరుకు పంపదలచుకొని — వ్రాశాడు.

తనభిల్లసైనికుల్లో ఒకణ్ణి ఆ వుత్తరంతో పంపుదామనుకుంటూవుండగా, అజయుడు తను పోతానన్నాడు.

"మీ అమ్మనికూడా అప్పుడు మొగల్ సైనికులే యెత్తుకొనిపోయ్యారు. అదృష్టవంతుడవైతే నీతల్లిని మళ్లీ చూస్తావు. భగవంతుడు నిన్ను అనుగ్రహించాలి." అని మేవారురాణి ఆదరణపురస్సరంగా దీవించింది.

అమ్మమాట వినేటప్పటికి అజయుడికళ్లు చెమర్చాయి. చిరిగిన ఉత్తరీయంతో రాణా కన్నీళ్లు తుడిచాడు. కొండక్రింద లోయదాకా, పదిమంది భిల్లులతో అమరసింహుడు అజయుణ్ణి సాగనంపాడు.

౫

నిండుసభలో మొల్లా చదివినవుత్తరాన్ని, యితరసభికులతోపాటు, వాళ్లకంటే ఎక్కువసంతోషంతోనే, దర్పంతోనే, భుజాలు ఎగరవేసుకుంటూ అక్బరు విన్నాడు. అంతా చదవడం అయాక, మీసం మెలివేస్తూ సభంతా కలయచూశాడు. అంతా తలోమాటా అన్నారు.

"సరే! మదగజం మెల్లిమెల్లిగా లొంగుబాటుకొస్తోంది. రాకేంచేస్తుంది?" అని ఆ విషపునవ్వే మళ్ళీ నవ్వాడు. ఉత్తరంతెచ్చిన యువకుణ్ణి చేరి పారమాసి యేదో మరిచిపోయిన విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకొంటోన్నాడు అక్బరు.

వంగి సలాంచేసి, మంత్రిపంపిన సేవకుడితో వెళ్లిపోయాడు అజయుడు.

తరువాతకూడా చాలాసేపు ఆలోచించాడు అక్బరు. కాని, తాను ఎవర్ని చెరపెట్టి, ఆమెమరణానికి కారకుడైనాడో ఆ జమ్నాబాయికొడుకే అజయుడని స్ఫురణకి రాలేదు.

* * * *

పదిరోజులు గడిచాయి. ఢిల్లీనగరముమధ్యవున్న పెద్ద ఉద్యానవనంలో చెక్కటిపచ్చికమీద కూర్చొని, ఆలోచిస్తున్నాడు, తల్లినిగురించి, అజయుడు. చీకటిపడుతూంది. అక్కడక్కడతప్ప అంతగా జనసంచారంలేదు. ముసుగువేసుకున్న ఒకవ్యక్తి ఎదురుగా వచ్చి నిలబడింది.

"ఎవరు-మీరు?" అన్నాడు అజయుడు. ఆ వ్యక్తి అతనిచెయ్యిపట్టుకొని, తోటలో మారుమూలవున్న గుబురు మల్లెపందిరిక్రిందకి లాక్కుపోయింది. ముసుగు తీసింది. సన్నటివెన్నెట్లో, అందమైన స్త్రీరూపం, స్పష్టంగా చూశాడు అజయుడు.

రెండడుగులు వెనక్కి జరిగాడు. ఆస్త్రీ రెండడుగులు అతనివేపు జరిగింది.

'ఎవరు మీరు, ఏంకావాలి ?'

"రాణా ప్రతాపసింహుని దగ్గర్నుంచి వొచ్చింది మీరేనా?"

"అవును. మీ కేంకావాలి?"

"మీ పేరు— అజయుడా ?"

"అవును. మీ కేంకావాలి?"

"జమ్నాబాయి. మీ—"

"అమ్మ. ఆవిడ యెక్కడుందో మీరెరుగుదురా? నా కామెని చూపుతారా?"

"నాతరంకాదు— నే నొకసంగతి మీకు చెప్పాలని యిక్కడికి తీసుకొచ్చాను."

"చెప్పండి. ఆమె యెక్కడున్నారు?"

"ఆమె చనిపొయ్యారు. ఘోరంగా— ఆత్మహత్య !!'

"ఆఁ. నిజమే !!"

అవునని తలవూపింది. వెక్కివెక్కి యేడుస్తూ వున్న అజయుణ్ణి తనమీదకి లాక్కుని ఓదార్చింది.

"ఓదారండి— ఆమెని—" అంటూ, యిటూ అటూ బాగాపరికించి, కంఠం తగ్గించి, ఇలాచెప్పింది ఆవిడ. "ఆమెని— అక్బర్‌చక్రవర్తి మానభంగంచేసి చెరిచాడు— ఆమె సహించలేక ఆత్మహత్య చేసుకుంది. ఆదృశ్యం కళ్లారా చూశాము. నేనూ— మా బంధువే మరోామె— మరోాహసీద్దీ—. తక్కినవాళ్లిద్దర్నీ చక్రవర్తే రహస్యం బయలుపడుతుందని చంపించేశాడు. నన్నూ యెప్పుడో—"

ఆమె వోహస్త్రీఅనీ, ఆమెమీద తను పడి కౌగలించుకొని యేడుస్తున్నాననీ, అజయుడు మరిచిపొయ్యాడు. ఆమె అతణ్ణి తనుకూడా కన్నీళ్లుతుడుచుకొంటో ఓదారుస్తోంది.

"నువ్వెవరు?"

ఉడికిపోతున్న అతనిగుండె రక్తాన్నుంచి వస్తూ వున్న ఆవిరి బాగా కనిపెట్టింది ఆమె.

"ప్రస్తుతం అక్బరుచక్రవర్తి జనానాలో పరిచారికను నేను ముఖ్యంగా సిగ్గువిడిచి మిమ్మల్ని కోరేది —మీహృదయంలో నా కొకస్థానం కావాలనే—"

అతను కూర్చుని, ఆమెని దగ్గిరకి లాక్కుని కౌగిలించుకున్నాడు. ముద్దు పెట్టుకున్నాడు.

౬

నెలరోజులు గడవవొచ్చాయి. అక్బరుదగ్గిర ఆజ్ఞతీసుకొని తిరిగి రాణాదగ్గిరకి పోవడానికి అజయుడు నిశ్చయించుకున్నాడు. ఈలోగా, తన తల్లినిగురించిన రహస్యం తనకి చెప్పినదానికీ, అతనికీ అన్యోన్యంగా అసమానమైనప్రేమ కుదిరింది. ఆమెకూడా అతనితో రహస్యంగా వొస్తాననని వొప్పించింది.

అక్బరుతో తనసంగతి చెప్పుకుందుకి అజయుడు వెళ్లాడు. అక్బరు మొహంచూడగానే వొళ్లు కుతకుత ఉడకడం ప్రారంభించింది. అణిచిపెట్టుకున్నాడు.

"ఉద్యానవనంలో మాట్లాడుదాం. రా" అని అక్బరు అన్నాడు.

ఇద్దరూ పాదుషా ఉద్యానవనంలో మాట్లాడుకొంటూ పచారుచేస్తున్నారు. కొంచెందూరంలో, అంతఃపురంలోకి వచ్చేపొయ్యే పరిచారికాజనం కనపడుతూవున్నారు. ఒంటరిగావుంటే, ఇలాంటి అక్కర్లని నలుగుర్ని పేరులేకుండా చేదామనుకున్నాడు అజయుడు. గోలగాకేక లేస్తోన్న ఒకస్త్రీని ఆరుగురు తురకలు పాదుషాదగ్గిరకి పట్టుకొని వచ్చారు. ఆ స్త్రీని గుర్తించగానే, కెవ్వునఅరిచి, కత్తిదూసి పాదుషామీద పడ్డాడు అజయుడు. పాదుషా ఎడంచెయ్యిమీద గాయం తగిలింది.

రక్తపుమడుగులో మెడ సగంతెగి, పొర్లుతోన్న అజయుడిమొహమ్మీద చడావుకాల్తో జాడించితన్నాడు అక్బరు. వుమ్మికూడా వేశాడు.

---

# నక్షత్రమండలము

(ధాతృ సంవత్సర ఆశ్వయుజ మాసము)

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

ఉత్తరము




దక్షిణము

ఈపటమును తలమీదుగా ఆ యాదిక్కులు సరిపడునట్టు పట్టుకొని చుక్కలను చూడవలెను. ఇందున్నట్లు గ్రహనక్షత్రాదులు (శుక్రగ్రహముయొక్క స్థానము అక్టోబరు 20-21 తేదీలనున్నట్లుచూపబడినది.)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అక్టోబరు | 8 తేదీని | రాత్రి | గం. 8-54 | అక్టోబరు 31 తేదీని | రాత్రి గం. | 7-23 |
| ,, | 15 ,, | ,, | ,, 8-26 | నవంబరు 7 ,, | ,, | 6.55 |
| ,, | 22 ,, | ,, | ,, 7-59 | కనబడును. | | |

13. 10- 20 ౬.౦౭

The vast sun clusters' gathered blaze
World-isles in lonely skies,
Whole heavens within themselves, amaze
Our brief humanities.

—Tennyson

మహావకాశముతో కూడియున్న ఆకాశ మను మహాసముద్రమున నచ్చటచ్చట నొంటొంటిగా చెదరియున్న ద్వీపప్రపంచములవలె బ్రహ్మాండ పరిమాణములు గల అసంఖ్య సూర్యమండలములు దగ్గరదగ్గరగానే ఉన్నట్లు గుత్తులుగుత్తులుగా నగపడుచు మహాద్యుతి తేజముతో మెఱయుచున్నవి. గుత్తులవలె దట్టముగానున్నట్లు మననేత్రములకు గోచరించుచున్నను, నిజముగా నాయామండలములు ఒండొంటికి తలంపశక్యముకానంత విశేష దూరముననుండుచు, ఆ పరిసరముల కవే విశాలవిశ్వములై తోచుచున్నవి. అచింత్యములైన పరిమాణము, దూరము, కాలగతులుగల ఆ బ్రహ్మాండతేజోరాసులతో పరిచూచుకొనునపుడు మన మానవజీవిత మనునది ఒక అవగింజ!— సముద్రమున నీటిబిందువు మాత్రమైనను కాకున్నది! ఏమి ఈ విచిత్రమని మనము నివ్వెఱపడుచున్నాము!

ఈ ధాతృనామసంవత్సర నిజభాద్రపద బహుళ అష్టమి - ౮ అక్టోబరు ౧౯౩౬- మొదలు ఆశ్వయుజ బహుళసప్తమి- ౮ నవంబరు ౧౯౩౬- వఱకు నగు మాసమున రాత్రితొలిజామున నాకాశముననగపడు గ్రహనక్షత్రాదులను గమనింతము.

## (Milky Way)

## పాలవెల్లి

"The gorgeous arch with golden worlds inlaid"

స్వర్ణమయప్రపంచములతో తాపింపబడిన మహనీయవితానము" అని యంగ్ (Young) కవిచే వర్ణింపబడిన యీ దివ్యధవళదృశ్యము ఈ మాసములో రాత్రి తొలిజామున ఈశాన్యమునుండి నైరృతిదిశకు, ఆకాశమునకడ్డుగా, కొంచెమువంగిన వింటియాకారముతో వ్యాపించియున్నది. ఈ దృశ్యమునకు వాయువ్యదిశనుగల ఆకాశభాగమునకంటె ఆగ్నేయదిశాభాగముననున్న ఆకాశఖండము రెండింత లధికమని చెప్పనొప్పను. ఈశాన్యమున నేకముగా తోచుచున్నను, రాజహంసమండల సమీపముననున్న శ్యామసీమలకడ చీలి, మధ్య నల్లనల్లనై తోచు ఛాయాపథముతో, రెండు పాయలు వేర్వేరుగానుండగా నైరృతిని దృష్టిపథమునకు తప్పిపోవుచున్నది.

## First Magnitude Stars and Planets

తేజోవిషయమున నగ్రగణ్యములైన ఇరువది నక్షత్రములలో ఈ మాసమున రాత్రి తొలిజామున నాలుగుమాత్రమే కనబడుచున్నవి:

౧. వీణామండలములోని బ్రహ్మ (Vega in Lyra)

౨. వృశ్చికములో జ్యేష్ఠ, (Antares in Scorpio)

3. గరుడునిలో శ్రవణము, (Altair in Aquila.)

౪. ఇంద్రద్యుమ్నుడు, (Fomalhaut -ఫోమలో)

పడమట తోరణస్తంభములవలె మెఱయుచుండిన చిత్ర, స్వాతి నక్షత్రము లస్తమించినందుకు ఆకాశరంగము శోభాహీనముగా నుండవలసినదేకాని ఆలోపము రాకుండ గ్రహము లమితతేజముతో మెఱయుచున్నవి. ఈ మాసములో శుక్రుడు తులా, వృశ్చిక రాసులలో సంచరించుచున్నాడు. అక్టోబరు ౨౦-౨౧ తేదీలలో చూడతగుస్థానము పటములో చూపినాడను. గురుడు జ్యేష్ఠను దాటి మూలలోనికి వచ్చుచున్నాడు. శని పూర్వాభాద్రలో వక్రగతుడైయున్నాడు. పడమటనుండి తూర్పునకు వరుసగా శుక్రుడు, జ్యేష్ఠ, గురుడు, శని అను నీ గ్రహనక్షత్రములు దీపమాలికవలె వెలుగుచు సంతోషాశ్చర్యముల గూర్చుచున్నవి. అందును అక్టోబరు ౨౦, ౨౧, ౨౨ తేదీలలో సూర్యాస్తమయము కాగానే పడమటతోచి పశ్చిమాకాశరంగమును మనోజ్ఞతరముగా తోపింపజేయుచున్నాడు.

## ధ్రువక్షితి - ఉత్తరనక్షత్రములు

ధ్రువక్షితిలో చిన్నయెలుగుతోక చివరను ధ్రువుడు బాగుగా మెఱయుచున్నాడు. దారి, తెన్ను

తోపక, సముద్రముపై యానముచేయు నావికులకు రాత్రి దిక్కులు తెలియుట ధ్రువునిమూలముననే; ధ్రువుడున్న దిక్కు ఉత్తరము. అది తెలిసినపుడు తక్కినవి తెలియుట సులభము. ఈ యంశమే Thomas Moore అను ఆంగ్లకవి ఈ క్రింది పంక్తులలో చక్కగా వర్ణించినాడు:

That star, on starry nights
The seaman singles from the sky
To steer his bark for ever by.

కనుక దీనిని పాశ్చాత్యులు Scip steerra - Ship star ఓడ చుక్క అనిరి. చిన్న ఎలుగు తోకలో కశ్యప - మహేంద్ర నక్షత్రములును, తోకమూలను అగ్నియు, అగ్నికెగువ మిత్రుడును మిణుకు మిణుకుమని మెఱయుచుండుట కాననగును. అగ్ని, మిత్రులకెదురుగా పడమటకు ధ్రువాలి ధాత, విధాతచుక్క లున్నవి. ఈనక్షత్రములే ధ్రువరక్షకులు. (Guards of the pole star ) షేక్స్పియర్ (Shakespeare) మహాకవి ఒక నాటకములో తుపానును వర్ణించుచు ఇట్లు వ్రాసినాడు:

The wind-shaked surge, with high
and monstrous mane,
Seems to cast water on the burning Bear
And quench the guards of the ever fixed
pole,

(మహానిల సంక్షోభముచే కలగిన సముద్రమున తరంగములు కొండలవలె మీదికి లేచి, మండుచు వెలుగుచున్న లఘుఋక్షముపై నీళ్లుచల్లినట్లుండును; నిశ్చలమైన ధ్రువతారకు కాపలాఉండి చుట్టుతిరుగుచున్న రక్షకులదాహము శాంతింపజేయుటకోయన ఉత్తర దిశను సముద్రజలములు మిక్కిలియెత్తుగా లేచుచున్నట్లు తోచెను.)

పెద్దయెలుగులోని చుక్కలు, సప్తఋషులలో నొక్కచుక్కయైనను ఇపు డగపడుటలేదు.

నరకుడు

Statius అను నాంగ్లకవి ఈ ధరానూను నిట్లు వర్ణించినాడు:

The Starry Serpent,
Southward winding from the Northern Wain
Shoots to remoter spheres its glittering train.

(నక్షత్రరూపమున నుత్తరదిశను కానవచ్చు నీ మహాసర్పము దక్షిణమునుండి మెలికలుతిరుగుచు, మూలమూలలనున్న ప్రదేశములకు తన నక్షత్రముల కాంతిని ప్రసరింపజేయుచున్నది.) బైబిలులో జాబ్ ప్రకరణమునందును నక్షత్రములును, నరకుడును ఇట్లు వర్ణింపబడుట గమనింపదగియున్నది.

"By His spirit He hath garnished the Heavens. His hand hath formed the crooked serpent."

భగవంతుడు తన సంకల్పశక్తిచే నక్షత్రములను రచించి ఆకాశరంగమును భూషించినాడు. వక్రగతిగల ఈ సర్పరూపము నాతడే సృజించెను.

పశ్చిమాకాశమున

స్వాతి, చిత్ర చుక్కలస్తమించినవి. శ్రీ మహావిష్ణువు శేషపాన్పుపై శయనించియుండి, పరివర్తనపొందనైయున్నాడు. అనగా పడమట అస్తమించి, కార్తిక శుద్ధఏకాదశినాడు తూర్పున నుదయింపనైయున్నాడు. అనంతామాత్యుడు సొగసుగావర్ణించినట్లు

సీ. అడుగున ప్రభవించు నాకాశగంగతో
కటి నందమగు పీతపటముతోడ
భూతప్రపంచంబు పుట్టించు శిశువుతో
తనరారు నాభిపద్మంబుతోడ
పదునాల్గుజగములు భరియించుకుక్షితో
సిరికి నాస్పదమైన యురముతోడ
కన్నులతోలుకాడు కరుణారసంబుతో
సుప్రసన్నాననస్ఫూర్తితోడ
నైనతేయునెక్కి వరభూషణప్రభా
జాల మెసగ శంఖ చక్రకలిత
హస్తుడగుచు నభయహస్తంబుతో"

చూడ్కులకు వేడ్కలుచేయు నీదివ్యరూపము కొన్నినెలలవఱకును మనకు సాయంకాల మగపడదు.

### దక్షిణమున

విశాఖ అస్తమించినది. వృశ్చికములో అనూరాధ, జ్యేష్ఠనక్షత్రములు కనపడుచున్నవి. తేలుతోకలో, అనగా మూలలో కొన్ని చుక్కలగపడుటలేదు. ఛాయాపథ సమీపమున పూర్వాషాఢ, ఉత్తరాషాఢ నక్షత్రములతో కూడిన ధన్వియు, ఆదిగువ మన్మథుని వాహనమైన చిలుకయు, ఆక్రిందను మయూర చిహ్నితుడైన బాణాసురుడును కలరు. ఈచుక్కలకు తూర్పుగా, యామ్యోత్తర రేఖపై ఇంద్రద్యుమ్నుడును, నాళీకజంఘబకము (Grus)ను కలరు. వారికితూర్పుగా, ఆగ్నేయాకాశమున ప్రావార కర్ణఘూకము(Phaenix)ను, యుగంధర మకరము (Sculptcr)ను ఉన్నవి.

### తూర్పున

కమఠ, ఘూకముల కేవల, తూర్పుసమీపపు టాగ్నేయమున జాజ్వల్యమానమైనదని వర్ణింపబడిన Chemical Furnace రూపముతో ధుంధుడను రక్కసుడు సముద్రవాలుకాప్రలినతలమునను న్నాడు. ఆ ప్రక్కనే మెలికలు తిరుగుచు పారు యమునలో కొంత భాగ మగపడుచున్నది. ఆవల వరుణున కాలయమైన సముద్రమునందు శింశుమారము ఘోర వికృత రూపముతో కానవచ్చుచున్నది. అగ్నిదైవత్యమైన కృత్తిక బాగుగా తూర్పున నుదయించినది. కృత్తికనుండి ఉత్తరముగా భృగుపరశు మండలముపాలవెల్లిలోనికివ్యాపించియున్నది. ఆదిగువనే గ్రుడ్లు మిటకరించుకొనుచు(The Blinking demon) పులోమ రక్కసుడున్నాడు.

### మధ్యను

భృగుపరశుమండలమున కావల పాలవెల్లిలో అప్సరసలు చక్కని చుక్కలై మెఱయుచున్నారు. ఆ చుక్కలదిగువ- దక్షిణముగా, పులోమబాధితయైన ఇంద్రమద ఉత్తరాభాద్రలోనికి చొచ్చుకొనియున్నది. ఆమె గర్భచ్యుతుడైన చ్యవనుడు ప్రక్కనే కలడు. చ్యవనుని ప్రక్కనే అశ్వినులు కలరు. కృత్తికలకును, అశ్వినులకును మధ్య ప్రొయ్యిపొక్కిళ్లవంటి భరణి ఉన్నది. అశ్వినులకును, యామ్యోత్తరరేఖకును మధ్య పేద్వఘూశ్వము అనబడు పెగసస్ చతురస్రము (Square of Pegasus) లో పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రములు కలవు. ఈ ప్రోష్ఠపదానక్షత్రముల దిగువ నొకటియు, ఉత్తరాభాద్ర అశ్వినులమధ్య నొకటియు రెండు చేపలున్నవి. వీటిని బంధించు సూత్రము వంకరలు తిరుగుచు క్రాంతివృత్తముమీదుగా నున్నది. ఈసూత్రబంధితములైన చేపలు రెండును మీనరాశిగా నేర్పడుచున్నవి.

పూర్వాభాద్రదిగువను శని ఉన్నాడు శనికిని, మకరమునకును మధ్య, యామ్యోత్తరరేఖకు రవంత తూర్పుగా కుంభరాశియున్నది. మకరమున్న సరస్సన కెగువ జలస్థానాధిపతియు, కుంభహస్తుడునైన వరుణుడున్నాడు. అగస్త్యశాపముచే ఏనుగైన ఇంద్రద్యుమ్నుడు మకరమున్న సరస్సన నీరు త్రావవచ్చి,గ్రాహబద్ధుడై పలువిధముల బాధింపబడుచున్నాడు. మరి కొంతకాలమున కా మకరము కాలచక్ర హతము కాగలదు.

శ్రవణము పాలవెల్లి ప్రక్కనే పడమటకు వ్రాలియున్నది. శ్రవణమునకును యామ్యోత్తర రేఖకును మధ్య వసుదేవతాకమైన ధనిష్ఠకలదు.

శ్రీ మహావిష్ణు నాభికమల సంజాతుడైన బ్రహ్మ ముఖమున నతనిభార్య, సకల విద్యాస్వరూపిణి సరస్వతి ఉన్నది. ఆమె వీణాపాణి. కనుకనే ఆమండలము వీణామండలమైనది. ఆ దంపతులకు వాహనమైన రాజహంస పాలసంద్రమున నొక గొప్పశిలువ (Cross) ఆకారముకల చుక్కలుగలదై యున్నది. ఈవాహనముతో నీ వాణీహిరణ్యగర్భులు పశ్చిమాకాశమును సమీపించుకొలది శరత్కాల వ్యాప్తి యగుచుండును.

### ఉల్కా పాతములు

ఈ మాసములో రాత్రి ౧౦ గంటలైన తరువాత ఒరయన్ నక్షత్రములు కనబడినపిమ్మట,౧౮-౨౪ తేదీల మధ్య, ఒరయనైడ్సు అనబడు ఉల్కలు మంచితేజస్సు కలిగి వేగముతో భగ్గున మండుచు రాలుచుండును. అవి ఆర్ద్రి ఉత్తరభాగమునుండి రాలును.

# నాట్యకళ



## శ్రీచీరాల బాలకృష్ణమూర్తి (చీరాల)

తెలుగునాటకరంగమున పేరెన్నికగన్న నటులు. సత్యభామ, దమయంతి, చింతామణి, విద్యాధరి, చిత్రాంగి మొదలైన అనేకనాయికా పాత్రలనుధరించి, దేశవంతటను ప్రశంసలను బొందినవారు. శ్రావ్యమైన కంఠము. ఇంపైనసంగీతము. నిర్దుష్టమగు వాచికము. భావద్యోతకమైన అభినయసంపద. ఇవియన్నియును సహజములగునేమి, స్వయంకృషిచే నేమి వీరికబ్బిన సుగుణపుంజమనవచ్చును. చిరుతప్రాయమునందే వీ రత్యధికముగ యశస్సును బడసియున్నారు.



# సాభిప్రాయ విశేషములు

ప్రపంచ వ్యవహారములందు ధర్మబలము క్షీణించి పశుబలము ప్రబలుచున్నది. జినీవాయందుగూడిన నానాజాతి సమితియును, లండనునందు గూడిన ఆయుధవిసర్జన సభయును ధర్మసంరక్షణమునకు నిరర్థకములైనవి. వివిధజాతుల ప్రతినిధులు జినీవాసభను శ్లాఘించినను ప్రపంచశాంతికి గలిగిన ప్రయోజన మతిస్వల్పము. ఇటలీ అబిసీనియా విజయము సకలరాజ్యములకును ఆయుధబల పోషణావసరమును హృద్గతము చేసినది. జర్మని, రుష్యా, ఫ్రాన్సు, గ్రేటుబ్రిటను మొదలగు రాజ్యములు సంగ్రామ సన్నాహములకు వ్యయము చేయుచున్న ద్రవ్యము భయసంభ్రమములను గలుగజేయుచున్నది. భూమియుద్ధముల యుగము, జలనౌకా యుద్ధముల యుగము పోయి వాయువిమానాగ్ని గోళయుగ ముదయించినది. వాయువిమానాగ్ని గోళములు గలుగజేయగల క్రూర సంహార క్రమమును గడచిన అబిసీనియా సంగ్రామ ప్రస్థానమును, స్పెయినునందు జరుగుచున్న పరివర్తన సంగ్రామ ప్రస్థానమును విశదము చేయుచున్నవి. స్పెయినునందు వ్యాప్తమైన విప్లవ పరివర్తనము సకలరాజ్యములందును బీజాంకురములను గలిగియున్నది. యూరపు రాజ్యములందు ప్రజాస్వామిక మస్తంగతమై నిరంకుశ నియంతృత్వము విజృంభించగల విధమునకు ప్రబల నిదర్శనములుగలవు. జర్మనియందు హిట్లరు గారి బోధలు వేదవాక్యములు. ఇటలీయందు ముస్సోలినీగా రవతారపురుషుడు రుష్యాయందు స్టాలినుగారు మహాపురుషుడు. సకల దేశములందును ఫాసిటు సిద్ధాంతములు వ్యాపకమును పొందుచున్నవి. గ్రేటుబ్రిటనునందును సర్ ఓస్వాల్డు మోస్లెగారు ఫాసిటు సిద్ధాంతములను వ్యాపింపజేయుటకు జేయుచున్న ప్రయత్నములు ప్రజాహృదయమునందు వ్యాపకమును గాంచుచున్నవి. ప్రపంచ వ్యవహారములందు నిరంకుశ స్వాతంత్ర్యాధికారముల కాదికాలమునుండియును ప్రవర్ధమానంబైన సంరంభము వర్తమానకాలమునందు ప్రళయాకారమును దాల్చుచున్నది. సకలరాజ్యములందును ప్రబలిన భాగ్యభోగాభిలాష, స్వాభిమాన స్వార్థపరాయణత్వము సర్వసంహారమునకు సాధనములగుచున్నవి. సకలరాజ్యములకును స్వాభిమానమునందు గల పట్టుదల మానవాభ్యుదయమునందు గలుగకున్నది. ప్రపంచమంతయును "నా దేశము, నాజాతి, నామతము, నాలాభము, నాపొట్ట" ఘోషలతో నిండిపోవుచున్నది. ఈ ఘోషల కాద్యంతములు కనుపడకున్నవి. పెద్దజాతుల పొట్టలు నిండుట దుర్లభమై ప్రపంచ మంతయును

సంక్షోభమయ మైనది. సకల దేశములకును
గత్యంతరము కనుపడకను మారణయంత్ర
నిర్మాణము శరణ్య మైనది. సకలరాజ్యము
లకును ఆయుధనిర్మాణపరిశ్రమ ప్రధానపరి
శ్రమమై మహాప్రళయమునకు సాధనమగు
చున్నది. ప్రజలకు పనిపాటులు నిర్మాణపరి
శ్రమ మూలముననుగాకను మారణపరి
శ్రమ మూలముననునేర్పడుచు ధనధాన్యాభి
వృద్ధి క్షీణించి ఆయుధనిర్మాణాభివృద్ధి
సర్వత్ర ప్రత్యక్ష మగుచున్నది.
సకల దేశములందును సహజమైన నాణె
ముల చలామణి యంతరించి మాయా
ప్రమాణము వ్యాప్తమై మారణసాధనముల
కార్థికవిప్లవము తోడై మహాప్రళయమునకు
సాధనమగుచున్నది. ఈ ప్రళయావస్థయందు
హిందూస్థానస్థితి సకలవిధముల దుర్భరముగ
నున్నది.

* * * *

### ఆర్థిక పారతంత్ర్యము

సకలరాజ్యములకును ఆర్థిక పారతం
త్ర్యము రాజకీయ పారతంత్ర్యముకన్నను
దుర్భరతమ మనువిషయమునిర్వివాదాంశము.
బ్రిటీషు పరిపాలనము హిందూస్థానమునకు
గలుగజేసిన మహోపకారములందార్థిక పార
తంత్ర్యము సర్వసంహారమునకు వినియోగ
పడుచున్నది. మంత్రులు, కలెక్టరులు, పెద్ద
చిన్న ఉద్యోగస్థులు, డాక్టరులు, లాయరులు,
గుమాస్తాలు, బంట్రోతులు, సిపాయిలు వారి
జీతములను జూచి మురియుచు బ్రిటీషు పరి
పాలనమును కొనియాడుట సహజము.
యూరపియను వర్తకులు వారి లాభములను
జూచి యానందించుటయును సహజము. రాజ
ప్రతినిధియును, సర్ జేమ్సు గ్రిగ్గుగారును
బ్రిటీషు ప్రయోజనములను సమర్థించుచు
భారతీయ ప్రయోజనములను నిరసించుట
యును సామాన్యవిషయము కోట్లప్రజలు
16 పెన్సీల మారకమునకు బలియగుచుం
డగా రాజప్రతినిని విషయాన్వేషణమును
సయితము నిషేధించుట యన్యాయము.
హిందూస్థానము మారకదాస్యము బ్రిటీషు
సామ్రాజ్యముతోపాటు పరదేశములతో
సయిత మనుభవించుట పరమాన్యాయము.
గ్రేటు బ్రిటనుతోపాటు ఫ్రాన్సు
మొదలగు దేశములును బంగారు ప్రమా
ణమును విసర్జించినను భారతప్రభుత్వ
హృదయమునందు సంచలనము గలుగలేదు.
మాయమార్గకము హిందూస్థాన వ్యాపార
మును, వ్యవసాయ పరిశ్రమను, సంపదలను,
జీవన ప్రవాహములను స్తంభింపజేసినది.
దేశము దరిద్రనారాయణ మయమై శుష్కిం
చినది. దేశమునందంతటను నిరుద్యోగము,
దారిద్ర్యము, అనారోగ్యము తాండవమాడు
చున్నవి. వర్తమాన నిస్సహాయస్థితియందు
విమోచన సాధనము దురూహ్యముగనున్నది.
ప్రభుత్వ మవలంబించెడిప్రతికూల మార్గము
సర్వత్ర తెలిసినవిషయము. దేశదాస్యవిమో
చన సాధనము ప్రజాహస్తములందు గల విధ

మును ప్రజానాయకుల ప్రబోధము విశదము చేయుచున్నది.

*   *   *   *

## ప్రజాప్రబోధము

శ్రీ పండిత జవాహరిలాలు నెహ్రూగారి సంచారము ప్రజాహృదయమునందు ప్రబలుచున్న ప్రబోధమును సహస్రముఖములను వెల్లడిచేయుచున్నది. శ్రీమంతులు సామాన్యులు, కార్మికులు కర్షకులు, సామ్యవాదులు కాంగ్రెసువాదులు, బాలురు వృద్ధులు, సవర్ణులు హరిజనులు నెహ్రూగారి సంచారమునందు చూపుచున్న యుత్సాహోద్రేకములు ప్రజాహృదయమునం దుత్పన్నమగుచున్న నవజీవనవికాసమునకు నిదర్శనము. రాజ్యము లంతరించినను, దేశములు మారినను, యుగములు శకములు మారినను మానవ స్వాతంత్ర్య ధర్మ పరిణామము యథావిధిగను సాగుచున్నది. గాంధిమహాత్ముడు ప్రసాదించిన ప్రబోధాంకురములు నెహ్రూగారి సంచారమునందు దోహదమును బడయుచున్నవి. హిందూస్తాన సమస్యలన్నియును స్వాత్మవిశ్వాస సమస్యయందు పరిపక్వము కావలసియున్నవి. సంపూర్ణస్వరాజ్యము, ఆర్థిక స్వాతంత్ర్యము, హరిజనోద్ధరణము, శాసనసభా ప్రవేశము, అధికార స్వీకారము, సాంఘిక సంయోగము, సామ్యవాదము, కార్మిక కర్షక సమస్య మొదలగు సకలసమస్యలును ప్రజల వ్యవసాయపరాయణత్వమువలనను సాధ్యము గావలసిన విధమును గాంధిమహాత్ముని యుపదేశాచరణములవలెను నెహ్రూగారి యుపదేశాచరణములును వెల్లడి చేయుచున్నవి. కాంగ్రెసునకు ఆదర్శపురుషుడైన నెహ్రూగారియుపదేశములు కాంగ్రెసు బలగౌరవ ప్రతిష్ఠలను వృద్ధిచేయుటకు వినియోగపడి కాంగ్రెసునకు సకల వ్యవహారములందును దిగ్విజయము గలుగుటకు భగవదనుగ్రహము గలుగుగాత!

---

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor: G. Subbaramayya.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M142 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 183 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 574B |
| లేని పేజీలు | 1 to 452 |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | |
| స్కాన్ చేసినది | Triveni |
| పరీక్ష చేసినది | Ch. Ramya KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |